ఈనాడు

# ఇంటింటా హోమియో వైద్యం


డాక్టర్ పావులూరి కృష్ణచౌదరి

బి ఎస్ సి ఎమ్ బి బి ఎస్

ఎమ్ ఎఫ్ హోమ్ (లండన్)


Presented By Ramoji Rao


ప్రచురణ




ఉషోదయా పబ్లికేషన్స్

ఈనాడు కాంపౌండ్, సోమాజిగుడా

హైదరాబాద్-500 482

# మామాట

ఈనాడు పాఠకుల కోసం ప్రత్యేకంగా ప్రచురణలు ప్రజోపయోగమైన ప్రాజెక్టులు చేపట్టాలన్న లక్ష్యంలో భాగంగా ఇంటింటా హోమియో వైద్యం అన్న ఈ గ్రంధాన్ని విడుదల చేస్తున్నాం ఈనాడు ఆదివారం మేగజైన్‌లో ఇంటింటా హోమియో వైద్యం శీర్షిక నిర్వహిస్తున్న డాక్టర్ పావులూరి కృష్ణచౌదరిగారే ఈ గ్రంధకర్త

ఆంగ్ల వైద్యవిధానం బహుళ ప్రాచుర్యం పొందినప్పటికీ నేటికి కూడా అది అందరికీ అందుబాటులో లేదన్నది యధార్ధం డాక్టర్ల ఫీజులు మందుల ఖర్చులు కూడా ఆకాశాన్ని అంటుతున్నాయి అసలీ ఖర్చులే ఆరోగ్యవంతుల్ని కూడా అనారోగ్యులుగా మార్చెయగల సామర్థ్యం కలిగినవని ఒప్పుకు తీరాలి పైపెచ్చు ఈ వైద్యవిధానంలోని కష్టనష్టాల గురించి కానీ మందులవల్ల కలిగె ఇతరేతర ప్రభావల గురించికానీ తెలుసుకోగల అవకాశాలు సైతం అతిస్వల్పం ముఖ్యంగా గ్రామీణ ప్రజలకు ఈ కష్టాలు మరీ అధికం వారికి తగిన సమయంలో వైద్య సదుపాయం లభించడమె దుర్లభంగా వుంది ఈ ఇబ్బందులన్నిటినీ గుర్తించి ఈనాడు అందరికీ అందుబాటులో వుండే హోమియో వైద్య విధానాన్ని ప్రజలకు మరింత చేరువచేసి స్వల్పఖర్చుతో స్వస్థతపొందె అవకాశం కల్పించాలన్న ఆశయంతో ఇంటింటా హోమియో వైద్యం పుస్తకాన్ని వెలువరిస్తోంది ఇందులో దైనందిన జీవితంలో తరచు వచ్చే వ్యాధులు వాటి లక్షణాలు నివారణోపాయాలు ఎన్నెన్నో సవివరంగా వున్నాయి

ఈ పుస్తకంతోపాటు ఈనాడు హోమియో కిట్ వేరుగా విడుదల చేస్తున్నాం సర్వసాధారణంగా ఉపయోగపడే మందులన్నీ ఈ కిట్‌లో ఉంటాయి వీటితో సామాన్యజనానికి కూడా సాధారణ రుగ్మతలను నయం చేసుకోవడం వీలవుతుంది మందులను ఎంపికచేసి కిట్‌ను రూపొందించింది కూడా డాక్టర్ పావులూరి కృష్ణచౌదరిగారే

ఈనాడు చేపట్టిన ఈ విశిష్ట పధకం యావత్తూ ఎ వ్యాపారదృష్టి లేకుండా పాఠక జనసేవకోసమె నిర్దేశించినది అందుకే కేవలం తయారీకి అయిన ఖర్చును మాత్రమే ధర నిర్ణయానికి ప్రాతిపదికగా తీసుకున్నాం పాఠకులకు మా ఈ ప్రయత్నం ఉపయోగపడితే చాలు అదే కొండంత ప్రతిఫలంగా భావిస్తాం

హోమియో వైద్యాన్ని జనసామాన్యానికి అందుబాటులోకి తెచ్చేందుకు ఉద్దేశించిన ఈ మహాయజ్ఞంలో పాలుపంచుకోవలసిందిగా కోరినంతనే అంగీకరించి అన్నివిధాలా సహకరిస్తోన్న డాక్టర్ పావులూరి కృష్ణచౌదరి గారికి మా కృతజ్ఞతలు

ఈ పుస్తకం అందించే స్ఫూర్తితో ఆరంభ దశలోనే అస్వస్థతను గుర్తించి ఔషధాలను వాడుకుంటూ అవసరమైనప్పుడు అనుభవజ్ఞులైన హోమియో వైద్యులను సంప్రదించి అందరూ ఆరోగ్యాన్ని కాపాడుకోవాలని మనసారా ఆకాంక్షిస్తూ

రామోజీ

చీఫ్ ఎడిటర్



# కృతజ్ఞతలు

ఈ పుస్తకంలో పొందుపరిచిన వ్యాసాలు ఎక్కువభాగం ఇంతకుముందు ఈనాడు లో ధారావాహికంగా వెలువడినవే ఈ వ్యాసాలను పుస్తకరూపంలో తీసుకొచ్చినట్లయితే ఉపయోగకరంగా ఉంటుందన్న అసంఖ్యాక పాఠకుల సూచనమేరకు ఈ పుస్తకాన్ని ఈ రూపంలో అందజేస్తున్నాను

భారతదేశంలాంటి పేదదేశానికి హోమియో వైద్యాన్ని మించింది లేదు హోమియోమందులు చౌక- అవి ఏళ్లతరబడి చెడిపోవు పిల్లలు పెద్దలంతా ఈ మందులు సేవించటం తేలిక ఈ విధానంలో తరుణవ్యాధుల్ని దీర్ఘవ్యాధుల్ని సునాయాసంగా సమూలంగా సురక్షితంగా నయంచేసుకోవచ్చు ఈ మందులవల్ల దుష్ఫలితాలు కలగవు ఇది హోమియో ప్రత్యేకత ఈ కారణాలన్నింటినీ పురస్కరించుకొని మన గ్రామీణ ప్రజలకు హోమియో విజ్ఞానాన్ని అందుబాటులోకి తేవాలని ఈనాడు సంస్థ సంకల్పించింది ఈ లక్ష్యానికనుగుణంగా ఈ సంస్థ హోమియో వైద్యాన్ని గురించి పత్రికలో వ్యాసాలు రాయమని నన్ను ప్రోత్సహించటం జరిగింది ఆంధ్రదేశంలో హోమియో బహుళప్రచారం గల వైద్యవిధానంగా రూపొందాలని వారి ఆకాంక్ష భారతదేశం యావత్తులో మన రాష్ట్రం హోమియో విషయంలో అగ్రగామిగా నిలవాలని ఈ సంస్థ తలపెట్టింది ఈ ఆకాంక్షకు రూపకల్పనగానే ఈ వ్యాసాలను పుస్తకరూపంలో ప్రచురిస్తున్నారు ఈ గ్రంథాన్ని లాభదృష్టిలేకుండా సేవాభావంతో కనీస ధరకు అందిస్తున్నారు

ఈ వైద్య ప్రచారానికి ఈనాడు వంటి గొప్ప సంస్థ చేయూతనిచ్చి, కొండంత అండగా నిలబడడం గొప్ప అదృష్టంగా భావిస్తున్నాను వారి సహృదయతకు సహాయ సహకారాలకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు

సమాజ శ్రేయస్సు కాంక్షించి హోమియో ప్రచారోద్యమానికి బాసటగా నిలిచి నా వ్యాసావళికి ప్రధానకారకులు ప్రేరకులైన మానవతామూర్తి శ్రీ రామోజీరావుగారికి నేనెంత రుణపడివున్నానో చెప్పడానికి మాటలు చాలవు

—డాక్టర్ పావులూరి కృష్ణచౌదరి



# విషయసూచిక



డాక్టర్  శామ్యూల్ హానిమన్ (1755-1843)

# వినూత్న వైద్య విప్లవ విధాత హానిమన్

డాక్టర్ శామ్యూల్ హానిమన్ ఈ చికిత్సా విధానాన్ని కనిపెట్టాడు 755వ సంవత్సరం ఏప్రిల్ వ తేదీన జర్మనీ మిస్సెన్‌లో పుట్టాడు ఈయన 0వ తేదీన పుట్టినట్లు వాడుకలోవున్న విషయం హానిమన్ తండ్రి పోర్సిలైన్ పాత్రలమీద రంగులు వేస్తుండేవాడు ఆయన తండ్రికున్న పదిమంది సంతానంలో ఈయన మొదటివాడు పుట్టినప్పటినుంచి ఈయన జీవితం పోరాటంగానే సాగింది చిన్నతనంలో పేదరికంతో పోరాటం పెద్దయిన తరవాత జీవితం చాలించేవరకు ప్రతికూలవర్గాలతోటి పోరాటం సాగించాల్సివచ్చింది కుటుంబ పరిస్థితుల ననుసరించి చిన్నతనంలోనే పరిశ్రమ పరిపూర్ణత పట్టుదల ఆయనకు అలవడ్డాయి

చిన్నతనంలో స్కూలు ఫీజులు చెల్లించలేక హానిమన్ తండ్రి ఆయనను చదువు మాన్పించాడు హానిమన్ టీచర్ అతని తెలివితేటలకు మెచ్చుకుని హానిమన్‌కు ఫీజులేకుండా విద్యాబోధన చేసేందుకు అతికష్టంమీద అతని తండ్రిని ఒప్పించి స్కూలులో చేర్చుకున్నాడు హానిమన్ తండ్రికి తన కుమారుడు ఉచితంగా చదువుకోవడానికి అభిమానం అడ్డువచ్చింది హానిమన్ టీచర్ పన్నెండవ ఏటనే తోటి విద్యార్థులకు గ్రీకు భాషాబోధన బాధ్యత అప్పగించి ఆవిధంగా గడించిన ధనంతో చదువుకునే ఏర్పాటుచేశాడు అందుకు తండ్రి అంగీకరించాడు చిన్నతనంలో ఎన్ని కష్టాలెదురైనా కష్టపడి పట్టుదలతో తండ్రి సహాయం లేకుండానే విద్యాభ్యాసం కొనసాగించాడు 20 సంవత్సరాల వయస్సు రాగానే హానిమన్ లీప్జిగ్ విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్యాభ్యాసానికి చేరాడు అక్కడ చదువుకునే రోజుల్లో జర్మన్ ఫ్రెంచి భాషాబోధనచేసి ఇంగ్లీషులోవున్న పుస్తకాలు తర్జుమాచేసి ఆర్జించిన ధనంతో లీప్జిగ్ విశ్వవిద్యాలయంలో చదువు పూర్తిచేసుకోగలిగాడు తరవాత రెండు సంవత్సరాల అనంతరం వియన్నాలో వైద్య విద్యాభ్యాసానికి వెళ్ళాడు అక్కడకూడా అర్ధరాత్రి వరకూ ఆంగ్ల గ్రంథాలు తర్జుమాచేస్తే వచ్చిన సంపాదనతోనే జీవితం గడుపుతూ 779లో తన ఇరవైనాలుగోఏట ఎర్లాంగెన్ విశ్వవిద్యాలయంలో వైద్యశాస్త్రంలో పట్టభద్రుడయ్యాడు

పట్టభద్రుడైన తరవాత వైద్యవృత్తి చేపట్టి వివిధ పట్టణాలలో ఆసుపత్రులలో పనిచేశాడు 782లో వివాహం అయింది వృత్తిలో నిమగ్నుడై రసాయనశాస్త్ర పరిశోధనలు సాగిస్తుండేవాడు చికిత్సకొరకు ఉపయోగించే ఔషధాల ధర్మాలు పరిశీలిస్తుండేవాడు ఈ పరిశోధనలు ఉత్తరోత్తరా తాను కనిపెట్టిన హోమియోవైద్య విధానానికి పునాదిగా ఉపయోగించాయని చెప్పుకోవచ్చు. ఈ పరిశోధనలేకాక ఇంగ్లీషు ఫ్రెంచి లాటిన్ ఇటాలియన్ భాషలలోవున్న వైద్యశాస్త్ర వ్యవసాయశాస్త్ర, భాషాశాస్త్ర సంబంధమైన గ్రంథాలను ఆయన అనువదిస్తుండేవాడు 785 నుంచి 789 వరకు ఆయన ప్రచురించిన పుస్తకాలు 2200 పుటలు వున్నాయంటే శాస్త్రవిజ్ఞానంపైన భాషావిషయాలపైన ఆయన పాండిత్యాన్ని అర్థంచేసుకోవచ్చు జ్వరపడిన రోగుల రక్తం

ఓద్పడం విరేచనకారి ఔషధాలు వాడడంలాంటి అనాటి చికిత్సలను ఖండిస్తూ 790లో హానిమన్ వ్యాసాలు ప్రచురించాడు అదే సంవత్సరంలో ఆంగ్లేయ వైద్యుడు కల్లెన్ రాసిన వస్తు గుణదీపిక అనే బృహద్గ్రంథాన్ని అనువదిస్తూ మలేరియా చికిత్సకువాడే సింకోనాబెరడు అన్నకోశానికి టానిక్‌గా పనిచేస్తుందని అయన రాసిన వ్యాఖ్యానంతో ఏకీభవించలేకపోయాడు తనపై స్వయంగా ఆ బెరడును వాడి దాని ధర్మాలను రాబట్టదలచాడు ఆ బెరడు కషాయాన్ని ఉదయం సాయంకాలం నాలుగు డ్రాముల చొప్పున పుచ్చుకున్నాడు కొద్దిరోజుల్లోనే మలేరియా జ్వరాన్ని పోలిన జ్వరం వచ్చింది ఈ ప్రయోగం అవగానే జ్వరం తగ్గిపోయింది వెంటనే మెరుపు మెరసినట్లు ఒక ఆలోచన తలపునకు వచ్చింది చలిజ్వరాన్ని నివారించే సింకోనా స్వయంగా చలిజ్వరాన్ని కల్గిస్తుందా డాక్టర్ జాన్ క్లార్కు మాటల్లో చెప్పవలసివస్తే చెట్టునుండి రాలిన యాపిల్‌పండు న్యూటనుకు గురుత్వాకర్షణ సూత్రాలు ప్రబోధించిన విధంగా చర్చిలో వేలాడుతున్న లాంతరు గెలీలియోకు లోలక సూత్రాలు ప్రబోధించిన విధంగా సింకోనా బెరడు హానిమన్‌కు సారూప్యౌషధ సూత్రాన్ని ప్రబోధించింది సింకోనా బెరడుతో తానుచేసిన ప్రయోగం తర్వాత ఆరు సంవత్సరాలపాటు ఈ ప్రయోగాలు అధ్యయనాలు సాగించి మొదటిసారిగా 796లో ఆనాటి ప్రసిద్ధ వైద్యపత్రిక హ్యూఫలాండ్ జర్నల్‌లో ప్రకటించారు ప్రపంచానికి సంబంధించినంతవరకు హోమియో వైద్య విధానం 1796లో మాత్రమే ఆవిష్కరించబడింది On a New Principle for Ascertaining the Curative Properties of Drugs అన్న శీర్షికతో ఆ చారిత్రాత్మక వ్యాసం వెలువడింది అనాటినుంచి సరూపాలతో సరూపాలను నివారించాలి అన్న నియమం బహిర్గతమయింది కాని వాస్తవానికి ఈ చికిత్సానియమం హానిమన్ కన్న 2500 సంవత్సరాల పూర్వమే వైద్య పితామహుడు హిప్పొక్రటీస్ చెప్పే వున్నాడు పురాతన గ్రీకుల కాలంలోనే తెలిసి కాలగర్భంలో కలిసిపోయిన ఈ సహజ చికిత్సా నియమానికి హానిమన్ తిరిగి ప్రాణం పోశాడని చెప్పవచ్చు.

హోమియో సూత్రాన్ని ఆవిష్కరించిననాటికి హానిమన్ వయస్సు 42 సంవత్సరాలు ప్రతికూలురు విమర్శకు పూనుకున్నారు అనాటికి అమలులోవున్న మొరటు చికిత్సా పద్ధతులను నిలువునా చీల్చిచెండాడే విప్లవాత్మక సున్నిత చికిత్సా విధానం హోమియోపతి మందులు తయారుచేసేవారి వ్యాపారం పడిపోయింది ఒకేమందు సూక్ష్మమైన మోతాదు అనగానే పచారీ దుకాణాల వ్యాపారానికి విఘాతం కల్గింది వారి దాడులను తట్టుకోవడానికి సరిపడ విజ్ఞత పట్టుదల ఓర్పు, శారీరక దృఢత్వం హానిమన్‌కి వున్నాయి

నిర్విరామంగా ప్రయోగాలు అధ్యయనాలు కొనసాగించాడు అనేక ఔషధాలను తనపైన ప్రయోగించుకుని వాటి ధర్మాలను రాబట్టాడు 18 0లో ఆర్గనాన్ ఆఫ్ రేషనల్ హీలింగ్ అనే హోమియోవైద్య సూత్ర గ్రంథాన్ని ప్రచురించాడు రోమన్‌కవి హొరేస్‌నుంచి గ్రహించిన Dare to be wise అన్న సూక్తిని ఆ గ్రంథం టైటిల్ పేజీలో ప్రకటించాడు విజ్ఞతతో వ్యవహరించడానికి వెరవనక్కరలేదన్నది ఈ సూక్తికి అర్థం ఈ లక్ష్యానికి తనను తాను అంకితం చేసుకుని ఈ వాక్యాన్ని తన గ్రంధానికి దీక్షావాక్యంగా స్వీకరించాడు

1811 నుంచి హానిమన్ లీప్జిగ్ విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడిగా పనిచేశాడు తన బోధన తన ఆర్గనాన్‌లో వ్యక్తంచేసిన అభిప్రాయాల కనుగుణంగానే సాగింది తన నూతన సిద్ధాంతాన్ని నమ్మిన ఉత్సాహవంతులైన శిష్యులు లభించారు వారి సహకారంతో ఔషధ ప్రయోగాలు కొనసాగించాడు తాను లీప్జిగ్‌లో పనిచేసిన కాలంలో మెటీరియా మెడికా ప్యూరా అనే గ్రంథాన్ని ఆరు సంపుటాల్లో వ్రాసి 81 నుంచి 1821 వరకూ ప్రచురించాడు వస్తుగుణ దీపిక అని కాకుండా స్వచ్ఛమైన వస్తుగుణ దీపిక అని పేరుపెట్టడంలో విశేషార్థం స్ఫురిస్తుంది మనుషులపై ప్రయోగాలు జరిపి ఔషధ ధర్మాలు రాబట్టి తన వస్తు గుణదీపికలో చేర్చడం ప్రథమ విశేషం

ఔషధ ధర్మాలను వివరించేటప్పుడు సాంకేతిక పదాలను వాడకుండా సహజంగా వాడుకభాషను ఉపయోగించడం రెండవ విశేషం ఈ ప్రత్యేకతలవలన ఈ గ్రంథాలు ఆరోజుకు ఈరోజుకు ప్రయోజనకరమైన గ్రంథాలుగానే వుండిపోయాయి

లీప్జిగ్‌లోవున్న కాలంలో పేరు ప్రఖ్యాతులు గడించుకున్న సమకాలికుల అసూయాద్వేషాలకు గురికావలసివచ్చింది వారంతా మందులు తయారుచేసే ఎపాథకెరీస్ ద్వారా ఒత్తిడి ఎక్కువచేశారు చట్టం ద్వారా కూడా చిక్కులు తెచ్చిపెట్టారు దానితో లీప్జిగ్ వదిలి అయన 82 లో కోథెన్ అనే చిన్నవూరికి మారవలసివచ్చింది తన వైద్య వృత్తికి ఆటంకాలులేవు స్వయంగా మందులు తయారుచేసి ఇవ్వవచ్చు. ఆయన శిష్యులలో ఒకరైన

డాక్టర్ స్టాఫ్ 822లో ప్రప్రథమంగా ఒక వైద్యపత్రిక ఆరంభించాడు హానిమన్‌పై వచ్చిన విమర్శలకు ఆ పత్రిక ద్వారా జవాబులు ఇస్తుండేవాడు

సరైన ఔషధాలను ఎంపికచేసి రోగులకిచ్చినా తాత్కాలిక ఉపశమనం మాత్రమే శాశ్వతంగా నివారణకాని కేసుల విషయం 8 6 నుంచి హానిమన్ దృష్టిని ఆకర్షించింది ఈ అంశంపై పన్నెండేళ్ళు సుదీర్ఘంగా పరిశోధించి కారణాలను విశ్లేషించి 828లో క్రానిక్ డిసీజెస్ అనే గ్రంథాన్ని ప్రచురించాడు దీర్ఘవ్యాధులను మూడుతరగతులుగా విభజించి ఆయా తరగతులకు చెందిన మందులను వివరించాడు దీర్ఘవ్యాధులకు కారణాలను విశ్లేషించి ఆ వ్యాధులకు సోరా సైకోసిస్ సిఫిలిస్ అనే పేర్లు పెట్టాడు ఈ పేర్లు రోగితత్వాన్ని తెలియచేస్తాయి వైద్యగ్రంథాలలో అవయవాలకు వర్తింపచేసి వర్ణించే వ్యాధులన్నింటికి మూలకారణాలుగా ఈ మూడింటిని వర్ణించాడు

హానిమన్ ఎనభై సంవత్సరాల వయస్సులో మొదటి భార్య మరణించిన 5 సంవత్సరాల తరవాత ఒక సంపన్నకుటుంబానికి చెందిన పేరు ప్రఖ్యాతులున్న ఫ్రెంచి యువతిని రెండో వివాహం చేసుకొన్నాడు 835లో జర్మనీ వదలి మిగిలిన ఎనిమిది సంవత్సరాలు పారిస్‌లో వైద్యవృత్తి కొనసాగిస్తూ జీవించాడు 88 సంవత్సరాలు జీవించి 843లో జులై 2వ తేదీన తుదిశ్వాస విడిచాడు

హానిమన్ పరిపూర్ణజీవి ప్రతిభాశాలి బహుభాషావేత్త తన జీవితకాలంలో స్వయంగా 70 పుస్తకాలు రచించాడు ఇంగ్లీషు ఫ్రెంచి ఇటాలియన్ లాటిన్ భాషలనుంచి 24 గ్రంథాలను తర్జుమా చేశాడు సుమారు నూరుమందులపై ప్రయోగాలు జరిపి ఫలితాలను క్రోడీకరించాడు తన జీవితంలో 44 సంవత్సరాలపాటు రోజుకు 4 గంటలు మాత్రమే నిద్రిస్తూ ప్రతి నాలుగవరోజు నిద్రకాస్తూ దీక్షతో కృషిచేశాడు విజ్ఞతతో జీవించడానికి వెనుకాడవద్దని ప్రబోధించాడు ఆయన సమాధిపై స్మారక ఫలకంమీద నా జీవితం వ్యర్థంకాలేదు అని చెక్కిన మాటలు పూర్తిగా సార్థకమైనవి



# సరస సరళ సహజవైద్యం...

ఇంకొక దశాబ్దంలో 20వశతాబ్దం పూర్తయి 21వ శతాబ్దం ప్రారంభం కానున్నది ఆ నమయానికల్లా అందరికీ ఆరోగ్యం నినాదాన్ని ప్రపంచ ఆరోగ్యనంస్థ ప్రకటించింది ఇదిఅన్ని వైద్యవిధానాలకూ నవాలు

భారతదేశ జనాభా అనాటికి 100 కోట్లకు చేరుకోవచ్చు. ఎంతోమంది పల్లెపట్టులు విడిచి పట్టణాలకు చేరుతున్నప్పటికీ మనదేశ జనాభాలో 80 శాతం ఇప్పటికీ గ్రామాల్లోనే నివసిస్తున్నారు యంత్రాలపై అధారపడిన వ్యాధి అవగాహనగాని మామూలు వ్యాధులకు సైతం రోజుకు ఒక కొత్తమందును తయారుచేసే వైద్య పద్ధతిగాని పెట్టుబడిదారీ వ్యాపార నంస్థలకు మేలు చేయగలవేమోగానీ సామాన్య ప్రజలకు నహాయపడజాలవు ఆధునిక వైద్యంగా చెలామణీ అవుతున్న అలోపతీ వైద్యవిధానం అందరికీ వైద్యం అన్న నవాలుకు జవాబు కాలేదు ఆరోగ్య నంరక్షణ పేరుతో సాగే వ్యాపార ప్రవృత్తి అమెరికాలాంటి నంపన్నదేశాలకు కూడా మొహంమొత్తించింది ఆర్థికభారంతో కూడిన నూపర్ స్పెషలైజేషన్‌వైపు నుంచి కుటుంబ వైద్యుని వైపునకు దృష్టిసారిస్తున్నారు అక్కడి ప్రజలు ఇలాంటి పరిస్థితులలో ఆర్థికంగా వెనుకబడివున్న మనదేశంలో అధునాతన పరికరాలతోకూడిన లేబరేటరీలు ఫైవ్‌స్టార్ హొటళ్ళను పోలిన నూపర్ స్పెషాలిటీ హాస్పిటళ్ళు హెల్త్ ఇన్సూరెన్సు కార్డులు విశేషంగా తలెత్తుతుండటం విడ్డూరం కాదా ప్రభుత్వం కూడా ప్రజారోగ్యాన్ని ఒక వ్యాపార నరళిగా గుర్తించి ఈ నంస్థలకు కోట్ల కొలది ధనాన్ని నమకూర్చడం దురదృష్టకరం ఇదంతా చూస్తుంటే మనం అందరికీ ఆరోగ్యం అన్న ఆదర్శానికి చేరువౌతున్నామా దూరమౌతున్నామా అన్నది ఊహించుకోవడం కష్టంకాదు

ప్రపంచ ఆరోగ్యనంస్థ నవాలుకు నమాధానం కాగలవి నహజవైద్య విధానాలు మాత్రమే గత చరిత్ర నుంచి మనం కొన్ని గుణపాఠాలు నేర్చుకోవాలి రెండున్నరవేల ఏళ్ల క్రితం వైద్య విధానాన్ని ఊహా ప్రపంచం నుంచి వాస్తవిక జగత్తుకూ మూఢ విశ్వాసాలనుంచి హేతుబద్ధవివేచనకూ మరలించిన ఘనత గ్రీకువైద్యుడు హిప్పోక్రటీస్ (క్రీ పూ 460-377)కు దక్కుతుంది వైరుధ్యాలను వైరుధ్యాలతోనే నిరోధించాలనే అల్లోపతి వైద్యసూత్రానికీ సారూప్యాలను సారూప్యాలే నవరిస్తాయనే హొమియో వైద్యసూత్రానికీ మూలపురుషుడు ఈయనే అందువల్ల ఈయన అల్లోపతికేకాదు హొమియోపతికి కూడా పితామహుడే క్రీస్తుశకం రెండవ శతాబ్దంలో వచ్చిన గ్రీకువైద్యుడు గాలెన్ ( 30-200) ప్రభావంతో వైరుధ్యసూత్రం నిలదొక్కుకుని సారూప్యసూత్రం తెరమరుగైపోయింది తిరిగి 6వ శతాబ్దంలో పునర్వికాసోద్యమ (రినైజాన్స్) ప్రభావంతో వచ్చిన పారాసెల్సస్ ( 493- 540) ఈ విధానంలోని అనంబద్ధతను ప్రశ్నించేదాకా పద్నాలుగు శతాబ్దాలపాటు వైరుధ్యసూత్రమే రాజ్యమేలింది ఈ కాలంలో ఇదెన్నో వెర్రితలలు కూడా

వేసింది ఉదాహరణకు జ్వరం వచ్చినపుడు గుండె వేగంగా కొట్టుకుంటుందని జ్వరం తగ్గాలంటే గుండెవేగం తగ్గించాలని రక్తం ఒడిస్తేగాని గుండెవేగం తగ్గదని కనక జ్వరం తగ్గాలంటే రక్తం ఓడ్చడం కన్న గత్యంతరం లేదని - ఇలాంటి నిర్హేతుకమైన ఆలోచనా పద్ధతులను అవలంబిస్తుండేవారు ఈ మొరటు పద్ధతులు హానిమన్ 755- 843 వచ్చేదాకా కొనసాగుతూనే ఉండేవి అమెరికా స్వాతంత్ర్య సమరసారధి జార్జి వాషింగ్టన్ నెత్తురును చాలాసార్లు ఓడ్చడం జరిగింది 799లో ఆయన మరణించేనాటికి ఆయనలో రక్తం అడుగంటిపోయింది ఫ్రెంచి చక్రవర్తి 3వ లూయీకి ఒక్క ఏడాదిలోనే 47 సార్లు నెత్తురు ఓడ్చడం 2 5 సార్లు వసరుపోవడానికి వాంతులు భేదులు కల్పించడం 3 2 సార్లు ఎనీమా చెయ్యటం జరిగింది ఇదంతా ప్రఖ్యాత రాజవైద్యుడైన బవార్డ్ ఆదేశాలననుసరించే సాగింది

వైద్య రంగంలో వైరుధ్య సూత్రాలను నిలబెట్టిన గాలెన్ పరమప్రమాణంగా పరిగణించబడుతూ అనాగరిక చికిత్సా పద్ధతులు బహుళ ప్రచారంలో ఉన్న తరుణంలో శామ్యూల్ హానిమన్ అవతరించాడు అప్పటిదాకా గాలెన్ ప్రామాణ్యత ప్రశ్నించరానిదిగా సాగింది వ్యాధి పరిజ్ఞానం ఔషధ పరిజ్ఞానం చికిత్సా పద్ధతులు చాలా అధ్వాన్నంగా వుండేవి పరిశోధనలు జరపటం జంతువులమీదా ఫలితాలు రుద్దడం మనుషులమీదా వైద్యరంగమంతటా కేవలం ఊహ కల్పన కృత్రిమ చింతన తాండవిస్తూ వుండేవి ఆ కాలంలో ఇతర రంగాలన్నీ సహేతుకంగా నియమబద్ధంగా చైతన్యవంతంగా రూపొందుతుంటే వైద్యరంగం జడప్రాయంగా పడివుండి తనను కూడా అభ్యుదయ పంథాలో మలచగల మౌలిక విప్లవంకోసం ఎదురుచూస్తూ వుంది చారిత్రకావశ్యకత అయిన ఈ వైద్య విప్లవాన్ని విజయవంతంగా సాధించిన ఘనత హానిమన్‌కు దక్కింది

హానిమన్ స్వయంగా అలోపతి వైద్యుడు తన 24వ ఏట 779లో ఎం డి పట్టా పొందాడు ఆనాటికి అమలులో వున్న వ్యాధి అవగాహనతోను చికిత్సా పద్ధతులతోను అసంతృప్తి చెంది ప్రబుద్ధమైన నైతిక దృష్టితో తనకు జీవనాధారమైన వైద్యవృత్తినే త్యజించి పేదరికాన్ని వరించాడు అమానుషమైన చికిత్సా పద్ధతి తన హేతుబుద్ధికి నచ్చకపోవటం వల్ల దానికి దోహదంగా ఉన్న ప్రామాణ్యతకే ఎదురు తిరిగాడు మలేరియాను నయం చేయడానికి ఉపయోగపడుతున్న సింకోనా బెరడుతో 790లో జగత్ప్రసిద్ధమైన ప్రయోగాన్ని తనపైనే చేసుకున్నాడు సింకోనా బెరడువల్ల తనకు మలేరియాను పోలిన లక్షణాలు వచ్చాయి దానితో మందు దేనిని కల్పించగలదో దానిని నయం చెయ్యగలదు అన్న ప్రకృతి నియమం ఆయనకు సాక్షాత్కరించింది అంటే సింకోనా బెరడు మలేరియా లాంటి వ్యాధిని కల్పించగలదు కాబట్టే దానిని నయం చెయ్యగలుగుతుందన్నమాట ఇదే హానిమన్ ఆవిష్కరించిన ప్రకృతి సహజమైన సారూప్యతానియమం వైద్య చరిత్రలోనే శరీరంపై ఔషధ ధర్మనిరూపణకు నాంది పలికింది ఈ ప్రయోగమే మానవుల చికిత్సకు అవసరమైన ఔషధ ధర్మాలను మానవులపై ప్రయోగించడం ద్వారా మాత్రమే రాబట్టవలసి వుంటుందన్న సహజవైద్య పద్ధతికి కూడా ఈ ప్రయోగమే నాందీవాచకం పలికింది ఈ ప్రయోగం ద్వారా వైద్యరంగంలో సహేతుకమైన సారూప్యత ప్రకృతి సిద్ధమైన సహజత ఒకేసారి నెలకొనడం విశేషం అయితే 790 నుంచి ఎన్నో ఔషధాలను తనపైన తన కుటుంబీకులపైన తన మిత్రులపైన ప్రయోగించి ఫలితాలు రాబట్టి నిగ్గుతేల్చుకున్న తరువాత మాత్రమే 796లో ప్రఖ్యాత జర్మన్ వైద్య పత్రిక హ్యూఫ్‌లాండ్‌లో ప్రప్రథమంగా తన సారూప్య సిద్ధాంతానికి సమర్థంగా ఒక వ్యాసం ప్రచురించాడు ఆనాటి నుంచి తాను ఆవిష్కరించిన నూతన పద్ధతిలో చికిత్స ఆరంభించి తాను గడించిన అనుభవం ద్వారా ఔషధం వీలైనంత చిన్న మోతాదులో ఇస్తేనే రోగికి బాధలేకుండా హాయిగా స్వస్థత చేకూరుతుందన్న సత్యాన్ని గ్రహించాడు ఈ మోతాదును తగ్గించడంలో తాను ఆవిష్కరించిన కొత్తపద్ధతికి శక్తి గుణీకరణ (potentisation)అని పేరుపెట్టాడు ఇలాంటి ఔషధ సూక్ష్మీకరణవల్ల వ్యాధి సత్వరంగా నివారణ అవుతూ ఉండడం వల్ల ఈ క్రియలో ఔషధశక్తి పెరుగుతుందన్న భావంతోనే హానిమన్ ఈ సూక్ష్మీకరణ ప్రక్రియను పొటెంటైజేషన్ అన్నాడు ఇలాంటి సూక్ష్మీకృత ఔషధ రూపాలను పొటెన్సీలుఅన్నాడు ఈ పొటెన్సీల రూపంలో ఔషధాలను ఇవ్వడం వలన రోగికి ఏ విధమైన రియాక్షనులు లేకుండా వ్యాధి సున్నితంగా హాయిగా నయమవుతుంది ఇలా పొటెంటైజేషన్ ద్వారా హోమియో చికిత్సా పద్ధతిలో సరళత్వం చోటుచేసుకుంది

ప్రయోగరీత్యా సహేతుకమైన సారూప్యతా నియమం సాధించడం జరిగింది ఇది ప్రకృతి సహజసూత్రం కావడంవల్ల వ్యాధి నివారణ సత్వరంగా జరుగుతుంది సూక్ష్మమైన మోతాదులు ఇవ్వడం సారూప్యతా నియమంవల్లనే సాధ్యపడింది ఔషధం సారూప్యత సూక్ష్మతల మూలంగా చికిత్స రోగికి సరళం- అంటే బాధారహితం- అయింది ఔషధాలను స్థూలరూపంలోకాక సూక్ష్మాతిసూక్ష్మ రూపంలో వాడడంవల్ల వెల సరసం అయింది ఔషధాలను చక్కెరతో కలిపి వాడడంవల్ల సరసత సార్థకం అయింది అలా సారూప్య ఔషధం సరస సరళ సహజ గుణాల మేలి కలయికగా రూపొందింది

ఇన్ని హంగులున్న హోమియోపతి ఈనాడు తగినంతగా ప్రజలలో చొచ్చుకుపోలేక పోవడానికి కారణం ఏమిటన్న సంశయం సహజంగానే వస్తుంది ఈ సంశయానికి మానవ వికాస చరిత్ర దృష్ట్యా సమాధానం చెప్పుకోవలసి వుంటుంది

వైద్యవిజ్ఞాన సౌధానికి నాలుగు స్తంభాలవంటి మహా వ్యక్తులు నలుగురున్నారు వారిలో మొదటి ఇద్దరు హిప్పోక్రటీస్ గాలెన్- గ్రీకు వైద్యులు తరవాత ఇద్దరు పారాసెల్సస్ హానిమన్- జర్మన్ వైద్యులు గ్రీకు విజ్ఞానం మూడు పువ్వులు ఆరు కాయలుగా వికసించినరోజుల్లో అవతరించినవాడు హిప్పోక్రటీస్ ఆ వికాస ప్రభావం ఆయన వైద్యపద్ధతిలో స్పష్టంగా ప్రతిబింబిస్తుంది గాలెన్ రెండవ శతాబ్దంవాడు గ్రీకు విజ్ఞానం రోమన్ విజ్ఞానం మరుగునపడి యూరప్ అంధకారయుగంలో ఉన్న శతాబ్దం అది అందుకే గాలెన్ ప్రభావంతో వైద్యవిజ్ఞానం పెడతోవ పట్టింది తిరిగి పునర్వికాసోద్యమ ప్రారంభంలో 6 వ శతాబ్దంలో జీవించిన పారా సెల్సస్ అనాటి అల్లోపతి వైద్యవిధానాన్ని తూర్పారబట్టాడు అయితే వైద్యవిజ్ఞానానికి శాస్త్రీయమైన ప్రయోగ పద్ధతిని సమకూర్చిన ఘనత హానిమన్‌కే దక్కింది ఆయన వివేకయుగమైన 8 వ శతాబ్ది చివరిభాగంలోనూ అభ్యుదయ యుగమైన 9 వ శతాబ్దపు ప్రారంభంలోను జీవించి ఆ రెండు యుగాల ఉత్తమ లక్షణాలు పుణికిపుచ్చుకున్న మహోన్నత వ్యక్తి అని మరవరాదు అందుకే 8 వ శతాబ్దంలో వెలుగులోకి వచ్చిన హోమియోపతి 19 వ శతాబ్దంనాటికి నాగరిక దేశాలన్నింటిలోనూ బాగా విస్తరించింది యూరప్‌నుంచి 825 నాటికి అమెరికాకు చేరింది రష్యాతోసహా అన్ని దేశాలు హోమియో వైద్యవిధానాన్ని గుర్తించాయి అమెరికాలో కూడా హోమియో కాలేజీలు వెలిశాయి అమెరికా రాజధాని వాషింగ్‌టన్‌లో అధ్యక్ష భవనం సమీపంలో ఒకేఒక వైద్య ప్రముఖుని స్మారక చిహ్నం నెలకొన్నది అది హానిమన్‌ది ఇంగ్లండ్ ఫ్రాన్స్ దేశాలలో కూడా ఈ విధానం ప్రజా మన్నన చూరగొంది చట్టరీత్యా కూడా దీన్ని గుర్తించారు

అయితే 19 వ శతాబ్దంలో యంత్ర నాగరికత విజృంభించి మానవుడు యంత్రానికి దాసుడయ్యాడు అంధకారయుగంలో మనిషిని మతం మింగితే ఈ ఆధునికయుగంలో యంత్రం మనిషిని మింగుతున్నది దీనితో వ్యక్తివికాసంపై ఆధారపడ్డ మానవ విలువలు మంట కలిసినై ఔషధ నిర్ణయంలో వ్యక్తిత్వానికి ప్రాధాన్యతనిచ్చే హోమియోపతి వలుకుబడి- వ్యక్తిని నామమాత్రావశిష్టునిగా దిగజార్చివేసిన సంస్కారరహితమైన ఈ సమాజంలో సహజంగానే పడిపోతూ వచ్చింది విజ్ఞులైనవారు ఆధునిక సమాజంలోని లోపాలను గుర్తిస్తూ మానవ విలువల గురించి ఆలోచిస్తున్నారు ఇది ప్రపంచవ్యాప్తంగా కనిపిస్తున్న శుభసూచన దీని ప్రభావం సమాజంలోని అన్ని రంగాలమీద పడుతున్నట్లే వైద్యరంగంమీదా పడుతున్నది యంత్ర నాగరికతకు లోనైన మానవుడు వ్యాధి కారణాన్ని రోగికి వెలుపలనే వెదుకుతూ వచ్చాడు వ్యాధి నివారణకు వాడుతూవచ్చిన మందులుకూడా మారుతున్న యంత్రాలు అందించే సమాచారంపై ఆధారపడి మారుతూ వచ్చాయి ఉదాహరణకు రోగకారకమైన సూక్ష్మక్రిములను హతమార్చే సల్ఫానమైడ్స్, యాంటీబయాటిక్స్ ప్రవేశపెట్టినరోజున మానవుని ఆయు ప్రమాణం 50- 200 ఏళ్లవరకు పెంచగలమని వైద్యశాస్త్రజ్ఞులు కలలుగన్నారు ఆ కలలు కల్లలని తేలిపోయింది ఈ రోజున ఆ యంత్రాలనే సూక్ష్మక్రిములనుంచి మనిషి వైపు తిప్పి వాటి సహాయంతో అవయవ దోషాలనుమాత్రమే కనుగొని వ్యాధి కారణాన్ని కనుగొన్నట్లు భ్రమిస్తున్నారు కాని మనిషి అంటే అవయవాలు మాత్రమే కాదని దేహం మనస్సు ప్రాణం ఈ మూడింటి సమాహారం అని గుర్తించలేకపోవడమే దీనికి కారణం వ్యాధి ప్రాణశక్తి వైకల్యంగా ప్రారంభమై జీవకార్యాలలో మనోవ్యాపారాలలో మార్పులు కలగచేసి చిట్టచివరలో మాత్రమే అవయవాలలో వ్యక్తమవుతుంది అంటే ఎక్సురే స్కానర్ ఎన్ఎంఆర్ లాంటి యంత్రాలద్వారా కను

క్కుంటున్నది వ్యాధి ఫలితాలేగాని వ్యాధి మూలాలుకావు యంత్రాలు అవయవాలను పరిశీలించగలవే మోగాని మనస్సును ప్రాణాన్ని పసికట్టజాలవు అవయవాలలో ఎట్టి మార్పులేని వ్యక్తిలో కూడా బాధలు ఉంటాయన్న నంగతి తెలిసినదే వ్యాధి నిరూపణకు యంత్ర పరిశీలన ఒక స్వల్ప సాధనం మాత్రమే యంత్రాలు కనిపెట్టలేని వ్యాధులెన్నో ఉన్నాయి

ఆరోగ్యం అంటే అస్వస్థతలేని స్థితి అస్వస్థత దేహ మానస ప్రాణ స్థాయిలలో ఏ స్థాయిలోనైనా ఉండవచ్చు. ఇది గుర్తించడమే సహజ వైద్య లక్షణం వైద్యుడు రోగిని మూడు స్థాయిలలో పరిశీలించి లక్షణాలను సేకరించి తదనుగుణమైన ఔషధాన్ని నిర్ణయించవలసి ఉంటుంది ఈ విధానంలో యంత్రాలు పసిగట్టగలిగిన చివరిదశకన్నా ముందే వ్యాధిని కనుగొని నివారించవచ్చు అందువల్ల సహజ వైద్యాలు ఈ యంత్ర వైద్యంకన్నా ఎంతో మేలైనవి ఈ సహజ వైద్యాలలో హోమియో అత్యాధునికంగా శాస్త్రీయంగా కళాత్మకంగా రూపొందింది దీనిలో ప్రయోగం పరిశోధన పరిశీలన ప్రాతిపదికలుగాగల శాస్త్రీయ పద్ధతిపై ఔషధ ధర్మాలు రాబట్టడం జరిగింది హోమియోపతికి రెండు ప్రాణాలు వ్యాధికి ఔషధానికి ముడివేసే సారూప్యతా నియమం హోమియో వైద్యానికి బహి ప్రాణమైతే రోగి పరిస్థితి దృష్ట్యా నిర్ణయించవలసిన పొటెన్సీ పద్ధతి అంత ప్రాణమవుతుంది సారూప్యతా నియమం సూక్ష్మతా నియమం పరస్పర సహకారులే ఇలాంటి శాస్త్రీయ నియమాలు మరే వైద్య విధానంలోనూ కనిపించవు

మనిషికి అస్వస్థత ప్రారంభమైనప్పుడు మొట్టమొదటగా మానసికస్థాయిలోనే ప్రారంభం అవు తుంది మానసిక స్థాయిలో వ్యాధి అనిర్వచనీయంగా మిగిలిపోతుంది ఈ స్థాయిలో వ్యాధిని అవగాహన చేసుకోవడానికి లేబరేటరీ పరీక్షలు సహాయపడవు ఆ పరీక్షలపై ఆధారపడ్డ వైద్యవిధానం ఈ స్థాయిలో నిరుపయోగం మానవునిపై ఔషధాలను ప్రయోగించి హోమియోలో ఔషధ ధర్మాలు రాబడ తారు కనుక వ్యాధిని మానసికస్థాయిలో విశ్లేషించి వ్యాధి ఫలానా అని పేరుపెట్టడానికి వీలులేని స్థితిలో అత్యంత ప్రయోజనకారి హోమియో వైద్యం లేబరేటరీ సౌకర్యాలంతగాలేని అసంఖ్యాక భారతదేశ గ్రామాల్లో ప్రజలకు మేలు చేకూర్చే వైద్యం హోమియోపతే

చికిత్సానంతరం ఈ వైద్యవిధానంలో దుష్ఫలితాలుండవు దీనికి కారణం ఔషధాలని సూక్ష్మమైన మోతాదులో వాడటమే మందు తీసుకోవడంలో ఇంతకన్నా సుఖమైన వైద్యం మరొకటి లేదు ఈ మందులు వ్యాధి నివారకాలుగానేకాక వ్యాధి నిరోధకాలుగా కూడా పనిచేస్తాయి సంప్రదాయ వైద్యంలో టీకాలు- వ్యాధి నిరోధక విషయంలో హోమియో పద్ధతిని పోలినట్టివే దేహతత్వ చికిత్సకు వాడే హార్మోనులు పోషణ లోపాన్ని సరిదిద్దడానికి వాడే విటమినులు సూక్ష్మత్వంలో హోమియో మోతాదులను పోలినట్టివే సూక్ష్మమైనవి అయినంతమాత్రాన వాటి ప్రయోజకత్వాన్ని సత్వరంగా నివారించే శక్తిని ఎవ్వరూ శంకించవలసిన పనిలేదు

దేహతత్వ విషయంలో వ్యక్తి వ్యక్తీ భేదిస్తారు వ్యాధి పేరును మాత్రమే దృష్టిలో పెట్టుకుని అందరికీ ఒకే మందును వాడితే దుష్ఫలితాలు తప్పవు దానికి నిదర్శనం సంప్రదాయ వైద్యులు ఎదుర్కొనే సమస్యలే హోమియో వైద్యులకు ఈ బాధలు లేవు ఔషధాల ఎంపికలో వ్యాధి పేరుకన్నా వ్యాధిగ్రస్తుడైన వ్యక్తికే ప్రాధాన్యత హెచ్చు సాంకేతికంగా దీనినే వ్యక్తీకరణ అంటారు వ్యక్తీకరణపై ఆధారపడి మందులను ఎంపికచేసి వాడడంవల్ల ఈ మందులు తీసుకునేవారికి దుష్ఫలితాలుండవు క్లుప్తంగా చెప్పాలంటే ఇది కాటలాగ్ వైద్యం కాదు

దీర్ఘ వ్యాధులన్నీ క్రిములవల్లకాక దేహతత్వానుసారంగా వచ్చేవే దీర్ఘ రోగులలో వ్యక్తీకరణ తప్పనిసరి వ్యక్తీకరణవల్ల ఇది మరొక ప్రయోజనం దీర్ఘ వ్యాధిగ్రస్తులకు హోమియో వైద్యవిధానం తప్ప గత్యంతరంలేదు ఈ వైద్యవిధానంద్వారా వ్యాధి నయంకాకపోయినా ప్రాణం హాయిగా ఉంటుంది దీనినే ఉపశాంతి ఉంటారు

ఈ మందులను ఎక్కడకు వెళ్లినా వెంట తీసుకుపోయి సుఖంగా ఉపయోగించుకోవచ్చు పసిపిల్లలకు కూడా తేలికగా ఇవ్వవచ్చు. ప్రథమచికిత్సలో ఇది నిరపాయకరం సత్వర ఫలితాలను కూడా ఇస్తుంది

హోమియో వైద్యంలో పాత జబ్బులు బయటపడి బాధిస్తాయనే అపోహ ఉంది అంతకుముందు లేని బాధలేవీ కొత్తగా రావు ప్రస్తుత బాధలేగాక తగ్గిపోయినట్లు కన్పించే పాత రోగాలుకూడా శరీరంలోనుంచి తుడిచివేసినట్లు పోతాయని తెలుసుకోవడమే శాస్త్రీయ అవగాహన

హోమియో వాడేవారు ఇతర మందులేవీ వాడకూడదన్న నియమం ఏమీలేదు వ్యాధి అణచివేతకు దారితీసే మందులుమాత్రం వాడకూడదు ఉదాహరణకు కార్టిజోనులు వాడకూడదు

హోమియో వైద్యంలో స్పెషలిస్టులుండరు ఇది వైద్యవిధానానికి నప్పె విషయం కాదు మనిషి అవయవ నమాహారం కాదు అవయవి ఇది హోమియోవైద్య అవగాహన

హోమియోవైద్య విధానం నియమబద్ధమైనది గనుక శాస్త్రీయతా వ్యక్తీకరణ సూత్రం పాటించి కళాత్మకతా ప్రయోజనాత్మకతా నంతరించుకొంది సూక్ష్మమైన మోతాదులతో నరళతా తీయని మందులతో నరసతా పుణికి పుచ్చుకొంది విద్యాబుద్ధులు నేర్చిన వారంతా గృహవైద్యంగా చేపట్టడానికి వీలైన నిరపాయత ఈ వైద్య విధానంలోని గొప్ప సౌలభ్యం



# సూత్రసప్తకం

వైద్య సిద్ధాంత గ్రంధాలలో ప్రధానంగా పేర్కొనదగినవి రెండు ఒకటి వైద్యశాస్త్ర పితామహుడు హిప్పోక్రటీస్ రచించిన సుభాషితాలు ఎఫొరిజమ్స్) కళాత్మకమైన శాస్త్రీయ వైద్యవిధానానికి ఈ గ్రంథం నాందివలికింది దీనిలో 422 సుభాషితాలున్నాయి వైద్యానికి సంబంధించిన నైతిక భావాలు ఈ గ్రంధంలో వున్నాయి వ్యాధి స్వరూపస్వభావాలను వైద్యుడు పాటించవలసిన నియమాలను ఈ సుభాషితాలు ప్రస్తావిస్తున్నాయి ఈ గ్రంధంలో హిప్పోక్రటీస్ ప్రదర్శించిన పరిశీలనాశక్తి హేతుబుద్ధి ఆశ్చర్యకరమైనవి

హిప్పోక్రటీస్ తన గ్రంధంలో చికిత్సకు సంబంధించిన ఎన్నో చిట్కాలను అందించాడు ఉదాహరణకు కొన్ని చూడండి

వ్యాధి తీవ్రంగా ఉన్నప్పుడు ఆహారం తేలికగా తీసుకోవాలి

వ్యాధి వెనకాడుతున్నప్పుడు ఎక్కువగా మందులు వాడి వ్యాధిని చెదరగొట్టగూడదు

వ్యాధిని ఉద్రేకపరిచే పరిస్థితులు కల్పించకూడదు

వ్యాధి తగ్గే సమయంలో జోక్యం చేసుకోరాదు దానిమానాన దానిని తగ్గనీయాలి

నిష్కారణంగా రోగి నీరసానికి లోనైతే వ్యాధి తిరగబెట్టే ప్రమాదముంది నిద్రతక్కువైనా మరీ ఎక్కువైనా అనారోగ్యమే

ఫిట్స్‌వచ్చిన తరువాత జ్వరం వచ్చినా పరవాలేదుగాని జ్వరం వచ్చిన తరవాత ఫిట్స్ రావడం ప్రమాదకరం

దిగులుతో కుమిలిపోయే మనిషికి ఫిట్స్ రావడం మరణాంతకం

లంఖణాన్ని వృద్ధులు తట్టుకోగలరు కాని పిల్లలు తట్టుకోలేరు

హిప్పోక్రటీస్ తనగ్రంధ ప్రారంభంలో ఈ విధంగా చెప్పాడు జీవితం సొంతం కళ అనంతం సందర్భం ఆకస్మికం అనుభవం వంచనాత్మకం నిర్ణయం కష్టసాధ్యం వైద్యుడు తనధర్మాన్ని నిర్వర్తిస్తే చాలదు రోగి అతని వెంట వుండేవారు కూడా తమధర్మాన్ని నిర్వర్తించేటట్టు చూడాలి బాహ్యాంశాల నిర్వహణ చక్కగా వుండేటట్లు చూడాలి

వైద్యకళకు సంబంధించిన రెండవగ్రంధం ఆర్గనాన్ ఇది 8 0 లో వెలువడింది దీని కర్త జర్మన్ వైద్యశాస్త్రవేత్త శామ్యూల్ హానిమన్ హొమియో వైద్యానికి ఈయనే పితామహుడు ఆర్గనాన్ ఆయన ప్రతిపాదించిన వైద్యతత్వగ్రంధం ఇది సర్వసమగ్రమైన గ్రంధం హిప్పోక్రటీస్ మాదిరిగానే హానిమన్ కూడా తన రచనను సుభాషితాల రూపంలోనే నిర్మించాడు దీనిలో 294 సూక్తులున్నాయి ఈ గ్రంథాన్ని రెండు

భాగాలుగా విభజించుకోవచ్చు. మొదటి రెండు సూత్రాలు ఒక భాగం మిగిలిన 292 సూత్రాలు రెండవ భాగం మొదటి రెండు సూత్రాలలో ప్రతిపాదించిన విషయాన్ని సమర్థించడానికి మిగిలిన సూత్రాలన్నీ చెప్పవలసి వచ్చింది

ఆర్గనాన్‌లోని తాత్వికసారాన్ని సంగ్రహంగా ఈ విధంగా చెప్పుకోవచ్చు.

**1**

వ్యాధిగ్రస్తుల ఆరోగ్య పునరుద్ధరణే వ్యాధినివారణ అంటాం అదే వైద్యుని ఏకైక ధ్యేయం

**2**

ఆరోగ్య పునరుద్ధరణ సత్వరంగా సరళంగా శాశ్వతంగా జరగాలి వ్యాధి మొత్తంగా నిర్మూలనకావాలి ఇదే వ్యాధి నివారణ ధ్యేయం అయితే ఇదంతా సుస్పష్టమైన సులభగ్రాహ్యమైన సూత్రానుగుణంగా సాగాలి వ్యాధి నివారణ వీలైనంత త్వరగా విశ్వసనీయంగా రోగికి సురక్షితంగా జరగాలి

ఇవి ఆర్గనాన్‌లోని మొదటి రెండు సూక్తులు వ్యాధి నివారణ అన్నది వ్యాధి సమూల నిర్మూలనగాను రోగికి పూర్వారోగ్య పునరుద్ధరణగాను నిర్వచించడం జరిగింది సంప్రదాయ వైద్యం రోగ లక్షణాలపై దృష్టిని కేంద్రీకరిస్తుంది హోమియో వైద్యంలో రోగి దేహతత్వపరమైన మానసిక శారీరక లక్షణాలన్నీ ప్రాధాన్యతను సంతరించుకుంటాయి

ఆమోదయోగ్యమైన సూత్రాలపై ఆధారపడి వ్యాధి నివారణ సత్వరంగా సరళంగా సాగాలన్నది రెండువేల ఏళ్ల కిందట గ్రీకు వైద్యవేత్త ఈస్క్లిపియస్ కన్నకల ఆ కలను వాస్తవం చేసిన ఘనత వైద్య చరిత్రలో హానిమన్‌కే దక్కుతుంది హోమియో వైద్యం సారూప్యతానియమం సూక్ష్మతా నియమం స్వస్థతానియమం అన్న మూడు నియమాలపై నిలబడింది ఇవి ప్రకృతి సిద్ధమైన నియమాలే ఇక్కడ కల్పనకు గానీ ఊహాగానానికి గానీ ఏమాత్రం తావులేదు ప్రకృతి నియమాలను అనుసరించిసాగే చికిత్స గనుక వ్యాధి నివారణ విశ్వసనీయమైనదిగా రూపొందింది అంతేగాకుండా వ్యాధి సత్వరంగా సరళంగా శాశ్వతంగా నివారణవుతుంది

**3**

వ్యాధుల సాధారణ లక్షణాల అవగాహన వైద్యునికుండాలి దానికితోడు వ్యాధిగ్రస్తుని విశిష్ట లక్షణాల వివేచన తప్పనిసరిగా వుండాలి ఈ విశిష్ట లక్షణాలే ఔషధసూచక లక్షణాలు ఈ విశిష్ట లక్షణ పరిజ్ఞానం లేకపోతే వ్యాధిలో నివారించదగినదేదో అతనికి తెలియదు

అదే విధంగా ఔషధాల సాధారణ లక్షణాలు వైద్యునికి తెలియాలి ఔషధం యొక్క విచిత్ర లక్షణాలు తెలియాలి విచిత్ర లక్షణాల జ్ఞానం లేకపోతె ఔషధాల వ్యాధినివారణ శక్తి అవగాహన కాదు

రోగి విశిష్ట లక్షణాలు ఔషధ విచిత్ర లక్షణాలు సరిపోల్చుకుని ఔషధాన్ని ప్రయోగించాలి ఔషధం మోతాదు తయారీ కూడా వైద్యునికి తెలిసివుండాలి ఔషధం పున ప్రయోగించే సమయం వైద్యుని దృష్టిలో వుండాలి

వ్యాధి నివారణకు ఏవైనా అడ్డంకులుంటే వాటిని గమనించి తొలగించాలి

హోమియో వైద్యసారమంతా ఈ ఒక్క సూత్రంలో వుందంటాడు హెచ్ ఎ రాబర్ట్

**4**

ఆరోగ్యాన్ని దెబ్బకొట్టి వ్యాధిని కల్పించే ప్రేరేపకాంశాలు వైద్యునికవగతం కావాలి స్వతహాగా ఆరోగ్యవంతులైన వ్యక్తుల్లో అటువంటి వ్యాధి కారకాంశాలను తొలగించి వ్యాధిని నిరోధించగలుగుతాడు వైద్యుడు ఈ రకంగా వైద్యుడు ఆరోగ్య సంరక్షకుడు కూడా అవుతున్నాడు

**5**

తరుణ వ్యాధుల విషయంలో ఆ వ్యాధి ఏ బాహ్యకారణాన్ని పురస్కరించుకుని వస్తున్నదో వైద్యుడు తెలుసుకోవాలి దీర్ఘవ్యాధుల విషయంలో రోగిపరమైన మౌలిక కారణాన్ని పరిశీలించాలి రోగి దేహతత్వం మనస్తత్వం స్వభావం వృత్తి జీవనసరళి అలవాట్లు మొదలైన అంశాలన్నీ పరిగణనలోకి తీసుకోవాలి దీర్ఘరోగాలకు మూలకారణం మయాజం దీన్ని వైద్యుడు అర్థం చేసుకోవాలి

ఆర్గనాన్ 345 సూత్రాలలో వైద్యతత్వమంతా ఇమిడి వుంది వ్యాధి ఔషధాలు ఔషధాల ఎంపిక మోతాదు పున ప్రయోగం స్వస్థత చేకూరడానికి గల అడ్డంకులు వ్యాధి నిరోధం వ్యాధి ప్రేరక మౌలిక కారణాలు- ఈ పరిజ్ఞానమంతా వైద్యునికి తప్పనిసరిగా వుండాలి దేహతత్వం నైజం పరిసరాలు ఇవి వ్యాధికి మూలకారణాలు

వైద్యశాస్త్రానికి వస్తువు మానవుడే మానవుడిని ఫలానా అని నిర్వచించలేం మానవుణ్నీ కేవలం అర్థం చేసుకోగలం మనిషి అంటే చైతన్యం మనస్సు, దేహాల కలయిక అని అర్థం చేసుకోవాలి మానవునివట్ల హానిమన్ అవగాహన వినూత్నమైనది విప్లవాత్మకమైనది హానిమన్ చేతుల్లో వైద్యవృత్తి స్వస్థతచేకూర్చే గొప్పకళగా రూపుదిద్దుకుంది

## 6

వైద్యుడు దేహ మానసిక ఆరోగ్యంలో మార్పులు గమనిస్తాడు రోగి పూర్వారోగ్యస్థితిలో వచ్చిన పరిణామాల ను విశ్లేషిస్తాడు ఈ మార్పులు రోగి అనుభూతి పరిధిలోనివి కావచ్చు. బంధుమిత్రులు గమనించినవి కావచ్చు. ఈ లక్షణాలన్నీ కలిసి వ్యాధి సమగ్ర స్వరూపాన్ని తెలియజేస్తాయి వాస్తవమైన భావనార్థమైన వ్యాధి చిత్రాన్ని అందిస్తాయి

ఈ సూత్రంలోని వ్యాధి సమగ్ర చిత్రచింతన విప్లవాత్మకమైన ఆలోచన ఈ ఒక్క భావనతోనే హానిమన్ వైద్య ప్రపంచంలో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నాడు ఆర్గనాన్‌లోని సుభాషితాలన్నింటిలో మకుటాయమాన మైనది ఇది

## 7

వ్యాధిలో తారట్లాడుతున్న ప్రేరేపక కారణాన్నిగాని వర్తమాన కారణాన్నిగాని తొలగించే పనిలేదుకాబట్టి రోగిలో మనం గమనించడానికి లక్షణాలు తప్ప మరేమీ దొరకవు వ్యాధి నివారకమైన ఔషధాన్ని పట్టుకోవడానికి ఉపకరించేది ఈ లక్షణ సముదాయం to a ty of symptoms) ఈ లక్షణ సముదాయం వ్యాధి అంతర్గత స్వభావానికి అంటే బాధలకులోనైన ప్రాణశక్తికి ప్రతిబింబం ఇదె వ్యాధి రూపం ఇదే నివారక ఔషధాన్ని తెలుసుకోవడానికి ఏకైక సాధనం అయి తీరాలి సరైన ఔషధాన్ని ఎంపిక చెయ్యడం దీనివల్ల తప్ప మరిదేనివల్లనూ సాధ్యపడదు లక్షణసముదాయాన్ని తొలగించి పూర్వారోగ్యస్థితిని పునరుద్ధరించడమే వైద్యకళ అనిపించుకుంటుంది

ఆర్గనాన్‌లోని ఈ మొదటి ఏడుసూత్రాలు ఇంద్రధనస్సులోని ఏడు కాంతిపుంజాల వంటివి



# జీర్ణారిష్టాలు

జీర్ణక్రియ చాలా సంక్లిష్టమైన జీవకార్యం అన్ని జీవకార్యాల మాదిరిగానే ఇది మెదడు జీర్ణమండల అవయవాలు గ్రంధుల సమన్వయ సహకారాలతో జరగవలసివుంటుంది ఆకలిని నియంత్రించే కేంద్రం మెదడులోని హైపోథెలామస్‌లో వుంది ఈ కేంద్రం నాడులు హార్మోనుల సహకారంతో తన కార్యక్రమం నిర్వహిస్తుంటుంది

జీర్ణమండలంలోని మొదటిభాగం నోరు చివరిభాగం పురీషనాళం ఈ రెండు తావులలోని కండరాలు మన ఇచ్ఛకులోబడి పనిచేస్తాయి మధ్యభాగంలో జరిగే కార్యక్రమమంతా మన స్పృహ లేకుండా జరిగిపోతుంది ఈ కార్యక్రమమంతా స్వయంచాలక నాడీమండలం గ్రంధులు జీర్ణావయవాల సమన్వయ సహకారాలతో క్రమబద్ధంగా జరిగిపోతుంది మన ఆహారంలోని పిండిపదార్థాలను మాంసకృత్తులను క్రొవ్వుపదార్థాలను బయట కర్మాగారాలలో కూడా జీర్ణం చేయవచ్చు. కాని శరీరంలో జరిగినంత సంపూర్ణంగా సత్వరంగా జరగదన్నవిషయం గుర్తుంచుకోవాలి జీర్ణక్రియకూడా మనిషి అంటే చైతన్యం దేహం మనస్సు అనే విషయాన్ని మరొకసారి గుర్తుచేస్తుంది

ఆరోగ్యాన్ని కాపాడడానికి జీర్ణమండలం ప్రధానపాత్ర వహిస్తుంది ఆకలి విరేచనం నిద్ర సమంగా వున్నట్లయితే ఆరోగ్యం మామూలుగావున్నట్లే అని భావన చేయవచ్చు. అస్వస్థత నివారణకుకూడా జీర్ణమండలం పాత్ర చాలా ప్రధానమైనది అస్వస్థతగావుంటే మొదట మార్పుచెందేది జీర్ణమండలమే ఆకలి పడిపోతుంది పెంపుడు జంతువులు ఆహారం ముట్టకపోయినట్లయితే అస్వస్థతగా వున్నట్లే అన్నవిషయం తెలిసిందే మనకు స్వస్థత చేకూరిందనడానికి నిదర్శనం ఆకలెయ్యడమే మనుషులుతప్ప ఏ జంతువుకూడా సుస్తీగావుంటే ఆహారం ముట్టదు అనారోగ్యంగా వుంటే కొన్ని సందర్భాలలో వికారపెట్టడం వాంతులు కావడం గాస్ పొట్టలోనొప్పి, విరేచనాలు మలబద్ధకంలాంటివి గమనిస్తాం ఈ లక్షణాలు జీర్ణమండలం నిర్వహించే పాత్రను గుర్తుచేస్తుంటాయి కొన్ని సందర్భాలలో జంతువులు తమ వ్యాధినివారణకు అనువైనమొక్కల ఆకులను వెతికి తింటాయని మనకు తెలుసు

## అజీర్తి

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| మితిమీరితినడం మసాలాలు ఎక్కువగా వాడడం నిద్ర లేకపోవడం శరీరశ్రమ తక్కువ మానసికశ్రమ ఎక్కువ విపరీతమైనకోపం మలబద్ధకం విరేచనం సాఫీగా | నక్స్‌వామికా |

కాదు నేరువుల్లగా వుంటుంది

| | |
|---|---|
| కొవ్వుపదార్థాలు ఎక్కువగా తినడం బిరియానీ ఐస్‌క్రీమ్‌లు తిని జీర్ణంకాక పోవడం సాధున్వభావం వెచ్చని వాతావరణం గిట్టదు | వల్సటిల్లా |
| తిన్నతరువాత రాయిపెట్టినట్లు పొట్టలో బరువుగా వుంటుంది వికారం నోరుచేదు దాహం అధికం కదిలితే బాధలెక్కువ మలబద్దకం తలనొప్పి | బ్రయోనియా |

## గ్యాస్

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| తేన్పులు ఎక్కువ నోరు చేదుగాగాని వుల్లగాగాని వుంటుంది ఎక్కువగా మసాలాలు కాఫీలు వాడుతుంటారు శరీరశ్రమ వుండదు అపానవాయువు పోయేటప్పుడు ఆననంలోనొప్పి | నక్స్‌వామికా |
| వుల్లటితేన్పులు పొట్టంతా ఉబ్బరంగా వుంటుంది ఏమితినలేరు పడుకుంటే బాధలెక్కువ తేన్పువచ్చినప్పుడు కొంచెం హాయిగావుంటుందిగాని వెంటనే బాధ మళ్ళీప్రారంభమవుతుందిఅపానవాయువు మోతతోగూడి దుర్వాసనగా వుంటుంది | కార్బోవెజ్ |
| తానుతిన్నదంతా గాస్‌కింద మారిందనిపిస్తుంటుంది మోతలతో అపానవాయువు లు గాస్‌తోనిండి పైపొట్టలో నొప్పి ఉదరవితానంపై ఒత్తిడే ఈ బాధకు కారణం | లైకోపోడియం |
| తేపులు అపానవాయువులు పొట్ట బెలూన్‌లాగా ఉబ్బిఉంటుంది తేన్పులు వచ్చినా పొట్ట ఉబ్బరం తగ్గదుగాని అపానవాయువుపోతేమాత్రం కొంత ఉప శాంతిగా ఉంటుంది జ్వరం చలి పొట్టఉబ్బరం దుర్వాసనగొట్టే అపానవాయువు | చైనా |

## వాంతులు

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| వాంతి వికారం ఉమ్మిఊరటం జిగురువదార్థం వాంతికావటం వాంతయినా వికారం తగ్గదు వికారం వలన ఉమ్మి | ఇపికాక్ |
| వికారం వాంతులు కళ్ళుతిరగటం నిస్త్రాణ చెమటలు | టబాకం |
| వాంతికాగానే వికారం తగ్గిపోతుంది అజీర్తి చిరాకు పరిసరాలలో ధ్వని వెలుతురు సహించలేరు చుట్టూ మనుషులుండడం సహించలేరు మానసిక శ్రమకు ఓర్చుకోలేరు కాఫీ ఆల్కహాల్ గిట్టవు | నక్స్‌వామికా |

## విరేచనాలు

అజీర్తికివాడే నక్స్‌వామికా వల్సటిల్లా బ్రయోనియాలు విరేచనాలకు కూడా మంచి మందులే నక్స్‌వామికా బ్రయోనియాలలో మలబద్ధకమే హెచ్చుగా కనిపిస్తుంది ఇతర లక్షణాలు గమనించి మందు ఎంపిక చేయాలి

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| పొట్టలోనొప్పితోగూడిన విరేచనాలకు ఇది ముందుగా ఆలోచించదగిన మందు పొట్టలోకి కాళ్ళు ముడుచుకొని పడుకుంటాడు మోతలతో నీళ్ల విరేచనాలు విరేచనం అయిన తరవాత పొట్టలో నొప్పి తగ్గుతుంది తిన్నతరవాత ఏమైనా తాగిన తరవాత నొప్పి ఉద్రేకిస్తుంది | కొలోసింథ్ |

| | |
|---|---|
| దీర్ఘకాలికంగా విరేచనాలవుతుంటాయి పొట్టలోనొప్పి నీళ్లవిరేచనాలు ఉదయం విరేచనాలు ఎక్కువగా అవుతుంటాయి మలం నీళ్లలా పలచగా దుర్వాసన కొడుతూవుంటుంది ఆకుపచ్చటి రంగు సాయంకాలందాకా నీళ్ల విరేచనాలవుతూ సాయంకాలం మామూలు విరేచనం కావడం ఈ రోగి విచిత్రలక్షణం శిశువులకు దంతాలు వచ్చే సమయంలో విరేచనాలకు ఇది మంచిమందు | పోడోఫైలం |
| ఉదయంపూట విరేచనాలధికం పిచికారీ కొట్టినట్లు శబ్దాలతోగూడిన విరేచనాలు దుర్వాసన విరేచనం కాబోయేముందు అయ్యే సమయంలో పొట్టలోనొప్పి పొట్టలో గుడబిడశబ్దాలు ఏదైనా తాగినప్పుడు తినగానే విరేచనాలు | యాలో |
| కలుషితాహారం తిన్న తరవాత పట్టుకొనే వాంతులు విరేచనాలు విరేచనాలు వాంతులు ఒకేసారి అవుతుంటే ముందుగా ఈ మందు ఆలోచించాలి తిన్న తరవాత తాగినతరవాత విరేచనాలవుతుంటాయి నిస్త్రాణ చలి | ఆర్సెనికం ఆల్బ్ |
| దీర్ఘకాలికంగా ఉదయంపూట విరేచనాలధికం వేకువజామున విరేచనం నిద్ర లేపేస్తుంది | సల్ఫర్ |

## మలబద్ధకం

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| దీర్ఘకాలికంగా మలబద్ధకం విరేచనం మాత్రలు వేసుకోవటం అలవాటయి వుంటారు విరేచనం సాఫీగా కాదు శరీరశ్రమ వుండదు | నక్స్‌వామికా |
| విపరీతమైన మలబద్ధకం మలం పెంటికలుగావుండి ముక్కవలసి వుంటుంది మలలుకూడా తోడుగావచ్చు. | కాలిన్సోనియా |
| మలంగట్టిపడి ముక్కలుముక్కలుగా పడుతుంటుంది మలవిసర్జన సమయంలో రక్తం పడవచ్చు. సాఫీగా విరేచనం గాదు | నేట్రంమూర్ |
| మలం పొడారి గట్టిపడిపోయివుంటుంది అతికష్టంమీదగాని విరేచనంగాదు | బ్రయోనియా |
| మలబద్ధకం మలం బయటకు వస్తూవస్తూ లోనికివెళ్ళిపోతుంది | సైలీషియా |
| మలబద్ధకం కొన్ని రోజులపాటు మలవిసర్జనజరగదు మలంమామూలుగానే వున్నా ముక్కవలసి వస్తుంది | అల్యూమినా |

## మలలు

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| మలబద్ధకం మలలు దురదపెడుతుంటాయి పరిశుభ్రత వీరికి పట్టింపులేదు స్నానం అంటే ఇష్టపడరు చల్లటిగాలి కావాలి కూల్‌డ్రింక్స్ ఇష్టపడతారు | సల్ఫర్ |
| మలబద్ధకం మలల్లో జిల మసాలాలంటే ఇష్టం పరిశుభ్రతపట్ల శ్రద్ధ ఎక్కువ స్నానం చేస్తే వీరికి హాయిగా వుంటుంది శరీరశ్రమ తక్కువ కోపస్వభావం | నక్స్‌వామికా |
| మలలు గుత్తులుగా బయటపడివుంటాయి దురద రక్తం పడుతుంది ఆసనంలోమంట నొప్పి దురదవలన రాత్రిళ్లు నిద్రాభంగం చన్నీళ్ళు తగిలితే హాయిగావుంటుంది | యాలో |
| మలలు గుత్తులుగా బయటకు కన్పిస్తాయి రక్తంమాత్రం రాదు మలబద్ధకం | ఈస్కులస్ |

| | |
|---|---|
| నడుంనొప్పి తొంటిలో కూడా నొప్పి పెడుతుంటుంది | |
| గుత్తులుగా మలలు కన్పిస్తుంటాయి సూదులుపెట్టి గుచ్చినట్లుగా నొప్పి గుడ్డ తగిలినా ఓర్చుకొలేరు | యాసిడ్ నైట్రిక్ |

## జీర్ణకోశంలో అల్సర్

అజీర్తి పొట్టలో మంట ఎసిడిటీ పుల్లటి తేవులు గాస్ లక్షణాలు కనిపించే రోగుల్లో జీర్ణకోశంలో అల్సర్ కూడా వుండొచ్చు. మనదేశంలో ఆంధ్రులకే ఈ బాధ ఎక్కువ ఆహారపు అలవాట్లు మార్చుకొని సరైన ఔషధం వాడుకుంటే ఆపరేషనుతో పనిలేకుండానే ఈ బాధను తగ్గించుకోవచ్చు.

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| పొట్టలో నొప్పి పెద్ద పెద్ద తేవులు తింటే వికారం తగ్గుతుంది కాని పొట్టలో నొప్పి ఎక్కువవుతుంది తినగానే నొప్పి ఆరంభమై ఒకగంటలోపుగానే వాంతి అయ్యేవరకు బాధపడుతుంటారు అర్ధరాత్రివేళ పసరు తెమడ కక్కేని నొప్పితో బాధపడుతుంటారు తీపి ఉప్పు రెండూ ఇష్టమే ఏదైనా పనివుంటే ఆందోళన పడిపోతారు | అర్జెంటం నైట్రికం |
| ఏదైనాతింటే నొప్పి తగ్గుతుంది తెరలు తెరలుగా పొట్టలో నొప్పి, తేవులు తినగానే నొప్పి తాత్కాలికంగా తగ్గినా 2 3 గంటల తరవాత మళ్లీ తిరగబెడుతుంది వీరికి విపరీతమైన మతిమరుపు అవయవాలు బిగవట్టినట్లు రంధ్రాలలో బిరడా బిగించినట్లు బాధలుంటాయి దుర్భాషలాడే స్వభావం | ఎనాకార్డియం |
| పొట్టలో బాధలు తింటే హాయిగా వుంటుంది ఎసిడిటీ ఆకలి తినాలనిపిస్తుంది వెచ్చటిపదార్థాలు తింటే నొప్పి ఉపశాంతిగా వుంటుంది మాంసం చేపలు అయిష్టం తీపిపదార్థాలు తినాలంటే వికారపెడుతుంది ఏ నిర్ణయం తీసుకోలేదు పరిశుభ్రత ఇష్టం | గ్రఫయిటిస్ |
| పొట్టలో అల్సర్ రక్తం కూడా పడుతుంటుంది విపరీతమైన నొప్పి మొదట పసరు తరవాత నల్లటిపదార్థం వాంతి చేసుకుంటారు చల్లటి పదార్థాలు ఐస్క్రీమ్ తింటే నొప్పి ఉపశమనంగా వుంటుంది లోపల వెచ్చబడగానే వాంతయిపోతుంది చల్లదనం భరించలేరు పొట్టలో బాధలకు తలబాధలకు చల్లదనం కావాలి ఏపాటిశ్రమ మానసికమైనా శారీరకమైనా కూడా తట్టుకోలేరు భయస్తులు | ఫాస్ఫరస్ |



# రుతుచక్రాలు

భూభ్రమణం చక్రావర్తం కాలగమనం చక్రావర్తమే వగలు తరువాత రాత్రి రాత్రి తరువాత వగలు వస్తుంటాయి చంద్రుడు భూమి చుట్టూ తిరుగుతుంటాడు కృష్ణపక్షం శుక్లపక్షం ఒకదాని తరవాత ఒకటి వస్తూనే ఉంటాయి మానవుడు ప్రకృతిలో ఒక భాగం మానవుడి జీవధర్మాలలో ప్రకృతి సిద్ధమైన చక్రావర్త స్వభావం కనిపిస్తూ ఉంటుంది బాల్య యవ్వన వార్ధక్య దశలు ఒకదాని తరవాత ఒకటి వస్తాయి వార్ధక్యాన్ని రెండవ బాల్యదశ అంటారు

స్త్రీలలో రుతుస్రావాలు అతి ప్రధానమైన జీవధర్మం వీరికి రుతుస్రావాలు చక్రావృతంగా వస్తుంటాయి అందుకే రుతుచక్రం అంటారు ఈ రుతుచక్రాలు హార్మోనుల ఆటుపోటుల వల్ల చంద్రుడు సముద్రాన్ని ప్రభావితం చేసినట్లుగా 28 రోజులకొకసారి పునరావృతం అవుతుంటాయి రుతుస్రావాలు కేవలం గర్భకోశానికి సంబంధించిన అంశం మాత్రమేగాదు మనస్సు కూడా రుతుస్రావాలను ప్రభావితం చేస్తుంది అండకోశాలను మెదడులోని హైపోథెలామస్ పిట్యూటరీ ద్వారా పరోక్షంగా ప్రభావితం చేస్తుంది మానసిక అంశాలు ప్రభావితం చేస్తాయి గనుక రుతుబాధలు వ్యక్తికీ వ్యక్తికీ భేదిస్తుంటాయి కొంతమందిలో ఏ బాధలూ కనిపించవు కాలపరిమితిలోను రుతుస్రావంలోనూ తేడాలుండవచ్చు. రుతుస్రావం మొత్తం వ్యక్తికి సంబంధించిన విషయం కనుక రుతుస్రావాలకు ముందుగానీ రుతుకాలంలోనీ ఇతర అవయవాలలో కూడా బాధలు వస్తుంటాయి వీటిని రుతు సంబంధమైన బాధలు అని చెప్పుకోవచ్చు.

రుతుచక్రాలు 25 నుంచి 33 దినాల వ్యవధిలో రావడం సహజంగా భావించవచ్చు. రుతుస్రావం 2 3 ఔన్సులుంటుంది శారీరక మానసికాంశాలు రుతుస్రావాన్ని రుతుచక్రాలమధ్య వ్యవధిని కాలపరిమితిని కూడా ప్రభావితం చేస్తాయి

రుతుచక్రాలకి రుతుస్రావానికి సంబంధించిన బాధలన్నింటికి ముందుగా ఆలోచించదగిన మందు సెపియా సెపియా స్త్రీల ఔషధంగా పేరువడిపోయింది నల్సర్‌ను పురుషుల ఔషధం అంటారు సెపియా పురుషులకు నల్సర్ స్త్రీలకు వారి వారి తత్వానుసారంగా శారీరక బాధలకనుగుణంగా ఇవ్వాలని గ్రహించాలి

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| రుతుస్రావం ఎక్కువ రోజులు కావచ్చు, తక్కువ రోజులు కావచ్చు. మైల ఎక్కువ కావచ్చు, తక్కువగాను కావచ్చు. పలచగా గాని కండలు కండలుగాని కావచ్చు. ఈ సందర్భాలన్నింటిలో సెపియా వాడి ప్రయోజనం పొందవచ్చు గర్భసంచి కిందికి | సెపియా |

| | |
|---|---|
| జారినట్లు బాధపడేవారికిది ప్రత్యేక ఔషధం ఈ బాధ వున్న స్త్రీలు కూచునేటప్పుడు కాలుమీద కాలువేసుకుంటారు. స్త్రీ జీవితంలో అన్ని దశలలో ఇది ప్రయోజనకరమైన ఔషధం చిన్నవయసులో రుతుచక్రాలు రుతుస్రావం మైలలో తేడాలు మొదలైనవాటికి ఈ మందు ఉపయోగిస్తుంది గర్భవతులకు కూడా ఇది మంచి మందు వేవిళ్లకు ప్రధానమైన మందుల్లో ఇది ఒకటి గర్భస్రావం కాకుండా ఉండటానికిది దివ్యౌషధం మొదట ఏపిస్‌వాడి తరవాత సెపియా వాడుకోవచ్చు. కుటుంబభారంతో కుంగిపోయిన కాంతలకు సెపియాను మించిన ఔషధం లేదు బహిష్టు సమయంలో వీరు ఉద్రేకపూరితంగా ఉంటారు మామూలుగా చిరాకు పడుతుంటారు ఇల్లు విడిచి దూరంగా పారిపోదామనిపిస్తుంది ముట్లుడిగిన దశలో ఇది స్త్రీలకెంతో మేలు చేస్తుంది ఈ స్త్రీలకు మనశ్శాంతి కొరవడుతుంది ఒళ్లంతా వెచ్చటి ఆవిర్లు చెమటలు రతి బాధాకరం అయిష్టం | |
| రుతుచక్రాల బాధలకు సెపియా తరువాత ముఖ్యమైన మందు పల్సటిల్లా సెపియా మధ్యవయస్కుల మందైతే పల్సటిల్లా యువతులది రజస్వల అయిన ప్పటినుంచి వచ్చే బాధలకు ప్రత్యేకమైన మందు పుష్పవతి కావటం ఆలస్యమైనా అయిన తరువాత బహిష్టులు క్రమంగా లేకపోయినా ఈ మందు ఆలోచించాలి వీరి దేహతత్వానికి వెచ్చటి వాతావరణం గిట్టదు క్రొవ్వుపదార్థాలు జీర్ణం చేసుకోలేరు | పల్సటిల్లా |

## మెనోరేజియా

నలభై ఏళ్ళు దాటిన స్త్రీలకి సాధారణంగా ఎదురయ్యే సమస్య హార్మోనుల సమతుల్యత దెబ్బతినడమే దీనికి కారణం గర్భకోశంలో గర్భనిరోధక సాధనాలను అమర్చడం కణుతులు మొదలైనవి కూడా కారణం కావచ్చు. బొద్దుగా వున్న వారిలో ఈ బాధ తరచుగా కన్పిస్తుంది ఉద్వేగపరమైన కారణాలు ఈ మార్పులకు దోహదం చేయవచ్చు. ఈ కేసులకి ముందుగా చిన్న ఆపరేషను చేసి ఉపయోగంలేకపోతే గర్భకోశం తీసివేయాలని సూచిస్తారు ఈ కేసులకి హోమియో చికిత్స ఎంతో ప్రయోజనకరమైంది

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| బహిష్టులు త్వరత్వరగా వస్తాయి మైల ఎర్రగా కండలు కండలుగా అవుతుంటుంది ముఖం ఉబ్బినట్లుంటుంది తలనొప్పి మనస్సులో ఆందోళన | బెల్లడోనా |
| బహిష్టులు త్వరత్వరగా వస్తుంటాయి మైల ఎర్రగా జోరుగా అవుతుంది నీరసం వికారం తోడవుతాయి వాంతి కూడా కావచ్చు | ఇపికాక్ |
| బహిష్టులు త్వరగా వస్తాయి మైల నల్లగా కండకండలుగా అవుతుంది తలతిప్పు చెవుల్లో హోరుమని శబ్దాలు | చైనా |
| బహిష్టులు త్వరత్వరగా వస్తాయి బహిష్టుకు బహిష్టుకు మధ్యలో విరామం లేకుండా ఆగి ఆగి మైల అవుతూనే ఉంటుంది మలబద్ధకం కోపతత్వం | నక్స్‌వామికా |
| బహిష్టులు త్వరగా వస్తాయి ఎర్రగా కండలు కండలుగా అవుతుంటుంది కదిలితే మైల జాస్తిగా అవుతుంటుంది పొత్తికడుపులో పోట్లు | సెబైనా |
| క్రమం తప్పి బహిష్టులు వస్తుంటాయి ఒళ్లంతా మంటలు మైల ఎక్కువగా చిక్కగా నల్లగా అవుతుంటుంది పనుపు వచ్చుగా చిక్కగా కుసుమ కూడా తోడవుతుంది మానం ఒరుసుకు పోతుంటుంది ఇతరమందులు ఉపయోగపడిన కేసులకు కూడా ఈ మందు ఆలోచించాలి | సల్ఫర్ |

## యుక్తవయస్సులో పుష్పవతి కాకపోవడం

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| సాధుస్వభావం మూడీగా ఉంటారు వెచ్చదనం గిట్టదు గుండెదడ వికారం రాగి వెంట్రుకలు బొద్దుగా ఉంటారు | వల్సటిల్లా |
| కుంగిపోయివుంటారు చిరాకు రక్తహీనత బక్కచిక్కి ఉంటారు. వలచని తెల్లకుసుమ | సెపియా |
| బొద్దుగా ఉంటారు బద్ధకస్తులు శిశుదశలో దంతాలు నడక ఆలస్యంగా వచ్చి ఉంటాయి ఎక్కువగా తలనొప్పితో పొట్టనొప్పితో బాధపడుతుంటారు ఒళ్ళు నల్లగా ఉంటుంది నీరసం శారీరక శ్రమకు తట్టుకోలేరు | కాల్కేరియాకార్బ్ |
| కుంగివుంటారు చర్మవ్యాధి సొనగారుతుంటుంది ముఖ్యంగా చెవులవెనుక ఎగ్జీమా పొట్టలో నొప్పి కీళ్లవాపు | గ్రఫయిటిస్ |

## యుక్తవయస్సులో రుతుశూల

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| యుక్తవయస్సులో రుతుశూలకు తప్పక వాడుకోదగినమందు నడుం కిందిభాగంలో కిడ్నీల ప్రాంతంలో శూలనొప్పి ఒక మోస్తరుగాగాని తీవ్రంగాగాని ఉండొచ్చు. నొప్పికి ఓర్చుకోలేక ఏడుస్తారు వికారం వాంతులు నొప్పికి తోడవుతాయి | వల్సటిల్లా |
| రుతుశూల తీవ్రంగా ఉంటుంది రోగిలో అధికంగా అస్తిమితం విరేచనాలు వివరీతమైన కోపం నొప్పికి తట్టుకోలేక సొమ్మసిల్లిపోతారు | కెమోమిల్లా |
| పొత్తి కడుపులో తెరలు తెరలుగా తీవ్రమైన రుతుశూల అటూ ఇటూ కదిలినా వేడికావు పెట్టినా ఉపశాంతిగా ఉంటుంది | మెగ్నీషియాఫాస్ |
| ఒళ్లంతా నొప్పులు బహిష్టురాకముందే బాధలు మొదలవుతాయి పొత్తికడుపు కిందికి జారుతున్నట్లు నొప్పి ముఖం ఎర్రగా వెచ్చగా ఉంటుంది చిరాకు కోపం | బెల్లడోనా |

## బహిష్టు ముందురోజుల్లో టెన్షన్ (P M T)

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| నీరసం చిరాకు నడుం దిగువ భాగంలో నొప్పులు తెరలు తెరలుగా శూలనొప్పి కామవాంఛ పూర్తిగా తగ్గిపోతుంది కోపం అసహనం ఇనుమడిస్తాయి మూడీగా ఉంటారు కుంగిపోయి నిర్లిప్తంగా ఉంటారు | సెపియా |
| నిస్త్రాణ కొంచం శ్రమ కూడా ఓర్చుకోలేరు ఆకలి చచ్చిపోతుంది వికారం తలనొప్పి ఒళ్ళు చల్లగా ఉంటుంది జననేంద్రియాల చుట్టూ చెమటలు యోనిలో దురద స్తనాలలో నొప్పి, తాకితే ఓర్చుకోలేరు బహిష్టులు అనిశ్చితంగా ఉంటాయి | కాల్కేరియా కార్బ్ |
| ఆందోళన అధికం హిస్టీరియా శారీరక లక్షణాలన్నీ ఉద్రేకిస్తాయి మూడీగా ఉంటారు వికారం తలనొప్పి, సొమ్మసిల్లిపోవడం కంటతడిపెట్టడం అధికంగా కన్పిస్తాయి మన స్థితికి తగినట్లే బహిష్టులు రావడం కూడా అనిశ్చితమే ముందుగా రావచ్చు. ఆలస్యం కావొచ్చు, అసలు రాకపోవచ్చు. | వల్సటిల్లా |

| | |
|---|---|
| రుతుచక్రాలు క్రమం తప్పి వస్తాయి ఉన్నట్లుండి రెచ్చిపోతుంటారు రుతుస్రావం మొదలైనప్పుడు ఒకటి రెండు రోజులు బాదలు మలబద్ధకం మాటి మాటికి మూత్ర విసర్జన చేయాలి | నక్స్‌వామికా |

## బహిష్టులు ఆలస్యమైతే

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| బహిష్టులు ఆలస్యం మైల తకు వ నడుంకింది భాగం గుంజుకుపోతుంది గర్భకోశం కిందికి జారుతున్నట్లనిపిస్తుంది పైకి నెట్టుకోవాలనిపిస్తుంది బహిష్టుకు ముందు పొత్తికడుపులో నొప్పి చిరాకు విశ్రాంతి తీసుకోవాలనిపిస్తుంది ఎవరూ దగ్గరవుండటానికి ఇష్టపడరు | సెపియా |
| పొత్తి కడుపులో తీవ్రంగా నొప్పి బహిష్టులు ఆలస్యంగా వస్తాయి ఒకటి రెండు రోజులు మాత్రమే మైల అవుతుంది మైల నల్లగా చిక్కగా కండలుగా ఉంటుంది ఉదయం పూట నిద్ర లేవగానే బాధలధికం అస్థిమితం మానసికంగా కుంగి ఉంటారు | లాకిసిస్ |
| బహిష్టులు ఆలస్యంగా వస్తాయి తీవ్రమైన శూలనొప్పి మైల తెల్లగా చాలా కొద్దిగా అయ్యీ కానట్టుగా అవుతుంది బొద్దుగా వుంటారు చర్మవ్యాధి యోనిచుట్టూ జిల | గ్రఫయిటీస్ |
| బహిష్టులు ముందుగాని ఆలస్యంగాగాని వస్తాయి ఒకసారి వచ్చినట్టు ఒకసారి రాదు సాధారణంగా ఆలస్యం శూలనొప్పి మైల నలుపు మైల కూడా ఒకసారి ఉన్నట్టు ఒకసారి ఉండదు ఆగి ఆగి అవుతుంటుంది ఒక క్రమం ఉండదు వికారం గుండెదడ మామూలే రోగీ మూడీగా ఉంటుంది లక్షణాలలో కూడా పద్ధతి ఉండదు | పల్సటిల్లా |

## మధ్యలో బహిష్టులు ఆగిపోతే

బహిష్టులు ఆగిపోతే గర్భధారణ కారణం కానప్పుడు డయాబెటీస్ థైరాయిడ్ లోపం గావచ్చు ఈ వ్యాధులు లేనప్పుడు హార్మోనులోపం కారణం గావచ్చు. ఇలాంటివారికి లక్షణాలను బట్టి ఔషధాలను ఎంపిక చేయాలి

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| పెరుగుదలలో లోపం నీరసం చలి తట్టుకోలేరు మలబద్ధకం చర్మంమీద గుల్లలు గడ్డలు కుంగిపోయివుంటారు యోనిలో దురదలు | సైలీషియా |
| బొద్దుగా వుంటారు ఆందోళనతో కూడిన భయాలు బలహీనత చెమటలు అధికం నీరసం విపరీతమైన విసుగు కోపం తేలికగా జలుబు గొంతునొప్పి లాంటివి వస్తుంటాయి తెల్లకుసుమ కంటిపై రెప్పలు ఉబ్బివుంటాయి | కాలీకార్బ్ |
| తేలికగా ఉద్వేగానికి లోనవుతారు మైగ్రెయిన్ తలనొప్పి గుండెదడ తరచు విరేచనాలు తెల్లకుసుమ వాతావరణం తేమగా వుంటే బాధలు ఎక్కువ | పల్సటిల్లా |
| ఆందోళన పడుతుంటారు ఆత్మవిశ్వాసం తక్కువ తేలికగా కంటతడిపెడతారు యోని పొడారివుంటుంది రతి బాధాకరంగా వుంటుంది రాసుకుపోయే తెల్లకుసుమ పొత్తికడుపులో నొప్పి తీపి అంటే ఇష్టం | లైకోపోడియం |



# గర్భవతి

పునరుత్పత్తి సృష్టిలో చాలా అద్భుతమైన సంఘటన ఇది చాలా క్లిష్టమైన సంఘటనకూడా మెదడు హైపోథెలామస్ ఎండోక్రయిన్ గ్రంధులు ముఖ్యంగా పిట్యూటరీ జననేంద్రియాల సమన్వయ సహకారాలతో ఈ కార్యక్రమం సాగుతుంది

స్త్రీలలో పునరుత్పత్తికి సాయపడే అవయవాలు గర్భకోశం అండాశయాలు గర్భకోశానికి ఇరువైపులా ఒక్కొక్క అండాశయం వుంటుంది పుట్టుకతోటే ఒక అండాశయంలో 70 వేల అండకణాలదాకా వుంటాయి అండకోశాలు గర్భధారణకు సాయపడే హార్మోనులను వుత్పత్తి చేస్తాయి యుక్తవయస్సు రాగానే బాలికలు పుష్పవతులవుతారు అండాశయాన్నుంచి అండకణాలు విడుదల కావడం మొదలయిందనడానికి ఇది సంకేతం రజస్వల అయినప్పటి నుంచి నెలనెలా ఒక్కొక్క అండకణం విడుదల అవుతుంది ఈ కార్యక్రమమంతా పిట్యూటరీ అధీనంలో వుంటుంది పిట్యూటరీ గ్రంధిని తొలగిస్తే రుతుచక్రాలుండవు పిట్యూటరీ గ్రంథి యుక్తవయస్సు వచ్చేవరకు అండకణాల విడుదలకు ఎందుకు సాయపడటంలేదో ఈనాటికీ శాస్త్రానికి అందని విషయం

ప్రతినెలా విడుదలకాబోయే ముందు ఒక అండకణం అండాశయం ఉపరితలానికి చేరుకుంటుంది అదే సమయంలో అండాశయంలో ఉత్పత్తి అయిన ఈస్ట్రోజెన్ రక్తంద్వారా గర్భకోశానికి చేరి తనలో చోటు చేసుకోబోయే పిండకణానికి కావలసిన పాన్పు సిద్ధం చెయ్యడానికి సన్నాహం ప్రారంభిస్తుంది ఉపరితలానికి చేరిన అండకణం తనచుట్టూ వున్న గ్రాఫియన్ ఫాలికిల్ అనే పొరను చీల్చుకొని బయటపడి అండవాహికలోకి చేరుతుంది అండకణం విడుదలై బయటపడ్డ తరవాత గ్రాఫియన్ ఫాలికిల్‌లో ప్రొజెస్టిరోన్ అనే హార్మోను ఉత్పత్తి ప్రారంభమవుతుంది ఈ హార్మోన్ కూడా గర్భకోశాన్ని ప్రభావితం చేసి పిండరక్షణకు అనువైన వాతావరణాన్ని కల్పిస్తుంది అండాశయాన్ని విడిచిన అండకణం ఈ లోపుగా అండవాహికద్వారా ప్రయాణించే టప్పుడు పురుషబీజకణంతో సంయోగం చెందుతుంది దీనినే గర్భధారణ అంటారు ఈ దశలో అండకణం పిండకణంగా మారుతుంది

పిండకణం రూపొందిన 36 గంటల్లో విభజన చెంది రెండు కణాలుగా మారుతుంది తరవాత మూడుదినాలు అండవాహిక ద్వారా ప్రయాణం సాగించి గర్భకోశాన్ని చేరుతుంది మూడు దినాలంటే ఎక్కువ సమయమే ఈ మూడురోజులు కూడా పిండకణం అభివృద్ధి చెందుతూనే ఉంటుంది ఒకవారం గడిచేలోగా గర్భకోశపు పొరలలో స్థావరం ఏర్పరచుకుంటుంది 8 వారాలు గడిచాక దీనిని పిండం (Foetus) అని వ్యవహరిస్తారు ఈ దశలో అవయవాలు రూపొందటం మొదలవుతుంది శరీరధాతువు

ఒ కూడా రూపుదిద్దుకుంటాయి 2 వారాలయ్యేసరికి పుట్టబోయే శిశువు ఆడా మగాని నిర్ణయించడాని కి వీలవుతుంది

## గర్భధారణ

గర్భధారణ స్త్రీ జీవితంలో ఒక ముఖ్యమైనఘట్టం ఇది స్త్రీ జీవితంలో ఎన్నో మార్పులకు కారణమవు తుంది ఉద్వేగపరమైన శారీరకమైన మార్పులెన్నో చోటుచేసుకొంటాయి శరీర ధర్మశాస్త్రరీత్యా స్త్రీలకు 8-35 సంవత్సరాల మధ్య వయస్సు గర్భధారణకు అనుకూలమైన వయస్సు 8 సంవత్సరాల ముందుగాని 35 సంవత్సరాల తరవాతగాని గర్భధారణకు అంతమంచిదికాదని శాస్త్రజ్ఞుల అభిప్రాయం చిన్నవయసులోనే పుట్టే సంతానం నాసిగా వుంటారు ఆరోగ్యం అంతంతమాత్రమే 35 సంవత్సరాల తరవాత కాన్పువస్తే తల్లి ఆరోగ్యం దెబ్బతింటుంది పిల్లలు అవయవలోపాలతో జన్మించే అవకాశం ఎక్కువ

గర్భధారణ సమయంలో స్త్రీలకు ధృఢమైన శారీరక మానసిక ఆరోగ్యం వుండాలి వీరికి పుష్టికరమైన ఆహారం తగినంత వ్యాయామం అవసరం మందులు పొగతాగటం మద్యం సేవించటం పుట్టబోయే శిశువు ఆరోగ్యానికి హాని కలిగిస్తాయి అందుచేత గర్భవతికి ఆహార విహారాలలో ఎంతో జాగ్రత అవసరం

## గర్భస్రావం

గర్భస్రావానికి కారణంగా ఎక్కువ కేసుల్లో పిండంలో జన్యుసంబంధమైన లోపాలని కనుగొన్నారు గర్భస్రావానికి మరొక ప్రధానకారణం పిండానికి సకాలంలో హార్మోన్ అందకపోవడం పిండరక్షణకువయోగపడే ప్రొజెస్టిరోన్ హార్మోన్ లోపం వాటిల్లినట్లయితే గర్భస్రావం జరుగుతుంది గర్భస్రావాలకు కారణాలు అనేకం తల్లిదండ్రుల ఆరోగ్యం వారు వాడుకొనే మందులు మొదలైన అంశాలు గర్భస్రావానికి దోహదకారులు

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| గవరగవరగా రక్తస్రావం చిన్న మానసిక బాధకు కూడా ఉద్రేకపడి రక్తస్రావం తేలికగా అలసిపోతారు చల్లదనం తట్టుకోలేరు బొద్దుగావుంటారు దుర్వార్తలకు తేలికగా స్పందిస్తారు | కాల్కేరియా కార్బ్ |
| పొట్టలో తెరలు తెరలుగా నొప్పి కొద్దిగా రక్తం కనబడుతుంది బహుమెత్తటి స్వభావం తేలికగా కంటతడి పెడతారు జీర్ణశక్తి తక్కువ విరేచనాలవుతుంటాయి వేడి తట్టుకోలేరు | పల్సటిల్లా |
| మూడవనెల నిండే సమయానికి గర్భస్రావమయ్యే వారికిది మంచిమందు వెనుక కిడ్నీప్రాంతంలో నొప్పులు ఆరంభమై ముందు పొట్టవైపునకుపాకి తొడల్లోకి వ్యాపిస్తాయి స్థూలకాయం బహిష్టులవుతున్నప్పుడు మైల ధారాపాతంగా ఎక్కువరోజులు అవుతుంటుంది | సెబైనా |
| పొత్తికడుపులో నడుంలో నొప్పి నీరసం నిర్లిప్తత మల బద్ధకం తిన్నా పొట్ట ఖాళీగా అనిపిస్తుంది బహిష్టులు వచ్చేరోజుల్లో ఆలస్యంగా వస్తూ మైల చాల తక్కువగా అవుతుంది బహిష్టులకు ముందు మైగ్రెయిన్ తలనొప్పి గర్భవతుల్లో మైగ్రెయిన్ | సెపియా |
| గర్భస్రావమవుతుందన్న అనుమానం పొట్టలో నొప్పి ఎర్రగా రక్తస్రావం తేలికగా అలసిపోతారు నడుంకింద భాగంలో అధికంగా నొప్పి పొట్టలోనుంచి జారుతున్నట్లు అనిపించడం వెలుతురు శబ్దాలు భరించలేరు | బెల్లడోనా |



## విరేచనాలు

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| కల్తీ ఆహారం తినడం మితిమీరి పండ్లు తినడం వికారం వాంతులు విరేచనాలు | ఆర్సెనికం ఆల్బ్ |

| | |
|---|---|
| ఉదయం లేవగానె విరేచనాలు తినగానే విరేచనానికి పరుగెత్తాలి విరేచనం నీళ్లలాగా పసుపురంగులో అవుతుంటుంది | పోడోఫైలం |
| ఉదయంపూట విరేచనాలెక్కువ మలం కుదవలుగా గాస్‌తో కూడి పిచికారి కొట్టినట్లవుతుంది పొట్టలో గడబిడలు విరేచనం కాబోయేముందు పొట్టలో నొప్పి | యాలో |

# అతిగా మూత్ర విసర్జన

గర్భవతులకు బాధాకరమైన విషయం తరచు మూత్ర విసర్జన చేయవలసి రావడం ఈ సందర్భంలో బెల్లడోనా నక్స్‌వామికా లు ప్రయోజనకరమైన ఔషధాలు చురుకులు మంటలు కూడా వుంటే కాంధారిస్ ఆలోచించాల్సి వుంటుంది

మూత్రపరీక్షలో ఆల్బ్యుమిన్ కనిపించినట్లయితే ప్రమాదసూచికగా భావించి వైద్యుడిని సంప్రదించాలి ఈ రోగులు ద్రవపదార్థాలు ఎక్కువగా వాడుకోవలసి వుంటుంది ఈ రోగులు లక్షణాలను విశ్లేషించి వాడుకోవలసిన మందులు ఏపిస్ యాసిడ్‌ఫాస్ టెరిబింతైనా

# మల బద్ధకం

గర్భవతుల్లో మలబద్ధకానికి ముందుగా ఆహారం అలవాట్లు మార్చుకోవలసి వుంటుంది పీచుఉన్న ఆహారం పచ్చిముక్కలు కూరగాయలు ఎక్కువగా వాడుకోవాలి ఉదయంపూట గోరువెచ్చటినీటిలో కలిపి నిమ్మకాయరసం తీసుకుంటే మలబద్ధకం కొంతవరకు తగ్గవచ్చు. వ్యాయామం కూడా కొంతవరకు సహాయం చేస్తుంది

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| సాఫీగా విరేచనం కాదు ఉదయంపూట రెండుమూడు సార్లు వెళ్లవలసి వస్తుంది చిరాకు కోపం ఎక్కువ ఈ మందు రాత్రి పడుకోబోయే ముందు వాడుకోవలసి వుంటుంది | నక్స్‌వామికా |
| మలం గట్టిపడి మల విసర్జన కష్టమైపోతుంది కోపదారి స్వభావం | బ్రయోనియా |
| విరేచనంకాక ముక్కిముక్కి కష్టపడవలసి వస్తుంది వీరికి మలం గట్టిపడకపోయినా ముక్కవలసి వుంటుంది రక్తం తక్కువ పాలిపోయివుంటారు | అల్యూమినా |
| ముక్కినప్పుడు మలం బయటకు వచ్చి లోనికి పోతుంది ఆసనం వెంట జిగురుపడు తుంటుంది బిడియపడే స్వభావం | సైలీషియా |
| విరేచనాలు మలబద్ధకం ఒకటి మార్చి ఒకటి అవుతుంటాయి చల్లదనం కావాలి ఆకలికి ఓర్చుకోలేని స్వభావం తీపి అంటే చాల ఇష్టపడతారు | సల్ఫర్ |
| మలబద్ధకం మలం ముక్కలు ముక్కలుగా విరిగిపడుతుంటుంది ఉప్పు ఎక్కువగా వాడుకొంటారు తేలికగా ఉద్వేగానికి గురవుతారు కుంగిపోయి వుంటారు | నేట్రంమూర్ |

అల్లోపతి మందులు మాయను ఛేదించుకొని పిండాన్ని చేరుతున్నట్లుగా కాలిఫోర్నియా వైద్యనిపుణులు పరిశోధనద్వారా తెలుసుకొన్నారు గర్భవతి అయిన స్త్రీ మొదటిమూడుమాసాలు కాన్పునకు ముందు రెండుమాసాలు మందులు వాడడం మంచిదికాదని 980 లో అమెరికా ప్రభుత్వం సూచనచేసింది జర్మనీలో వేవిళ్లకు వాడిన థాలిడోమైడ్ వల్ల అంగవైకల్యం చెందిన శిశువులు పుట్టారు మందులు వాడడంవలన కలిగే దుష్ఫలితాలకి ఇది ఒక నిదర్శనం మాత్రమే అయితే హోమియోమందులు చాలా సూక్ష్మ మోతాదులలో వుంటాయిగనుక తల్లీ బిడ్డలిద్దరికీ క్షేమకరమే

## వేవిళ్లు

గర్భవతులకు వచ్చే బాధ వేవిళ్ళు. వేవిళ్లకు కారణం హార్మోన్‌ల మధ్య సమతూకం లోపించడమే ఈస్ట్రోజెన్ హార్మోను పరిమాణం పెరిగిపోయి హైపొథెలామస్ ద్వారా పరోక్షంగా అది జీర్ణావయవాలను ప్రభావితం చేస్తుంది

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| వికారం వాంతులు ఎన్నిసార్లు వాంతయినా వికారం తగ్గదు ఆహారం చూస్తే రోత లాలాజలం ఎక్కువ వాంతిలో పసరు జిగురుపదార్థం దాహంవుండదు చిరాకుగా వుంటుంది | ఇపికాక్ |
| ఇపికాక్ తరవాత ఈ మందు తప్పక ఆలోచించాలి వాంతిలో తెల్లగావుండే జిగురు పడుతుంటుంది వాంతయిన తరవాత ఎంతో నిస్త్రాణ మల బద్ధకం విపరీతమైనకోపం వాంతులవుతున్నా ఆకలి ఎక్కువగానే వుంటుంది ఎంత తిన్నా ఆకలితీరదు పొట్ట ఖాళీగా వున్నట్లనిపిస్తుంది ఏదీ పట్టించుకోబుద్ధికాదు. ఇది ప్రత్యేక లక్షణం | సెపియా |
| ఉదయం టిఫిన్ తిన్న తరవాత హఠాత్తుగా వాంతి అవుతుంటుంది వాంతి చేదుగా పుల్లగా వుంటుంది పొట్టలో బరువుగా రాయి పెట్టినట్లుంటుంది విపరీతమైన కోపం మల బద్ధకం | నక్స్‌వామికా |
| భోజనం చేసిన వెంటనే తిన్నది జీర్ణం కాకుండానే వాంతి అవుతుంది వాంతి అయిన తరవాత నీరసంగా సొమ్మసిల్లిపోతారు వాంతిలో అధికంగా జిగురువుంటుంది వాంతులు తెరలు తెరలుగా తీవ్రంగా హఠాత్తుగా అవుతుంటాయి | యాంటింటార్ట్ |



# బాలారిష్టాలు

బిడ్డ వయస్సు రెండు సంవత్సరాలు వచ్చేవరకు శిశువు అని వ్యవహరిస్తారు మొదటి రెండు సంవత్సరాల కాలంలో శిశువు శారీరకంగా మానసికంగా గణనీయంగా ఎదుగుతుంది ఈ దశలో శిశువు ఉద్వేగాలకు గురవుతుంది కేవలం తేడు ఆశించి శిశువులు ఏడుస్తుంటారు తమకండరాలకు శక్తివచ్చిన తరవాత గాని పారాడలేరు

బిడ్డపుట్టినప్పుడు 20 అంగుళాల పొడవు 7-8 పౌనుల బరువు వుంటుంది సంవత్సరం గడిచేనరికి 30 అంగుళాల పొడవు అవుతారు 6 మాసాలుగడిచేనరికి పుట్టిననాటికన్న రెట్టింపు బరువుంటారు సంవత్సరం నిండేనరికి పుట్టిననాటికన్న మూడురెట్లు బరువౌతారు పుట్టినప్పుడు శరీరంతో పోలిస్తే తల పెద్దదిగా కన్పిస్తుంది . నాలుగు నెలలు నిండేనరికి తలనిలబెట్టగలరు ఆరుమాసాలు వచ్చేనరికి కూర్చోగలరు పన్నెండు నెలలు నిండేనరికి నడుస్తారు మొదటి సంవత్సరంలో ఆహారంలో పేచీలుండవు రెండవ సంవత్సరంలో మాత్రం పిల్లలకు రుచులపట్ల ఇష్టాయిష్టాలు వ్యక్తంగా తెలుస్తాయి తల్లిపాలు శిశువులకు శ్రేష్ఠమైన ఆహారం 6 నుంచి 8 మాసాలలోపుగా తల్లిపాలు మానిపించి ఆవుపాలు అలవాటు చేయవచ్చు. ఆహారం వేళప్రకారం ఇవ్వాలి వళ్ళరనం లాంటివి ఇస్తుంటే శిశువుల కవనరమైన సి విటమిను కూడా లభిస్తుంది పిల్లలకు కాఫీ టీలు అలవాటు చేయకూడదు

మానసికాభివృద్ధి విషయంలో సంవత్సరం వయస్సువచ్చేనరికి రెండక్షరాల మాటలు అనడం మొదలుపెడతారు రెండు సంవత్సరాలు నిండేనరికి వస్తువులు పేర్లుపెట్టి అడగడం చిన్నచిన్న వాక్యాలు మాట్లాడడం మొదలుపెడతారు మూడవసంవత్సరంలో నోరు ముక్కు చెవి కాలు చెయ్యి మొదలైన అవయవాలను గుర్తిస్తారు నాలుగవ సంవత్సరంలో తమ పేరు లింగభేదాలను తెలుసుకోగలుగుతారు అయిదో సంవత్సరం రాగానే టైము విషయం తెలుస్తుంది వస్తువులను ఉపయోగించుకోవడం అలవాటవుతుంది

## శిశువిరేచనాలు

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| నీళ్ళ విరేచనాలవుతుంటాయి బలంగా చిమ్మినట్లవుతుంటాయి తిన్నది అరగకుండా బయటకు వస్తుంది ఉదయంపూట విరేచనాలధికం తిన్న | పోడోఫైలం |

| | |
|---|---|
| తరవాత ఏదైనా తాగిన తరవాత స్నానంచేసినవెంటనే విరేచనం అవుతుంటుంది పగలంతా విరెచనాలు సాయంకాలం మామూలు విరేచనం పళ్లువచ్చే.సమయంలో వట్టుకొనే విరేచనాలు | |
| పొట్టలోనొప్పి. విరేచనాలు కాళ్ళు ముడుచుకొంటారు ఏ కాస్త తిన్నా వెంటనే విరేచనాలవుతాయి పొట్టకు ఒత్తిడి తగిలితే హాయిగా వుంటుంది | కాలోసింథ్ |
| దంతాలు వచ్చేటప్పుడు ఆకుపచ్చగా జిగురుతోకూడిన విరేచనాలు మలం దుర్వాసనకొడుతుంది- చిరాకు ఎక్కువ | కేమోమిల్లా |
| చెడిపోయిన ఆహారం ఎక్కువగా పళ్ళు తినితెచ్చుకొనే విరేచనాలు మలం నల్లగా వుంటుంది దుర్వాసన దాహం అధికం మాటిమాటికి నోరు తడువుకొంటారు ఎక్కువగా తాగరు అతినీరసం అస్తిమితం | ఆర్సెనికం ఆల్బ్ |

## ఉబ్బసం

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| దగ్గు తెమడ తేమగాలిపడదు ఆయాసం ఎడమవైపు పడుకోలేరు పాల ఉబ్బసానికిది దివ్యౌషధం | నేట్రంసల్ఫ్ |
| దగ్గు ఆయాసం దగ్గుతో ఊపిరాడదు ఉక్కిరిబిక్కిరి అవుతుంటారు వాంతిచేసుకొంటారు ఛాతీలో పిల్లికూతలు కాళ్ళూ చేతుల్లో చెమటలు కారుతుంటాయి | ఇపికాక్ |
| కోపంతో దగ్గు ఆయాసం ఊపిరి అందక ఉక్కిరిబిక్కిరి అవుతారు తలవెనక్కు వంచితే ఉపశమనంగా వుంటుంది చన్నీళ్ళు తాగినా చల్లటి గాలి తగిలినా హాయిగా వుంటుంది | కేమోమిల్లా |
| మాటిమాటికి తిరగబెట్టే ఉబ్బసం పొడిదగ్గు ఊపిరాడదు మామూలుగా పడుకోలేరు పొట్టమీద మోకాళ్ళు మోచేతుల మీద కప్పమాదిరిగా పడుకుంటే ఉపశమనంగా వుంటుంది ఈ మందు ఒకసారి వాడినతరవాత మళ్లీ నాలుగైదు మాసాలవరకు వాడకూడదు | మెడోరైనం |

## జలుబు

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| చల్లటిగాలిసోకి హఠాత్తుగా జలుబుచేస్తే ఇది ప్రత్యేకమైనమందు | ఎకొనైట్ |
| తలంటిన తరవాత వచ్చేజలుబు ముఖం ఎర్రబడుతుంది ఒళ్ళువేడిగా వుంటుంది | బెల్లడోనా |
| పడిశం చిక్కబడిస్రావం చిక్కగా పచ్చగా వుంటుంది చల్లటిగాలిలో ఉపశమనంగా వుంటుంది | పల్సటిల్లా |
| ముక్కునుంచి స్రావం నీరులాగా కారుతుంది పైపెదవి ఒరుసుకుపోతుంది విపరీతంగా తుమ్ములు ముక్కులెప్పుడూ బిగుసుకుపోయివుంటాయి | ఆర్సెఆల్బ్ |
| జలుబు గొంతులో నస గొంతుచీరుకుపోయినట్లు దగ్గు | ఎలియంసెపా |

| | |
|---|---|
| ముక్కువెంట కళ్ళవెంట నీరు కళ్ళెర్రబడతాయి మంట | యుఫ్రేజియా |

## దగ్గు

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| పొడిదగ్గు రాత్రిళ్ళు ఎక్కువ అస్తిమితంగా వుంటారు | ఎకొనైట్ |
| గొంతు చీరుకుపోతూ కంగుకంగుమని దగ్గు గొంతులో సున గొంతు బొంగురుపోతుంది | స్పాంజియా |
| బ్రాంకైటిస్ పిల్లికూతలు దగ్గు జ్వరం | హెపార్‌సల్ఫ్ — |
| రాత్రిళ్ళు దగ్గు ఎక్కువ ఛాతీలో గురగుర వాంతులు వికారం వాంతయినా వికారం తగ్గదు | ఇపికాక్ |
| కోపానికి గురైనతరవాత దగ్గు ప్రారంభమౌతుంది గొంతులో సున పిల్లికూతలు | కేమోమిల్లా |

## టాన్సిల్స్ వాపు

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| గొంతులో ఎరుపు వాపు-నొప్పి, జ్వరం తలంటుకొన్న తరవాత బాధలు | బెల్లడోనా |
| గొంతులో తీవ్రంగా ఇన్ఫెక్షన్ వుల్ల అడ్డుపడినట్లుగా నొప్పి టాన్సిల్స్‌లో చీము తీవ్రంగా జ్వరం చల్లదనం పడదు | హెపార్‌సల్ఫ్ |
| టాన్సిల్స్‌లో చీము నోరుదుర్వాసన జ్వరం చెమటలు | మెర్క్‌సాల్ |
| మాటిమాటికి గొంతునొప్పి. టాన్సిల్స్ పెద్దవిగా కన్పిస్తాయి మెడవక్క గ్రంధులు వాచివుండవచ్చు. జ్ఞాపకశక్తి తక్కువ | బెరైటాకార్బ్ |

## దంతాలువచ్చే సమయంలో బాధలు

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| దంతాలు రావడం ఆలస్యం జిగట విరేచనాలు | కాల్కేరియాకార్బ్ |
| చిరాకుపడుతుంటారు విరేచనాలు ఒక బుగ్గఎర్రగా ఒకబుగ్గ పాలిపోయి కన్పిస్తాయి | కేమోమిల్లా |
| ఒళ్ళువులక హరాత్తుగా జ్వరం | ఎకొనైట్ |
| చిరాకు బుగ్గలు ఎర్రగా వుంటాయి ఫిట్స్. | బెల్లడోనా |

## పొట్టలో క్రిములు

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| నిద్రలో పళ్ళు నూరుతుంటారు మాటిమాటికి ముక్కులో వేలుపెట్టి కెలుకు | సినా |

| | |
|---|---|
| తుంటారు నిద్రలో ఉలిక్కిపడి లేస్తారు వికారం వాంతులు అస్థిమితంగా వుంటారు | |
| బొద్దుగా వుంటారు దంతాలు ఆలస్యంగా వస్తాయి నడక ఆలస్యం కడుపునొప్పి విరేచనాలు | కాల్కేరియాకార్బ్ |

## చెవిపోటు

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| చెవిపోటు జ్వరం రాత్రిళ్ళు బాధలుద్రేకిస్తాయి వేడికాపు హాయిగా వుంటుంది | బెల్లడోనా |
| పచ్చగా చిక్కగా చీము చెవిపోటు బాధలు ఒకతీరుగావుండవు కాపుపెడితే బాధలెక్కువ | పల్సటిల్లా |
| దీర్ఘకాలికంగా చీముకారుతుంటుంది చెవిపోటు చెవివెనుక భాగంలో కూడా నొప్పి చెవిదుర్వాసన చిరుచెమటలు చల్లదనం గిట్టదు | హెపార్‌సల్ఫ్ |
| చెవిపోటు పెద్దపెట్టున ఏడుస్తుంటారు | కేమోమిల్లా |

## జ్వరం

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| చల్లగాలి తగలటం దడుచుకోవడం లాంటి కారణాలవలన హఠాత్తుగా జ్వరం వస్తుంది అస్థిమితం దాహం అధికం | ఎకొనైట్ |
| జ్వరంతో ఒళ్ళుకాలిపోతుంటుంది పొట్టమీద చేయిబెట్టి తీసిన తరవాత కూడా కొంతసేపు వేళ్ళుకాలుతుంటాయి తల పొట్ట వేడిగావుంటాయి తలనొప్పి అధికంగా వుంటుంది అపస్మారంగా వుంటారు కాళ్ళు చేతులు అదిరినట్లుగా కదలవచ్చు. | బెల్లడోనా |
| జ్వరంతో బాధపడుతుంటారు తలనొప్పి, కదిలితే బాధలెక్కువవుతాయి దాహం అధికం చిరాకుపడతారు పోట్లు | బ్రయోనియా |
| జ్వరం మాటిమాటికి ఒళ్ళువిరుచుకొంటారు. పక్కకుదరక అటూఇటూ దొర్లు తుంటారు తేమతో కూడిన వాతావరణంలో బాధలుద్రేకిస్తాయి | రస్టాక్స్ |
| జలుబు దగ్గుతో కూడిన జ్వరం దాహముండదు తలభారం కళ్ళుమూసుకు పోతుంటాయి మగతగావుంటారు | జెల్సిమియం |

## రికెట్స్

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| బొద్దుగా వుంటారు దొడ్డికాళ్ళు పొట్టపెద్దది తలనిలపటం ఆలస్యం నడక రావటంఆలస్యం నిద్రలో తలమీద దిగపోతగా చెమటలుపడతాయి | కాల్కేరియాకార్బ్ |
| తలపెద్దది మాడుపూడదు ఎముకలు కండరాలు గట్టిపడవు నడక ఆలస్యం పాలుగిట్టవు పాలుతాగితే విరేచనాలు మలబద్ధకం | సైలీషియా |

| | |
|---|---|
| తలపెద్దది దోడ్డికాళ్లు బాగాతింటారు పంటబట్టదు శరీరంముడతలువడి పదలి వుంటుంది | పల్ఫర్ |

## ముక్కు అదిరితే

దెబ్బేమీ తగలకుండానే ముక్కువెంట రక్తంకారితే లక్షణాలను బట్టి ఔషధాన్ని ఎంపికచెసి ఆ బాధ మళ్లీ మళ్లీ తిరగబెట్టకుండా నివారించవచ్చు.

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| కుంకుమలాగా ఎర్రని వెచ్చని రక్తం ముక్కువెంట కారుతుంది తేలికగా కుదవలు కట్టి నల్లగా మారుతుంది ముఖం కందబారి వెచ్చగా వుంటుంది కదిలితే బాధలు ఎక్కువ కణతలలో తలనొప్పి | బెల్లడోనా |
| పిల్లలు సన్నగా పొడవుగా వుంటారు ముక్కు వెంట ఎర్రని రక్తం ఆగిఆగి పడుతుంటుంది గాయాలు పడినప్పుడు వీరికి రక్తం ఎక్కువగా పోతుంది ఐస్‌క్రీమ్ అంటే మక్కువ భయస్తులు | ఫాస్ఫరస్ |
| శరీరంలో ఏ భాగంనుంచైనా నీళ్లలాగా ఎర్రటి రక్తం కారిపోతుంటే ముందుగా ఈ ఔషధం ఇవ్వాలి ఇదేవిధంగా ఆందోళనతో కూడిన ఈలక్షణాలు కన్పిస్తే ఎకొనైట్ గుర్తుకు రావాలి | మిల్లిఫోలియం |
| రక్తం ధారాపాతంగా పోతుంటుంది తేలికగా గడ్డ కడుతుంటుంది | ఫెర్రంఫాస్ |

## పక్కతడపటం

సాధారణంగా పిల్లలు 3 4 సంవత్సరాలు నిండేనరికి రాత్రిళ్లు పక్కతడపటం మానేస్తారు కొంత మంది 10 11 ఏళ్లు వచ్చేవరకు కూడా నిద్రలో మూత్రం పోస్తుంటారు నగంమంది పిల్లలు 2 ఏళ్లకే పక్కతడపటం మానేస్తారు నూటికి 5 మంది 11 ఏళ్లు నిండినా పోస్తూనే వుంటారు లక్షణాలను బట్టి మందులువాడి వారి బాధను నివారించవచ్చు. ఇంట్లోగాని బళ్లోగాని పిల్లలు ఉద్వేగపరమైన సమస్యలను ఎదుర్కొన్నట్లయితే ముందుగా ఆకారణాలను తొలగించడానికి ప్రయత్నించాలి

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| నిద్రలో మూత్రం బొట్లు బొట్లుగా పడుతుంది నడిచేటప్పుడు మూత్రం చుక్కలు చుక్కలుగా బట్టల్లో పడుతుంది వాతావరణం చల్లగా వుంటే పక్కతడుపుతుంటారు సాధారణంగా పడుకోగానే పక్కతడుపుతారు | బెల్లడోనా |
| మెత్తటి స్వభావంగల పిల్లలు ముఖ్యంగా ఆడపిల్లలు తెలియకుండానే మూత్రం పడుతుంటుంది పక్కతడుపుతుంటారు మనను నిలకడగా వుండదు తేలికగా ఏడుస్తారు ఓదార్పు ఇష్టపడతారు అనూయ ఎక్కువ చల్లటి వాతావరణం కావాలి | పల్సటిల్లా |
| పిల్లలు త్వరగా పొడవు సాగుతారు సన్నగా వుంటారు భయస్తులు చీకట్లో భయంజాస్తి ఎవరైనా తోడు పడుకోవాలి జాలిస్వభావం ఆప్యాయత కోరుకుంటారు ఐస్‌క్రీమ్ బాగా ఇష్టపడతారు | ఫాస్ఫరస్ |

| | |
|---|---|
| వడుకోగానే మూత్రం పోసేపిల్లలకు ఇది మంచిమందు చల్లటి పాడిగాలు లు వీచినప్పుడు వీరు బాధకు గురవుతుంటారు చాలా జాలి మనస్సు. వర్షాకాలంలో ఎక్కువగా వక్కతడవరు | కాస్టికం |

అయిదు సంవత్సరాల వయస్సు నిండిన దగ్గరనుండి మగ పిల్లలు ఆడపిల్లలకన్నా త్వరగా పొడవు సాగుతుంటారు ఏ వయస్సులో అయినా మగవారిలో పెరుగుదల ఎక్కువ 9- సంవత్సరాల మధ్య మాత్రమే ఆడపిల్లల్లో మగపిల్లలకన్నా ఎక్కువగా పెరుగుదల కనిపిస్తుంది ఈ వయస్సు ఆడపిల్లలు ఆదే వయస్సు మగ పిల్లలకంటే ఎక్కువ పొడవుంటారు పదమూడు సంవత్సరాల వయసుదాటిన తరవాత ఆడపిల్లల్లో పెరుగుదల నిలిచిపోతుంది అదే వయస్సులో మగపిల్లలు బాగా పొడవుసాగడం మొదలవుతుంది అదే వయస్సుగల ఆడపిల్లల కన్న ఎత్తుగా పెరుగుతారు పదిహేను సంవత్సరాలు వచ్చే వరకు వేగంగా పెరిగి ఆ తరవాత రెండు సంవత్సరాలు కొంచెం పెరుగుతారు

చిన్నపిల్లల వైద్యంలో హెూమియోపతికి ప్రత్యేకస్థానముంది ఈ మందు పిల్లలకివ్వడం తేలిక పిల్లలు మందు ఇష్టంతో తీసుకొంటారు పిల్లలకివి త్వరగా పనిచేస్తాయి వారికేదురలవాట్లు లేకపోవడమే దానికి కారణం కావచ్చు. పెద్దవారిలాగా మానసిక ఒత్తిళ్లకు గురికాకపోవడం కూడా మరొక కారణం కావచ్చు. హెూమియో వైద్యప్రయోజనం అర్థం చేసుకోడానికి పిల్లల్లో ఈ మందు సాధించే ప్రయోజనమేనిదర్శనం హెూమియోమందు వ్యాధి నివారణశక్తులనుత్తేజపరిచి నివారణ చేస్తుంది చిన్నపిల్లల్లో లక్షణాలను రాబట్టడం సాధ్యంకాదుకనుక వ్యాధి కారణం బాహ్యలక్షణాలు గమనించి మందులను ఎంపిక చేసి వాడవలసి వుంటుంది



# టైఫాయిడ్ జ్వరం

టైఫాయిడ్ అంటే టైఫస్‌ను పోలింది అని. టైఫస్ అనే గ్రీకు పదానికి మగత అని అర్థం. మగత ఈ రోగులకు ఉండే అనేక లక్షణాలలో ఒకటి. రోగి లక్షణాలలో ఏదో ఒక లక్షణాన్ని ఎత్తిచూపి దానినే వ్యాధి పేరుగా, వ్యాధి విధానంగా చెప్పడం సంప్రదాయ వైద్యంలో ఆనవాయితీ. వ్యాధి నిర్ధారణ వెనుక ఉండే చిదంబర రహస్యం ఇదే.

సూక్ష్మక్రిములు శరీరధాతువులలో కలిగే మార్పులను గురించి చెప్పడం రోగ ఫలితాన్ని విశ్లేషించడమవుతుందిగాని రోగకారణాన్ని కనుక్కోవడం కాదు. అయితే ఆ ఫలితాన్ని కలిగించిన అసలు కారణమేమిటి? ఈ ప్రశ్న అత్యంత ప్రముఖమైనది. దీనికి సమాధానం ధాతుశైథిల్య శాస్త్రం (పాథాలజీ) కనుక్కోగలగాలి. ఇదే హోమియోపతిలో అయితే మనిషి అని సమాధానం వస్తుంది. మూలకారణం రోగి శరీరంలోనే ఉంది. ధాతువుల లోపాన్ని సరిచేసే ఔషధం కోసం శరీరం ఆరాటపడుతుందన్నమాట. రోగలక్షణ సముదాయం ప్రకృతి పరిభాష. ఈ లక్షణ సముదాయాన్ని ఆధారం చేసుకుని ఔషధాన్ని ఎంపిక చేయటం హోమియోపతి పద్ధతి. అనేక లక్షణాలలో ఒక లక్షణాన్నే వ్యాధిగా పేరుపెట్టి, ఆ లక్షణాన్ని అణిచివేయటం అలోపతి పద్ధతి. ఇదే హోమియోపతి, అలోపతీ విధానాల్లో ఉన్న ప్రధానమైన తేడా.

కలుషితమైన ఆహారం, నీటివల్ల వచ్చే జబ్బులు మూడు. టైఫాయిడ్, కలరా, రక్తవిరేచనాలు. వ్యాధి రాకుండా ముందుజాగ్రత్త వహించడానికి ఈ పరిజ్ఞానం అవసరం. టైఫాయిడ్ క్రిములు కొంతమంది పసరుతిత్తులలో ఉండిపోతాయి. అవి ఉన్న వ్యక్తులకు జ్వరంరాదు. ఈ వ్యక్తులు రోగం వ్యాపింపచేయటానికి వాహకులవుతారు. టైఫాయిడ్ జ్వరం రావటానికి క్రిములకన్నా శరీరతత్వమే ప్రధానమైన కారణమన్న విషయం దీనివల్ల తెలుస్తుంది. టైఫాయిడ్ జ్వరాన్ని కల్గించే సూక్ష్మజీవులను సాలెమ్మొల్లా టైపై అని వ్యవహరిస్తారు. రోగవాహకులు ఈగలవల్ల ఆహారం, పాలు, నీరు, కూరగాయలు కలుషితమై రోగవ్యాప్తికి దోహదమవుతారు.

ఈ జ్వరం రోగిని మూడువారాలు బాధపెడుతుంది. మళ్లీ తిరగబెట్టకపోతే జ్వరం గడువు 21 రోజులుగా పరిగణించవచ్చు. ఇది ప్రమాదకరమైన వ్యాధి అయినప్పటికీ జ్వరం అకస్మాత్తుగా తారస్థాయి అందుకోదు. 3, 4 రోజులు గడిచిన తరువాతగాని జ్వరం తీవ్రరూపం ధరించదు. జ్వరం రావడమే తీవ్రస్థాయిలో ఆరంభమైతే అది టైఫాయిడ్ కాదనే చెప్పాలి. ఈ పరిస్థితివల్లనే ఎకోనైట్ ఈ జ్వరానికి వాడకూడదు.

జ్వరం ఆరంభదశలో రోగి బడలికగా ఉంటాడు. చలిచలిగా వుంటుంది. కొంచెం తలనొప్పి, కడుపులో వికారం. ఆకలిమందం. నాలుకపై మందం చేరుతుంది. కొంచెం పొడిదగ్గు. నిద్రపట్టదు. ఈ బాధలు క్రమక్రమంగా పెరుగుతుంటాయి. ఈ దశలో జ్వరానికి ఫలానా జ్వరం అని పేరు పెట్టడానికి వీలులేదు.

క్రమంగా జ్వరం 104° లకు చేరుకొంటుంది. పొట్ట ఉబ్బరిస్తుంది. నొప్పిగా వుంటుంది. నాడి శరీర ఉష్ణోగ్రతకు తగినంత వేగంగా కొట్టుకోదు. నిమిషానికి 80 సార్లు కొట్టుకుంటూ ఉంటుంది. రోగి మగతగా ఉంటాడు. రాత్రిపూట చిత్తభ్రమకు లోనవుతుంటాడు. కొంతమందికి ముక్కు అదిరి రక్తం పడుతుంది. విరేచనాలు కావచ్చు.

జ్వరం రెండోవారానికి చేరుకునేసరికి విరేచనాలు పలచగా, గవరగా అవుతుంటాయి. ఇది టైఫాయిడ్ జ్వరం ముఖ్యలక్షణం. ఈ దశలో రక్తపరీక్ష వైడాల్ టెస్ట్ ద్వారా జ్వరనిర్ధారణ చేయవచ్చు. రెండవవారంలో ఛాతీమీద, వీపుమీద, పొట్టమీద గులాబిరంగు దద్దురు కన్పిస్తుంది. మూడవ వారంలో ఈ దద్దుర్లు తగ్గిపోతాయి. రోగి బాగా నీరసించిపోతాడు. ఆలోచనాశక్తి తగ్గిపోతుంది. అయినవాళ్లను కూడా గుర్తుపట్టలేడు. రక్తస్రావాలు, పేగుచిట్లడం లాంటి ప్రమాదాలు ఈ దశలో ఎక్కువ. మెదడు, పొట్టలో వచ్చే మార్పులే కాకుండా ఊపిరితిత్తులలో నిమ్ము కూడా చేరవచ్చు. ఈ గండాలన్నీ తట్టుకుని రోగి బతికి బయటపడాలి. మూడువారాలు గడిచినప్పటికీ మళ్లీ తిరగపెట్టదన్న గ్యారంటీ లేదు. సంప్రదాయ వైద్యంలో వాడే మందులవల్ల సైడ్ ఎఫెక్ట్ మామూలే. ఇవి ఒక్కొక్కసారి వ్యాధికన్న భయంకరం. ఈ మందులు వాడిన రోగులకి జ్వరం తిరగబెట్టే ప్రమాదం ఎక్కువని వైద్యులను హెచ్చరించాడు నర్‌జాన్‌కానీబేర్.

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| జ్వరం ఆరంభదశలో తప్పక వాడుకోదగిన మందు. రోగి మబ్బుగా వుంటాడు. తలనొప్పి, ఒళ్ళు భారంగా ఉంటుంది. నడవబోతే కాళ్లలో వణుకు. వణుకు ఈ మందు ప్రత్యేక లక్షణం. కళ్లు మూతలు పడిపోతుంటాయి. నాలుకపై మందం. దప్పిక ఉండదు. మలబద్ధకముండదు. విరేచనాలు కూడా కనిపించవు. ఈ దశలో ఈ మందు వాడితే టైఫాయిడ్ బాధలనుండి రోగిని కాపాడినట్లే. రోగి లక్షణాలను బట్టి మందు ఎంపిక చేయడమే హోమియో వైద్యవిధానం. | జెల్సిమియం |
| జెల్సిమియం వాడదగిన దశలో ఆ మందు వాడనట్లయితే రోగికి మగత ఎక్కువవుతుంది. రోగి తాగుబోతులాగా మాట్లాడుతూనే మైకంలోకి జారిపోతుంటాడు. ఇది ఈ మందు ప్రధాన లక్షణం. వొళ్లంతా నొప్పులు. మానసికమైన అస్థిరత్వం జాస్తి. అమితమైన నీరసం. చెమట, మలం, మూత్రం కంపుగొడుతుంటాయి. టైఫాయిడ్ జ్వరానికి దీన్ని ప్రత్యేకమైన మందుగా వాడుకోవచ్చు. ఈ మందు వాడిఏదశలోనైనా టైఫాయిడ్ జ్వరాన్ని నయం చేయవచ్చు. | బాప్టీజియా |
| జ్వరంలో విపరీతమైన ఒళ్లునొప్పులు, ఒళ్లు విరుపులు.పక్క కుదరదు. ఆహారం ఇవ్వబోయినా, మందు ఇవ్వబోయినా తీసుకోడు. విషం పెడుతున్నారని భయం. ఈ రోగికి శారీరకమైన అస్థిమితం. నడుము, కాళ్లు లాగుతుంటాయి. నిద్రపట్టదు. కలలవలన భయం, ఆందోళన. చిత్తభ్రమ. పిచ్చి పిచ్చిగా మాట్లాడుతుంటాడు. కదలకుండా, స్థిమితంగా పడుకొని ఉన్న రోగికి రస్టాక్స్ఎప్పుడూ ఇవ్వకూడదు. | రస్టాక్స్ |
| జ్వరంలో తీవ్రమైన ఒళ్లునొప్పులతో బాధపడుతూ కూడా పక్కమీద కదలకుండా పడుకొన్న రోగికి ఈ మందు తప్పక ఆలోచించాలి. కదిలితే బాధలెక్కువవుతాయి. అందుకే కదలటానికి ఇష్టపడడు. నుదురు పగిలిపోతుంటుంది. మలబద్ధకం. దప్పిక విపరీతం. తడవ తడవకు నీళ్లు ఎక్కువగా తాగుతాడు. మగతగా ఉంటాడు. చిత్తభ్రమ. ఇంట్లో ఉన్నప్పటికీ మనింటికి పోదామని పిచ్చిపిచ్చిగా కలవరిస్తుంటాడు. | బ్రయోనియా |

రోగి పరిస్థితి మరీ విషమించిన తరుణంలో ఈ మందు ఆలోచించాలి టైఫాయిడ్ మందుల్లో ఇది ఒకటిగదా అని విచక్షణారహితంగా ఈ మందు వాడకూడదు విపరీతమైన బలహీనత ఆందోళన అస్థిమితం ఈ మందు ప్రధాన లక్షణాలు కదిలే ఓపికలేక కాళ్లు చేతులు మాత్రమే కదులుంటాయి చనిపోతాననే భయం ఆవహిస్తుంది నోరు ఎర్రగా వుంటుంది కంపుగొట్టే విరేచనాలు దప్పిక ఎక్కువ మాటిమాటికి కొద్దికొద్దిగా చల్లటి నీళ్లు చప్పరిస్తుంటాడు

ఆర్సెనికం ఆల్బ్

# నిమోనియా

ఊపిరితిత్తుల్లో వచ్చే ఇన్ఫెక్షన్ని నిమోనియా అంటారు ఇది అకస్మాత్తుగా వస్తుంది ఈ ఇన్ఫెక్షన్ బాక్టీరియా వైరస్ క్రిములవల్ల కూడా వస్తుందని గుర్తించారు ఈ వ్యాధి పసిపిల్లల్లోగాని వృద్ధుల్లోగానివచ్చినట్లయితే చాలా ప్రమాదకరం

మనదేహంలో ఛాతిలో రెండు ఊపిరితిత్తులు గుండెకిరువైపులా ఉంటాయి ఈ ఊపిరితిత్తుల బరువు ఒక కిలో ఇవి శరీరంలో గాలిపంపుల మాదిరిగా పనిచేస్తాయి రక్తాన్ని ప్రసారంచేసే పంపు - గుండె ఈ రెండు అవయవాల మధ్య సహకార సమన్వయాలు దేహారోగ్యానికి ఎంతో అవసరం కణజాలాలకు అవసరమయిన ప్రాణవాయువును బయటి వాతావరణంనుంచి పీల్చుకొని రక్తానికి అందించడం శరీరధాతువుల్లో తయారయ్యే మలిన వాయువులను రక్తంనుంచి సేకరించి బయటికి నెట్టివేయడం ఈ గాలిపంపులు నిర్వహించే కార్యక్రమం

ఊపిరితిత్తులలో 30 కోట్ల గాలి గదులున్నాయని ఒక అంచనా ఇవి గాలిగొట్టాల చివరల్లో ఉంటాయి ఈ అరలని ఎల్వియోలై అంటారు ఎల్వియోలై గోడల్లో కేశనాళికలుంటాయి గుండె కుడిభాగం నుంచి బయలుదేరిన రక్తం ఈ కేశనాళికల్లో ప్రవహిస్తుంది నిమిషానికి 0 లీటర్ల రక్తం ఇట్లా ప్రవహిస్తుంది ఈ రక్తంద్వారా శరీర ధాతువుల్లో తయారయ్యే మలిన వాయువులు ఊపిరితిత్తులకు చేరవేయబడతాయి కేశనాళికల్లో ప్రవహించే రక్తం గాలిగదుల్లో ఉన్న ప్రాణవాయువును స్వీకరించి తనలోవున్న మలిన వాయువును గాలి గదుల్లోకి చేర్చి ముందుకు ప్రయాణం సాగిస్తుంది ఈ విధంగా శుద్ధమైన రక్తం గుండె ఎడమవైపునకు చేరుకుంటుంది ఊపిరితిత్తులలోని గాలి గదుల గోడల వైశాల్యం 000 చదరపు అడుగులు అంటే ఒక టెన్నిస్ కోర్టంత విస్తీర్ణమైంది దీన్నిబట్టి గాలిగదుల ప్రాముఖ్యత అర్థం చేసుకోవచ్చు. నిమోనియా వచ్చినపుడు గాలిగదుల వాపువచ్చి నిమ్ముచేరుతుంది గాలిగదులు గట్టిపడతాయి దీనిని హెమెటైజేషన్ అంటారు ప్రాణాధారమైన వాయువుల మార్పిడిలో అంతరాయం కలుగుతుంది నిమోనియో జ్వరం చలి పొడిదగ్గు కీళ్లనొప్పులతో ఆరంభమవుతుంది మొదట్లో పొడిదగ్గే అయినా తరవాత దగ్గుతోపాటు జిగురుగా ఉండే కళ్ళెకూడా పడుతుంది ఈ జిగురులో రక్తం కలిసి గవర గవరగా పడుతుంది సాధారణంగా ఇన్ఫెక్షన్ నూటికి 80 మందిలో ఒక ఊపిరితిత్తికే పరిమితమయి ఉంటుంది ముఖ్యంగా కుడివైపు ఊపిరితిత్తి అయివుంటుంది రెండు ఊపిరితిత్తులలో ఒకేసారి ఇన్ఫెక్షన్ వస్తే డబుల్ నిమోనియా అని పిలుస్తారు

ఫ్లూ జ్వరంలాగానే నిమోనియా చలితో మొదలవుతుంది జ్వరంతోబాటు ఛాతీలో నొప్పి ముందుగాని వెనుకవైపుగాని రావచ్చు. గాలి పీల్చేటప్పుడు ఈ బాధ ఎక్కువ రోగి గాలిచాలక ఆయాసపడుతుంటాడు ఆకలి మందగిస్తుంది విరేచన బద్ధకం పెదాలమీద నర్పిలాంటి పొక్కులు కనబడతాయి కళ్ళెను బయటకు తీసుకురావడానికి మాటిమాటికి దగ్గుతాడు దగ్గుతుంటే ఛాతీలో ఎక్కువ నొప్పి నొప్పి భరించలేక దగ్గును అణుస్తుంటాడు జ్వరం ఆరంభమైన నాలుగో రోజుకి కొంత తీవ్రత తగ్గి 6 7 రోజులకుగాని జ్వరం విడవదు జ్వరం విడవగానే ఒళ్లంతా చమటలు పోస్తాయి హాయిగా నిద్ర పట్టుతుంది నిద్రలేచిన తరవాత హాయిగా గాలి పీల్చుకుంటాడు

జ్వరం ఉన్నప్పుడు నాడి నిమిషానికి 100 నుంచి 30 సార్లు కొట్టుకొంటుంది ఈ వేగం 130 కన్నా ఎక్కువైతే రోగి పరిస్థితి విషమించిందని గుర్తించాలి రోగి డెలీరియంలో పడిపోతాడు ఈ రోగంవల్ల గుండె

మెదడులో కలిగే మార్పులతో మరణంకూడా సంభవిస్తుంది ఈ రోగుల్లో కీళ్ళు, లివరుకు సంబంధించి మార్పులు ఉంటాయి

నిమోనియా రోగిని బాగా విశాలంగా వెచ్చగా ఉన్న గదిలో ఉంచి వైద్యం చేయవలసి ఉంటుంది ద్రవరూపంలో ఉండే వేడివేడి పదార్థాలు ఎక్కువగా ఇవ్వాలి వేడినీళ్లతో తడిపిన గుడ్డతో రోజా వొళ్ళు తుడవాలి వృద్ధులయిన రోగులయితే అప్పుడప్పుడు అటూఇటూ తిప్పి పడుకోబెట్టాలి ఊపిరితిత్తులలో నిమ్ము నిలబడిపోకుండా దగ్గి ఉమ్మేటట్లు చూడాలి

జ్వరం తగ్గిన తరవాత రోగికి ప్రాణాయామంలాంటి వ్యాయామం మంచిది చిన్న పిల్లలకు ఇది బాగా మేలుచేస్తుంది జ్వరం తగ్గిన తరవాత 3 వారాల్లో చిన్నవాళ్లయితే కోలుకుంటారు గాని పెద్దవాళ్ళు 2 మాసాలు గడిచినా మామూలు మనుషులు కాలేరు వ్యాధి ఆరంభదశలో ఎకొనైట్ బెల్లడోనా ఫెర్రంఫాస్ ఇపికాక్ ముందుగా ఆలోచించదగ్గ మందులు

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| బాగా ఆరోగ్యంగా ఉంటాడు చలిగాలిలో తిరగటంవల్ల నిమోనియా వస్తుంది జ్వరం చలితో ఆరంభమవుతుంది భరించరాని పొడిదగ్గు మంచంమీద వెల్లకిలా పడుకోలేడు మూడు నాలుగు దిండ్లు వేసి ఎత్తుగా పడుకోబెట్టాలి ఈ రోగికి నిమ్ము ఎడమ ఊపిరితిత్తిలో వస్తుంది ఎడమవైపు పడుకోలేడు విపరీతమైన దప్పిక ఎప్పుడూ చల్లటి పానీయాలే కోరుతుంటాడు జ్వరం తీవ్రత ఆందోళన అస్తిమితం ఈ రోగి ప్రత్యేక లక్షణాలు గొంతు పొడారి ఉంటుంది జ్వరం వచ్చిన తరువాత 36 గంటలు దాటితే ఆ రోగిలో ఎకొనైట్ లక్షణాలుండవు ఇది గమనార్హం | ఎకొనైట్ |
| చిన్నపిల్లల్లో నిమోనియాకు ఇది ప్రత్యేకమైన మందు పిల్లల్లో ఏదివచ్చినా నూటికి 80 కేసుల్లో వాంతులతో మొదలవుతుంది ముఖ్యంగా ఇది నిమోనియాలో గమనించవచ్చు. అన్నం సహించదు డోకులు వికారం ఊపిరాడనట్టి దగ్గు తెరలుతెరలుగా వస్తుంది ఛాతీలో గురగుర జీనలు సాగుతున్నట్టుగా కళ్ళె. ఈ కళ్ళెలో రక్తపు జీరలు ఈ జీరలు ఎర్రగా ఉంటాయి ఇది గమనార్హం జ్వరం తగిలేటప్పుడు వడే కళ్ళెలో రక్తం జీరలు నల్లగా ఉంటాయి ఈ తేడాను గుర్తించాలి ఇపికాక్ రోగిలో ముక్కులో జిలగా ఉండి తుమ్ములెక్కువగా వస్తుంటాయి ఈ రోగుల్లో సాధారణంగా దప్పిక ఉండదు | ఇపికాక్ |
| ఆరంభదశలో ఎకొనైట్ ఫెర్రంఫాస్ వాడిన రోగులకు తరవాత తప్పక ఆలోచించదగిన మందు బ్రయోనియా ఈ రోగికి సూదులు గుచ్చుకున్నట్లుగా పోట్లు అదిరిపోయే పొడిదగ్గు అసలు కళ్లె పడదు రోగి ఏమాత్రం కదలికనూ భరించలేడు దగ్గుతుంటే ఛాతీలో నొప్పి అందుకని దగ్గటానికి భయపడుతుంటాడు దగ్గు వచ్చినప్పుడు తలనొప్పి. ఇది విచిత్ర లక్షణం నిమోనియా ఏవైపు ఉంటే అవైపే పక్క కుదురుతుంది అవైపు ఊపిరితిత్తికి కదలిక లేకపోవడమే రోగికి సుఖం | బ్రయోనియా |
| ఈ రోగిలో నిమోనియా బ్రయోనియా రోగిలో లాగా త్వరగా తారస్థాయికి చేరుకొంటుంది ఈ రోగి ఛాతీ పైభాగంలో బరువు పెట్టినట్లుంటుంది ఇది ప్రధాన లక్షణం ఆయాసం ఎక్కువ దగ్గుతుంటే తుప్పురంగులో కళ్ళె పడుతుంటుంది రోగి చాలా మగతగా ఉంటాడు చలిగాలి అసలు భరించలేడు చలిగాలి తగిలితే చాలు దగ్గు ఎక్కువ ఈ రోగి పక్కన ఎవరో ఒకరు అనుకొని కూర్చోవాలని | ఫాస్పరస్ |

కోరుకుంటాడు ఈ రోగికి దప్పిక ఎక్కువ ఈ జ్వరంలో చల్లని పుల్లటి ద్రవాలని కోరుకుంటాడు

# మలేరియా

చలితోకూడిన జ్వరాన్ని మలేరియా అని వ్యవహరిస్తాం మలేరియా అనే మాటకు అసలు అర్థం చెడువాయువు కార్యకారణ సంబంధాలు తెలియనందువల్లనే చలిజ్వరానికి చెడువాయువు అనే పేరు తగిలించారు

ఇది ప్రపంచంలో అనేక దేశాల్లో అప్పుడప్పుడు దర్శనమిచ్చే వ్యాధి మానవజాతిని హతమార్చే భయంకర వ్యాధిగా దీనికి పేరు ఆఫ్రికా దేశాల్లో ప్రతి సంవత్సరం 4 సంవత్సరాల వయస్సు లోపు పిల్లలు ఈ వ్యాధిసోకిన కారణంగా 0 లక్షల మంది చనిపోతున్నారని ఒక అంచనా మలేరియా క్రిములు ఈ వ్యాధిని వ్యాపింపజేసే దోమలు వాటి సంహారానికి వాడే మందుల ప్రభావానికి లొంగకపోవ డమే దీనికి కారణం

మలేరియా క్రిములు నాలుగురకాలు మలేరియా వ్యాధిని వ్యాపింపచేసే దోమ ఎనాఫ్‌లీస్ ఎనాఫ్‌లీస్ దోమలలో ఆడజాతి దోమలు మాత్రమే ఈ కార్యక్రమాన్ని నిర్వహిస్తాయని కనుగొన్నాడు సర్ రొనాల్డ్‌రాస్ ఈ దోమలు మలేరియా రోగిపై వాలి రక్తాన్ని పీల్చుకుంటాయి ఆ రక్తంలో కొన్ని మలేరియా క్రిములు కూడా ఉంటాయి దోమలలో ప్రవేశించిన మలేరియా క్రిములు 7 నుంచి 0 రోజుల్లో కొన్ని మార్పులకు గురై ఆతర్వాత ఈ దోమ మరొకరిని కుట్టినప్పుడు అతని రక్తంలో ప్రవేశించి చలిజ్వరాన్ని కల్గిస్తాయి మలేరియా క్రిములు రక్తంలోని ఎర్రకణాలను ధ్వంసంచేస్తాయి అందువల్లనే మలేరియా రోగి తెల్లగా పాలిపోయి ఉంటాడు

జ్వరం తలనొప్పి, ఒళ్ళునొప్పులు చలి వణుకు చెమటలు చలిజ్వరం వచ్చిన వారందరిలో కనబడే లక్షణాలే మలేరియా క్రిములు శరీరంలో ప్రవేశించిన వెంటనే కాలేయంలోకిచేరి ఎర్రరక్తకణాలలో ప్రవేశించి అభివృద్ధి చెందుతాయి తరవాత ఆ ఎర్రకణాలను ఛేదించుకొని రక్తప్రవాహంలో చేరిపోయి ఎర్రరక్తకణాల పైకెగబడి ధ్వంసంచేస్తాయి ప్లాస్మోడియం ఫాల్సిపేరం అని పిల్వబడే ఒకరకం క్రిములు ప్రత్యేకంగా మెదడుకుపోయే రక్తనాళాల్లో ప్రవేశించి రక్తప్రసారాన్ని నిరోధించి హఠాన్మరణానికి కూడా దారితీస్తాయి

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| ఇది మలేరియా జ్వరానికి ముందుగా ఆలోచించదగిన మందు క్వైనాలాంటి మందులు వాడాక జ్వరంతగ్గిన తరవాత రోగులలో కన్పించే దుష్ఫలితాలకు కూడా ఇది మంచిమందు ఈ మందు 30 పొటెన్సీలో 4 వారాలకు ఒక రోజు మాత్రమే ఉదయం మధ్యాహ్నం సాయంకాలం ఒక్కొక్క డోసు చొప్పున మూడు మాసాలు వాడుకోవచ్చు.<br><br>జ్వరం ఉదయం 0 గంటలకు ప్రారంభమవుతుంది చలి తలనొప్పి అధికంగా దాహం వికారంతో కూడిన బాధలు ఆరంభమౌతాయి తలనొప్పి లంకించుకోవటంతో జ్వరం రాబోతుందని రోగికి తెలుస్తుంది నడుము పీకు తుంటుంది<br><br>జ్వరం పట్టుకోగానే రోగి మగతగా స్పృహతప్పి ఉంటాడు దాహం ఇంకా ఎక్కువౌతుంది ఎన్ని నీళ్ళుతాగితే అంతహాయిగా ఉంటుంది<br><br>చలిజ్వరంలో చరమదశ చెమటలువట్టి జ్వరం విడిచిపోవడం చమటలు పట్టేసరికి నొప్పులులాంటి బాధలన్ని తగ్గిపోతాయి కాని తలనొప్పి మాత్రం వదలదు జ్వరం పూర్తిగా విడిచిన తరువాత గూడా తలనొప్పి ఉంటుంది చలి వేడి చమటలున్న మూడు దశల్లో దాహం ఉంటుంది జ్వరం ఎక్కువగా | నేట్రంమూర్ |

| | |
|---|---|
| ఉన్నప్పుడు తలనొప్పి విపరీతమన్న విషయం నేట్రంమూర్ రోగిలో గమనార్హం | |
| జ్వరం రోజువిడిచి రోజువస్తుంది ఉదయం 7 నుండి 9 గంటలకు జ్వరం ఆరంభమౌతుంది జ్వరం వచ్చేముందు రాత్రి వాంతి వచ్చినట్టు వికారపెట్టి బాధపడతాడు జ్వరం వచ్చేముందు విపరీతమైన దాహం వేస్తుంది<br>వాంతులవుతాయి ఒళ్ళు విరుపులు ఆవలింతలు తోడవుతాయి ఒళ్ళంతా విరగగొట్టినట్టు నొప్పులు కనుగుడ్లు పిక్కుపోతుంటాయి తలనొప్పి వసరువాంతులతో జ్వరం మొదలవుతుంది జ్వరంలో నీరుతాగితే వణుకు పుట్టుకొస్తుంది ఈ రోగికి చమట తక్కువే అసలుండకపోవచ్చు. | యుపటోరియం పెర్ఫ్ |
| జ్వరం సాధారణంగా 2 నుండి 2 గంటలలోపుగా మొదలవుతుంది చలిమొదలయ్యేముందు నీరసంగా ఉంటుంది ఒళ్ళు విరుపులు ఆవలింతలు జాస్తి చలిజ్వరం దాదాపు ఒకేసారి ఆరంభమవుతాయి మునుగుకప్పి పడుకుంటే హాయిగా ఉంటుంది దాహం తక్కువే దాహం అయినా కొద్దికొద్దిగా నీరు తాగుతుంటారు వేడిగాఉంటే ఇష్టపడతారు జ్వరం పెరిగినకొద్ది నీరు ఎక్కువసార్లు తాగాలనిపిస్తుంటుంది ఆందోళన అధికం స్తిమితంగా ఉండలేదు చెమటలు పట్టడం మొదలైనతరవాత బాధలన్నీ తగ్గడం ఆరంభిస్తాయి చెమటలువట్టే సమయంలో దాహం విపరీతం ఎక్కువ నీరు తాగుతారు కాని ఇమడవు | ఆర్సెనికం ఆల్బ్ |
| చలి జ్వరం చెమట మూడుదశలు ఒకదానితర్వాత ఒకటి స్పష్టంగా కనబడతాయి చలిరాబోయేముందు దాహం వేస్తుంది చలిమొదలయ్యేముందు జ్వరం మొదలయ్యేముందు దాహంవేస్తుంది చెమటలు వట్టేటప్పుడు విపరీతంగా నీళ్లు తాగుతారు | చైనా |

# ఫ్లూజ్వరం

జలుబు దగ్గు ఒళ్ళు నొప్పులతో వచ్చే జ్వరాన్ని ఫ్లూ జ్వరమంటారు ఇది వైరస్ ఇన్ఫెక్షన్ ఈ జ్వరం తగ్గిపోయిన తరవాత నీరసం చాలా ఎక్కువ మానసికంగా కుంగిపోతారు కళ్ళు తిరుగుతుంటాయి ఆసియా వైరస్‌వల్ల వచ్చే ఫ్లూ చాలా ప్రమాదకరమైందిగా గుర్తించారు దీనిని వైట్‌ప్లేగ్ అని కూడా పిలుస్తారు

ఫ్లూ జ్వరం సాధారణంగా 3 4 రోజులలో తగ్గిపోతుంది ఈ జ్వరం అందరిలో ఒకేరకంగా వుండదు ఈ జ్వరంవల్ల నీరసపడ్డ రోగి బాక్టీరియా క్రిములదాడికి లొంగిపోతాడు ఒక్కొక్కసారి నిమోనియా జ్వరం పట్టుకుంటుంది ఇది ముఖ్యంగా వృద్ధుల్లో కన్పించే లక్షణం

ఫ్లూ జ్వరం రోగులకు కూడా మామూలు జ్వరాలు వచ్చిన రోగులకు తీసుకునే జాగ్రత్తలే తీసుకోవాల్సి వుంటుంది రోగి పరుండే గది మరీ చల్లగాగాని మరీ వెచ్చగాగాని వుండకూడదు ద్రవపదార్థాలే ఎక్కువగా వాడాలి

19 7- 8 సంవత్సరంలో ఈ జ్వరం ఒకేసారి కొన్ని కోట్ల మందికి వచ్చింది ఆ సమయంలో అల్లోపతి వైద్యంకన్నా హోమియో వైద్యం ఘనవిజయాలు సాధించినట్లు ప్రభుత్వ రికార్డులలో నమోదైన విషయమే. హోమియో చికిత్స పొందిన రోగులు చాలా తక్కువమంది మరణించారు

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| ఫ్లూ జ్వరానికి ప్రత్యేకమైన మందు ఫ్లూ జ్వరం వచ్చిందని ఏపాటి అనుమానమొచ్చినా లక్షణాలు స్పష్టంగా ఇంకా బయటికి రాకపోయినా ఈ మందు వాడి వ్యాధి | జెల్సిమియం |

తీవ్రతను అరికట్టవచ్చు రోగి నీరసంగా వుంటాడు శరీరమంతా బరువుగా వున్నట్లనిపిస్తుంది అలిసిపోయి వుంటాడు ఎవ్వరితోనూ మాట్లాడటానికి ఇష్టపడ డు ఎటూ కదలకుండా పడుకొని వుంటాడు శక్తి లేనందువల్లనే అలా వుంటాడు కనురెప్పలు బరువెక్కి మూసుకుపోతుంటాయి రోగి మందకొడిగా కనిపిస్తాడు వెన్నులో చలి జ్వరం ఎంత ఎక్కువున్నా దప్పిక వుండదు ముక్కు కారుతుంటుంది గొంతులో మంట తల భారం నొప్పి మెడ నరాలు నొప్పి రోగిలో అలసట నీరసం ప్రస్ఫుటంగా కనిపించే లక్షణాలు

---

### బ్రయోనియా

ఈ రోగికి కోపం జాస్తి ఇతరులు తన సంగతి పట్టించుకోవడం ఇష్టముండదు పలకరించినా పలకడు తన పనులకు సంబంధించిన దిగులు విచారం ఎక్కువ మంచానికి అతుక్కుని వుంటాడు కదిలితే బాధలెక్కువ కండరాలలో కీళ్లలో నొప్పులు ఈ రోగికి తలనొప్పి ఎక్కువ కదిలితే తలనొప్పి వస్తుంది కళ్ళు తెరిచినా తలనొప్పి అంటే కొంచెం కదలిక కూడా బ్రయోనియా రోగికి బాధాకరం తలకు గట్టిగా గుడ్డ కట్టుకొని పడుకొంటాడు చల్లనిగాలి ఈ రోగికి హాయినిస్తుంది చల్లని నీళ్ళు మాటిమాటికి తాగుతుంటాడు ఎప్పుడు తాగినా గ్లాసెడు నీళ్ళు తాగుతాడు పొడి దగ్గు వుంటుంది ఈ దగ్గువల్ల కూడా బాధలు ఎక్కువౌతుంటాయి

బ్రయోనియా రోగికి మలబద్ధకం జాస్తి ఇది ఈ రోగి విశిష్టలక్షణం విరేచనం మేక పెంటికలలాగా వుంటుంది

---

### రస్టాక్స్

ఈ రోగి ప్రశాంతంగా వుండలేడు కదలకుండా పడుకొంటే కండరాలు కీళ్ళు పట్టుకుపోయి బాధపెడుతుంటాయి బాధలు తగ్గడానికి ఒళ్ళు విరుచుకుంటుంటాడు కదలిక మొదట్లో బాధలున్నా కదలసాగిన తరవాత ఈ బాధలుతగ్గిపోతాయి ఇది ఈ మందు విచిత్రలక్షణం ఈరోగిలో ఆందోళన భయం కోపం ప్రముఖంగా కనబడుతుంటాయి అధైర్యం విచారం కూడా ఎక్కువే నిద్రపట్టదు నిద్ర పట్టక పోవడానికి ముఖ్యకారణం శరీరంలో కదలికలేనప్పుడు బాధలెక్కువ కావడమే

రస్టాక్స్ రోగికి చల్లటిగాలి చలి వాతావరణం గిట్టదు తడిసినందువల్ల ఈ రోగికి బాధలొస్తుంటాయి గది వెచ్చగా వుండాలి కాపు పెడితే బాధలు తగ్గుతాయి

అధికశ్రమవల్లా వర్షంలో తడిసినందువల్లా బాధలొస్తే ముందుగా ఈ మందు వాడుకోవలసి వుంటుంది దాహం వేస్తుంది కొద్ది కొద్దిగా నీళ్ళు తాగుతుంటాడు బ్రయోనియాలాగా ఎక్కువ నీళ్లు కావాలనడు

చెమట ఎక్కువ పెదాలు నోరు పొడారివుంటాయి గొంతు బొంగురుపోయి వుండవచ్చు. ఈ రోగిలో ఈ లక్షణాలు సామాన్యంగా కనబడుతుంటాయి రస్టాక్స్ రోగి అటూ ఇటూ కదులుతుంటాడు

---

### యుపటోరియం

ఈ రోగికి శరీరమంతా నలగగొట్టినట్టు నొప్పి కండరాలకన్న లోతుగానున్న ఎముకలు కూడా నొప్పి పెట్టడం ఈ రోగి విచిత్ర లక్షణం

శరీరమంతా బాధలకన్న వీపులో బాధ విపరీతం నడుం విరిగినట్లు అనిపిస్తుంది ముక్కు కారుతుండటం తుమ్ములు కళ్ళు ఎర్రబడటం ఫ్లూ జ్వరం వచ్చేముందు కనబడవచ్చు. ఇవి ఈ రోగి ప్రత్యేక లక్షణాలు ఉదయం 7 నుంచి 9 గంటల వరకు ఈ రోగికి చలి ఎక్కువ ఈ రోగికి దాహం ఎక్కువ ఐస్‌నీళ్ళు కావాలని కోరుతుంటాడు పొడిదగ్గు వచ్చి శరీరమంతా కదలబారుతుంది

---

ఫ్లూ జ్వరానికి ఎకొనైట్ బెల్లడోనా ఆర్స్ఆల్బ్ నక్స్‌వామికా వల్సటిల్లా కూడా రోగి లక్షణాలనుబట్టి ఆలోచించవలసిన మందులే

6 మాసాలలోపు పిల్లలకు ఫ్లూ వస్తే వైద్యుని సంప్రదించవలసి వుంటుంది చిన్నపిల్లల్లో ఒకరోజుకన్నా ఎక్కువ ఈ జ్వరం వున్నా పెద్దలలో 3 రోజులకు మించివున్నా వైద్యుని సలహా పొందటం ఉచితం

# జలుబు

జలుబు వైరస్ క్రిములవల్ల వస్తుంది ఒకేరకమైన వైరస్‌వల్లకాక అనేకరకాల వైరస్‌వల్ల జలుబు పట్టుకొంటుంది జలుబుకు చికిత్స సంప్రదాయవైద్యంలో లేదు శ్వాసావయవాల వ్యాధి నిరోధకశక్తికి దోహదకారి అయిన ఇంటర్‌ఫెరాన్ అనే రసాయనిక పదార్థాన్ని పెంపుచేసే మందు అవసరాన్ని ఇటీవలనే గుర్తించారు వ్యాధి నిరోధించడానికిగాని నివారించడానికిగాని జీవశక్తిని ఉత్తేజపరచడం అవసరమన్న హోమియో వైద్య సిద్ధాంతాన్ని ఈ ఆలోచన బలపరుస్తున్నది జ్వరంలాగానే జలుబు తుమ్ములు శరీర స్వియరక్షణకి ఉపయోగపడే దేహప్రక్రియలుగా అవగాహన చేసుకోవలసి ఉంటుంది జలుబు తుమ్ములను అణచివేసే మందులను వాడుకోగూడదు జలుబును అణచివేసే నేసల్ స్ప్రే లాంటి మందులు మంచివికావు

జలుబు అంటువ్యాధి జలుబు చేసిన వ్యక్తి తుమ్మితే సుమారు 6 గజాల దూరానవున్న వ్యక్తులకుకూడా అంటుకొంటుంది జలుబు చేసిన వ్యక్తులు వాడిన తుండుగుడ్డలద్వారా ఇతరులకు సోకుతుంది శీతాకాలం ఈ బాధ ఎక్కువ

కొన్ని ఋతువులలో ముఖ్యంగా వేసవిలో కొన్నిరకాల పూలపుప్పొడి గిట్టనందువలన కొందరికి ధూళి రసాయనాల వాసనలు పడనందువల్ల జలుబును పోలిన హేఫీవర్ వస్తుంది ముక్కులవెంబడి నీరు కళ్ళు ఎరుపెక్కి దురదలు మంటలు పెడుతుంటాయి అంగిట్లో దురద ముక్కు కళ్ళు వాచివుంటాయి గొంతు సైనస్ ఇన్ఫెక్షన్ కూడా తోడవుతుంది మామూలు జలుబుకు కారణం వైరస్ క్రిములు అయితే హేఫీవర్ ఎలర్జీ

జలుబుకు రోగి తత్వానుసారంగా చికిత్స చేయడమే ఉత్తమమైన పద్ధతి శ్వాసావయవాల బాధలకి తొలిదశలో ఎకొనైట్ బెల్లడోనా ఫెర్రంఫాస్ బాగా ఉపయోగిస్తాయి

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| పొడిగా చల్లగా ఉన్న గాలిలో తిరిగితే వచ్చే జలుబు జ్వరానికి కూడా ఇది ప్రత్యేకమైన మందు చలికాలంలో ఇది తప్పక ఆలోచించాలి పులకరం జ్వరం ముక్కులు బిగుసుకుపోతాయి ముక్కులవెంట నీళ్లు కారకపోవచ్చు. గదిలోకి గాలి వస్తుంటే హాయిగా ఉంటుంది | ఎకొనైట్ |
| ఈ రోగికి త్వరగా జలుబు పట్టుకొంటుంది తలనొప్పి తీవ్రమైన జ్వరం కన్పిస్తాయి ముక్కుపుటాలు వెచ్చగా ఉంటాయి పలచని నీరు కారుతుంటుంది గొంతునొప్పి తుమ్ములు ఎక్కువ దగ్గు ఖంగుఖంగుమనే పొడి దగ్గు నిద్ర సరిగా పట్టదు<br>బెల్లడోనా ఇచ్చిన తరువాత బాధలు తగ్గకపోతే వాడదగిన మందు ఫెర్రంఫాస్ ఎకొనైట్ వాడిన తరువాత బాధలు మిగిలిపోయినా ఫెర్రంఫాస్ వాడుకోవచ్చు ముక్కులవెంబడి నీళ్లు కారుతూ ముక్కులు బిగేసి బాధపడేవారికి ఆలోచించదగ్గ మందులు ఆర్సెనికం ఆల్బ్ లైకోపోడియం | బెల్లడోనా |
| జలుబు ముక్కులవెంబడి నీళ్లలా కారుతుంది ముక్కుపుటాలు పై పెదవి కందివుంటాయి ముక్కులు విపరీతంగా కారుతున్నా బిగుసుకుపోయి ఉంటాయి ఇది విచిత్ర లక్షణం బయట గాలిలోకి పోతే బాధలెక్కువవుతాయి తుమ్ములు నుదురంతా నొప్పి కళ్ళు వెలుతురు చూడలేవు తుమ్మినకొద్దీ ముక్కుల్లో జల ఎక్కువ చలికాలంలో వచ్చే జలుబుకు ఆర్స్ ఆల్బ్ ప్రత్యేకమైన మందు ఆర్స్ | ఆర్సెనికం ఆల్బ్ |

ఆల్సో రోగికి భయం ఆందోళన జాస్తి

ఈ సందర్భంలో మెర్క్సెల్ కూడా గుర్తుంచుకోదగిందె

| | |
|---|---|
| జలుబు నీళ్లలాగా కాకుండా చిక్కగా కారుతుంటుంది తుమ్ములు తెరలుతెరలుగా రావచ్చు ఈ రోగులకు వాసన రుచి తెలియవు జ్వరం పెదాలమీద పొక్కులు కన్పిస్తే ఇది ప్రత్యేకమైన మందు వీరు విచారంగా దిగులుగా ఉంటారు వారి జోలికి పోకుండా ఉంటే మంచిది | నేట్రంమూర్ |
| ముక్కులు మండుతూ కళ్లవెంట నీళ్ళు కారుతుంటాయి ఉల్లిపాయలు తరిగేటప్పుడు ఎదురయ్యే అనుభవం ఈ జలుబును గుర్తుచేస్తుంది పొడిదగ్గు గొంతు నొప్పి ఉండవచ్చు | ఎలియంసెపా |
| ఎలియంసెపా లక్షణాలకు విరుద్ధమైన లక్షణాలుగల జలుబు కళ్లమంటలు నీళ్ళు కారుతుంటాయి ముక్కులవెంట నీళ్ళు కారుతుంటాయి కాని ముక్కులు మండవు దగ్గు కళ్ళె ఎక్కువగా వస్తుంది పగలు దగ్గుతుంటారు రాత్రి పడుకొన్నతరువాత దగ్గు వుండదు | యుఫ్రేజియా |
| జలుబు ముదిరిన తరువాత ఇది మంచి మందు బయట గాలిలోకి పోయినప్పుడు ముక్కు కారుతుంటుంది గదిలో ఉన్నప్పుడు ముక్కు బిగేసివుంటుంది దగ్గు పొడిగా వుండవచ్చు కళ్ళె కూడా పడుతుండొచ్చు. దగ్గుతెర వచ్చి వాంతి చేసుకోవచ్చు ఆర్సెనికంలోగూడా ఈ లక్షణం కనబడుతుంది పల్సటిల్లా రోగులది చాలా సాధుస్వభావం | పల్సటిల్లా |
| చల్లటి గాలిలో తిరిగితె వచ్చే జలుబుకు ఇది మంచిమందు ఎకోనైట్‌లో వచ్చినంత త్వరగా జలుబు రాదు ఆరంభదశలో ముక్కు బిగునుకుపోయి ఉంటుంది నీరు కారదు జలుబు ముదిరిన తర్వాత ముక్కు కారుతుంటుంది తుమ్ములెక్కువ రాత్రిళ్ళు బయటకు వెళ్ళినప్పుడు ముక్కులు దిబ్బడేస్తాయి గదిలో ఉన్నప్పుడు పగటిపూట ముక్కులు కారుతుంటాయి నక్స్ రోగి కోపిష్టి. | నక్స్‌వామికా |

# తడపర

తడపర చిన్నవయస్సులో అతిసులభంగా లంకించుకొనే అంటువ్యాధి 5 సంవత్సరాలలోపు పిల్లల్లో ఇది ఎక్కువగా కనబడుతుంది కాని ఏ వయస్సులోనైనా రావచ్చు ఒకప్పుడు ఇది ప్రమాదమైన వ్యాధి అనుకొనే వారు కాదు 875లో ఫిజీ దీవుల్లో తడవరవల్ల ఆ దీవుల్లో నివసించే లక్ష 50 వేల మందిలో 40 వేల మంది చనిపోయారు ఆ తరవాత ఈ వ్యాధి ప్రమాదకరమైనదిగా మెదడును కూడా దెబ్బకొట్టగల వ్యాధిగా గుర్తిస్తున్నారు

అభివృద్ధి చెందిన దేశాల్లో ఈ వ్యాధి నిరోధక టీకాలు పిల్లలకు తప్పనిసరిగా వేయించాలి ఈ టీకాలు వేయించనట్టి పిల్లలను పాఠశాలలకు రానివ్వరు కూడా పర్షియాకు చెందిన రేజెస్ అనే వైద్యశాస్త్రవేత్త 9వ శతాబ్దంలో తడవర మశూచిలను గూర్చిన వివరాలను శిశువైద్య గ్రంధంలో ప్రచురించాడు

రోగి తుమ్మినా దగ్గినా వెలువడే వ్యాధి కారకాలైన వైరస్‌క్రిములతో కూడి తుంపర ద్వారా వ్యాధి ఇతరులకు సంక్రమిస్తుంది రోగులు వాడుకొనే వస్తువులద్వారా జేబురుమాళ్ళద్వారా కూడా ఈ వ్యాధి వ్యాపిస్తుంది చలికాలం వసంతరుతువుల్లో ఈ వ్యాధి ఎక్కువ మందిలో కనబడుతుంటుంది ఈ వ్యాధిక్రిములు శరీరంలో ప్రవేశించిన రోజుల తరవాతగాని వ్యాధి లక్షణాలు కనబడవు వ్యాధి లక్షణాలు కనబడడానికి 4 రోజుల ముందునుంచే ఆ బిడ్డ ద్వారా ఇతరులకు వ్యాధి సంక్రమించే అవకాశాలున్నట్లు కనుక్కున్నారు వంటిమీద

దద్దువున్నన్ని రోజులు ఆ బిడ్డద్వారా ఇతరులకు ఈ వ్యాధి సంక్రమించవచ్చు.

వ్యాధి ఆరంభదశ జలుబును పోలి ఉంటుంది ముక్కు కారుతుంటుంది కొద్దిగా దగ్గు తలనొప్పి మెడలు వీపునొప్పి 4 రోజులు గడిచేసరికి జ్వరం 03 04 డిగ్రీలకు చేరుకొంటుంది ఇది రెండవదశ ఈ దశలో నోటిలో ఎర్రటి మచ్చలు దవడలలోపల ఏర్పడతాయి విటినే కోప్లిక్స్ మచ్చలంటారు ఈ మచ్చలు వ్యాధి ప్రత్యేక లక్షణం ముఖంమీద ఒంటిమీద దద్దురావడం ఆరంభిస్తుంది 36 గంటల్లో ఒళ్ళంతా దద్దు కనబడుతుంది ఒళ్ళంతా దురదలు మంటలు దద్దు కన్పించిన తరువాత రెండ రోజుల్లో జ్వరం తగ్గిపోతుంది తరవాత దద్దు నమసిపోతుంది

వైరస్ వ్యాధిగ్రస్తులకు వ్యాధి నిరోధకశక్తి పోతుంది తడవర రోగులకు కూడా ఆ కారణంగా నిమోనియా చెవిలో చీములాంటి చిక్కులు ఎదురౌతాయి ఈ వైరస్ క్రిములు మెదడుకు కూడా వ్యాపించి మెదడువాపు ఫిట్సులాంటి వ్యాధులు వచ్చే ప్రమాదముంది ఈ రోగులకు మార్బిలైనం ఎం ఉదయం ఒక డోసు సాయంకాలం ఒక డోసు ఇవ్వడం మంచిది

తడవర రోగులను తిరగనివ్వగూడదు వెలుతురు గాలి బాగా వచ్చే గదులలో ఉంచి చికిత్సచేయాలి జ్వరం ఉన్న రోజులలో ద్రవపదార్థాలను ఇస్తూ ఉండాలి

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| ఈ మందు ఏ జ్వరానికైనా ఇచ్చే ఆనవాయితీ ఉంది అల్లోపతి వైద్యంలో పెన్సిలిన్ వాడినట్లుగా ఈ మందులను వాడితే ప్రయోజనం శూన్యం ఎకోనైట్ రోగి లక్షణాలను గమనించాలి జ్వరం అకస్మాత్తుగా వస్తుంది తీవ్రత కూడా హెచ్చు. ఒళ్ళు కాలిపోతుంటుంది దప్పిక ఎక్కువ చల్లటి నీళ్ళు అడుగుతుంటారు పక్క కుదరక అటూ ఇటూ పొర్లుతుంటారు మానసిక ఆందోళన భయం అస్తిమితం ముఖం ఎర్రగాఉంటుంది ఈ లక్షణాలుగల బిడ్డకు ఎకోనైట్ 30 పొటెన్సీలో 4 గంటలకు ఒక డోసు చొప్పున ఇస్తే రెండు రోజుల్లో దద్దు బయటికి వస్తుంది జ్వరం తగ్గిపోతుంది రోగికి పై బాధలు లేకుండా పోతాయి | ఎకోనైట్ |
| కొద్దిగా పడిశం కంగు కంగుమని దగ్గు తలభారం ముఖం కందినట్లుగా కనబడు తుంది ఎప్పుడూ నిద్రపోవాలనిపిస్తుంటుంది ఎవ్వరితో మాట్లాడబుద్ధికాదు పలక రించితే విసుగు రాత్రి 9 గంటలయ్యేసరికి కలవరింతలు గది చల్లగా ఉండాలి వేడిగా ఉంటే అన్ని బాధలు ఉద్రేకిస్తాయి.వంటిమీద గుడ్డ కప్పితేతన్నిపారేస్తాడు నాలుకమీద మందపాటి కోటింగ్ దప్పిక ఎక్కువ ప్రతిసారి నీళ్ళుఎక్కువగా తాగు తుంటాడు సముద్రతీర ప్రాంతాలలో డెల్టాప్రాంతాలలో నివసించేవారి తరుణ వ్యాధులకు బ్రయోనియా వరప్రసాదం ఇది తడవరకు,జర్మన్ మీజిల్సుకుకూడా మంచి మందు 30 పొటెన్సీలో 4 గంటలకు ఒకసారి రెండుమూడు రోజులువాడితే దద్దు బయటకు వస్తుంది జ్వరం తగ్గిపోతుంది | బ్రయోనియా |
| ఇది వేసవికాలంలో వచ్చే తడవర వ్యాధికి తప్పక ఆలోచించదగిన మందు వ్యాధి నిదానంగా పరిణామం చెందుతుంటుంది ముందు చాలా రోజులపాటు ఒళ్ళంతా భారం నడవడం కూడా కష్టమనిపిస్తుంది జ్వరం కూడా హెచ్చుగా ఉండదు 30 పొటెన్సీలో 4 గంటలకు ఒకసారి రెండుమూడు రోజులు వాడవలసిఉంటుంది | జెల్సిమియం |
| డాక్టర్ కెంట్ మహాశయుడు- ఆలోచించకుండా ఆనవాయితీగా వ్యాధి వరంగా మందులు వాడేవారు కూడా తడవర వ్యాధికి పల్సటిల్లా సల్ఫర్ వాడుకుంటే | పల్సటిల్లా |

చాలంటాడు వ్యాధికి మందు చెప్పడం అసలు ఇష్టపడని వ్యక్తి డాక్టర్ కెంట్ అయితే కొంతమంది రోగులకు ఎకోనైట్ యుఫ్రేజియా మందులు వాడవలసిన అవసరం రావచ్చునె అభిప్రాయం వెలిబుచ్చాడీయన

ఈ రోగుల్లో దద్దు పేలినట్లుగా కనబడుతుంది జ్వరముంటుందిగాని దాహం ఉండదు దాహం లేకపోవటం గమనార్హమైన విషయం రోగి పక్కన ఎవరోఒకరు ఎప్పుడూ కూర్చొని ఓదారుస్తుండాలి లేకపోతే జాలిగా ఏడుపు ప్రతి 4 గంటలకు ఒకడోసు వంతున జ్వరం వెనకాడే వరకు వాడాల్సి ఉంటుంది

---

**యుఫ్రేజియా**

జలుబు తుమ్ములు ఎక్కువ కనురెప్పలు ఉబ్బిఉంటాయి కళ్ళెర్రబారి నీళ్ళు కారుతుంటాయి దగ్గు రాత్రికంటె పగలెక్కువ ఈ మందు వాడినట్లయితే తడపరవల్ల వచ్చే కంటి అల్సర్స్ లాంటివి రావు 30 పొటెన్సీలో ప్రతి నాలుగు గంటలకు ఒక డోసు వాడవలసి ఉంటుంది

---

తడపర తరవాత వచ్చె బాధలన్నింటికి మందుగా మార్బిలైనం ఆలోచించాలి ఉంటుంది

దద్దు బయటికిరాక మెదడు దెబ్బతినేటట్లయితే ఏపిస్‌మెల్లిఫికా జింకం మెటాలికం వాడాల్సి ఉంటుంది

# విరేచనాలు

అనేక కారణాలవల్ల ఈ వ్యాధి సంక్రమించవచ్చు ఇది తరుణవ్యాధిగా రావచ్చు అప్పుడప్పుడు తిరగబెట్టే దీర్ఘకాలిక వ్యాధి కావచ్చు విరేచనాలతోపాటు కడుపునొప్పి కూడా తేడుకావచ్చు. కడుపునొప్పికి కారణం ఒక్కొక్కసారి ప్రమాదకరమైన జబ్బుకావచ్చు ఈ వ్యాధి సంవత్సరంలోపు పిల్లల్లో వచ్చినా వృద్ధుల్లో వచ్చినా ప్రమాదకరమైన విషయంగా గుర్తించాలి

మనదేశంలో నూటికి 40 మంది పిల్లలే మొత్తం ఆఫ్రికా ఖండంలోని 46 దేశాల పిల్లల సంఖ్యకన్న మన పిల్లల సంఖ్య హెచ్చు నీళ్ల విరేచనాలు పిల్లలకు వచ్చే వ్యాధులలో ప్రధానమైంది ఆసుపత్రులకువచ్చే పిల్లల కేసుల్లో నూటికి 30 కేసులు డయేరియాకు సంబంధించినవే ఈ వ్యాధిలో స్రావాలు ఎక్కువగా పోతాయి గనుక మరణానికి దారితీయవచ్చు ఈ వ్యాధితో రోజుకు 2500 మంది పిల్లలు చనిపోతున్నారని ఒక అంచనా

డయేరియాకి కలుషిత ఆహారం బాక్టీరియా వైరస్ క్రిములు కారణమని గుర్తించారు తరుణవ్యాధిగా వచ్చే డయేరియాలో మల పరీక్షలద్వారా క్రిములను గుర్తించి యాంటీబయాటిక్స్ వాడుతుండే వారు

గత పదిసంవత్సరాలలో ప్రపంచ ఆరోగ్య సంస్థ డబ్ల్యు హెచ్ ఒ పరిశోధనలు వ్యాధి అవగాహనకు సంబంధించి నూతన దృక్పథానికి దారితీశాయి ఏ మందులూ అవసరంలేకుండా ఉప్పు గ్లూకోజ్ నీటిలో కరిగించి ఆ ద్రావణాన్ని ఇచ్చి డయేరియాను నయంచేసే కొత్తప్రక్రియను అమలులోకి తెచ్చారు

ప్రపంచ ఆరోగ్యసంస్థ పిల్లల డయేరియాకి కారణమని భావించే 26 రకాల బాక్టీరియా వైరస్ క్రిములను పరిగణనలోకి తీసుకోలేదు చిన్నపేగులకు గల ప్రత్యేక వ్యాధినిరోధక శక్తి తగ్గిపోవడమే వ్యాధికి కారణంగా అభిప్రాయపడ్డారు వ్యాధి నిరోధక శక్తి తగ్గిపోవడంతో మామూలుగా చిన్నపేగుల ద్వారా స్వీకరించే లవణాలను సుగర్లను శరీరం స్వీకరించలేకపోతున్నది ఇదే విరేచనాలకు కారణం నోటిద్వారా సోడియం లవణం గ్లూకోజు నీటినిచ్చి దేహానికి సహజమైన వ్యాధి నిరోధకశక్తిని పెంచి విరేచనాలను నివారించగలుగుతున్నారు ఇది సులభమైన పద్ధతి ఈ పది సంవత్సరాలలో ఈ పద్ధతి ప్రచారంలోకి వచ్చాక ఆసుపత్రికి వచ్చేడయేరియా కేసులు బాగా తగ్గిపోయాయి

వ్యాధులకు కారణం క్రిములు కాదు సహజమైన వ్యాధినిరోధకశక్తి తగ్గి జీవతత్వం లొంగిపోవటమే వ్యాధికి మూలకారణమని రెండు శతాబ్దాల క్రితమే హానిమన్ సిద్ధాంతీకరించి హోమియోవైద్యాన్ని ప్రవేశపెట్టారు ప్రపంచ ఆరోగ్యసంస్థ పరిశోధనల ఫలితాలు హానిమన్ భావాన్నే సమర్థిస్తున్నాయి

ప్రపంచ ఆరోగ్య సంస్థ సిఫార్సుచేసిన ద్రావణాన్ని ఈ కింది విధంగా తయారుచేసుకోవచ్చు. ఒక లీటరు నీటిలో 4 చెంచాల గ్లూకోజు ఒక చెంచా ఉప్పు కలిపి కరిగించాలి రోగి బరువు ఆధారంగా ఈ ద్రావణం ఎంత ఇవ్వాలో నిర్ణయించారు ప్రతి కిలోగ్రాము బరువుకు 50 మి.లీ వంతున రోజు మొత్తంమీద తాగించాలి

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| వాంతులు విరేచనాలు అవుతుంటాయి బిడ్డత్వరగా పీక్కుపోతుంది కాళ్ళు చల్లబడిపోతాయి ముఖం పీక్కుపోయివుంటుంది చర్మం ముడతలు ముడతలు పడివుంటుంది రోగిలో అస్తిమితం విపరీతం ఐస్‌క్రీమ్ లాంటివి తిన్న తరువాత అయ్యే వాంతులు విరేచనాలకు ఇది ప్రత్యేకమైన మందు రోగి ముడుచుకొని పడుకునివుంటాడు | ఆర్సెనికం ఆల్బ్ |
| పాలు గిట్టక విరేచనాలు పట్టుకుంటే ఈ మందు ఉపయోగపడుతుంది రోగి ముఖంలో బాధ ఆందోళన స్పష్టంగా కన్పిస్తుంటాయి పాలు తాగిన వెంటనే ఇముడ్చుకోలేక కక్కుతుంటారు పసరు విరేచనాలు ఆర్సెనికం ఆల్బ్ రోగిలాగా ముడుచుకొని పడుకుంటాడుగాని ఆ రోగిలో కన్పించే అశాంతి ఈ రోగికుండదు రోగం ముదిరి అవసానదశ దాపురించిందా అన్న సమయంలో ఆర్స్ ఆల్బ్, ఎథూజాలు చాలా ఉపయోగకరమైనవి<br>ఈ రోగిలో అన్ని లక్షణాలు తీవ్రస్థాయిలో కన్పిస్తాయి వాంతులు తీవ్రంగా వుంటాయి విరేచనాలు విపరీతం ఫిట్స్‌కూడా రావచ్చు. తీవ్రత ఈ మందు ప్రత్యేకత | ఎథూజా |
| పెద్దపెద్ద విరేచనాలవుతుంటాయి దుర్వాసన. కొంచమేతిన్నా పెద్దవిరేచనమవుతుంది ఈ రోగి నీటికోసం తహతహలాడతాడు కాని ఆహారాన్ని దగ్గరకు రానీయడు పొట్టలో గుడగుడ శబ్దాలు విన్పిస్తాయి నిద్రపోయే సమయంలో తలలో ఎక్కువగా చెమటలు వాంతులు కాపు ధోకులు ఎక్కువ నురుసునురుసుగా వాంతులవుతుంటాయి తిన్న ఆహారం కూడా వెళ్ళిపోతుంటుంది విరేచనాలు ఉదయంపూట ఎక్కువ పళ్ళువచ్చే సమయంలో అయ్యే విరేచనాలకు ఈ మందు మంచిది ముడ్డిపేగు జారిపోతుంది పలచగా విరేచనాలయ్యేటప్పుడు ముడ్డిపేగు జారితే ఇది ఇవ్వవచ్చు. | పోడోఫైలం |
| విరేచనం కాబోయేముందు పొట్టలో నులినొప్పి, అన్నం తిన్నతరవాత నొప్పి తెరలుతెరలుగా వస్తుంది నొప్పి వున్నప్పుడు కాళ్ళు పొట్టలో ముడుచుకొని అదిమిపెట్టి పడుకొంటే ఉపశాంతి వుంటుంది పొట్టమీద వత్తినా నొప్పి సర్దుకుంటుంది<br>విరేచనాలు నురుసు నురుసుగా అవుతాయి మొదట నీళ్ళుగా మొదలయి తరవాత పసరు రక్తంకూడా పడుతుంది పోడోఫైలం రోగిలోలాగా పెద్దపెద్ద విరేచనాలు కావు | కొలోసింథ్ |
| ఏదైనా తిన్నా తాగినా వెంటనే విరేచనం అవుతుంది దొడ్డికి వస్తే ఆపుకోలేరు పొట్టలో గడబిడలు పేగులు అరుస్తుంటాయి విరేచనం పిచికారి కొట్టినట్టు వేగంగా అవుతుంది నీరు అపానవాయువు ఉండలుండలుగా మలం కలిసి | యాలో |

విరేచనాలు కావటం ఈ మందు ప్రత్యేక లక్షణం వేసవిలో విరేచనాలకు పీతలు తెన్న తరవాత బీరుతాగితే అయ్యే విరేచనాలకు ఇది మంచి మందు

---

# రక్తవిరేచనాలు

విరేచనాల కేసుల్లో నూటికి 20 కేసులు రక్త విరేచనాలకు సంబంధించినవే ఇది పెద్దపేగుల్లో ఇన్ఫెక్షన్‌వల్ల వస్తుంది ఆహారం తాగేనీటిద్వారా ఇన్ఫెక్షన్ సంక్రమిస్తుంది ఉష్ణదేశాల్లో ముఖ్యంగా ఇండియా చైనాల్లో ఈ కేసులెక్కువని వెల్లడైన విషయం ఇంగ్లండ్ అమెరికా వంటి అభివృద్ధి చెందిన దేశాల్లో కూడా నూటికి 0 మందికిపైగా ఈ వ్యాధికి లోనవుతున్నారు

మనశరీరంలో పెద్దపేగులు 6 అడుగుల పొడవుంటాయి ఈ పేగుల జిగురు పొరల్లో ఇన్ఫెక్షన్‌వలన రక్త విరేచనాలు పట్టుకుంటాయి చిన్నపేగులకుండే ప్రత్యేక ఇమ్యూనిటీ పెద్దపేగులకు లేదన్న విషయం గమనార్హం అందువల్ల ఇన్ఫెక్షన్‌కు గురయినప్పుడు పెద్దపేగుల్లో అల్సర్లు వస్తుంటాయి కాని చిన్నపేగుల్లో రావు దెహరక్షణ వ్యూహంలో ఈ తెడా జీవతత్వ వధకంగా అర్థం చేసుకోవాలి

రక్త విరేచనాలకు కారణమయ్యే క్రిముల ముఖ్యంగా రెండు రకాలు ఒకటి బాక్టీరియా రెండు ఎమీబా బాక్టీరియా క్రిములతో వచ్చే విరేచనాలను బాసిలరీ డిసెంటరీ అంటారు ఎమీబావల్ల వస్తే ఎమీబిక్ డిసెంటరీ అని అంటారు ఎమీబా పెద్దపెగులనే కాకుండా మెదడు కాలేయం ఊపిరితిత్తులను గూడా దెబ్బకొడుతుంది గనుక ఎమీబిక్ డిసెంటరీ అనిగాక ఎమీబియాసిస్ అని పిలుస్తారు ఈ పేరే ఉచితమైనది

పరిసరాలు శుభ్రంగా లేకపోవడం పరిశుభ్రమైన అలవాట్లు లేకపోవడం ఈ వ్యాధి సంక్రమించడానికి దోహదం చేస్తాయి మలంద్వారా కలుషితమైన నీటివల్ల మలంమీద వాలిన ఈగలు ఆహారం మీద వాలడం వల్ల రక్త విరేచనాలు పట్టుకుంటాయి

కొంతమందిలో క్రిములు చోటుచేసుకున్నా వారికే బాధలూ ఉండవు కాని వారిద్వారా ఇతరులకు క్రిములు వ్యాపిస్తుంటాయి వీరిని క్యారీయర్లు అంటారు ఈ వ్యక్తులె సమాజానికి చాలా ప్రమాదకరమైనవారు వ్యాధి రావడానికి క్రిములకన్నా శరీర అంతర్గత వరిస్థితే ఎక్కువ పాత్ర వహిస్తుందని చెప్పడానికి ఈ క్యారీయర్సే నిదర్శనం

ఎమీబా పెద్దపేగుల్లో స్థావరం ఏర్పరచుకొని చుట్టూ గూడు ఏర్పాటుచేసుకొని పదిలంగా జీవిస్తుంది గూడు నిర్మించుకొన్న ఎమీబాలను సిస్టులంటారు ఈ సిస్టులు మలంద్వారా విసర్జించబడినా బయట శీతోష్ణ పరిస్థితులను తట్టుకొని కొన్ని వారాలపాటు బతకగలుగుతాయి ఈ సిస్టులు నీరు ఆహారం ద్వారా ఇతరులకు సంక్రమించి రక్త విరేచనాలను కలుగజేస్తాయి

రక్త విరేచనాలను కల్గించే బాక్టీరియాను షిగెల్లా బాసిలస్ అని పిలుస్తారు జపాన్ శాస్త్రజ్ఞుడు కియోషీషీగా గౌరవార్థం వాటికాపేరు పెట్టారు 870 లో జర్మన్ శాస్త్రజ్ఞుడు పాల్ ఎహర్లిక్‌తో కలిసి ఈయన ఈ బాక్టీరియాను కనుగొన్నారు

రక్త విరేచనాలు వచ్చిన రోగులకు 3 4 నుంచి 20 దాకా అవ్వచ్చు పిల్లల్లో అయితే చాలా ఎక్కువగా అవుతుంటాయి విరేచనాలు వలచగా నీళ్లమాదిరిగా అవుతూ రక్తం జిగురు చీము పడుతుంటుంది కడుపునొప్పి తోడవుతుంది విరేచనం వస్తే ఆపుకోలేరు త్వరత్వరగా దొడ్డికిపోవలసిందే వాంతులు కూడా వుండొచ్చు అపానవాయువులు ఎక్కువ రోగి పొట్టమీద చేయిపెట్టితే నొప్పి అంటాడు పిల్లల్లో విరేచనాలతోపాటు జ్వరం మండిపోతుంటుంది ఆకలి మందగిస్తుంది రోగి చిరాకుగా విసుగుగా ఉంటాడు ఈ లక్షణాలన్నీ ఒక్క రోగిలోనే వుండవు అందరు రోగుల్లో ఒకేస్థాయిలో కూడా వుండవు అందుకే వైద్యం క్రిములకు గాకుండా లక్షణాల ఆధారంగా రోగులను వ్యక్తీకరించి వారికి వైద్యం చేయడం అవసరం బాసిలరీ డిసెంటరీలాగా కాకుండా ఎమీబియాసిస్ ఒకపట్టాన లొంగదు ఎమీబియాసిస్ దీర్ఘకాలిక రోగంగా తరచు తిరగబెడుతుంది

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| రక్త విరేచనాలకి ఇది ప్రత్యేకమైన మందుగా చెప్పుకోవచ్చు. జిగురు రక్తంతో కూడుకొన్న వసరు రంగు విరేచనాలవుతుంటాయి ముడ్డి విపరీతమైన తీపు మాటిమాటికి దొడ్డికి వెళ్లాల్సి వస్తుంది మలం తక్కువ బంక పడుతుంటుంది అనసంలో మంట అర్ధరాత్రయ్యేటప్పటికి బాధలెక్కువ రోగి కదలకుండా ప్రశాంతంగా పడుకొని వుంటాడు ఈ లక్షణం గమనార్హం విరేచనాలు మరీ ఎక్కువగా అవుతుంటే మందు గంటగంటకు ఇవ్వవచ్చు. మామూలుగా అయితే 3 4 గంటలకు ఒక డోసు చొప్పున వాడితే సరిపోతుంది | మెర్క్‌కార్ |
| శరీర కష్టం లేకుండా మానసిక శ్రమచేసే వారికి సరిపోయే మందు అజీర్తి వ్యాధితో బాధపడుతుంటారు మాటిమాటికి కాఫీ టీలు మత్తుపదార్థాలు కావాలి ఊరకనే ఉద్రేకపడిపోతారు<br><br>రక్త విరేచనాలు చిన్న చిన్న ఉండలుగా మలం జిగురుతోపడుతుంటుంది విరేచనం పూర్తిగా అయినట్టుండదు లోపల మిగిలిపోయినట్లుంటుంది ముడ్డి బాగా తీపు పెడుతుంది విరేచనం అయిన కొంచెం సేపు బాగుంటుంది కాని తరువాత మామూలే నాలుకమీద మందం బాగా పట్టివుంటుంది వసువు వచ్చగా వుంటుంది | నక్స్‌వామికా |
| దుర్వాసనతో గూడిన రక్త విరేచనాలు ఒక్కొక్కసారి ఆకుపచ్చగా ఏపరగా కూడా విరేచనాలు కావచ్చు. మలం చాలా తక్కువ పొట్ట వుబ్బరం జాస్తి విరేచనం అయిన తరువాత ముడ్డి మండుతుంది దాహం ఎక్కువ కొద్దికొద్దిగా నీళ్లు ఎక్కువసార్లు తాగుతుంటారు జీవితంపట్ల నిరాశ దొడ్డికివెళ్లి వచ్చిన తరువాత విపరీతమైన నీరసం ఒకచోట కదలకుండా వుండలేడు నీరసం దాహం ఈ రోగినిపట్టించే విచిత్ర లక్షణాలు | ఆర్సెనికం ఆల్బ్ |
| జిగట విరేచనాలు జిగురు ముద్దలు ముద్దలుగా పడుతుంటుంది దొడ్డికి వచ్చినట్లుండి రాత్రిపూట అనేకసార్లు లేవవలసి ఉంటుంది విరేచనానికి ఉదయాన్నే లేవగానే పరుగెత్తాల్సి వుంటుంది ముక్కిన తరవాత రక్త విరేచనం అవుతుంటుంది అపానవాయువుతోపాటు విరేచనం అయిపోతుంటుంది మూత్రం పోసుకునేటప్పుడు కూడా విరేచనం గావచ్చు. ఇది ఈ మందు విశిష్టలక్షణం విరేచనం కాబోయేముందు పొట్టలో గడబిడగా వుంటుంది విరేచనం ఒంటేలు కూడా ఒక్కసారి వస్తాయి ఆహారం తిన్న వెంటనే విరేచనానికి పోవాలి విరేచనానికి వెళ్లితే అపానవాయువే పోవచ్చు. | యాలో |
| జిగురుతో కూడిన వసువువచ్చని విరేచనాలు రక్తం కలిసి వుండొచ్చు, లేకపోవచ్చు. తెరలుతెరలుగా పొట్టలో మెలిపెట్టినట్టు నొప్పి, వాంతి అయ్యేట్టుగా వికారం పొట్ట ఉబ్బరం పొట్టనొప్పి, విరేచనం అయితే తగ్గిపోతుంది కాళ్లు పొట్టకానించి పడుకొన్నా తగ్గిపోతుంది ఇది కాలోసింథ్ రోగిలో ప్రధాన లక్షణం తిన్న తరువాత తాగిన తరువాత నొప్పి వచ్చి తప్పక విరేచనం అవుతుంది రక్త విరేచనాల రోగికి మెర్క్‌కార్ తరవాత ఇది చెప్పుకోదగినది | కాలోసింథ్ |
| ఇది తరుణ రోగులకీ దీర్ఘరోగులకీ మొండికేసులకి వాడుకోదగిన మందు ఈ రోగికి పాలువడపు వేకువజామున విరేచనాలెక్కువ అవుతుంటాయి విరేచనం వచ్చి రోగి నిద్రలేచి దొడ్డికిపోవాలి | సల్ఫర్ |

# కలరా

కలరాను చాలా తీవ్రమైన అంటువ్యాధిగా పరిగణిస్తారు ఇది అకస్మాత్తుగా సంక్రమిస్తుంది ప్రాణాంతకమైన వ్యాధి ఇంగ్లండ్ ఐరోపా అమెరికా దేశాలలో లభ్యమైన వివరాలు పరిశీలిస్తే అల్లోపతి వైద్యవిధానం ద్వారా చికిత్స పొందిన కలరా రోగుల్లో నూటికి 40 మంది మరణిస్తే హోమియో చికిత్స చేయించుకొన్న వారిలో నూటికి 9 మందే మరణించారు డాక్టర్ మాక్లొగ్లిన్ అనే ఇంగ్లండ్ వైద్య ప్రముఖుడు తనకు హోమియో వైద్యంపట్ల నమ్మకం లేకపోయినా తనకు కలరా వ్యాధి సంక్రమిస్తే మాత్రం హోమియో వైద్యం మాత్రమే చేయించు కుంటానని రాసిన ఉత్తరం బ్రిటిష్ పార్లమెంటు రికార్డులలో నమోదైవున్న విషయమే 836వ సంవత్సరం వరకు ఆస్ట్రియా దేశంలో హోమియో వైద్యచికిత్స చట్టరీత్యా నిషిద్ధంగా వుండేది ఆ సంవత్సరంలో కలరా వ్యాధి సోకి ఈ వైద్యం ద్వారా చికిత్స పొందినవారు (అల్లోపతి వైద్య విధానం ద్వారా చికిత్స పొందినవారికన్న) చాలా తక్కువ మంది మరణించడంతో చట్టాన్ని మార్పుచేసి ఆ సంవత్సరంనుంచే హోమియో వైద్యవిధానా న్ని ప్రోత్సహించడం మొదలుపెట్టారు రష్యా ఇటలీ ఫ్రాన్స్ దేశాల్లో కూడా కలరా అంటువ్యాధి చికిత్సలో హోమియో వైద్యం ఘనవిజయాలే సాధించింది ఆయా దేశాల ప్రభుత్వాల ప్రజల అభిమానం ఆదరణ ఈ వైద్య విధానానికి లభించాయి

హోమియో వైద్య విధానంలో వ్యాధులు ముదిరి ఫలానా వ్యాధి అని గుర్తించగల దశకుముందే నివారించగల అవకాశముంది హానిమన్ జీవించివున్న రోజుల్లో ఐరోపాలో పెద్దఎత్తున కలరా వ్యాపించింది హానిమన్ ఈ వ్యాధిని తానుగా ఎప్పుడూ చూచి వుండకపోయినా వ్యాధి లక్షణాలను ఆధారం చేసుకొని వ్యాధి ఆరంభదశలో కాంఫర్ వాడితే 5 నిమిషాల్లో నివారించవచ్చునని ప్రకటించారు కాంఫర్ వాడిన తరువాత 5 నిమిషాలలో రోగ నివారణకానట్లయితే అది వ్యాధి రెండవ దశగా పరిగణించి క్యూప్రంమెట్ వాడవలసి వుంటుందని సలహా ఇచ్చారు క్యూప్రంమెట్ రాగిలోహం నుంచి తయారుచేసే ఔషధం అనాదిగా మన దేశంలో రాగి పాత్రల వాడకం శ్రేష్ఠమని రాగి చెంబులో నీరు పెట్టుకొని తాగుతుంటారు నీటిలో కలరా క్రిములులాంటివివున్నా రాగి పాత్రలో నిల్వ ఉంచుకొని తాగితే కలరా ప్రమాదంలేదన్న విషయం గమనార్హం హంగరీలో రాగి గనుల్లో పనిచేసే కార్మికులకు కలరా ప్రమాదం లేదని హానిమన్ రాశారు ఓడల్లో రాగి పాత్రలలో వంటచేసి పెడుతుంటే ఓడ ప్రయాణికులకు కలరా ప్రమాదం ఉండదని అందరికీ తెలిసిన విషయమే

కలరా నివారణకు హానిమన్ ప్రవేశపెట్టిన మూడవ ఔషధం వెరాట్రం ఆల్బ్. మూడవదశలో కలరా రోగులకు విపరీతమైన వాంతులు విపరీతంగా విరేచనాలు విపరీతంగా చల్లగావుండే చెమటలు నుదుటిమీద చల్లని చెమటలు ఈ మందు ప్రత్యేక లక్షణం

కలరా రక్తవిరేచనాలు టైఫాయిడ్ ఈ మూడు వ్యాధులూ కలుషితమైన నీటిద్వారా వస్తాయి ఇది మనదేశంలో చాలా ఎక్కువ తూర్పునుండి పశ్చిమానికి వ్యాపించిన వ్యాధికనుక దీనిని ఏషియన్ కలరా అని కూడా వ్యవహరిస్తారు

కలరా వ్యాప్తిలో ఈగల పాత్ర అనల్పం కలరా విబ్రియో అనే సూక్ష్మజీవులు కలరాకు మూలకారణం కలరా రోగుల మలంపై వాలిన ఈగలు ఆహారపదార్థాలపై వాలి ఆ పదార్థాలను కలుషితం చేస్తాయి ఈ కలుషిత ఆహార పదార్థాలు తిన్నవారికి ఈ వ్యాధి సంక్రమిస్తుంది కలరావున్న రోజుల్లో పరిసరాలను పరిశుభ్రంగా వుంచుకొని ఈగలు రాకుండా తినే పదార్థాలపై వాలకుండా చూసుకోవాలి నీళ్లు కాచుకొని తాగడం మంచిది శరీరంలో కలరా క్రిములు ప్రవేశించినా కలరా రానివారున్నారు వీరిని క్యారియర్స్ అంటారు వీరిద్వారా కలరా వ్యాపించే ప్రమాదం మాత్రం వుంది

కలరా క్రిములు సోకిన తరువాత నుండి 5 రోజులలోపుగా ఈ వ్యాధి లక్షణాలు బయటపడతాయి వ్యాధి ఆరంభంలో రోగికి తలనొప్పి, పొట్టలో నొప్పి, వాంతులు వుంటాయి ఆకలి మందగిస్తుంది విరేచనాలు దప్పిక నడుంలో నొప్పులు పిక్కలలోని కండరాలు అదురుతుంటాయి ఈ దశలో నాడి నిమిషానికి 40 50

సార్లు కొట్టుకుంటుంది రోగి ఒంటిమీద చేయివేస్తే చల్లగా ఉంటుంది కళ్లు పీక్కొని పోయినట్లుంటాయి పొట్టలో మంటలు ఇది కలరారోగి ప్రాథమిక దశ ఈ దశలో కాంఫర్ వాడాలి కాంఫర్ మదర్ టించరు ఒకచుక్క ఒక చెంచా పంచదారమీద వేసిఇవ్వాలి ప్రతి 5 నిమిషాలకు ఒకసారి రోగి వంట్లో వేడి పుట్టేవరకు ఇస్తే కలరా ఈ దశలోనే నివారణ అవుతుంది

ప్రథమ దశ దాటిన తరువాత రోగికి వాంతులు బియ్యం కడిగిన నీళ్లలాంటి విరేచనాలు మొదలవు తాయి ఒళ్ళు చల్లబడిపోతుంది రక్తపోటు పడిపోతుంది దప్పిక జాస్తి ఉచ్ఛ్వాసనిశ్వాసాల వేగం పెరుగుతుంది నాడి చేతికందదు కాళ్ల పిక్కలు విపరీతంగా పీకుతుంటాయి వాంతులూ విరేచనాలవుతూ కాళ్ళపిక్కలు విపరీతంగా లాక్కుపోతుంటే క్యూప్రంమెటాలికం 0 ఎం పొటెన్సీలో 2 గంటలకు ఒక డోసు రోగి స్థితి కొంత మెరుగైన తరువాత 4 గంటలకు ఒక డోసు చొప్పున వాడవలసి వుంటుంది రోగిలో చల్లదనం తగ్గి పోయి బాధలు వెనకాడే వరకు ఈ విధంగా చేయాలి

విపరీతంగా వాంతులూ విరేచనాలూ అవుతూ నుదుటిమీద చల్లని చెమటలు కనబడే దశలో వాడవలసిన మందు వెరాట్రం ఆల్బ్ ఇది క్యూప్రంమెటాలికం వాడిన విధంగానే వాడవలసి వుంటుంది

కలరా రోజులలో గంధకాన్ని వారానికి రెండుసార్లు పాదాలకి పూసుకుంటే వ్యాధి నిరోధకంగా పనిచేస్తుంది

# కోరింత దగ్గు

ఇది బాక్టీరియా క్రిముల ద్వారా సంక్రమిస్తుంది అత్యధిక శిశుమరణాలకు ఇది కారణంగా పేర్కొంటున్నారు మీజిల్స్ డిఫ్తీరియా వ్యాధులతో పోలిస్తే దీనివల్ల వాటికన్న రెండింతలు ఎక్కువ శిశుమరణాలు సంభవిస్తున్న ట్లు ఒక అంచనా ఇది 4 ఏళ్లలోపు పిల్లల్లో ఎక్కువగా కన్పిస్తుంది నూటికి 50 కేసులు 2 సంవత్సరాలలోపల వచ్చేవే జబ్బుతోవున్న పిల్లలు దగ్గినప్పుడు వెలువడే తుంపర్లద్వారా క్రిములు ఇతరులను ఆశ్రయిస్తాయి క్రిములు శరీరంలో ప్రవేశించిన తరువాత వ్యాధి లక్షణాలు ఒకటి రెండు వారాల్లో ప్రకటితమవుతాయి

వ్యాధి మొదటిదశలో జలుబు దగ్గు కొద్దిపాటి జ్వరం కన్పిస్తాయి ఈ దశ రెండువారాలపాటు కొనసాగుతుంది క్రమేపి దగ్గు ఉధృతమై తెరలు తెరలుగా రావడం మొదలవుతుంది తెరలు తెరలుగా వచ్చే దగ్గు ఈ జబ్బు రెండవదశ ప్రారంభానికి సంకేతం ఈ దశలో దగ్గు తెర వచ్చినప్పుడల్లా బిడ్డ భయోత్పాతంతో తల్లిని గట్టిగా పట్టుకొంటుంది దగ్గు తెరవచ్చి తగ్గిన తరవాత గాలి పీల్చుకునేటప్పుడు శబ్దం వినబడుతుంది కష్టంమీద జిగురుగా వుండే పదార్థాన్ని ఉమ్మివేస్తుంది దగ్గు తెరల తరవాత వాంతులు కనబడతాయి దగ్గు తెరలు వచ్చి తగ్గిన తరవాత నిస్త్రాణ చోటు చేసుకొంటుంది రోజులో 40 నుంచి 50 తెరలుగా దగ్గు రావచ్చు. దగ్గు తెరలవలన నాలుక అడుగుభాగంలో పుండు ఏర్పడుతుంది దగ్గే సమయంలో నాలుక కిందిపళ్లకు రాసుకోవడమే దీనికి కారణం చెంచాతో నాలుక అడుగుభాగంలోనున్న పుండును తాకితే దగ్గు తెరవస్తుంది కోరింత దగ్గును గుర్తించడానికి ఇది ఒక పరీక్షగా భావించవచ్చు. 4 5 వారాల్లో రెండవదశలో కన్పించే దగ్గు తెరలు క్రమేపి తగ్గిపోతాయి కఫం తేలికగా తెగిపడిపోవడం జరుగుతుంది ఇది ఈ వ్యాధి మూడవదశ ప్రారంభాన్ని సూచిస్తుంది మూడవదశ రెండు మూడు వారాలుంటుంది అయినా ఒక సంవత్సరంపాటు ఎప్పుడు జలుబు లంకించుకొన్నా మళ్ళీ దగ్గు తెరలు కనబడుతూనే వుంటాయి

దగ్గు తెరలుగా వచ్చేటప్పుడు ఊపిరి అందక పసిపిల్లలు చనిపోవడం కద్దు కోరింత దగ్గువల్ల బిడ్డల్లో కన్పించే మరో చిక్కు నిమోనియా జబ్బు మెదడు నరాలు చిట్లి రక్తస్రావం సంభవించే కేసులు కూడా వుండవచ్చు.

2 మాసాలు నిండకముందే టీకాలు వేయించడం సంప్రదాయ వైద్యంలో జరుగుతుంది 2వ మాసం 8వ మాసం వయస్సులో డి పి టి టీకాలు వేస్తుంటారు వ్యాధి నిరోధక చర్యగా పెర్టూసిన్ 30 పొటెన్సీలో రోజుకు ఒక డోసు వంతున వారంరోజులపాటు వాడటం మంచిది ఈ వ్యాధి ఒకసారి వచ్చి తగ్గిపోయిన వారికి జీవితం లోరాదు

కోరింత దగ్గుతో బాధపడే రోగులకు తడవర తేలికగా లంకించుకొంటుంది 5 సంవత్సరాల లోపు పిల్లల్లో

ఇలా జరిగే అవకాశాలు ఎక్కువ చిన్నపిల్లల్లో కోరింత దగ్గుతో ఫిట్స్ కనబడవచ్చు.ఈరకమైన మార్పులు వ్యాధి తీవ్రతను సూచిస్తాయి సంవత్సరంలోపు పిల్లలకు ఈ వ్యాధి సంక్రమిస్తే చాలాప్రమాదం నిమోనియా విరేచనాలు లాంటి చిక్కులు తోడైనా ప్రమాదమే

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| ఇది ఈ వ్యాధితో బాధపడే రోగుల రక్తం నుంచి తయారుచేసే మందు దీనిని నోసోడ్ అని పిలుస్తారు కోరింతదగ్గుకిఈ నోసోడ్ ప్రత్యేకమైన మందుగా డాక్టర్ క్లార్క్ శ్లాఘిస్తాడు వ్యాధి నిరోధకంగాను వ్యాధి నివారకంగాను కూడా ఇది ఉపయోగపడుతుంది 30 పొటెన్సీలో ఈ మందును రోజూ ఉదయం ఒక డోసు చొప్పున రెండువారాలు వాడితే వ్యాధి నిరోధకంగా పనిచేస్తుందని డాక్టర్ షెపర్డ్ వెల్లడించిన విషయం<br>ఈ మందు వ్యాధి అన్ని దశలలోను వాడుకోవచ్చు. వ్యాధి తీవ్రతను తగ్గిస్తుంది వ్యాధిని త్వరగా నివారిస్తుంది<br>రోగి జలుబు విపరీతమైన దగ్గుతో బాధపడుతుంటాడు ముఖం కంది వుంటుంది కఫం జీనలు జీనలుగా సాగుతుంది దగ్గు తగ్గిన తరువాత వికారం వాంతి కన్పిస్తాయి నిద్ర లేచేసరికి ఊపిరాడకుండా దగ్గు వ్యాధి నివారణకు ప్రతి నాలుగు గంటలకు ఈ మందు 30 పొటెన్సీలో ఒక డోసు వంతున వాడవలసి వుంటుంది దగ్గు తెరలు వెనకాడగానే మందు ఆపేయాలి | పెర్టూసిన్ |
| కోరింత దగ్గుకు హానిమన్ ఉపయోగించిన మందు ఇది ఈ వ్యాధి అంటువ్యాధిగా ప్రబలినప్పుడు ఈమందు చాలా ప్రయోజనకారి దగ్గు తెరలు విపరీతం రోగి మామూలుగా గాలపీల్చుకునే అవకాశంవుండదు సాయంకాలంరోగికి బాధలు అధికం కఫం పడడం కష్టం కఫం తెగక వికారపెట్టి వాంతులవుతుంటాయి వాంతితోపాటు నీళ్లు అన్నం తెమడ బయటకు వచ్చేస్తాయి గొంతులో గురగురగా వుంటుంది పక్క టెముకల కింద నొప్పి పత్తిపట్టుకొని కూర్చోవాలి<br>ఈ మందు ఒకరోజు ఒక డోసు వాడితేచాలు అవసరమైతే ఒక రోజు ఆగి మరొకడోసు వేసుకోవచ్చు. అంతకన్నా ఎక్కువ డోసులు వాడుకోకూడదు | డ్రోసెరా |
| కోరింతదగ్గు ఆరంభదశలో దగ్గు కొద్దిపాటి జ్వరం కన్పిస్తాయి రెండవ దశలో దగ్గు తీవ్రతరమవుతుంది ప్రధమ దశలోనే ఎకోనైట్ బెల్లడోనా మందులను వాడితే ఈ వ్యాధిని ఆదిలోనే నివారించవచ్చు.<br>బెల్లడోనా రోగిలో రాత్రివేళల్లో అకస్మాత్తుగా దగ్గు వస్తుంది అతికష్టంమీద దగ్గిన తరువాత కొద్దిగా జిగురుతో కూడిన ఉమ్మి వస్తుంది జ్వరం తీవ్రంగా ఉంటుంది గొంతునొప్పి పొడారిపోయినట్టుంటుంది దాహం వేయదు డోకులు వాంతులు కళ్ళు ఎర్రగా కన్పిస్తాయి ఒంటిమీద చేయివేస్తే కాలుతుంటుంది<br>బెల్లడోనా రోగిలో మాదిరిగా దగ్గు జ్వరం బాధలుండి రోగి బాగా అస్తిమితంగా కన్పించి ఎక్కువ నీరు తాగాలన్పిస్తుంటే ఆ రోగికి ఎకోనైట్ ఇవ్వాల్సి వుంటుంది<br>ఈ మందులను 30 పొటెన్సీలో జ్వరం దగ్గు వెనకాడేవరకు ప్రతి 4 గంటలకు ఒక డోసు ఇవ్వాల్సి వుంటుంది | బెల్లడోనా |
| కోరింతదగ్గు నివారణకు ఈ మందు చాలా ప్రశస్తమైనదంటాడు డాక్టర్ కెంట్ దగ్గు తీవ్రంగా వుండి వాంతులు డోకు తోడైనట్టయితే ఈ మందు వాడితే వ్యాధి | కార్బోవెజ్ |

తగ్గుతుందంటాడు ఈ మందు వాడిన తరవాత వ్యాధి పూర్తిగా నివారణ కాక పోయినా శేషభాగానికి వాడవలసిన మందు తెలుసుకోవడానికి వీలవుతుందని కూడా కెంట్ అభిప్రాయపడ్డాడు

---

# ఆటలమ్మ

ఇది సాధారణంగా చిన్నపిల్లలకు ఎక్కువగా వస్తుంది అరుదుగా ఈ వ్యాధి పెద్దవాళ్లకు కూడా సంక్రమించవచ్చు. ఒకసారి ఈ వ్యాధి వస్తే జీవితంలో మళ్ళీరాదు చిన్నతనంలో ఆటలమ్మవచ్చిన వాళ్లకి పెద్దయిన తరువాత సర్పి కన్పించవచ్చు.

ఆటలమ్మ వారిసెల్లాజోస్టర్ అనే వైరస్‌వల్ల వస్తుందని కనుక్కొన్నారు సర్పి (హెర్పిస్‌జోస్టర్)కి కూడా ఈ క్రిములే కారణమన్న విషయం గమనార్హం ఆటలమ్మ 2 3 సంవత్సరాల కొకసారి అంటువ్యాధిలా ప్రబలుతుంది స్కూలు పిల్లల్లో ఎక్కువగా కన్పిస్తుంది 6 నెలలలోపు శిశువులకి ఈ వ్యాధి సోకితే చాలా ప్రమాదకరమైందిగా గుర్తించాలి 6 7 మాసాల గర్భవతుల్లో ఈ వ్యాధి కన్పిస్తే వైద్యుని సంప్రదించాలి చిన్నతనంలో ఈ వైరస్ క్రిములు శరీరంలో చోటు చేసుకొన్నా గుప్తంగా వుండిపోయి పెద్దయ్యాక సర్పి వ్యాధిరావచ్చు. కొందరిలో ఈ క్రిములు శరీరంలో ప్రవేశించినా ఆటలమ్మ బయటపడకుండానే వారికి వ్యాధి నిరోధక శక్తి పెంపొందుతుంది ఈ వివరణ దృష్ట్యా వ్యాధి రావడానికి క్రిములకన్నా శరీరతత్వం అధిక ప్రాధాన్యత వహిస్తున్నదని స్పష్టం

క్రిములు శరీరంలో ప్రవేశించిన తరవాత సుమారు రెండు వారాలకుగాని వ్యాధి లక్షణాలు బయటపడవు దీనినే ఇంక్యుబేషన్ పీరియడ్ అంటారు ఈ వైరస్ ఇన్ఫెక్షన్ వల్ల మొదట జ్వరం తలనొప్పి, ఆకలిలేకపోవడం నడుంనొప్పి, నీరసం కన్పిస్తాయి ఒకటి రెండు రోజుల్లో ఛాతీమీద వీపుమీద ఎర్రని మచ్చలు బయలుదేర తాయి ఈ మచ్చలు క్రమంగా చేతులమీదికి కాళ్లమీదికి కూడా వ్యాపిస్తాయి ఈ మచ్చలే క్రమంగా బొబ్బలుగా రూపొందుతాయి బొబ్బలు చుట్టూ చర్మం కంది ఉంటుంది వీటిలో క్రమంగా చీము కూడుకొంటుంది తరవాత ఈ చీముబొబ్బలు మాడిపోవడం మొదలుబెట్టి చెక్కులు గట్టి వూడిపోతుంటాయి ఇదంతా మూడు వారాల్లో జరిగిపోతుంది ఎర్రమచ్చలన్నీ ఒకేసారి పుట్టవు ఇవి రావడం మొదలుపెట్టాక 3 4 రోజులపాటు ప్రతిరోజు కొత్తమచ్చలు కన్పిస్తూనే ఉంటాయి ఆటలమ్మలో రోగి వంటిమీద ఒకేసారి మచ్చలు నీటిబొబ్బలూ చీము బొబ్బలూ కన్పిస్తాయి బొబ్బలు కన్పించగానే రోగి విపరీతమైన దురదతో బాధపడతాడు ఆ సమయంలో రోగిని గోకనీయకుండా చూడాలి బొబ్బలు ఎండిపోకముందే గోకినట్లయితే గోకినచోట చీమువట్టి గుంటలేర్పడతాయి నిద్రలో తెలియకుండా గోకే ప్రమాదముంది గనుక రోగి గోళ్ళు కత్తిరించాలి చేతికి గుడ్డలు కట్టి వుంచడం మంచిది పక్కదుప్పట్లు ప్రతిరోజూ మార్చుతుండాలి పొక్కులు మాడి రాలిపోయేవరకు చిన్నపిల్లల్ని రోగి దగ్గరకు రానివ్వకూడదు ఎంత జాగ్రత్తగా వున్నా ఆటలమ్మ ఇంట్లో ఒకరికి వస్తే మిగతా పిల్లలందరికి వచ్చే అవకాశముంది గర్భవతికి ఆటలమ్మ పోసినా గర్భస్థ శిశువుకి ప్రమాదంలేదు ప్రసవించిన తరవాత బాలెంతకు ఈ వ్యాధి వచ్చినట్లయితే శిశువుకు కూడా వచ్చే అవకాశముంది ఇది ప్రమాదకరమైనదని గుర్తించాలి పెద్దవాళ్ళు కూడా ఆటలమ్మపోసిన రోగితో మరీ సన్నిహితంగా మెలగకూడదు వీరికి ఆటలమ్మ రాకపోయినా సర్పి రావచ్చు.

ఆటలమ్మపోసి రోగికి జ్వరం తీవ్రంగా వుండి వాంతులు విపరీతమైన దగ్గు తోడైతే వెంటనే డాక్టర్ని సంప్రదించాలి కళ్లలో బొబ్బలు కన్పించి కళ్ళెర్రబడితే తప్పనిసరిగా వైద్య సహాయం పొందాలి

## సర్పి

చిన్న వయసులో ఆటలమ్మ వచ్చిపోయిన వారిలో మాత్రమే ఈ వ్యాధి కన్పిస్తుంది చిన్నతనంలో ఆటలమ్మ వచ్చినట్లు గుర్తుండకపోవచ్చు కూడ చర్మం మీద బారుకి బొబ్బలు కన్పిస్తాయి ఇవి నరాన్ని అంటిపెట్టుకొని వరసగా ఉంటాయి శరీరంలో ఒక సగం వరకే ఈ బొబ్బలు కన్పిస్తాయి పొక్కులు రాబోయే

ముందు విపరీతమైన నొప్పి కన్పిస్తుంది నొప్పి వున్న భాగంలో పొక్కులు పుట్టుకొస్తాయి కొద్దిపాటి జ్వరం కూడా ఉంటుంది బడిపిల్లల్లో ఆటలమ్మ వ్యాధి ప్రబలినప్పుడు దానికి మూలం బడిలోని ఒక ఉపాధ్యాయుని నర్పికావచ్చు. నర్పి ఇంట్లో పెద్దవాళ్లకుంటే వారి సమీపానికి పిల్లలను పోనీయకూడదు వారిద్వారా పిల్లలకి ఆటలమ్మ అంటుకొనే ప్రమాదముంది నర్పి వచ్చి తగ్గిపోయిన తావుల్లో చర్మమంతా తిమ్మిరిగా వుంటుంది వెర్రిమంటలు కూడా వుండవచ్చు కళ్లల్లో నర్పి వచ్చినట్లయితే తప్పనిసరిగా వైద్యుని సంప్రదించాలి

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| దద్దురు ఎర్రగా ఉంటుంది నీటిబొబ్బలు దురద ఎక్కువ రాత్రిపూట బాధలధికం రోగికి పక్కకుదరదు వణుకు జ్వరం కూడా ఉంటుంది ఆటలమ్మకు ఇదే ప్రధానమైన మందు ఆరంభం నుంచి ఈ మందువాడితే దుష్ఫలితాలు రాకుండా తేలికగా వ్యాధి తగ్గిపోతుంది | రస్టాక్స్ |
| బొబ్బలు రావడం ఆలస్యం బొబ్బల్లో స్పష్టమైన పెరుగుదల కన్పించదు కొంచం నీలవర్ణంగా కన్పిస్తాయి రోగికి మగత ఎక్కువ చెమటలూ ఎక్కువే వికారపెట్టుతుంది నీరసం ఊపిరితిత్తుల నిమ్ము దగ్గు చిన్నపిల్లలో దగ్గు మరీ ఎక్కువ | యాంటింటార్ట్ |
| బొబ్బలో చీము కూడుకొన్నట్లయితే ఈ మందు వాడడం తప్పనిసరి దద్దు నీటిబొబ్బలు కూడా ఉంటాయి రోగికి చెమటలు ఎక్కువగా వడుతుంటాయి కాని దాని రోగికి బాధలు తగ్గవు ఇది మెర్క్‌సాల్ ప్రధాన లక్షణంగా భావించవచ్చు | మెర్క్‌సాల్ |
| ఆటలమ్మ రోగుల్లో దురద మరీ ఎక్కువగా వుండి బాధపడుతుంటే ఈ మందు ఆలోచించాలి కాళ్ళు, చేతుల్లో కొద్దిగా ఉబ్బు కన్పించవచ్చు. ఆరంభ దశలో ఈ రోగులకు లక్షణాలను బట్టి ఎకోనైట్ బెల్లడోనాలు కూడా వాడుకోవలసి రావచ్చు ఎకోనైట్ రోగిలో పెద్ద పెట్టున జ్వరం ఆందోళన ప్రస్ఫుటంగా కన్పిస్తాయి బెల్లడోనా రోగిలో విపరీతమైన తలనొప్పి, కాలిపోతున్నట్లు జ్వరం ముఖం కందబారివుంటుంది మగత నిద్ర సరిగా పట్టదు | ఏపిస్ |
| వేరియాలైనం ను ఆటలమ్మ, నర్పి వ్యాధుల్లో వ్యాధినిరోధక నివారణ ఔషధంగా బర్నెట్ ప్రస్తుతించాడు | |
| నర్పికి వాడుకొనే మందులు | |
| చురుకులు మంటలు పెద్ద పెద్ద బొబ్బలు వాపు చల్లటినీళ్ళు తగిలితే హాయిగా వుంటుంది | ఏపిస్ |
| నీటిబొబ్బలు విపరీతంగా మంట బెడుతుంటాయి మధ్య రాత్రి నుంచి అసలు నిద్రపట్టదు వికారం నీరసం బలహీనత వేడినీళ్ళు తగిలితే హాయి | ఆర్సెనికం ఆల్బ్ |
| బొబ్బలు మాడినట్లు కన్పిస్తాయి నరాలలో వెర్రిపోట్లు దురద పెడుతుంది గోకితే మంటలు బట్టకూడా తాకనివ్వదు | మీజీరియం |

# డిఫ్తీరియా

ఇది ప్రమాదకరమైన అంటువ్యాధి ఆరంభదశలో గుర్తించకపోతే ప్రాణాంతకం కూడా దీనికి మూలకారణమైన సూక్ష్మక్రిములు సాధారణంగా టాన్సిల్స్ జిగురు పొరలలో చోటుచేసుకొని వృద్ధిచెందుతాయి ఈ వ్యాధి సోకిన రోగుల నోటినుండి ఉమ్మి తుంపరల ద్వారా ఇతరులకు సంక్రమిస్తుంది ఈ వ్యాధి కారకక్రిములు గొంతులో వున్నా ఆరోగ్యంగా వుండేవారున్నారు వారినే క్యారియర్స్ అని అంటారు వీరిద్వారా ఇతరులకు వ్యాధి వ్యాపించే ప్రమాదం ఎక్కువే

ఈ వ్యాధి సమశీతోష్ణ ప్రాంతాలలో ఎక్కువ చలికాలంలో ఎక్కువమందికి సోకుతుంటుంది వర్షాలు తక్కువ వున్న సంవత్సరాలలో ఈ వ్యాధి ఎక్కువగా వ్యాపిస్తుందని గమనించారు ఈ క్రిములు శరీరంలో చోటుచేసుకొన్న తరవాత 2నుండి 5 రోజుల లోపుగా వ్యాధి లక్షణాలు ఆరంభిస్తాయి వ్యాధిగ్రస్తులలో వ్యాధి తగ్గిన తరవాత ఒకనెల రోజుల వరకు కూడా వారి గొంతులో వ్యాధి క్రిములుంటాయన్న విషయం గమనార్హం

వ్యాధి ఆరంభదశలో జ్వరం తలనొప్పి, గొంతునొప్పి కన్పిస్తాయి గొంతులో వచ్చే ఇతర వ్యాధులకి డిఫ్తీరియాకీ ప్రత్యేకమైన తేడా ఒకటి వుంది టాన్సిల్స్‌పై పలచని పొర ఏర్పడుతుంది ఆ పొర క్రమంగా పైకి వ్యాపించి ముక్కువెనుక భాగం వరకు వస్తుంది ఈ దశలో కంఠం వాపు తేడవుతుంది కంఠం వాచినందువల్ల గాలి పీల్చడం మింగటానికి కూడ ఇబ్బందిగా వుంటుంది గాలి పీల్చడం కష్టమయితే గొంతువద్ద ఆపరేషన్ చేసి ఊపిరితిత్తుల్లోకి గాలి ప్రవేశించే ఏర్పాటు చేస్తారు నోటి దుర్వాసన కంఠం చుట్టూ వున్న గ్రంధులు వాచివుండడం మాట బొంగురుపోవడం ఈ వ్యాధి ప్రత్యేక లక్షణాలు కొన్ని కేసుల్లో ముక్కువెంట రక్తం పడుతుంటుంది

డిఫ్తీరియా వ్యాధి క్రిములు శరీరమంతటా వ్యాపించవు కాని ఆ క్రిములనుండి ఉత్పత్తి అయ్యే విషపదార్థం శరీరమంతటా వ్యాపిస్తుంది ఈ విషపదార్థం ముఖ్యంగా గుండె నాడీమండలాల్లో చోటుచేసుకొని గుండె ఆగిపోయే ప్రమాదానికి పక్షవాతానికి నిస్సత్తువకి దారితీస్తుంది

ఈ వ్యాధిని ఆరంభదశలో గుర్తించి నివారించడం అవసరం ఈ రోజుల్లో బిడ్డ మొదటి 6 మాసాల వయస్సులోనే 3 సార్లు వ్యాధి నిరోధక టీకాలు ఇస్తున్నారు సాంప్రదాయక వైద్యులు వాడే టీకాల విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి డాక్టర్ పాటర్సన్ డాక్టర్ బాడ్‌మన్ మొదలైన ఇంగ్లండ్ వైద్యవేత్తలు ఈ టీక లకి పూర్తిగా వ్యతిరేకులు డిఫ్తీరియా టీకాలు తీసుకున్న 30 మంది నర్సుల్లో సాధారణ వ్యాధినిరోధక శక్తి సన్నగిల్లి ఇన్‌ఫ్లుయెంజా జర్మన్ మీజిల్స్, కోరింతదగ్గు లాంటి వ్యాధులకు గురయ్యారని డాక్టర్ బాడ్‌మన్ వెల్లడించాడు టీకాలు తీసుకొన్నవారు వాటి ప్రమాదానికి గురై చనిపోయినవారు కూడా వున్నట్లు డాక్టర్ షెపర్డ్ ప్రకటించిన విషయమే జంతువుల రక్తం నుంచి తీసే సీరంతో ఈ టీకాలు తయారౌతున్నాయి జంతువుల సీరంమానవులలో ప్రవేశపెడితే ప్రమాదం కావచ్చు.ఈ విషయంలో ఆశ్చర్యపడవలసిన పనిలేదు ఈ రోజుల్లో పిల్లలకు అనేక రకాలయిన టీకాలు పుట్టినరోజు నుండే ఇస్తున్నారు ఈ టీకాల వల్ల కలిగే దుష్ఫలితాలకు డాక్టర్ గ్రిమ్మర్ పైరోజెన్ వాడడం మంచిదంటాడు ప్రతిఇంట్లో ఈ ఔషధాన్ని 30 పొటెన్సీలో వుంచుకోవడం మంచిది టీకాలు వేసిన తరవాత దుష్ఫలితాలు ఎదురైతే ఈ మందు ప్రతి 6 గంటలకు ఒక డోసు చొప్పున తగ్గుదల కన్పించేవరకు 2, 3 రోజులు వాడడం మంచిది డిఫ్తెరైనం 30 పొటెన్సీలో వారానికి ఒకరోజు మాత్రమే 6 వారాలపాటు వాడితే వ్యాధినిరోధకంగా పనిచేస్తుంది టీకాలకు బదులు వేరియోలైనం 30 పొటెన్సీలో పైవిధంగా మశూచివ్యాధి నిరోధకంగా వాడుకోవచ్చు.

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| డిఫ్తీరియా వ్యాధికిది ప్రత్యేకమైన మందుగా పరిగణించవచ్చు. వ్యాధి ఆరంభదశ నుండి విపరీతమైన నీరసం ఈ మందు ప్రధాన లక్షణం వ్యాధి త్వరత్వరగా తీవ్రతరమవుతుంది రోగి కొంచెంసేపు కూడా నిలబడలేడు నాలుకమీద మందం | మెర్క్యూరియస్ సైనేటస్ |

బాగా కూడుకొనివుంటుంది చొంగ తీగలు తీగలుగా జినలు సాగుతుంటుంది నాడి వేగంగా కొట్టుకుంటుంది చెమటలు ఎక్కువ రోగి సాయంకాలం రాత్రిళ్ళు చాలా నీరసంగా వుంటాడు ముకు వెంబడి రక్తం కన్పిస్తే పరిస్థితి విషమిస్తుందని గమనించాలి ఈ మందు 30 పొటెన్సీలో వారానికి ఒకరోజు 6 వారాలపాటు వ్యాధినిరోధకంగా కూడా వాడుతుంటారు

**లాకిసిస్**

ఇది పాముగరళం నుండి తయారౌతుంది భయంకరమైన వ్యాధులన్నింటికి వ్యాధి ప్రమాదస్థాయికి చేరుకొన్నదశలో ఈ మందు అద్భుత ఫలితాలనిస్తుంది మెడచుట్టూ గుడ్డ తగిలినా ఓర్చుకోలేడు ఊపిరాడక ఉక్కిరి బిక్కిరి అవుతాడు వేడి ద్రవపదార్థాలు అసలు తాగలేడు వ్యాధి గొంతులోపల ఎడమవైపు ప్రారంభమై కుడివైపునకు ప్రయాణం చేస్తుంది ఇది ఈ ఔషధం ప్రముఖ లక్షణం గొంతు కమిలినట్లుగా వుంటుంది విపరీతమైన నీరసం భరించరాని నోటి దుర్వాసన ప్రతిదానిని అనుమానిస్తాడు డాక్టరన్నా డాక్టర్ ఇచ్చే మందన్నా కూడా అనుమానమే నిద్ర సుఖాన్నివ్వదు ఇది విచిత్రలక్షణం

**లైకోపోడియం**

ఈ రోగికి వ్యాధి గొంతు కుడివైపు మొదలయి ఎడమవైపు ప్రయాణం చేస్తుంది ఈ లక్షణం లాకిసిస్ లక్షణానికి వ్యతిరేకమైనది ఔషధాలను ప్రత్యేకమైన వ్యక్తులుగా పరిగణించటం హోమియోవైద్యం విశిష్టత ఔషధ ధర్మాలు రాబట్టడానికి మానవులపై ప్రయోగాలు చేస్తారు కనక ఔషధాలకున్న ఈ విశిష్టలక్షణాలను తెలుసుకోవడం సాధ్యపడుతుంది రోగం సాయంకాలం 4 గంటల నుండి 8 గంటల వరకు ఉధృతంగా వుంటుంది ఈ రోగి వేడివేడి పదార్థాలు ఇష్టపడతాడు పొట్ట ఉబ్బరం మోతతో అపానవాయువులు ముక్కుదిబ్బడ వేసి వుంటుంది నోటితో గాలి పీలుస్తుంటాడు మూత్రవిసర్జన తగ్గిపోతుంది బిడ్డ నిద్రలో లేచి చిరాకుగా ఏడుస్తుంటాడు

**ఆర్స్ఆల్బ్**

స్థిరంగా వుండలేకపోవడం భయం ఆందోళన ఒంటరితనం పనికిరాదు మాటిమాటికి పక్కలు మార్చడం ఈ గదిలో నుంచి ఆ గదిలోకి మారడం ఇవన్నీ ఆర్స్‌రోగిని పట్టిచ్చే ప్రధానలక్షణాలు అమితనీరసం దాహం అధికం వేడిద్రవపదార్థాలు కావాలి తాగిన వెంటనే వాంతులు కావడం ఈ రోగినుంచి వచ్చే స్రావాలన్నీ దుర్వాసన కొడుతుంటాయి మూత్రంలో అల్బుమిన్ పోతుంటుంది ఒళ్ళు నీరు చూపుతుంది ఈ లక్షణాలు వ్యాధి చరమదశగా గమనార్హం

లక్షణాలను ఆధారం చేసుకొని ఈ వ్యాధిగ్రస్తులకి ఏపిస్ ఫైటోలక్కా డిఫ్తిరైనం కూడ ఆలోచించవలసివుంటుంది ఎంపికచేసిన ఔషధాలు బాగా పనిచేయనప్పుడు డిఫ్తిరైనం పెద్ద పొటెన్సీలో వాడవలసివుంటుందని డాక్టర్ ఫుల్లర్ట్ సూచించాడు

# గవదబిళ్లలు

ఇది లాలాజల గ్రంధులకు సంక్రమించే అంటువ్యాధి శరీరంలో వుండే మూడు జతల లాలాజల గ్రంధులలో పెద్దవి పెరాటిడ్ గ్రంధులు పెరాటిడ్ గ్రంధులు ముఖానికి రెండువైపులా చెవుల కింది భాగానికి ముందుగా వుంటాయి ఇది వైరస్ క్రిముల ఇన్ఫెక్షన్ ఇన్ఫెక్షన్ వల్ల రెండు గ్రంధులు వాయవచ్చు. లేదా ఒకే గ్రంధి వాయవచ్చు. రెండు సంవత్సరాల వయసుదాటిన పిల్లల్లో ఇది ఎక్కువగా కన్పిస్తుంది ప్రతి 3 4 సంవత్సరాలకొకసారి ప్రబలంగా వ్యాపిస్తుంది

ఈ వైరస్ క్రిములు ఎంగిలిద్వారా ఉమ్మిద్వారా ఒకరినుండి మరొకరికి సంక్రమిస్తుంటాయి ఈ క్రిములు

శరీరంలో చేటుచేసుకొన్న తరువాత 2, 3 వారాలకుగాని వ్యాధి లక్షణాలు కన్పించవు ఈ క్రిములు సోకినవారు వ్యాధి లక్షణాలు కన్పించకముందు ఒక వారం రోజులు వ్యాధి నివారణ అయిన తరవాత ఒక వారంరోజులదాకా ఇతరులకు ఈ వ్యాధి సంక్రమింపజేయగలరని గమనించారు వ్యాధి లక్షణాలు కన్పించినవారికి ఒక వారంలో లక్షణాలన్నీ తగ్గిపోతాయి వ్యాధి లక్షణాలు కన్పించకముందు వ్యాధి నివారణ అయిందనుకొన్న తరువాత కూడా ఈ రోగులవల్ల వ్యాధి వ్యాపించే ప్రమాదముంది గనుక ఈ రోగులను రోగమున్న సమయంలో వేరుగా వుంచినందువల్ల ఆశించిన ప్రయోజనం చేకూరదు

గవదబిళ్ళ వాపు వచ్చేముందు ఒళ్ళంతా వులవరంగా వుంటుంది జలుబు తలనొప్పి, ఆకలి మందం ఒకమాదిరి జ్వరం ఒళ్ళంతా నొప్పులు ఆ తరువాత 2-24 గంటలలో గవదబిళ్ళలు వాస్తాయి వాపు మొదటగా ఒకవైపు తరువాత రెండోవైపున కన్పిస్తుంది గవదబిళ్ళలు వాపు కన్పించేవరకు ఈ బాధలు ఫ్లూజ్వరం బాధల్ని పోలివుంటాయి ఈ వ్యాధిలో నోరు పూర్తిగా తెరవడం కష్టం నమిలేటప్పుడు మింగేటప్పుడు నొప్పి నారింజ నిమ్మలాంటి పుల్లటి వస్తువులు తింటే ఈ బాధ మరీ ఎక్కువ లాలాజల గ్రంధుల ఇన్ఫెక్షన్ని పట్టిచ్చేది ఈ లక్షణమే రెండుమూడు రోజులు గడిచేసరికి జ్వరం 103 - 104° వరకు చేరుకొంటుంది జ్వరం వున్న రోజుల్లో వాపు ఉన్నచోట తాకితే చాలా బాధగా వుంటుంది

యుక్తవయసు వచ్చిన తరువాత గవదబిళ్ళల వ్యాధి సోకినవారిలో 00 కి 25 మందికిపైగా పురుషుల్లో బీర్జాల వాపు కన్పిస్తుంది స్త్రీలలో అండకోశాల్లో స్తనాల్లో నొప్పి కన్పిస్తుంది ఈ వ్యాధిలో ప్రధానమైన దుష్పరిణామం మెదడువాపు తూర్పుదేశాల్లో చైనాలో ఈ పరిణామం ఎక్కువని కనుక్కొన్నారు

ఈ వ్యాధి వచ్చినప్పుడు తలనొప్పి, చెవిపోటు మెడ పట్టుకుపోవడంలాంటి లక్షణాలు కన్పిస్తే వెంటనే వైద్యుణ్ణి సంప్రదించాలి కడుపులో నొప్పికి వాంతులు తోడైతే వెంటనే డాక్టర్ని చూడాలి

ఈ వ్యాధిగ్రస్తులు ప్రత్యేకంగా పని మానుకొని పడుకోవలసిన అవసరం లేదు ఇంతకుముందెప్పుడూ ఈ వ్యాధి సోకనివారు వ్యాధిగ్రస్తులకు దూరంగా వుండడం మంచిది రోగులు మసాలాలు పుల్లటి పదార్థాలు తీసుకోరాదు లాలాజలం ఎక్కువగా వూరి బాధ కల్గిస్తుంది

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| ఇది సాధారణంగా గవదబిళ్ళలకి పనికొచ్చే మందు బాధలు హఠాత్తుగా తీవ్రంగా రావడం బెల్లడోన్నా లక్షణం గవదబిళ్ళలు ఎర్రగా వుంటాయి తాకితే నొప్పి గొంతులో మంట తినేటప్పుడు తాగేటప్పుడు పలకమారుతుంది బాధలు మెరుపులాగా వచ్చిపోతుంటాయి ఇది బెల్లడోనా ప్రత్యేక లక్షణం కొంచెం మగత తలనొప్పి కూడా వుంటే బెల్లడోనా కేసు అని నిర్ధారించుకోవచ్చు | బెల్లడోనా |
| ఇది గవదబిళ్ళలకి ప్రత్యేకమైన మందుగా డాక్టర్ బర్నెట్ పైలర్లు శ్లాఘించారు ఈ వ్యాధికి ఇదితప్ప వేరే మందు అవసరంలేదని బర్నెట్ వాదన<br>పైలోకార్పిన్ జబరాండీ అనే మొక్క నుంచి తయారౌతుంది ఈ ఆకుల పసరు లాలాజల గ్రంధులను ఉత్తేజపరిచి ఎక్కువ లాలాజలాన్ని ఉత్పత్తి చేస్తుంది సారూప్య సిద్ధాంతరీత్యా ఈ మొక్క నుండితయారయ్యే మందు లాలాజల గ్రంథుల వాపునకు మంచి మందు ఈ మందు 6 పొటెన్సీలో ఉదయం ఒక డోసు, సాయంకాలం ఒక డోసు చొప్పున వాడితేవ్యాధి త్వరగా నివారణ కాగలదని నమోదు చేయబడిన విషయం అధికంగా చెమటలు అపరిమితంగా దాహం ఉమ్మి ఎక్కువగా రావడం మొదలయినవి ఈ మందును పట్టిచ్చే లక్షణాలు | పైలోకార్పిన్ |
| ఎక్కువగా చెమటలు మితిమీరిన నీరసం నోటి దుర్వాసన నాలుకమీద తెల్లటి పూత ఉన్నట్లయితే ఈ మందు వాడవలసివుంటుంది | మెర్క్యూరియస్ |

| | |
|---|---|
| నిస్త్రాణ చలి వులవరం బంక చెమటలు మాటిమాటికి నోరు తడుపుకోవడం ఆర్సెనికం రోగి ప్రధాన లక్షణాలు గవదబిళ్ళల వ్యాధి స్తనాలకు అండకోశాలకు బీర్జాలకు వ్యాపించినట్లయితే ఈ ఔషధం ఎంతో ఉపయోగపడగలదు | ఆర్సెనికం ఆల్ఫ్ |
| ఎడమవైపు గవదబిళ్ళ వాచివుంటుంది కాళ్ళూ చేతులూ నొప్పి రాత్రివేళ ఈ బాధలు ఎక్కువ రోగి స్తిమితంగా వుండలేడు అటూఇటూ కదులుతుంటే బాధలు ఉపశమిస్తాయి చలి భరించలేడు దప్పిక ఎక్కువ పెదిమలమీద నీటిపొక్కులు లాంటివి ఉండవచ్చు. | రస్టాక్స్ |
| ఇది ఈ వ్యాధిగ్రస్తుల నుంచి తయారయ్యే ఔషధం ఈ వ్యాధి నుంచి బయటపడినా ఆరోగ్యం కుదుటబడనివారి బాధలకు ఇది ప్రత్యేక ఔషధం 200 పొటెన్సీలో రెండు వారాలకు ఒక డోసు చొప్పున 2 3 డోసులు వాడుకోవడం మంచిది ఈ వ్యాధివల్ల దాపురించిన మానసిక వ్యాధికి ఇది దివ్యౌషధం | పెరాటిడినమ్3 |

# పోలియో

పోలియో వ్యాధిని శిశుపక్షవాతం అని ఇదివరలో వ్యవహరిస్తుండేవారు ఈ వ్యాధి ఈ శతాబ్దంలోనే ఎక్కువైనట్లు కన్పిస్తుంది దీనికి కారణం పిల్లలకి అనేక రకాల టీకాలు ఇవ్వడమే కావచ్చునని ఇంగ్లండు వైద్యులు అభిప్రాయపడ్డారు సాధారణంగా ఈ వ్యాధి 2 సంవత్సరాలలోపు పిల్లలకే సోకుతుంది ఈ శతాబ్దిలో పెద్దవయస్సువాళ్ళు కూడా దీనికి గురైనట్లు గమనించారు అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ 30 సంవత్సరాల వయస్సులో పోలియోవాత పడ్డాడన్నది జగద్విదితం

పోలియో వ్యాధికి కారణం వైరస్ ఈ వైరస్ క్రిములు నవ్రపధ ద్వారా శరీరంలోకి ప్రవేశించి నాడీకణాలను చేరుకుంటాయి తరువాత మెదడు వెన్నుబాములోని నాడీ కణాలను విచ్ఛిన్నంచేసి వాటి కార్యకలాపాలను దెబ్బకొడతాయి దీని ఫలితంగా పక్షవాతం సంభవిస్తుంది

ఈ వైరస్ క్రిములు పేగుల లోపలి పొరల్లో స్థావరం ఏర్పాటు చేసుకుంటాయి ఈ క్రిములు చేరిన వ్యక్తులద్వారానే ఇతరులకు సంక్రమిస్తుంది ఈ క్రిములు స్థావరంగా కలిగిన వ్యక్తులందరికీ పోలియో రాదు అట్లా రాని వ్యక్తులను క్యారియర్స్ అంటారు వ్యాధికి ప్రధాన కారణం శరీరతత్వమే అని చెప్పడానికి క్యారియర్ మంచి ఉదాహరణ

ఈ వ్యాధి వేసవికాలంలో ఎక్కువగా వ్యాపిస్తుంది పోలియో వ్యాధిగ్రస్తుల ముక్కు, గొంతుకలోని స్రావాల్లో మొదటి రెండు వారాలు ఈ క్రిములు ఎక్కువగా కనిపిస్తాయి అందుచేత పిల్లలను ఈ సమయంలో వ్యాధిగ్రస్తుల దగ్గరకు పోనీయరాదు వ్యాధి నివారణయిన తరువాత మూడు మాసాల వరకు చిన్న పిల్లలను ఆ రోగులకు దూరంగా వుంచడం మంచిది

950వ సంవత్సరంలో ఇంగ్లండులోని బర్మింగ్‌హామ్‌లో 949తో పోలిస్తే అకస్మాత్తుగా పోలియోవ్యాధి కేసులు రెట్టింపయినట్లు కనుగొనడం జరిగింది దీనికి కారణం వివిధ రకాల అంటువ్యాధులకు వ్యాధినిరోధక టీకాలే కారణమని నిర్ధారించి తాత్కాలికంగా డిఫ్తీరియా నిరోధక టీకాలులాంటి టీకాలు పిల్లలకివ్వడం మానివేశారు వ్యాధికి వైరస్‌కన్నా శారీరక పరిస్థితులు కారణమన్న అభిప్రాయానికి ఇదే రుజువు

పోలియో వ్యాధి సంక్రమించిన రోగికి అకస్మాత్తుగా జ్వరం వస్తుంది జ్వరం 4 రోజులదాకా వుండవచ్చు రోగి మగతగా చికాకుగా వుంటాడు ఫిట్స్ రావచ్చు.వాంతులు కూడా ఉండొచ్చు. తల మెడ వీపు నొప్పి పెడుతుంటాయి కాళ్ళు చేతులు పట్టుకుంటే నొప్పులు ఇది వ్యాధి ఆరంభదశ పెద్దపిల్లలకు పెద్దవాళ్లకు ఈ వ్యాధి సోకినట్లయితే 24 గంటలలోపుగానే పక్షవాతం కూడా వస్తుంది

జ్వరం ఆరంభమైన 4 5 రోజులకు పక్షవాతం వస్తుంది మొదట్లో కాళ్ళు, చేతులు మొత్తం

కదిలించలేకపోయినా క్రమేపీ కండరాలలో బలం పుంజుకుని కాలిలోనో చేయిలోనో బలహీనత మిగిలిపో తుంది కండరాలు ఒక నెలరోజుల్లో బలం పుంజుకుంటాయి బలం పుంజుకోని కండరాలు క్రమంగా క్షీణించి పోతాయి క్షీణించిన అవయవాలలో పెరుగుదల కూడా తగ్గిపోతుంది ఒకసారి ఈ వ్యాధి వచ్చి పోయిన తరు వాత మళ్లీరాదు

పోలియో మామూలుగా వచ్చినప్పుడు వెన్నుబాముకే వ్యాధి పరిమితమై వుంటుంది రోగి ఎట్టి పరిస్థితిలోనూ చనిపోడు కాని అంటువ్యాధిగా ప్రబలినప్పుడు నూటికి ఇరవైమంది చనిపోయినట్లు నమోదైన విషయమే దీనికి కారణం వ్యాధి వెన్నుబాము వరకే పరిమితం కాకుండా మెదడు వరకు వ్యాపించడమే

వ్యాధి ఆరంభదశలో లాధరస్ జెల్సిమియం బెల్లడోన్నా ఫైజోస్టిగ్మా ముఖ్యంగా వాడుకోదగినట్టివి

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| ఇది వ్యాధినిరోధకంగా నివారకంగా కూడా ఉపయోగిస్తుంది దీన్ని బిడ్డకు మొదటి సంవత్సరంలో 200 పొటెన్సీలో రెండో సంవత్సరంలో 1 ఎం పొటెన్సీలో మూడవ సంవత్సరంలో 0 ఎం పొటెన్సీలో సంవత్సరానికి ఒక్క డోసు వాడినట్టయితే జీవితంలో ఆ బిడ్డకు పోలియో రాదని డాక్టర్ టేలర్ స్మిత్ చెప్పిన మాట ఇదే డాక్టర్ ఎలిజబెత్ రైట్ హబ్బర్ట్ అయితే 4 వారాల వ్యవధిలో 30 200 ఎం పొటెన్సీలో వరసగా ఒక డోసు సంవత్సరంలోపు వయసులోనే వాడి రెండవ సంవత్సరంలో ఎంగాని 0 ఎం గాని ఒక్క డోసు వాడితే సరిపోతుందంటుంది వ్యాధి నివారణకు 30 పొటెన్సీలో ప్రతి 4 గంటలకూ ఒక డోసు చొప్పున వ్యాధి తగ్గుముఖంపట్టే వరకు వాడవలసివుంటుంది వెన్నుబాములోని నాడీకణాల రక్షణకు ఇది ప్రత్యేకమైన ఔషధం లాధరస్ రోగి కండరాలు శుష్కించిపోయి బలహీనంగా వుంటాయి తూలినట్లు నడుస్తుంటాడు | లాధరస్ |
| ఇది వ్యాధి ఏ దశలోనైనా వాడుకోదగ్గ ఔషధరాజంగా డాక్టర్ కెంట్ గుర్తించాడు వెన్నుబాము మెదడు నాడీకణాలకు రక్తప్రసారాన్ని బాగా పెంచి ఈ వ్యాధి దుష్ఫలితాలను నివారిస్తుంది కండరాల వణుకు బలహీనతలకు ఇది ప్రత్యేక మైన మందు దీనిని 30 పొటెన్సీలో లాధరస్‌లాగా వాడుకోవలసివుంటుంది | జెల్సిమియం |
| అకస్మాత్తుగా జ్వరం కండరాలలో కంపనాలు నొప్పులు ఫిట్స్ ఈ రోగి ప్రత్యేక లక్షణాలు తడిసిన తరువాత పోలియో లాంటి పరిణామాలకు ఇది ప్రత్యేకమైన మందు | బెల్లడోనా |



# గాయాలు - ప్రమాదాలు

ప్రతి ఇంటిలో ముఖ్యంగా గ్రామాలలో నివసించేవారి ఇళ్ళల్లో దెబ్బలకు బెణుకులకు గాయాలకు ఉపయోగించే మందులు ఉండడం అవసరం

ఈ రకమైన బాధలకు ఉపయోగించే మందులన్నింటిలో ప్రధానమైనది ఆర్నికా ఆర్నికాలేని ఇల్లు ఉండటానికి వీలులేదని అభిప్రాయపడింది ప్రముఖ ఇంగ్లీషు వైద్యులు డాక్టర్ బ్లాకీ ఆర్నికా కముకు దెబ్బలకు బెణుకులకు దెబ్బలవలన పడిన గాయాలకు అధిక శ్రమవలన దేహానికి కలిగే అలసటకు పనిచేస్తుంది కాన్పుకు ముందు కాన్పు తరువాత ఈ మందు వాడుకోవచ్చు. కాన్పువల్ల తల్లికి కలిగే అలసట షాక్ ఇన్ఫెక్షన్ నివారణకు ఈ మందు ప్రయోజనకారి ఆపరేషనుకి ముందు తరువాత ఈ మందు వాడుకోవచ్చు. పన్ను పీకించుకునే వాళ్ళు కూడా పన్ను పీకించుకునే ముందు తరువాత ఈ మందు వాడితే రక్తస్రావం తక్కువగా ఉంటుంది షాక్‌నుంచి త్వరగా కోలుకోవచ్చు. ఆర్నికా టైఫాయిడ్‌కి టైఫాయిడ్‌ను పోలిన జ్వరాలకు దివ్యౌషధం ఆపరేషన్ తరవాత దెబ్బ తగిలిన తరవాత ఎవ్వరైనా అస్వస్థతకు గురైతే తప్పక ఆర్నికా వాడుకోవచ్చు. ఒళ్ళు నొప్పులు పులక కండరాలు నలగగొట్టినట్లుండే బాధలు ఆర్నికా లక్షణాలు గాయం దెబ్బ ఎప్పుడు తగిలినా ఎన్నిరోజుల తరవాత అయినా ఈ మందు ఉపయోగిస్తుంది రోడ్డు ప్రమాదాలకు గురైన వ్యక్తులు ఒక్కొక్కప్పుడు శారీరకంగానే కాక మానసికంగా షాక్‌కి గురికావచ్చు. ఉద్వేగం ఆపలేని దు ఖం- వీటికి లోనయ్యే వారికి కూడా ఆర్నికా మంచి మందు షాక్‌కి గురైన వ్యక్తికి ఆర్నికా ప్రతిపావుగంటకు ఒక డోసు ఇవ్వాల్సి ఉంటుంది కొన్ని డోసులు వాడిన తరువాత మూడు నాలుగు గంటలకు ఒక డోసు వాడవచ్చు. షాక్‌వలన రోగికి ఆందోళన అస్తిమితం భయం కలిగి బాధపడుతున్నట్లయితే ఆర్నికా కన్న ఎకనైట్ ఎక్కువ ప్రయోజనకారి ఆర్నికా రోగికి పడుకోబెట్టి మంచాన్ని కాళ్ళవైపు కొంచెం ఎత్తుగా వుంచితే హాయిగా ఉంటుంది తాకినా అటూ ఇటూ తిరగకుండా పడుకోవలసి వచ్చినా ఈ రోగి బాధపడిపోతాడు పైన గాయం పడకుండా బెణికినట్లయితే ఆర్నికాలోషను పైపూతగా వాడవచ్చు. బెణికిన తరువాత 24 గంటలలోపల ఆ భాగంపైన మంచుగడ్డపెట్టడమో చల్లని నీళ్ళతో తడిపిన గుడ్డ వుంచడమో చెయ్యాలి ఆ తరువాత వేడికాపు పెట్టవలసి ఉంటుంది బెణికిన భాగానికి ఇలాస్టిక్ బాండేజి కట్టుకడితే హాయిగా ఉంటుంది

దెబ్బతగిలి గాయపడి రక్తస్రావం కన్పించిన కేసుల్లో కూడా షాక్‌కు రక్తస్రావం అరికట్టడానికి గాయం త్వరగా మానడానికి ముందు ప్రతి పావుగంటకు తరువాత నాలుగు గంటలకొక డోసు చొప్పున ఆర్నికా వాడుకోవడం మంచిది ఈ కేసుల్లో పులక కండరాల బాధలు త్వరగా తగ్గిపోతాయి

తేనెటీగలు కందిరీగలు కుట్టిన తావుల్లో ఆర్నికా లోషన్ రాస్తే బాధ వెంటనే తగ్గిపోతుంది కాలిన కేసుల్లో

షాక్ తగ్గడానికి ఆర్నికా ఉపయోగించవచ్చు.

దెబ్బలనగానే గుర్తు వచ్చేమందు ఆర్నికాయే అయినా నరాలు అధికంగా వుండే అరికాళ్ళు, అరిచేతులు వేళ్ళు తలుపులో పడి నలిగినా మేకులులాంటివి గుచ్చి విడిచినా వాడవలసిన మందు హైపెరికం కండరాల దెబ్బలకి ఆర్నికా నరాలు నలిగితే హైపెరికం గుర్తుంచుకోవాలి వేళ్ళు చితికి నరాలు నలిగితే కలిగే బాధ షాకులకు హైపెరికం మంచిమందు ధనుర్వాత నిరోధానికి ప్రతి పావుగంటకి ఒకసారి వాడుకోవాలి ధనుర్వాత నిరోధానికేగాక నివారణకి కూడా ఇది ప్రత్యేకమైన మందు ధనుర్వాతంలో ఫిట్స్‌కి ప్రతి 5 నిముషాలకి ఒకసారి తరవాత ప్రతి నాలుగుగంటలకి ఒకసారి 30 పొటెన్సీలో హైపెరికం వాడుకోవలసి వుంటుంది

పదునైన వస్తువులు గుచ్చుకుని గాయాలైన కేసుల్లో ముఖ్యంగా గుర్తుంచుకోవలసిన మందు లెడంపాల్ నరాలు నలిగిన గాయాలకు ఇది హైపెరికంలాగా పనిచేస్తుంది హోమియో వైద్యంలో లెడంపాల్ ఎ టి ఎస్ వంటిది గాయంవద్ద తిమ్మిరి బాధ అనుకున్న దానికన్న ఎక్కువ కాలం వుండిపోవడం గాయం తగిలిన తావు చల్లగా వుండటం ఆతావున చన్నీళ్ళు పోస్తే హాయిగా ఉండటం లెడంపాల్ ప్రత్యేక లక్షణాలు కనుగుడ్డుకు దెబ్బతగిలి కంటిచుట్టూ నల్లగా వుంటే లెడంపాల్ వాడవలసి వుంటుంది

లెడంపాల్ అవసరమున్న కేసులకు వేడికావు గిట్టదు దెబ్బ తగిలిన తావునుండి పోట్లు పైకి వ్యాపిస్తుంటాయి ఈ రోగి చలికి తట్టుకోలేడు దెబ్బతగిలిన తావున చల్లదనం కావాలి చన్నీళ్ళు పోస్తుండాలి గుడ్డ కప్పనీయడు

పదునైన వస్తువులు గుచ్చుకున్నదానికే కాక తేలుకాటుకి ఇది ప్రత్యేకమైన మందు కీటకాలు కుట్టినా వాడవలసిన మందు ఇదే చీమకుట్టిన బాధలకు ఫార్మికా రూఫా తేనెటీగలు కుట్టిన బాధలకు ఏపిస్ మెల్లిఫికా అర్టికా యూరెన్స్ కందిరీగలు కుడితే టారెంటులా క్యూబెన్సిస్ దోమకాటు బాధలకు స్టాఫిశాగ్రియా లెడంపాల్ ఆలోచించదగిన మందులు

గాయాల విషయంలో ముఖ్యంగా చెక్కుపోయిన గాయాల విషయంలో త్వరగా మానుపట్టడానికి కాలెండులా ఔషధాన్ని మించినది లేదని శ్లాఘించింది డాక్టర్ డొరోతీషెపర్డ్ ఇది యాంటీసెప్టిక్ కాదు కాని కాలెండులా లోషన్ రాసిన గాయంలో క్రిములు చేరవు చీముపట్టిన గాయాలను ఈ లోషనులో కడిగి కట్టుకడితే చీమంతాపోయి రెండురోజులకే గాయం శుభ్రంగా తయారవుతుంది డాక్టర్ కారల్టన్ ఆపరేషను కేసుల్లో ఈ లోషన్ వాడుతుండేవారు ఆర్నికా హైపెరికం కాలెండులా ఈ మూడూ కూడా పై పూతగా వాడుకోతగ్గ మందులే

బెణుకులకు పట్టుకున్న కేసుల్లో ముందుగా వాడవలసిన మందు ఆర్నికా ఈ మందుని లోపలికి సేవించడమేకాక ఆర్నికా లోషను పూతమందుగా వాడవచ్చు ఒకటి రెండు రోజులలో బాధ నివారణ జరగనట్లయితే బెల్లిస్ పెరెన్నిస్ ను వాడవచ్చు. దీనిని కూడా ఆర్నికాలాగా లోపలికి మందుగా తీసుకోవడం లోషను పైపూతగా వాడవలసి ఉంటుంది ఈ మందుల తరువాత కొంత బాధ మిగిలిపోతే రస్టాక్స్ ఆలోచించాలి రస్టాక్స్ అవసరం అయిన కేసుల్లో ఉద్రేక ఉపశమనాలు చాలా స్పష్టంగా వుంటాయి చల్లదనం విశ్రాంతులవల్ల బాధ అధికమై వెచ్చదనం కదలిక ఉపశమనాన్ని కలిగిస్తాయి ఈ ఉద్రేక ఉపశమనాలపై ఆధారపడి రస్టాక్స్ కాల్కేరియా కార్బ్‌లు వాడుకోవాలి బెణికిన పట్టిన కేసుల్లో ఆర్నికా- రస్టాక్స్- కాల్కేరియాల కార్బ్‌లు ప్రధాన ఔషధత్రయంగా పరిగణించవచ్చు.

ప్రతి ఇంటిలో జరిగే ప్రమాదాలలో కాలడం ఒకటి కాలినా బొబ్బ పొక్కని చిన్నకేసుల్లో అర్టికా యూరెన్స్ లోషనులో గుడ్డతడిపి కాలిన తావులో పెడితే బాధ తగ్గుతుంది బొబ్బ పొక్కితే షాక్‌నుండి తేరుకోవడానికి ముందుగా ఆర్నికా ఇవ్వాల్సి ఉంటుంది నొప్పితో బాధ పడుతుంటే కాంథారిస్ నొప్పి తగ్గేవరకు ప్రతి పావుగంటకు ఒక డోసు ఇవ్వాలి కాలిన తావున హైపెరికం లోషనులో గుడ్డతడిపి కట్టడంవల్ల ఉపశమనం వుంటుంది

కాలిన కేసుల్లో చాలా ఉపయోగకరమైన మందు కాస్టికం అంటుంది డాక్టర్ డొరోతిషెపర్డ్ కాలిన చోట బాధలు ఎక్కువగా ఉన్నవాళ్ళకు కాస్టికం వాడితే పదినిముషాల్లో బాధలు తగ్గిపోతాయి బాధ తిరగబెట్టినట్లయితే కాస్టికం మళ్ళీ ఇవ్వాల్సి వుంటుంది

# వడదెబ్బ

ఎండాకాలంలో వడదెబ్బ ప్రమాదకరం దీనికి వెంటనే చికిత్స చేయవలసిన అవసరం ఉంటుంది ప్రాణహానికూడా కలగవచ్చు వడదెబ్బ, ఎండలకు సొమ్మసిల్లిపోవడం ఈ రెండింటిని వేరువేరుగా గుర్తించాలి ఎండలో పనిచేసేటప్పుడు చెమట ఎక్కువగా పట్టుతుంది ఇది బయటవేడిని శరీరం తట్టుకోడానికి అవలంబించే రక్షణ చర్య చెమటద్వారా శరీరంలోని లవణాలు బయటికి పోవడంతో అమితమైన నీరసం కండరాల నొప్పులు చోటుచేసుకుంటాయి దీనినే హీట్ ప్రాస్ట్రేషన్ అంటారు వృద్ధులు స్త్రీలు ఈ రకమైన బాధలకు గురి అవుతుంటారు తాగుబోతులకుకూడా ఇది వర్తిస్తుంది గాలిలో తేమ ఎక్కువగా ఉండి ఎండ తీవ్రంగా ఉన్న వాతావరణంలో పనిచేసేవారికి ఎండదెబ్బ తగలడం సహజం ఎండదెబ్బను సూచించే ప్రధానమైన లక్షణాలు తలనొప్పి తల తిరగడం అమితమైన నీరసం స్తిమితంగా ఉండలేకపోవడం చెమటలు జ్వరం ఉండదు ఇది గమనార్హం చర్మం పాలిపోయినట్లుంటుంది చల్లబడిపోతుంది నాడి వేగం అధికం వాంతులుకూడా ఉండవచ్చు. ఎండదెబ్బ తగిలిన రోగులకు ప్రతి పదినిమిషాలకు కొంచెం ఉప్పు కలిపిన నీళ్లు తాగించడం అవసరం దీనివల్ల చెమటద్వారా బయటకుపోయిన సోడియం లవణాన్ని భర్తీ చేసినట్లవుతుంది అదనంగా పళ్లరసంకూడా ఇవ్వొచ్చు. ఎండదెబ్బ తగిలిన రోగిని చల్లని గదిలో ఉంచి ప్రతి పదినిమిషాలకు నాడి శరీర ఉష్ణోగ్రతను పరిశీలించాలి

వడదెబ్బ తగిలిన రోగుల్లో వంటిమీద చెమట ఏమాత్రం ఉండదు వడదెబ్బకు ఇదే మూలం ఆరంభంలో వడదెబ్బ తగిలినవారిలోకూడా హీట్ ప్రాస్ట్రేషన్‌కి సంబంధించిన లక్షణాలే కనిపిస్తాయి ఎండ వేడిమిని తట్టుకోడానికి చెమట పట్టించే ప్రయత్నంలో భాగంగా రక్తప్రసారం అధికమై చర్మం కందిపోయి ఉంటుంది వడదెబ్బ తగిలిన వారిలో మెదడులోని శరీర ఉష్ణోగ్రతను కాపాడే కేంద్రం దెబ్బతింటుంది ఈ కారణంగా శరీర ఉష్ణోగ్రత విపరీతంగా పెరిగిపోతుంది జ్వరం 05 డిగ్రీలనుండి 0 డిగ్రీల ఫారన్‌హీట్ దాకా ఉండవచ్చు హీట్ ప్రాస్ట్రేషన్‌కి వడదెబ్బకు ప్రధానమైన తేడా జ్వరమే జ్వరం కాలిపోతూ ఉండటంవల్ల ప్రధాన అవయవాలైన మెదడు మూత్రపిండాలు కాలేయం శాశ్వతంగా దెబ్బతినిపోవచ్చు. ఒకసారి వడదెబ్బ తగిలిన తరువాత కోలుకోలేక మరణించిన కేసులు వృద్ధుల్లో ఎన్నో ఉన్నాయి మెదడు దెబ్బతినడంవల్ల స్పృహతప్పిపోవడం ఫిట్స్‌కూడా కనపడవచ్చు. పిల్లల్లో వృద్ధుల్లో ఇవి కనపడుతుంటాయి

వడదెబ్బను గుర్తించడానికి ఈ కిందివి ప్రధాన లక్షణాలు ఒళ్లు వేడిగా కాలిపోతుంది జ్వరం 05 నుండి 0 డిగ్రీలదాకా ఉంటుంది చెమట ఉండదు పొడిగా ఉంటుంది దప్పిక ఎక్కువ మగత తలతిప్పు విపరీతమైన తలనొప్పి స్పృహతప్పిపోవడం గురక నాడి వేగంగా కొట్టుకుంటుంది

వడదెబ్బ తగిలిన కేసులకు వెంటనే చికిత్స చేయాలి వారిని తడిగుడ్డలతో చుట్టి పడుకోబెట్టడం మంచిది బాగా గాలి విసురుతుండాలి జ్వరం 0 ° లు వచ్చేదాకా చుట్టిన గుడ్డలు తడుపుతూ విసురుతూ ఉండవలసిందే జ్వరాన్ని ఎంత తొందరగా తగ్గించగలిగితే అంత మంచిది ఇది అవయవాలు దెబ్బతినకుండా ఉండడానికి అవసరమైన చర్య జ్వరం 0 ° రాగానే తడిగుడ్డలు తీసివేసి పొడిగుడ్డలతో కప్పవచ్చు

వడదెబ్బ తగలకుండా చూసుకోవాలంటే ఎండవేడి తేమతో కూడిన గాలి ఉన్న వాతావరణంలో అమితంగా శ్రమించకూడదు కొద్దిగా ఉప్పు కలిపిన నీళ్లను ఎక్కువగా తాగడం మంచిది బాయిలర్లు కొలుములవద్ద పనిచేసేవారికి ఈ జాగ్రత్త అవసరం మద్యపానంచేసేవారు వేసవిలో పగటిపూట తాగటం తగ్గించుకోవాలి వంటగదుల్లో పనిచేసేవారు ఉప్పు కలిపిన నిమ్మరసం తాగడం మంచిది

| లక్షణాలు | ఔషధం |
|---|---|
| ఇది వడదెబ్బకు ముందుగా ఆలోచించదగిన మందు అకస్మాత్తుగా లక్షణాలు కనిపిస్తాయి ముఖం ఎర్రబారి ఉంటుంది అక్కడక్కడ కండరాలలో అదురుడు కళ్లెర్రబారి ఉంటాయి కంటిపాపలు విప్పారిఉంటాయి ఒళ్లు కాలిపోతుంటుంది వంటిమీద చేయివేసి తీసిన కొన్ని క్షణాల తరవాత కూడా అరచేయి కాలిపో | బెల్లడోనా |

తుంటుంది నోరు పొడారి ఉంటుంది జ్వరం విపరీతం రోగి స్తిమితంగా ఉండడు తలతిప్పు, వికారం వాంతులు మాటిమాటికీ మూత్రం పోస్తుంటారు అయితే మూత్రం ఎక్కువ రాదు ఒక్కొక్కసారి తెలియకుండానే మలమూత్రాలు జారీ అవుతుండవచ్చు.

| | |
|---|---|
| ఇది హీట్‌ప్రాస్ట్రేషన్‌కు సరైన మందు ఎండదెబ్బ తగులుతుందా అని అను మానం ఉన్నప్పుడు దీనిని ముఖ్యంగా వృద్ధులకు స్త్రీలకు పిల్లలకు ముందుగానే నిరోధక ఔషధంగా వాడటం మంచిది వేసవి ప్రయాణానికి ఎవరైనా ముందుగా ఈ మందు వాడుకోవడం మంచిదే<br>విపరీతమైన తలనొప్పి, తల వగిలిపోతున్నట్లే అనిపిస్తుంది తల దిమ్ము ముఖం ఎర్రబారి ఉంటుంది రోగి అటూఇటూ కదిలితే బాధలెక్కువ తల పెద్దదయినట్లుగా అనిపిస్తుంటుంది రక్తం తలవైపు ఎక్కువ ప్రసరిస్తుంది కణతల్లోని మెడలోని రక్తనాళాలుఅదురుతుంటాయి గొంతు పట్టుకుపోయినట్లుం టుంది వికారం | గ్లోనాయిన్ |

బెల్లడోనా గ్లోనాయిన్ రోగుల్లో తలకు సంబంధించిన లక్షణాలు ఒకేరకంగాఉన్నా గ్లోనాయిన్ రోగిలో తలనొప్పి అధికం తలనొప్పి రావటం తొందరగానే వస్తుంది తగ్గటంకూడా తొందరగానే తగ్గుతుంది తల వెనక్కి వంచితే బెల్లడోనా రోగికి తలనొప్పి తగ్గుతుంది అదే గ్లోనాయిన్ రోగికి ఎక్కువ అవుతుంది గ్లోనాయిన్ రోగికి తలబాధ ఎక్కువగాఉంటే బెల్లడోనా రోగికి జ్వరం ఎక్కువగా ఉంటుంది

| | |
|---|---|
| ఈ రోగి ఎండ తట్టుకోలేడు వేసవిలో బాధలు ఎక్కువ గొడుగు లేకుండా ఎండలోకి వెళితే తలనొప్పివచ్చే వ్యక్తులకు ఇది మంచి మందు తల వగిలిపోతున్నట్లు బాధపడుతుంటారు ఇది గ్లోనాయిన్ బాధలను గుర్తుచేస్తుంది తలనొప్పి రాబోయే ముందు చూపు బూజర బూజరగా ఉంటుంది ఇది నేట్రంమూర్ ప్రధాన లక్షణం | నేట్రంమూర్ |
| ఎండలో పడుకొన్నందువల్ల వచ్చే బాధలకి ప్రత్యేకమైన మందు ఆందోళన భయం అస్తిమితం ఎక్కువగాఉంటే ఈ మందు వాడుకోవలసి ఉంటుంది తల వేడిగా ఉంటుంది జ్వరం ఎక్కువ ముఖం ఎర్రగా కనబడుతుంది వళ్లంతా తిమ్మిర్లు ఇది ఎకొనైట్‌రోగిలో విశిష్ట లక్షణం ఎండలో తిరిగినందువల్ల వచ్చే పక్షవాత లక్షణాలకు ఇది మంచి మందు | ఎకొనైట్ |
| ఈ రోగికి ఎండ బొత్తిగా గిట్టదు వేసవిలో వచ్చే నీరసానికి ఇది ప్రధానమైన మందు బలహీనతవల్ల శరీరం వణికినట్లుంటుంది తలనొప్పి ముచ్చలిగుంట ప్రాంతాల్లో అధికం నుదురు వగిలిపోతున్నట్లు గుడ్లు ముందుకు పొడుచుకు వస్తున్నట్లు అనిపిస్తుంది కనురెప్పలు బరువుగాఉండి మూతలు పడుతుంటాయి | జెల్సిమియం |
| వడదెబ్బ తగిలి కోలుకొన్న తరువాత వచ్చే బాధలకు ప్రత్యేకమైన మందు ఎండాకాలం ఏపాటి మానసిక శ్రమకు తట్టుకోలేక తలనొప్పితో బాధపడేవారికిది మంచి మందు | నేట్రంకార్బ్ |
| ఎండవల్ల వచ్చే బాధలకి వడదెబ్బకి ఇది మంచి మందు పక్షవాత లక్షణాలు కనబడితే ఇది తప్పక ఆలోచించాలి | లాకిసిస్ |



# విధినిషేధాలు

రోగి అంటే ఒక అవయవ సమాహారమనికాక ప్రతి రోగిని ఒక ప్రత్యేక వ్యక్తిగా పరిగణించాలి ఔషధాలుమన మిత్రులవంటివి మిత్రులను వారి స్వభావాన్ని బట్టి గుర్తిస్తారు ఔషధాల ఎంపికకు వాటి విచిత్ర లక్షణాలే ప్రధానం

సారూప్యతా నియమం వ్యాధిలో ఒక లక్షణానికికాక రోగి లక్షణ సమగ్రతకు వర్తింపచెయ్యాలి హోమియోలో లక్షణాలను మదింపుచేస్తారు మానసిక లక్షణాలు, రోగి యాపత్తుకు వర్తించే ముఖ్యాంశాలు ప్రధమశ్రేణికి చెందిన లక్షణాలు విచిత్ర లక్షణాలు రెండవశ్రేణికి చెందినవి అవయవాలకు వర్తించే లక్షణాలు సాధారణ తరగతికి చెందిన లక్షణాలు మాత్రమే నేను నాకు అని మొదలుపెట్టి వివరించే బాధలు ముఖ్యాంశాలు(Generals)ఉదాహరణకు నాకు ఎండ గిట్టదు నేను అవిధేయతను సహించను లాంటి వివరణలు ముఖ్యాంశాలు నా మోకాలు వాచింద నిచెప్పే విషయం సాధారణ లక్షణం(Particular) రోగి సాధారణ లక్షణాలపైనే నొక్కి చూపిస్తాడు

రోగి తనను గూర్చి వివరించే లక్షణాలు దీర్ఘ వ్యాధుల్లో అతి ముఖ్యమైనవి ఆ లక్షణాలు యంత్రాలు పసిగట్టలేవు తరుణ వ్యాధుల్లో బహిర్గతంగా వ్యక్తమవుతూ మనం చూడగలిగే లక్షణాలపై ఆధారపడి ఔషధాలు ఎంపికచేయవచ్చు

దీర్ఘవ్యాధి రోగులు మందు వేసుకున్నాక వాళ్ళు ఇదివరకెప్పుడో బాధపడి ఈ మధ్యకాలంలో కన్పించ కుండా పున్న లక్షణాలు బహిర్గతంకావచ్చును అంత మాత్రాన వేరే మందు ఇవ్వాల్సిన పనిలేదు బహిర్గతమైన కొత్త లక్షణం చాలా బాధాకరంగావుంటే మాత్రం ఉపశమనానికి కొద్దిపాటి పొటెన్సీలో వేరే ఏదైనా మందు ఇవ్వవచ్చును దీర్ఘరోగి మందు వేసుకున్నాక తాను చెపిన లక్షణాలు వ్యక్తమైన తీరుకు విరుద్ధంగా తగ్గిపోనారంభిస్తాయి ఉదాహరణకు ఒక రోగికి ముందు చర్మవ్యాధి కనబడి తగ్గిపోయి ఉబ్బసంతో బాధపడుతుంటే ఆ రోగికి సరైన ఔషధం వాడినప్పుడు ముందుగా ఉబ్బసం తగ్గిపోయి తెలికగానయినా చర్మవ్యాధి కూడా కన్పించి తగ్గిపోయి సంపూర్ణ స్వస్థత చేకూరుతుంది స్వగ్రామంనుండి పొరుగూరు చేరిన వ్యక్తి స్వస్థలానికి చేరుకోవడానికి ముందుగా పొరుగూరునుండి ఆ చివరి గ్రామాలు దాటి క్రమంగా స్వగ్రామానికి చేరుకున్నట్లు వ్యాధి లక్షణాలు కూడా రోగిలో అవి కనిపించిన వరుసకు విరుద్ధమైన వరుసలో తగ్గిపోతూ స్వస్థత చేకూరుతుంది

స్వస్థత చేకూరే తీరులో మరొక ముఖ్య విషయం గుర్తుంచుకోవాలి లోనుండే ముఖ్యమైన అవయవాలలో బాధలు ముందుగా నివారణ కావాలి తరవాత పై అవయవాలలో బాధలు తగ్గాలి ఉదాహరణకు మెదడు చర్మం తీసుకుంటే పొంగు జ్వరాలలో ముందుగా చర్మంమీద పొంగు అణచడానికి మందులు వాడితే పొంగుతగ్గి

ఫిట్స్ వస్తాయి అది ప్రమాదకరం మెదడుకు ప్రమాదం తగ్గిన తరవాత చర్మంమీద పొంగు తగ్గాలి ఇది ప్రకృతి సహజం ఇది ముందు ఇల్లు శుభ్రంచేసుకుని తరువాత చుట్టూ దొడ్డి శుభ్రంచేసుకోవడంలాంటిదే ఈ అంశాలను హెరింగ్ స్వస్థతా నియమాలని వ్యవహరిస్తారు

హోమియో ఔషధాలలో ఎకొనైట్ ఆర్సెనికం బెల్లడోనా బ్రయోనియా కేమోమిల్లా డల్కామారా జెల్సిమియం ఇపికాక్, రస్టాక్స్‌లాంటి ఔషధాలను తరుణ ఔషధాలుగా వర్గీకరించారు సల్ఫర్ కాల్కేరియా లైకోపోడియం నేట్రంమూర్ సెపియా ఫాస్పరస్ గ్రఫయిటీస్ లేకసిస్ తూజాలాంటి ఔషధాలను దీర్ఘౌషధాలుగా వర్గీకరించారు తరుణ వ్యాధులకు దీర్ఘౌషధాలను వాడడం నిషేధం ఆ విధంగా వాడవలసివస్తే దానికి అనువైన తరుణౌషధం ఎంపికచేసివాడాలి ఉదాహరణకు ఎకొనైట్ - సల్ఫర్ బెల్లడోనా - కాల్కేరియాకార్బ్, బ్రయోనియా - నేట్రంమూర్ ఆర్స్ ఆల్బ్ - తూజా

మందువాడిన తరవాత రోగిలో స్వస్థత చేకూరుతున్నట్లు కన్పిస్తున్నంతకాలం వేచివుండాలి ఆ మందుగాని వేరే ఏ మందుగాని వాడరాదు ఇది హోమియో వైద్యంలో పరమోత్కృష్టమైన నియమం

తరుణ వ్యాధులన్నింటిలో ఈ మందులు 30 పొటెన్సీలో నిరపాయకరంగా వాడుకోవచ్చు. దుష్పలితాలుండవు దీర్ఘవ్యాధుల విషయంలో 30 పొటెన్సీలు ఆపై పొటెన్సీలుకూడా ప్రయోజనకారులు వైద్యుడి సహాయంతో పై పొటెన్సీలు వాడుకోవడం సముచితం

## కొన్ని ముఖ్యసూచనలు

★ హోమియో కిట్‌లోని ఔషధాలు గోళీలరూపంలో ఉంటాయి నాలుగయిదు గోళీలు ఒక డోసుగా పరిగణించవచ్చు.

★ ఎవరి మందువారు అరచేతిలో వేసుకుని నోట్లో వేసుకోవచ్చు. ఇతరులకు ఇచ్చేటప్పుడు మాత్రం శుభ్రమైన తెల్లకాగితం మీదవేసి ఇవ్వాలి గోళీలు నాలుకమీద వేసుకుని చప్పరించాలి నీళ్ళుతాగాల్సిన పనిలేదు

★ మందు వేసుకోటానికి అరగంట ముందుగానీ తర్వాతగానీ ఆహారం కాఫీ టీలు తీసుకోకూడదు

★ తరుణ వ్యాధుల్లో 5 6 గోళీలు ఒకకప్పు నీళ్ళలో వేసి కలిపి 2 3 4 గంటలకొకసారి తీవ్రతను బట్టి మూడునాలుగు చెంచాల ద్రావణం చప్పరించాలి దీర్ఘవ్యాధుల విషయంలో నిపుణుడైన వైద్యుని సలహామేరకు మందులు వాడుకోవడం మంచిది

★ *హోమియో ఔషధాలకు కర్పూరం వాసన తగలకూడదు మందులు వాడేటప్పుడు కర్పూరం కలిసిన పదార్థాలు తినకూడదు*



# ఆర్నికా

కముకు దెబ్బలు
సలగ్గొట్టినట్లు బాధలు
గాయాలలో మంట రక్తస్రావం
కుళ్ళినగాయాలలో నొప్పి
శ్రమవల్ల సొమ్మసిల్లటం
గుండెల్లోనొప్పి
మెదడులో రక్తనాళాలు చిట్లటం
మానసిక శారీరక గాయాలు ఇప్పటివిగావచ్చు ఎప్పటివైనా కావచ్చు

ఈ మందును మీ కిట్‌లో 30 200 ఎం పొటెన్సీలలో వుంచుకోండి ఏ మందు పెట్టుకున్నా పెట్టుకోకపోయినా ఈ ఒక్కటయినా వుంచుకోండి అల్లోపతిలో ఈ మందులేదు ఇది మొక్క నుంచి తయారయ్యే ఔషధం ప్రపంచంలో అన్ని దేశాల్లో కొండ ప్రాంతాల్లో ఈ మొక్కలు పెరుగుతాయి మేకలు గొర్రెలు కొండ ప్రాంతాలలో తిరిగేటప్పుడు దెబ్బలు గాయాలు తగిలితే ఈ మొక్కలను వెతుక్కొని తింటాయన్న విషయం గమనార్హం

దెబ్బతగిలి గాయం అయినా అవకపోయినా షాక్ వాపు నొప్పి తగ్గడానికి ఆర్నికా వాడుకోవాలి దెబ్బతగిలిన వెంటనే పెద్ద పొటెన్సీలో ప్రతి నాలుగుగంటలకు ఒకసారి వాడుకోవాలని డాక్టర్ కెంట్ సూచన బాధలు తగ్గడం మొదలయ్యాక వెంటనే మందు ఆపివేయాలి దెబ్బతగిలిన చోట తడిగుడ్డ చుట్టి వుంచడం మంచిది దెబ్బలకి మొదటి 24 గంటలలో కాపుకాయడం పనికిరాదు

షాక్ తగిలిన రోగులను పడుకోబెట్టాలి షాక్ తగిలిన రోగి ముఖం పాలిపోయి వుంటుంది ఒళ్ళంతా చెమటలు అరిచేతులు అరికాళ్ళలో ఎక్కువ స్పృహతప్పిపోయి వుండవచ్చు వికారం వాంతులు నాడి వేగంగా కొట్టుకొంటుంది రక్తపోటు పడిపోతుంది ఇవన్నీ షాక్‌రోగి లక్షణాలు ఈ రోగిని పడుకోబెట్టి తలభాగంకన్న కాళ్ళు కనీసం ఒక అడుగు ఎత్తుగా వుంచాలి దానివల్ల మెదడుకు రక్తం బాగా అందుతుంది ఈ రోగి స్పృహలో లేనట్లయితే ఒత్తిగిలా పడుకోబెట్టాలి దీనివల్ల చొంగ శ్వాసకు అడ్డంబడకుండా వుంటుంది షాక్‌తిన్న రోగికి స్పృహవుంటే ద్రవపదార్థాలు తాగించాలి పొట్టకు తలకు బలమైన దెబ్బలు గాయాలు తగిలి

షాక్ వచ్చినట్లయితే నోటిద్వారా ద్రవపదార్థాలు ఇవ్వగూడదు పెద్దవాళ్ళకు ప్రతి 5 నిమిషాలకు ఒకసారి గ్లాసు మంచినీళ్ళు ఇవ్వడం మంచిది ఒక గ్లాసు నీళ్ళలో ఒక చెంచా ఉప్పు /2 చెంచా సోడా ఉప్పు కలిపి ఇవ్వడం శ్రేయస్కరం 2 సంవత్సరాల లోపు పిల్లలకు ప్రతి పావుగంటకు పావుగ్లాసు ఇవ్వడం మంచిది పసిపిల్లలకు 5 నిమిషాలకు ఒక ఔన్సు ఇస్తే సరిపోతుంది

స్పృహతప్పిన రోగులను వెంటనే ఆసుపత్రికి తీసుకువెళ్ళాలి సిరలద్వారా రక్తం సెలైన్‌లాంటివి ఎక్కించాల్సి వుంటుంది రక్తస్రావం లాంటివి షాకుకు కారణమైతే దానిని వెంటనే ఆపుచేయాలి హానిమన్‌కు పూర్వమే ఈ మొక్కకు గాయాలకు మంచి మందుగా పేరువుండేది ఈ మందును గాయాలకు దెబ్బలకు మాత్రమే పరిమితం చేయనక్కర్లేదు అధికశ్రమ వల్ల కండరాల్లో నొప్పులకు ఇది వాడుకోవచ్చు. ఎక్కువగా నడవడంవల్ల కాళ్ళల్లో నొప్పులకు కాన్పు తరవాత గర్భకోశ కండరాలు అలిసిపోయి పొత్తికడుపులో నొప్పులకు ఆర్నికా వాడుకోదగిన మందే పెద్ద వయస్సు వచ్చిన తరవాత మొట్టమొదటిసారిగా కాన్పు వచ్చిన స్త్రీలు కాన్పునకు ముందు కాన్పు అయిన వెంటనే ఆర్నికా వాడుకుంటే వారికి హాయిగా వుంటుంది ఆపరేషన్ చేయించుకోబోయేవారు ఆర్నికాను ముందురోజు ఉదయం ఒక డోసు సాయంకాలం ఒక డోసు ఆపరేషన్ అయిన తరవాత రెండురోజులపాటు ఉదయం సాయంకాలం వేసుకొంటే షాక్ రక్తం పోవడం లాంటిది లేకుండా హాయిగా వుంటుంది కముకు దెబ్బలు తగిలి చర్మం కమిలినట్లయితే ఆర్నికా మదర్‌టించర్ ఔన్సు నీటికి 5 చుక్కలు వేసిన ద్రావణంతో తడిపి కట్టుకడితే వాపు నొప్పి త్వరగా తగ్గిపోతాయి గడ్డకట్టిన రక్తం కరిగిపోయి కదుములు తగ్గిపోతాయి చర్మం దోక్కుపోతే ఆర్నికా బదులు కాలెండులా ద్రావకం ఆర్నికా లాగానే నీళ్ళల్లో కలిపి గుడ్డ తడిపి కట్టు కట్టడం మంచిది కండరాల శ్రమవల్ల బడలిక నొప్పులు బెణుకులు కముకు దెబ్బలు రక్తస్రావాలు షాక్‌లాంటి శారీరక బాధలకు ఆర్నికా అమోఘమైన ఔషధం

మానసిక అలసటకి షాక్‌కి ఇది మంచి మందు యాక్సిడెంట్ తరవాత రాత్రిళ్లు నిద్రలో హఠాత్తుగా లేచి పులిక్కిపడడం ఆందోళన కనిపిస్తే ఈ మందు వాడుకోవచ్చు. గుండెపోటు వస్తుందనీ చనిపోతాననీ భయపడి రాత్రిళ్లు నిద్రపట్టక ఆందోళన చెందేవారికి ఈ మందు వాడవచ్చు. అధికంగా మానసిక శ్రమ చేసి అలసటవల్ల ఏకాగ్రత కోల్పోతే ఈ మందు తప్పనిసరిగా వాడుకోవాలి

దెబ్బలు గాయాలు మానిపోయినా నొప్పులు మిగిలిపోతే వాటిని పాతనొప్పులంటారు ఈ నొప్పులకి ప్రధానమైన మందు రస్టాక్స్ ఈ మందు 30 పొటెన్సీలో ఉదయం ఒక డోసు సాయంకాలం ఒక డోసు చొప్పున 4 రోజులపాటు వాడుకోవలసి వుంటుంది

ఎప్పుడో తగిలిన దెబ్బల దుష్ఫలితాలకు ఆర్నికా చాల వుపయోగపడుతుంది తలకెప్పుడో తగిలిన దెబ్బ వలన తలనొప్పి మొండివ్యాధిగా పట్టుకొంటే ఆర్నికా పెద్ద పొటెన్సీలో ఉదయం ఒక డోసు సాయంకాలం ఒక డోసు ఒక్కరోజు మాత్రమే వాడితే తగ్గిపోతుంది

శారీరక మానసిక లక్షణాలను దృష్టిలో పెట్టుకొని సంధితోగూడిన సన్నిపాత జ్వరానికి తీవ్ర మలేరియా లాంటి విషజ్వరాలకు సైతం ఇది వాడుకోదగిన మందు

# 2. లెడంపాల్

గాయాలకు ఇది మంచి మందు ఆర్నికా సరసన ఉంచుకోదగిందే పదునైన వస్తువులు గుచ్చుకున్నా తెగినా ఆ గాయాలకు చీముపట్టినా ఇది బాగా ఉపయోగపడుతుంది కుక్క, పిల్లి ఎలుక కరిచినా దోమకాటుకు తేలు కుట్టినా ఈ మందును ఉపయోగించుకోవలసి వుంటుంది మేకులు కత్తెరలాంటి వాటివల్ల గాయాలు ఏర్పడితే వెంటనే లెడంపాల్ వాడి ధనుర్వాతాన్ని నిరోధించవచ్చు ధనుర్వాతం వచ్చినతరవాత హైపెరికం వాడవలసి వుంటుంది లెడం వాడితే ఎ టి ఎస్ ఇంజెక్షన్ ఇవ్వడం అనవసరం

తుప్పు మేకులు తీగలు గుచ్చుకొని సెప్టిక్ అయి పోట్లు పెడుతుంటే ఈ మందును 30 పొటెన్సీలో ప్రతి అరగంటకు ఒకసారి బాధ తగ్గేవరకు వాడుకోవచ్చు. పోట్లు తగ్గిన తరవాత తిరగపెడితే మళ్ళీ ఈ మందు వాడవలసి వుంటుంది

గాయాల విషయంలో ఆర్నికా లెడంపాల్ కాలెండులా త్రయం చాలా ప్రసిద్ధి దెబ్బవల్ల తగిలిన షాక్‌కి ఆర్నికా ఒక డోసు ముందుగా వాడిన తరవాత ఒకపూట ఆగి పోట్లు తగ్గడానికి లెడంపాల్ ప్రతి 2 గంటలకు ఒక డోసు వాడుకోవచ్చు. గాయాన్ని కాలెండులా లోషన్‌తో కడిగి ఆ లోషనులో ముంచిన గుడ్డతోనే కట్టుకడితే గాయానికి చీమువట్టదు కాలెండులాతో కట్టుకడితే గాయంలో సూక్ష్మజీవులు చేటుచేసుకోవు 4 కప్పుల నీళ్ళలో ఒక చెంచా కాలెండులా మదర్ టించరు కలిపితే కాలెండులా లోషన్ తయారౌతుంది అమెరికన్ సివిల్‌వార్‌లో క్షతగాత్రులైన సైనికులకు కాలెండులాలోషన్‌తో కట్లు కడితే గాయాలు చీమువట్టకుండా తేలికగా నయమైపోయాయనేది డాక్టర్ కారల్‌టన్ వెల్లడించిన సత్యం గాయాల్లో నొప్పి తగ్గడానికి లెడం సెప్టిక్ కాకుండా గాయాలు మానడానికి కాలెండులా చక్కగా పనిచేస్తాయి

లెడంపాల్‌కి ఒక ప్రత్యేకత వుంది గాయాల్లో పోట్లువున్నా చన్నీళ్ళుపోస్తే హాయిగా వుంటుంది ఈ పోట్లు కిందినుంచి పైకి తంతుంటాయి అందువల్లనే తేలు మండ్రగబ్బ లాంటివి కుడితే ప్రతి పావుగంటకు ఒకడోసు వాడి బాధ నివారించుకోవచ్చు. దోమలుకుడితే వచ్చే దద్దుర్లకు ఇది ప్రత్యేకమైన మందు ఈ దద్దుర్లకు ఈ మందు పైపూతగాను 30 పొటెన్సీలో మాత్రలుగా లోనికి తీసుకోవచ్చు.

లెడంపాల్ కీళ్ళనొప్పులకు మంచిమందు కీళ్ళువాచి నీరువట్టి వుంటాయి నొప్పులు పాదాల్లో మడమల్లో ప్రారంభమై క్రమంగా పైకి పాకుతాయి చన్నీళ్ళు తగిలితే ఉపశమనంగా వుంటుంది

తాగుబోతులైన వృద్ధుల్లో తెరలు తెరలుగా వచ్చే దగ్గుకు ఇది ఆలోచించదగిన మందు వీరికి రాత్రిపూట బాధలెక్కువ దువ్వటి కప్పుకోడానికి ఇష్టపడరు

## హైపెరికం

దీనికీ లెడంపాల్‌కీ దగ్గర సంబంధం వుంది లెడంపాల్ వాడినా బాధలు తగ్గకపోతే ఇది వాడుకోవలసి వుంటుంది గాయాలకు చీమువట్టి పోట్లు పెడుతుంటాయి నోరు తెరవడం కూడా కష్టంకావచ్చు. ఇది ధనుర్వాతం వస్తున్నట్లు సూచన ఈ దశలో హైపెరికం వాడడం తప్పనిసరి పెద్ద పొటెన్సీల్లో ప్రతి 4 గంటలకు ఒక డోసుచొప్పున బాధలు వెనక్కు తిరిగేదాకా వాడాలి ఏ ఇంజెక్షన్లతో పనిలేకుండా ధనుర్వాతం తగ్గుతుంది

మెదడుకి వెన్నుపాముకి తగిలిన దెబ్బలకి ఇది ప్రత్యేకమైన మందు కండరాలు నలిగితే ఆర్నికా ప్రత్యేకమైన మందు నరాలు నలిగితే హైపెరికం ప్రత్యేకమైన మందు తలకు దిమ్మతిరిగేటంత దెబ్బతగిలినా కూర్చోబడి ముడ్డిపూసకు దెబ్బతగిలినా కలిగే బాధలకు తప్పక ఈ మందు వాడుకోవలసి వుంటుంది

చేతివేళ్ళు, కాలివేళ్ళు నలిగితే ఇది ప్రత్యేకమైన మందు నలిగినచోట వుండు పడుతుంది వుండు దగ్గరనుండి పోట్లు పైకి తంతుంటాయి కండరాలు నలిగితే ఆర్నికా ఎలా వాడుకోవాలో నరాలు నలిగితే హైపెరికం అలా వాడుకోవాలి

గాయాలు మాన్పడంలో ఇది కాలెండులా లాగా పనిచేస్తుంది కాలెండులా లాగా హైపెరికం లోషను తయారుచేసుకొని కట్లు కట్టడానికి ఉపయోగించుకోవచ్చు. వుండ్లు సెప్టిక్ అయినప్పుడు హైపెరికం లోషన్ వాడడం మంచిది వుండ్లు సెప్టిక్ అయి పోట్లు మొదలయితే ఇది తప్పక వాడుకోవాలి అరిచేతుల్లో ఏదైనా గుచ్చుకొని చీమువట్టి వాచి పోట్లు పెడుతుంటే ఈ మందు బాగా ఉపయోగపడుతుంది

గోరుచుట్టుకు హైపెరికం లోషన్‌పైన పూసి సైలీషియా వాడితే తగ్గిపోతుంది రాచకురుపునకు సెగ్గడ్డలకు హైపెరికం పూతమందుగా వాడుకోవచ్చు.

ఖండిత అవయవాల్లో నొప్పికి ఇది ప్రత్యేకమైన మందు

# ౩ ఎకోనైట్

వసిపిల్లలకు ఇది మంచి మందు తరుణ వ్యాధులకిది ప్రత్యేకమైన ఔషధం
అకస్మాత్తుగా వచ్చే వ్యాధులు చలిగాలి సోకి బాధలొస్తాయి
అకస్మాత్తుగా వచ్చే తీవ్ర జ్వరాలు
తలనొప్పితో కూడిన జలుబు దగ్గు భయం ఆవేదన అస్తిమితం ప్రధాన లక్షణాలు
పుట్టిన శిశువుకు నీరుడు పడకపోతే ఇది ఇవ్వాల్సి వుంటుంది
ఇన్ఫెక్షన్- జ్వరం దాహం ఆందోళన కన్పిస్తుంది
చలిగాలి సోకి రాత్రిపూట తీవ్రమైన దగ్గుతో (క్రూప్) లేచి కూర్చోవటం
తీవ్రంగా వంటినొప్పి చెవిపోటు గొంతునొప్పి న్యయాటికా ఆ రోగికి ఈ మందు
వాడిన తరవాత బాధలు తగ్గి తిరగబెడితే సల్ఫర్ ఇవ్వాల్సి

దీన్ని నాభి అంటారు ఇది చాలా ప్రమాదకరమైన విషపదార్థం ఎంత ప్రమాదకరమైన విషపదార్థమైనా పొటెన్సీరూపంలో అమృతతుల్యంగా హోమియో మలుస్తుంది ఎంత విషమైతే అంత శక్తిమంతమైన ఔషధంగా ఉపయోగపడుతుంది

8వ శతాబ్దం మధ్యదాకా జబ్బేదైనా రక్తం ఓడ్చటం అలవాటు హోమియోపతి ఎకోనైట్‌ను ప్రవేశపెట్టి రక్తం ఓడ్చటం నిరర్థకం అని రుజువు చేసింది

ప్రాచీన కాలం నుంచీ ఎకోనైట్‌ను జ్వరాలు కీళ్ళనొప్పులు సయాటికాలాంటి నొప్పులకు వాడడం ఆనవాయితీగా ఉండేది

జ్వరంవున్నదని ఈ మందు వాడవలసిన పనిలేదు జ్వరంతోబాటు కొన్ని అనుబంధ లక్షణాలు ఉన్నప్పుడే ఈ మందు వాడాలి

ఎకోనైట్ ప్రధానంగా తరుణ వ్యాధులచికిత్సకు పరిమితమైనందున జ్వరంతో కూడిన తరుణవ్యాధులకు ఇది బాగా ఉపయోగపడుతుంది

జ్వరం వ్యాధిని ప్రతిఘటించడానికి శరీరంచేసే ప్రయత్నంగా ఆధునిక వైద్యపరిశోధనలు తెల్పుతు న్నాయి జ్వరం ఉన్నప్పుడు శరీరంలో వ్యాధినిరోధకాలయిన యాంటీబాడీస్ అత్యధిక మోతాదుల్లో తయారౌ తాయి కేవలం జ్వరాన్ని తగ్గించాలని మందులు వాడడం అశాస్త్రీయం జ్వరాలు అనేక కారణాలవల్ల రావచ్చు- సందర్భాన్ని అనుసరించి తగిన మందులు ఎంపికచేసి వాడవలసి ఉంటుంది

ఎకోనైట్ లక్షణాలు హఠాత్తుగా తీవ్రస్థాయిలో వస్తాయి తీవ్రజ్వరం ఆరంభదశల్లో ఉపయోగపడేమందు ఎకోనైట్ ఇన్ఫెక్షన్‌వల్ల వచ్చే జ్వరం ఆరంభదశల్లో మాత్రమే ఇది ఉపయోగపడుతుంది ఈ మందు వాడడానికి అవసరమయ్యే కారణాలు చాలా స్పష్టమైనవి బలమైన గాయంవల్ల కలిగే షాక్కీ చల్లటి పొడిగాలులు తీవ్రమైన ఎండలవల్ల వచ్చే జ్వరానికీ ఎకోనైట్ వాడుకోవాలి ఇది జ్వరం ఆరంభదశలోనే వాడదగిన మందు కాబట్టి డాక్టర్ దగ్గరకు వచ్చేటప్పటికి ఎకోనైట్ వాడవలసిన పరిస్థితి మించిపోతుంది అందువల్ల డాక్టర్లు ఎకోనైట్ వాడటం అరుదు చలిగాలివల్ల ఎండలవల్ల ఎకోనైట్ బాధలు ఎలా మొదలవుతాయో దడుపు తీవ్రమైన కోపంవల్ల కూడా బాధలు వస్తాయి

ఎకోనైట్ లక్షణాలన్నింటిలో అంతర్లీనంగా ఉండే సూత్రం టెన్షన్ అని అంటాడు డాక్టర్ హ్యూజీస్ మానసికస్థాయిలో భయం ఆందోళన అస్తిమితం అతని ఉద్వేగపూరితమైన టెన్షన్‌కు నిదర్శనం రక్తనాళాల్లో టెన్షన్ ముక్కుల్లో రక్తనాళాలు చిట్లి రక్తం కూడా రావచ్చు నాడి వేగంగా బలంగా కొట్టుకొంటుంది కండరాలలో కూడా టెన్షన్ అందుకే గుండెదడ జ్ఞానేంద్రియాల్లో టెన్షన్ సంగీతాన్ని కూడా భరించలేడు టెన్షన్‌వల్ల

మరణభీతి హెచ్చు- ఫలానా టైముకు చనిపోతానని అంటాడు బంధువులందరికీ కబురు పెడతాడు అప్పగింతలుచెబుతుంటాడు. చీకట్లోభయం జనం గుంపులు చూస్తే భయం శారీరక మానసిక అస్తిమితంవల్ల అటూ ఇటూ కొట్టుకుంటుంటాడు కాని బాధలు ఉపశమించవు నొప్పి అసలు ఓర్చుకోలేడు మరణభీతివల్ల నిద్రకూడా పట్టదు

ముఖంలో ఆందోళన- విపరీతమైన తలనొప్పి పడుకున్న రోగి లేచేటప్పటికి తల తిరుగు తుంటుంది

జలుబు హఠాత్తుగా పట్టుకొంటుంది విపరీతమైన తుమ్ములు తలనొప్పి, జ్వరం అధికమైన దప్పిక ఆందోళన భయం ముక్కువెంట రక్తంపడటం కూడా లేదుగావచ్చు. చల్లగాలిలో తిరిగితే పట్టుకొనే ముఖం నరాల్లో నొప్పి, పళ్ళనొప్పికి ఇది మంచి మందు

ఎకోనైట్ రోగుల్లో కడుపులో నొప్పి చల్లటి పానీయాలు తాగితే బాధలు ఎక్కువౌతాయి ఆర్సెనికం రోగుల్లో కూడా ఈ లక్షణం కన్పిస్తుంది ఘాటైన పదార్థాలు బీరు బ్రాందీ అంటే ఇష్టం నోరు చేదు నీళ్ళు తప్ప అన్నీ చేదుగానే ఉంటాయి తీవ్రమైన జ్వరంతో ప్రారంభమయ్యే పసికర్లకు ఇది మంచి మందు

శ్వాసకోశవ్యాధుల్లో ఆరంభదశల్లో ఎకోనైట్ బాగా ఉపయోగపడుతుంది పసిపిల్లలకు పొడిగావున్న చల్లగాలి తగిలితే వచ్చే గొంతువడిశం (లెరింజైటిస్) తెరలు తెరలుగా దగ్గు గొంతు బొంగురుపోవడం జరిగితే ఈ మందు తప్పక వాడుకోవాలి ఈ బాధలన్నీ చలిగాలితగిలినప్పటి నుంచీ ఆరంభమవుతాయి తీవ్రమైన జ్వరం ఊపిరి అందక ఆందోళనతో నిద్రనుంచి లేస్తాడు ఆ బిడ్డకు వెంటనే ప్రతి అరగంటకు ఒక డోసు ఎకోనైట్ వాడవలసి ఉంటుంది

చిన్న పిల్లలున్న ప్రతి ఇంట్లో ఎకోనైట్ బెల్లడోనా కెమోమిల్లా ఉంచుకోవాలి క్లుప్తంగా ఇవి ఎ బి సి అని గుర్తుంచుకోవచ్చు.

చెవి నొప్పి, గొంతునొప్పి, మూత్రావయవాల్లో ఇన్ఫెక్షన్ (యూరినరీ ఇన్ఫెక్షన్) లాంటి వ్యాధుల ఆరంభదశలో ఎకోనైట్ తప్పక వాడుకోదగిన మందు

ఎకోనైట్ బెల్లడోనా వ్యాధి లక్షణాలు హఠాత్తుగా తీవ్రస్థాయిలో ఒక్కపెట్టున మొదలౌతాయి ఎకోనైట్ రోగిలో భయం ఆందోళన స్పష్టంగా కనబడతాయి పంచేంద్రియాలు కూడా సున్నితంగా ఉంటాయి కాని బెల్లడోనా రోగి మందంగా అపస్మారకంగా ఉంటాడు ఎకోనైట్ భయం తీవ్రస్థాయిలో ఉంటుంది

ఆర్సెనికం రోగిలో ఎకోనైట్‌లోలాగా భయాందోళనలుంటాయి కాని ఎకోనైట్ వ్యాధి ఆరంభదశలో తప్ప పనికిరాదు వ్యాధి ముదిరిన తరవాత ఉపయోగపడేది ఆర్సెనికం- ఈరెండు మందులకి దాహం ప్రధానమే కాని ఎకోనైట్ రోగి ఎక్కువనీళ్ళు తాగుతాడు ఆర్స్‌రోగి కేవలం గొంతు తడుపుకొంటాడు

# 4 ఆర్సెనికం ఆల్బ్

నిస్త్రాణ మానసికంగా శారీరకంగా అస్తిమితం -
మంట పెడుతూ ఒరుసుకుపోయే స్రావాలు
వేడికావు హాయిగా వుంటుంది అర్ధరాత్రి బాధలు ఎక్కువ
తిన్నది ఒంటికి పట్టదు క్రమంగా బరువు కోల్పోతారు
పాడైన ఆహారపదార్థాలు తిన్నందువల్ల వాంతులు విరేచనాలు
దాహం ఎక్కువకాని నోరు మాత్రమే మాటి మాటికి తడుపుకొంటారు
చర్మవ్యాధులు చర్మం పొలుసులులాగా లేచి పోతుంటుంది
డయాబెటీస్ పుళ్ళు.
జలుబు ముక్కుకారడం మలేరియా ఆస్త్మా నిమోనియా కాన్సర్

దీనిని పాషాణం అని అంటాం ఇది విషవదార్థంగా మధ్యయుగాల నుండి కూడా అందరికీ తెలును రెండు నుండి అయిదు వడ్లగింజల పరిమాణంలో తీసుకుంటే మరణిస్తారు శాకాహార జంతువులకు ఇది ఎక్కువగా ఉపయోగపడుతుంది మాంసాహార జంతువులకు నక్స్‌వామికా మేలుచేస్తుంది గుర్రాలకు ఆర్స్ ఆల్బ్, గొర్రెలకు పల్సటిల్లా పందులకు యాంటెంక్రూడ్ వాటివాటి తత్వాలకు సరిపోయే మందులు

చిన్నరోగాలకి పెద్దరోగాలకు కూడా ఇది మంచి మందు జలుబు మొదలుకొని కాన్సర్ వరకు ఇది ఉపయోగపడుతుంది వృద్ధులకు శాకాహారులకు లావుపాటి వాళ్ళకు ఇది బాగా పనిచేస్తుంది ప్రతి వ్యాధిలో కొందరికయినా ఆర్సెనికం ఉపయోగపడుతుందన్న విషయం గమనార్హం ఈ మందు వాడుకోడానికి దాని విశిష్టలక్షణాల అవగాహన చాల ముఖ్యం

వ్యాధి అతిశీఘ్రంగా ముదిరిపోతుంటే ఆ రోగికి ఈ మందువాడి మృత్యుముఖం నుంచి బయటపడవే యవచ్చు. రోగి అమితనిస్త్రాణ బలహీనతలో కూడా మానసికంగా శారీరకంగా నిశ్చలంగా వుండలేడు తానుగా కదలలేనప్పటికి ఇతరుల తోడ్పాటుతోనైనా కదలాలంటాడు ఆత్మీయులు ఎంత సపర్య చేసినా ఇంకా అసంతృప్తే ఒంటరిగా వుండలేడు చనిపోతానని భయం మంటలతో కూడిన బాధలు వేడికాపు పశమనంగా వుంటుంది స్రావాలన్నీ మండుతుంటాయి వుండ్లు తీవ్రరూపందాల్చి ఆ భాగం కుళ్ళిపోతుంది ఇదే గాంగ్రీన్ స్రావాలు కంపుకొడుతుంటాయి ఇన్ఫెక్షన్‌తోపాటు రక్తస్రావం రోగి బాధలన్నీ అర్ధరాత్రి 2 గంటల నుండి తెల్లవారు జామున 2 గంటల వరకు అధికం ఉబ్బసం రోగుల్లో ఇది గమనించదగ్గ విషయం ఆర్సెనికం రోగిని పట్టిచ్చే లక్షణాల్లో దప్పిక కూడ చాల ముఖ్యమైనదే మాటిమాటికి నోరుతడు పుకొంటాడు సారాయి పొగాకు వాడడంవల్ల కలిగే దుష్ఫలితాలకు ఈ మందు తప్పక ఆలోచించాలి జంతువుల విషాలకు ఇది మంచి విరుగుడు ఆర్స్‌ఆల్బ్, తూజా లాకిసిస్ తేలు పాముకాట్లకు ఆలోచించదగినవి రోగి తల మినహాయించి ఒళ్ళంతా కప్పుకొంటాడు తలకు చల్లటి గాలి తగిలేట్లుగా కిటికీవద్ద మంచం వేయించుకుంటాడు

విషపూరిత ఆహారం ఫుడ్‌పాయిజనింగ్) వల్ల కలిగే వాంతులు విరేచనాలకి ఇది దివ్యౌషధం కలరా తీవ్రరూపం ధరించాక రోగి దాదాపు చనిపోయేస్థితిలో వుంటాడు ఆ దశలో ఇది అమృతంలాగా పనిచేస్తుంది

విచారం దిగులు అపరాధ భావనతోకూడిన ఆందోళన వ్యాధి తగ్గదని నిరాశ చీకట్లో ఒంటరిగా వుండలేకపోవడం ఇలాంటి లక్షణాలతో కూడిన చిత్తచాంచల్యముంటే ఆర్సెనికం ఎక్కువ పొటెన్సీలో రెండు డోసులు ఇవ్వడం మంచిది ఈ రోగి చిన్న బాధకు కూడ తట్టుకోలేడు ఇది విచిత్రలక్షణం ఆత్మహత్యకు సంబంధించిన ఆలోచనలు వస్తుంటాయి ఆర్స్ రోగి నీరసంలో నీటుగా కనిపిస్తాడు పరిసరాలు నీటుగా వుంచుకొంటాడు ఇది గమనార్హం

జలుబుకు ఇది ప్రసిద్ధిచెందిన ఔషధం మాటిమాటికి జలుబుచేసేవాళ్ళకు ఇది ఇవ్వవచ్చు. జలుబుచేస్తే ముక్కులు జిలపెడుతుంటాయి ఆగకుండా తుమ్ములు ముక్కుపుటాలు పైపెదాలు మండుతుంటాయి ముక్కు వెంట ధారాపాతంగా నీళ్ళలాంటి పడిశం పడిశం చిక్కబడితే బాధలు తగ్గుతాయి చలికాలంలో జలుబుచేస్తే ముందుగా వాడుకోతగ్గ మందు ఇది జలుబు తీవ్రమై గొంతులో నస దగ్గు మొదలవుతాయి గొంతు బొంగురుపోతుంది దగ్గుతో ఉక్కిరిబిక్కిరై అర్ధరాత్రి లేచి కూర్చోవాల్సి వస్తుంది ఎంతాగినా దగ్గు వస్తుంది అర్ధరాత్రివేళ దగ్గువచ్చే ఊపిరితిత్తుల వ్యాధులన్నిటిలో ఇది ఆలోచించదగిన మందు

జీర్ణకోశవ్యాధుల్లో ఆహారం సహించదు ఆహారం పేరుచెబితేనే వికారం ఒక చెంచానీళ్ళు పుచ్చుకొన్నా ఇమడవు పళ్ళు ఐస్‌క్రీమ్‌లాంటివి తింటే బాధలు ఉధృతమవుతాయి వేపుళ్ళు ఇష్టపడతారు నెయ్యి బాగా తాగుతాడు కడుపులో మంట పొట్ట ఉబ్బరం కాపుపెడితే ఉపశమనం తాగుబోతుల్లో వచ్చే ఈ రకమైన పొట్టలో బాధలకు ఇది ప్రత్యేకమైన మందు ఎప్పుడూ బీరుతాగే వాళ్ళ ఇలాంటి బాధలకు కాలీబైక్రోమ్ బాగా వుపయోగపడుతుంది

ఎక్కువగా ఆసనంలో బాధతోకూడిన విరేచనాలకి గ్రహణికి ఇది చాల మంచిమందు శిశువుల్లో వచ్చే

వాంతులు విరేచనాలకి ఇది ముందుగా ఆలోచించదగిందే

ఆననం చిట్లటం (ఫిషర్ మొలలవ్యాధితో ఆననంలో విపరీతమైన మంట కూడా వుంటే ఈ మందు వాడుకోవచ్చు.

మూత్రపిండాలు మూత్రకోశంలో ఇన్ఫెక్షన్ మూత్రం జారీ అయ్యేటప్పుడు భరించరాని మంట మూత్రం చాల కొద్దిగా జారీ అవుతుంటే ఆర్స్ వాడుకోవచ్చు. రక్తంతో కూడిన మూత్రం వచ్చేవ్యాధుల్లో ఇది ఆలోచించదగ్గది

క్రమం తప్పి బహిష్టులుకావడం మైల ధారాపాతంగా కావడం కంపుగొట్టమైల ఈ లక్షణాలతో కూడిన గర్భకోశ కాన్సరు ఆరంభదశలో ఆర్స్ఆల్బ్ వాడుకొంటే వ్యాధినివారణ అవుతుంది గర్భకోశంపూత దుర్వాసనతోగూడిన తెల్లకుసుమ మంట వుంటే ఈ మందు వాడుకోవచ్చు.

వెల్లకిలావడుకోలేకపోవడం కొద్దిపాటి శ్రమకు కూడ దడ ఆయాసం గుండె బలహీనత మూత్రం సాఫీగా జారీకాకపోవడం ఇలాంటి లక్షణాలతోగూడిన గుండె జబ్బుకు ఇది మంచి మందు

ఒంటికి నీరు పడితే ఆర్సెనికం ఆల్బ్ వాడుకోవచ్చు. గుండె కండరాలకు టానిక్‌లాగా పనిచేసి వంట్లో నీరు లాగివేస్తుంది కొండలలో నివసించే కొన్ని జాతుల వారు బరువులు మోసుకుంటూ కొండలు తేలికగా ఎక్కి దిగటానికి ఆర్స్ఆల్బ్‌ను సూక్ష్మమోతాదులలో టానిక్‌గా వాడుకుంటారు చర్మవ్యాధులలో కూడ ఇది వాడతారు పొలుసులు రేగే చర్మవ్యాధులలో ఇది బాగా వుపయోగిస్తుంది తామర సోరియాసిస్‌లాంటి వ్యాధులకు ఇది మంచి మందు విపరీతమైన మంట దురదవుంటే ఈ మందు తప్పకవాడుకోవచ్చు. సాధారణంగా అర్ధరాత్రప్పుడు దిగపోత చెమటలుంటాయి

ఆర్సెనికం రోగిది చలి తట్టుకోలేని తత్వం తేమగాలి సముద్రతీరం చల్లటి ఆహారం చల్లటి పానీయాలు ఈ రోగికి గిట్టవు ఆర్సెనికంరోగి బాధలు అర్ధరాత్రి పెరుగుతాయి లేచి అటూ ఇటూ తిరుగుతాడు

---

# టా యాంటింటార్ట్

శిశువులలో వృద్ధులలో బ్రాంకైటిస్‌కిది ప్రత్యేకమైన మందు
ఊపిరితిత్తులనిండా కఫం దగ్గితే తెగిపడక ఉక్కిరిబిక్కిరి అవుతుంటారు
ఛాతీలో గురగురలు
రోగి నిద్రమత్తుతో అపస్మార రోగిలా కన్పిస్తాడు ముఖం పాలిపోయి వుంటుంది
కఫంతో నిండిన శ్వాసకోశవ్యాధుల అంతిమక్షణాలలో గరళంలాగా పనిచేస్తుంది
దగ్గితే కఫంపడిపోయే బ్రాంకైటిస్ రోగికి ఇపికాక్
కఫం పడనట్లయితే యాంటింటార్ట్
వికారం ఎక్కువ నిస్త్రాణ - వాంతయితే బాధలు తగ్గిపోతాయి

ఈమందు పసిపిల్లలకు వృద్ధులకు బాగా ఉపయోగపడుతుంది బలహీనంగా ఉన్న వ్యక్తులకు అకస్మాత్తుగా పట్టుకొనే దగ్గు నిమోనియా కోరింతదగ్గు విరేచనాలలాంటి వ్యాధులకు ఈ మందు ఆలోచించవలసి ఉంటుంది

అమితమైన నీరసం ఆపుకోలేని నిద్ర చల్లని చిరు చెమటలు ఈ రోగిలో కనపడే విశిష్ఠ లక్షణాలు ఈ రోగికి చిరాకు చాలా ఎక్కువ

పిల్లలు చీకాకుగా ఉంటారు ప్రతి విషయానికి ననుగుతుంటారు ఎవరైనా వారి జోలికిపోతే ఏడుపు లంకించుకుంటారు పిల్లలకు అజీర్తి పట్టుకుంటే పల్సటిల్లా కేమోమిల్లా యాంటింటార్ట్ వాడుకోవాలి

వల్సటిల్లా బిడ్డ చూసేవాళ్లకు జాలి కలిగించేవిధంగా నున్నితంగా ఉంటుంది ఎవ్వరైనా దగ్గరకుతీస్తే ఏడుపు అవుతుంది కేమోమిల్లా రోగికి చిర్రుబుర్రులు ఎక్కువ చేతిలో ఏదుంటే అది గిరాటు కొడతారు ఎత్తుకున్నా ఒకరిదగ్గర కుదురుగా ఉండరు ఎదుటివ్యక్తి ఎత్తుకొనేవరకు ఊరుకోరు అక్కడా స్తిమితంగా ఉండరు యాంటింటార్ట్ రోగి మనస్తత్వం వల్సటిల్లా కేమోమిల్లా రోగులకన్నా భిన్నమైనది వీళ్లకు విసుగే ఎక్కువ కాని వాళ్ల నంగతి ఎవ్వరూ వట్టించుకోకూడదు

ఈ రోగులకు చొంగ ఎక్కువ దోకులు విపరీతం బలవంతంగా తిండిపెడితే వాంతి చేసుకుంటారు నీరసించి సొమ్మసిల్లి ఉంటారు ఒళ్లు చల్లగాఉండి ముఖంమీద చెమటలు ఉంటాయి మామూలుగా దోకులు తగ్గటానికి ఇపికాక్ మంచి మందు వాంతి అయితే యాంటింటార్ట్ రోగికి వికారపెట్టడం తగ్గిపోతుంది అదే ఇపికాక్ రోగిలో వాంతి అయినా వికారం తగ్గదు ఇది గమనార్హం

అజీర్తి బాధ ఉన్నప్పుడు పుల్లటి వదార్థాలంటే ఇష్టం పాలంటే అసలు గిట్టదు పైగా వాంతి చేసుకుంటారు నాలుక మీద తెల్లటి మందం ఉంటుంది

కడుపునొప్పి, వలచటి విరేచనాలు విరేచనంలో జిగురు అప్పుడప్పుడు రక్తంకూడా కన్పించవచ్చు. పిల్లల వేనవి విరేచనాలకు ఇది దివ్యౌషధం విరేచనాలతోపాటు వాంతులు నీరసం చెమటలుకూడా ఉన్నట్లయితే ఇది ప్రత్యేకమైన మందుగా చెప్పుకోవచ్చు. కలరా గ్యాస్ట్రోఎంటరయిటిస్‌కి ఇదితప్ప వేరే మందు వాడవలసిన అవసరం రాలేదని అనుభవపూర్వకంగా డాక్టర్ నాష్ చెప్పిందే

ఊపిరితిత్తుల బాధలకు కూడా ఇది మంచి మందు బ్రాంకైటిస్ నిమోనియా ఉబ్బసం కోరింతదగ్గు రోగులకు ఇది వాడుకోవచ్చు. ఊపిరితిత్తులలో నిమ్ముచేరి దగ్గినా కఫం తెగక బాధపడుతుంటే ఈ మందు ఆలోచించాలి కాని నిస్త్రాణ చెమటలు ఆపుకోలేని నిద్ర కన్పించే రోగులకుమాత్రమే ఇది వాడవలసి ఉంటుంది

కోపంవచ్చినా ఏడుపు వచ్చినా దగ్గు తెరలు మొదలవుతాయి ఈ లక్షణం ఉన్న కోరింతదగ్గురోగికి యాంటింటార్ట్ వాడాలి దగ్గుతెర తగ్గిపోయిన తరువాత బిడ్డ నిద్రపోతుంది ఇది ఈ మందు లక్షణం

వాతావరణంలో తేమ ఉంటే ఈ రోగులకు జలుబు తేలికగా వట్టుకొంటుంది అది బ్రాంకైటిస్ నిమోనియాలోకి మారుతుంది నీరసం కళ్లు మూసుకుపోయే మగత కదిలిస్తే కోపం చెమటలు ఛాతీలో నిమ్ము కన్పిస్తాయి దగ్గినా కళ్లె రాదు పడుకోలేరు పడుకొంటే ఆయాసం పొట్టఉబ్బరం ఆకలి ఉండదు దాహంకూడా తక్కువ ఆహారం అంటే వికారం పాలు అసలే గిట్టవు

ఈ మందు మశూచికానికి బొబ్బలలాగా చీముపొక్కులుండే చర్మవ్యాధికి ప్రత్యేకమైన మందు ఈ రోగికి నడుం నిలవదు ఏపాటి కదలికకైనా నొప్పి ఎక్కువ అవుతుంది ఈ నొప్పితోబాటు నీరసం దోకులు చెమట ఉంటే ఇది తప్పక ఇవ్వవలసి ఉంటుంది

ప్రసవించగానే శిశువు ఏడవకుండా నీలంగా ఉంటే ఇది తప్పక వాడుకోవాలి

# 6 బెల్లడోన్నా

అకస్మాత్తుగా వచ్చే బాధలు
ఇన్ఫెక్షన్ జ్వరం వాపు ఎరుపు నొప్పి, గొంతులో బాధ
టాన్సిల్స్‌వాపు సెగ్గడ్డలు అపెండిక్సు వాపు
బాధ ఓర్చుకోలేరు అపస్మారం పిల్లల్లో ఫిట్స్ కీళ్లవాపు జ్వరం
కదిలితే బాధలెక్కువ తలనొప్పి, తలకుగుడ్డ కట్టుకొంటే హాయిగా వుంటుంది
పడక కుర్చీలో చేరగిలి పడుకోవాలనిపిస్తుంది ముందుకు వంగితే బాధలు
చల్లదనం గిట్టదు

బెల్లడోన్నా ఔషధాన్ని కనుక్కోకపోయినట్లయితే హోమియో వైద్యానికి ఇంత పేరు ప్రఖ్యాతులు వచ్చేవి కావు ఇది ఎకోనైట్ (వననాభి ని పోలినమందే పసిపిల్లలు ఇంట్లో వుంటే ఎకోనైట్ బెల్లడోన్నా కేమోమిల్లా ఈ

మూడు మందులు తప్పనిసరిగా ఇంట్లో వుంచుకోవాల్సిందే ఇది ప్రధానంగా మెదడుకు మందు మెదడు వాపునకు ఇది ప్రత్యేకమైన మందు మెదడు అంతగాలేని గొర్రెలు కుందేళ్లపై ఈ మందు ప్రభావం మానవులమీద ఉన్నంతగా లేదు మానవులకు వాడే మందుల ధర్మాలను నిర్ధారించడానికి వాటితో మానవులపైనే ప్రయోగాలు జరపాలనడానికి ఈ మందే గొప్ప నిదర్శనం బెల్లడోన్నా రోగినాడులు జ్ఞానేంద్రియనాడులతో సహా బహుసున్నితం వెలుతురు శబ్దం స్పర్శ కొద్దిపాటి కుదుపు కూడా ఈ రోగి సహించలేడు ఏపాటి చలి భరించలేడు చల్లటి గాలిలో తిరిగినా చన్నీళ్లతో తలకడుక్కొన్నా ఈ రోగికి బాధలు లంకించుకుంటాయి

బాధలు తీవ్రంగా వుంటాయి బాదలు ఏ రకమైనవైనా కావచ్చు అకస్మాత్తుగా వస్తాయి ఈ రోగికి ఉద్రేకం తత్తరజాస్తి బిడ్డ ఒక నిమిషంలో ఆడుకొంటూ ఉల్లాసంగా ఉంటుంది మరో నిమిషంలో పెద్దజ్వరం ఒళ్ళు కాలిపోతుంటుంది ఫిట్స్ కూడా తోడు కావచ్చు ఈ కేసులకు తప్పక బెల్లడోన్నా వాడాలి 30 పొటెన్సీలో గంట గంటకు జ్వరం వెనకాడేవరకు 6 7 డోసులయినా ఇవ్వాల్సి వుంటుంది పసిపిల్లల్లో ఈ రకమైన జ్వరాలు తరచుగా చూస్తుంటాం అందుకే బెల్లడోన్నా ప్రతి ఇంట్లో వుండాలి ఈ రకంగా బాధలు తరచుగా వస్తుంటే ఈ బిడ్డల పొట్టలో క్రిములు (వరమ్స్) అనుమానించాలి ఈ సందర్భంలో సినా మంచి మందు

మెదడు అనగానే తెలివికి సంబంధించి అపస్మారం ఉన్మాదం గుర్తుకొస్తాయి బెల్లడోన్నా రోగిలో అపస్మారం (డెలీరియం) ఉన్మాదం (మానియా) కూడా ప్రధాన లక్షణాలే మూలుగుడు ఉలిక్కిపడడం ఈ రోగిలో కనబడతాయి మూలుగుతుండే రోగికి ముందుగా బెల్లడోన్నా ఇస్తే వెంటనే వ్యాధి వెనకాడుతుంది వ్యాధి పేరు ఏదైనా ఫరవాలేదు అకస్మాత్తుగా జ్వరంవట్టుకొని అపస్మారక స్థితిలో రోగి మూలుగుతుంటే బెల్లడోన్నా ఇస్తే మీరు ఆ రోగిని మృత్యుముఖం నుంచి తప్పించినట్లే

ఉన్మాదానికి ఆరంభదశలో ఇది మంచి మందు దగ్గరవుతున్న వాళ్లను కొరకడం కొట్టడంలాంటివి చేస్తారు అపస్మారం అనగానే బెల్లడోన్నాతోపాటు హయోసియామస్ స్ట్రమోనియం గుర్తుంచుకోవాలి టైఫాయిడ్ జ్వరంలో అపస్మారానికి హయోసియామస్ మంచిమందు స్ట్రమోనియం రోగికి చీకటంటే భయం ఇన్ఫెక్షన్ ఆరంభదశలో జ్వరం గొంతునొప్పి, చెవిపోటు మూత్ర సంబంధమైన బాధలు (యూరినల్ ఇన్ఫెక్షన్) చర్మం మీద దద్దు రావచ్చు. రోగిని తాకితే వేడి ముఖం ఎర్రబారి వుంటుంది వాపు అదురుతున్నట్లు నొప్పి ఇవి కనబడితే తప్పక బెల్లడోన్నా ఇవ్వాల్సి వుంటుంది ఇన్ఫెక్షన్ మొదలైన తాపులకు రక్తప్రసారం అధికం కావడమే పై బాధలకు కూడా కారణం నొప్పికి బెల్లడోన్నా మంచిమందు తలనొప్పికి ఇది బాగా ఉపయోగపడుతుంది తలకదిలితే నొప్పి, వెలుతురు చూడలేడు శబ్దం వినలేడు పడుకుంటే తలబాధ ఎక్కువ కూర్చొని తలవెనక్కు పెట్టుకొని తలకు తుండుగుడ్డ చుట్టుకుకూర్చొంటే హాయిగా వుంటుంది ఈ రోగులకు బి పి కూడా వుండవచ్చు ఈ రకమైన తలబాధకు బెల్లడోన్నా వాడుకోవచ్చు.

యుక్తవయస్సు పిల్లల్లో బహిష్టు సమయంలో కనిపించే నొప్పికి కూడా ఈ మందు వాడుకోవచ్చు మెరవులాగా వచ్చి తగ్గిపోయే నొప్పులన్నింటికి ఇది మంచి మందు ఇలాంటి నొప్పులకు మెగ్నీషియా ఫాస్ కూడా వాడుకోదగిందే

బెల్లడోన్నా రోగికి గొంతు బాధలెక్కువ నోరు గొంతు పొడారిపోతాయి మింగుతున్నా మాట్లాడుతున్నా నొప్పి టాన్సిల్స్ వాచి ఎర్రగా ఉండి మింగుతున్నప్పుడు నొప్పి పెడుతుంటే ముందుగాఈమందు వాడుకోవాలి ఇది వాడుకొంటేటాన్సిల్స్ ఆపరేషన్ అవసరం రాదు మొదట నిర్లక్ష్యం చేసివుంటే ఫైటోలక్కా మెర్క్యూరీ వాడుకోవలసిరావచ్చు

ఇదే విధంగా చెవిపోటు ఆరంభదశలో ఈ మందు వాడితే గూబచిల్లిపడి చీముకారే పరిస్థితి రాదు ఎపెండిక్స్ ఇన్ఫెక్షన్ వలన పొట్టలో అకస్మాత్తుగా నొప్పి, తీవ్రంగా జ్వరం వస్తే ఆదిలోనే బెల్లడోన్నా గంట గంటకు ఒక డోసు వాడితే 24 గంటల జబ్బు వచ్చిందని ఆపరేషను చేయవలసిన అవసరంరాదు

బెల్లడోన్నా అవసరం పడే బాధలన్నీ అకస్మాత్తుగా తీవ్రంగా ఆరంభమై పగటిపూటకన్నా రాత్రిళ్లు అధికంగా ఉంటాయి రోగి మొదట ఉద్రేకంగా ఉన్నా పోనుపోను అపస్మారకంగా ఉంటాడు మధ్య మధ్య నిద్రపట్టినా నిద్రలో భయంకరమైన కలలు ఉలికిపాటు కనిపిస్తాయి శ్వాసావయవాలలో ఇన్ఫెక్షన్ వల్ల

స్వరపేటిక వాచి పొడిదగ్గు వస్తుంది దగ్గు రాత్రిపూట జాస్తి ఈ స్థితికి ఫాస్ఫరస్ కూడా గుర్తుంచుకోదగ్గ మందు బెల్లడోన్నా రోగికి నిమోనియా కూడా రావచ్చు ఈ సందర్భంలో వైద్యుని సంప్రదించడం అవసరం

బెల్లడోన్నా జ్వరలక్షణాలు గమనార్హం ఒళ్లు కాలుతుంటుంది ఒంటిమీద చేయిపెట్టి తీసిన కొన్ని క్షణాలదాకా చేయికాలుతుంది తలవేడిగా ముఖం ఎర్రగా వుంటుంది తలలో చెమటలు ఒంటిమీద బట్టలున్నచోట చెమట కాళ్ళు చల్లగా ఉంటాయి రోగి మూలుగుతుంటాడు వడదెబ్బకి ఇది దివ్యౌషధం దంతాలు వచ్చే సమయంలో పిల్లలకు ఫిట్స్ వస్తుంటే ఈ మందు వాడుకోవచ్చు.

# 7 బ్రయోనియా

కదిలితే బాధలు ఒత్తిడి హాయిగా వుంటుంది
చల్లగాలి చన్నీళ్ళు ఉపశాంతినిస్తాయి
జిగురుపొరలు పొడారిపోతాయి పెదాలు ఆరిపోయి వుంటాయి
దాహం ఎక్కువ నాలుక మీద మందం
అజీర్తి మలబద్ధకం మలం పెంటికలు కడుతుంది
తల పగలకొడుతున్నట్లు నొప్పి ఛాతీలో పోట్లు
కండరాలలో పోట్లు నడుం నొప్పి
బ్రాంకైటిస్ పొడిదగ్గు
బహిష్టు సమయంలో స్తనాల్లో నొప్పి

బ్రయోనియా ఒక పాలీక్రెస్ట్ అనేక రకాలయిన వ్యాధులను నివారించగల ఔషధాలను హోమియోలో పాలీక్రెస్టలని పిలుస్తారు తరుణ వ్యాధులకు ఉపయోగపడే ఔషధాలలో దీనికి ప్రత్యేకమైన స్థానముంది ఎకోనైట్ బెల్లడోనా జెల్సిమియం బాప్టీజియా రస్టాక్స్ మొదలయిన ఔషధాలు ఈ కోవకి చెందినవే వ్యాధుల పేర్లనిబట్టి గాక రోగిలో కన్పించే కొన్ని విశిష్ట లక్షణాలనుబట్టి హోమియో ఔషధాలను ఎంపిక చేయాలి రోగిలో ఈ విశిష్ట లక్షణాలున్నప్పుడు వ్యాధిని ఏ పేరుతో పిలిచినా ఆ రోగికి ఈ ఔషధాన్నిచ్చి రోగాన్ని నయం చేయవచ్చు

బ్రయోనియాను పట్టిచ్చే విశిష్ట లక్షణాలలో మొదటిది కదలిక వల్ల బాధలు అతిశయించటం బ్రయోనియా రోగికి శరీరంలో కదలిక లేకపోవడమే గాకుండా మనను కూడా ప్రశాంతంగా వుండాలి రోగి కదిలినా ఆలోచించినా జ్వరం తలనొప్పిలాంటి బాధలు అధికమవుతాయి అందువల్లనే బ్రయోనియా రోగి పలకరిస్తే విసుక్కుంటాడు రెండో విశిష్ట లక్షణం స్రావాలు ఆరిపోవడం జిగురుపొరలు పొడిగా వుంటాయి నోరు ఆర్చుకుపోతుంది దప్పిక ఎక్కువ నీళ్ళు ఎక్కువగా తాగుతాడు ఇదే ఆర్సెనికం ఆల్బ్ రోగి అయితే దప్పికవున్నా మాటిమాటికి నోరు తడుపుకొంటాడు బ్రయోనియా రోగిలో పేగుల్లోని స్రావాలు హరించుకు పోవడంవల్ల మలం గట్టిపడిపోయి మలబద్ధకానికి దారితీస్తుంది ఈ రోగి దగ్గు కూడా పొడిగా వుంటుంది కఫం రాదు బ్రయోనియా రోగిలో మూడవ విశిష్ట లక్షణం- ముఖ్యంగా ఛాతీ భాగంలో చురుకులు పోట్లు గాలి పీల్చినప్పుడు ఈ బాధలెక్కువౌతాయి బ్రయోనియా నిమోనియాని పట్టిచ్చేది ఛాతీలోని చురుకులు పోట్లే బ్రయోనియా బాధలు రాత్రి 9 గంటలప్పుడు ఆర్సెనికం ఆల్బ్ రోగిలో అర్ధరాత్రి 2 ఒంటిగంటల మధ్య బాధలు ఉద్రేకిస్తాయి పొడిగా వుండే చలి గాలివల్ల బ్రయోనియా రోగిలో బాధలు అతిశయిస్తాయి ఎకోనైట్‌లో కూడ ఈ లక్షణం గమనించవచ్చు

హోమియో వైద్యంలో జ్వరానికి ముందుగా ఎకోనైట్ బెల్లడోన్నాలు సాధారణంగా వాడుతుంటారు హఠాత్తుగా ఉధృతంగా వచ్చే జ్వరాలకు ముందుగా ఆలోచించదగిన మందులు ఇవే బాధలు క్రమంగా ఎక్కువౌతూ వచ్చే జ్వరాల్లో వాడతగిన మందు బ్రయోనియా ఫ్లూజ్వరానికి నిమోనియా టైఫాయిడ్ కీళ్లవాతంతో వచ్చే జ్వరాలకు (రుమాటిక్ ఫీవర్) బ్రయోనియా ప్రత్యేకమైన మందు

ఈ రోగికి కోపం ఎక్కువ తేలికగా ఆందోళనపడే స్వభావం- ఇంటి విషయాలను గూర్చి, భవిష్యత్తును గూర్చి ఆందోళన బెంగ పెట్టుకుంటాడు ఎకోనైట్ రోగిలో కూడా ఆందోళన కొట్టవచ్చినట్లు కనబడుతుంది ఔషధాలను విశ్లేషించేటప్పుడు ఈ వివరాలు తెలుసుకోవడం అవసరం బ్రయోనియా మానసిక లక్షణాలు గుర్తించి పైన చెప్పిన విశిష్ట లక్షణాలున్న రోగికి జ్వరం ఎలాంటిదైనా బ్రయోనియా వాడి సత్ఫలితాలు సాధించవచ్చు.

జ్వరానికే కాకుండా అజీర్ణానికి కూడా బ్రయోనియా మంచి మందు నక్స్ వల్సాటిల్లా కూడా అజీర్తికి మంచి మందులే బ్రయోనియా రోగి అతిగా తిని బాధలు కొనితెచ్చుకొంటాడు నోరు చేదు నాలుక మీద తెల్లటి మందం వుంటుంది పొట్టలో రాయి పెట్టినట్లుంటుంది తేపులొచ్చినా అపానవాయువు బయటకు పోతున్నా హాయిగావుంటుంది మలబద్ధకం మలం పెంటికలు కట్టుతుంది తీపి చాలా ఇష్టం తింటే పొట్ట ఉబ్బరం చల్లటి పానీయాలన్నా ఇష్టమే కాని తాగిన తరవాత అవస్థపడతాడు ఈ రోగికి వేసవికాలంలో కూల్‌డ్రింక్స్ తాగితే విరేచనాలు పట్టుకొంటాయి వెచ్చటి వాతావరణంలో తలనొప్పి కీళ్ళనొప్పులు దగ్గు ఎక్కువౌతాయి ఈ బాధలున్నప్పుడు గదిలోకంటే ఆరుబయటే హాయిగా వుంటుంది రోగికి కొన్నికొన్ని గిట్టకపోయినా వాటివల్ల అవయవాలలోని బాధలు తగ్గవచ్చు. అవయవధర్మాలనుబట్టి రోగి తత్వాన్ని కనుక్కోలేమనడానికి ఇలాంటి నిదర్శనాలెన్నో వున్నాయి

పొంగు జ్వరానికిది మంచి మందు పొంగు సరిగా బయటపడకపోతే ఈ మందు వాడితే పొంగు పూర్తిగా బయటికొస్తుంది రోగికి హాయి చేకూరుతుంది జ్వరం కూడా తగ్గిపోతుంది

చనుబాల జ్వరాని (మిల్క్ ఫీవర్)కిది ప్రధానమైన మందు

# ☙నక్స్‌వామికా

నవనాగరికులకు ఇది ప్రత్యేకమైన మందు
ఒళ్లు కదలకుండా కూర్చొని పనిచేసే వారికిది ఇవ్వాల్సి ఉంటుంది
ఆహారంకన్నా కాఫీ మద్యంలాంటివాటిమీద ప్రీతి ఎక్కువ
మద్యం సేవించినవారికి మరునటి రోజు వచ్చే బాధలకు ఇది ఆలోచించాలి
అజీర్తి, మలబద్ధకం అకారణంగా తలనొప్పి మలలు
నిద్ర తక్కువ తెల్లవారు జామున లేచి కూర్చొంటారు
ఆకలి ఉంటుంది తినబుద్ధిగాదు తిన్నవెంటనే ఒక గంటసేపు బాధ పడతారు
నోరు పులుపు చేదు ఉదయంపూట పసరు వాంతులు తలనొప్పి
విరేచనం సాఫీగాకాదు
బహిష్టులు ముందే వస్తాయి మైలబారుకు అవుతుంటుంది మైల జాస్తి
కోపిష్టి. ఎప్పుడూ ఏదో ఒకమందు తింటుంటారు

ఇది ముషిణికాయ నుంచి తయారవుతుంది ఇది హానిమన్ ప్రవేశపెట్టిన మందు హానిమన్ ఈ మందును తన మీద తన కుమారుని మీద శిష్యబృందం మీద ప్రయోగించి లక్షణాలను కనుక్కొన్నాడు ఈ మందుని పాలీక్రెస్టు ఔషధాలలోనే ప్రధానమైనదిగా చెప్పుకోవచ్చు నాగరికత తెచ్చిపెట్టిన జబ్బులకిది ముఖ్యమైన మందు శరీర శ్రమ ఎరగకుండా ఎప్పుడూ ఆఫీసుల్లో పనిచేసే వాళ్ళకి వ్యాపార లావాదేవీల్లో తలమునకలయ్యే వాళ్ళకి ఈ మందు బాగా ఉపయోగపడుతుంది మానసిక శ్రమను మరిచిపోవడానికి కాఫీ టీ విస్కీ బ్రాందీలకు వీరు బానిసలౌతారు వీరికి స్త్రీ వ్యసనం కూడా మెండే వేపుళ్ళు మసాలాలంటే వీరికి ప్రాణం విలాస జీవితానికి అలవాటుపడి ఏ రాత్రివేళో పడుకొంటారు మానసికశ్రమ మరిచిపోవడానికి ఎక్కువగా పొగ తాగుతుంటారు ఈ అలవాట్లవల్ల క్రమంగా ఆకలి మందగిస్తుంది టానిక్కులు కావాలి మలబద్ధకం విరేచనం అవడానికి ఎప్పుడూ మందులు పుచ్చుకుంటారు బరువు బాధ్యతలు పెంచుకోవటంవల్ల విసుగు కోపం

పెరిగిపోతుంటాయి సాధారణంగా ఈ జీవనసరళి పురుషుల్లో ఎక్కువ అందుకే నక్స్‌వామికా ప్రధానంగా పురుషుల ఔషదంగా చెబుతారు పల్సటిల్లా ప్రధానంగా స్త్రీల ఔషదం

నక్స్ రోగులు ఉద్రేకపరులు వీరికి టెన్షన్ జాస్తి టెన్షన్‌వల్ల వీరికి కోపం వస్తుంది ఎకోనైట్ రోగుల్లో కూడా టెనన్ జాస్తి వారికి టెన్షన్ వలన ఆందోళన ఈ రెండూ బిపి రోగులకి మంచి మందులే ఆయా తత్వాలనుబట్టి ఈ మందులు వాడుకోవలసి వుంటుంది

ఈ రోగికి ఎప్పుడూ తన ఆరోగ్యాన్ని గురించే చింత దాంతో చుట్టూవున్న వాళ్ళని కసురుకుంటాడు సొంత బంధువుల మీద ఇంకా విసుక్కుంటాడు హత్యకు సంబంధించిన ఆలోచనలు వస్తుంటాయి

పట్టుదల సంఘంలో పైకి పోవాలనే దీక్ష నక్స్ ప్రధాన లక్షణాలు సంఘంలో నాయకులంతా నక్స్ తత్వం వున్నవాళ్ళే కాఫీ టీ విస్కీలాంటి ఉత్తేజకరమైన పానీయాలకు అలవాటుపడడం కూడ దీక్ష సడలకుండా వుండడానికేమోననిపిస్తుంది శుభ్రంగా వుండడం పరిసరాలను పరిశుభ్రంగా వుంచుకోవడం నక్స్ స్వభావం ఇదె లక్షణం ఆర్స్ ఆల్బ్ రోగులకు కూడ వుంది

నక్స్‌రోగిది చాలా సున్నితమైన మనసు ప్రతి విషయానికి తేలికగా స్పందిస్తారు ఉద్రేకపూరిత స్వభావమున్న పురుషులకు నక్స్ స్త్రీలకు ఇగ్నాషియా పిల్లలకు కేమోమిల్లా మంచి మందులు ఈ మూడు మందులు మినీకిట్‌లో వుంచుకోదగ్గవే మనసులాగా శరీరం మెదడు కూడా సున్నితమే కొద్దిపాటి బాధలకి కూడా తట్టుకోలేరు తేలికగా స్పృహ కోల్పోతారు

భోగలాలసులకి జీర్ణకోశం లివర్ త్వరగా దెబ్బతింటాయి ఆహారం తిన్న తరవాత పొట్టవుబ్బరం వికారపెడుతుంది వాంతి అయితే హాయిగా వుంటుంది నోరు అరుచి పుల్లగా చేదుగా వుంటుంది పొద్దున లేవగానె వికారం తలనొప్పి వీరికి నక్స్ బాగా ఉపయోగపడుతుంది

ఎప్పుడూ మలబద్ధకం వీరి మలబద్ధకంలో ఒక ప్రత్యేకత వుంది దొడ్డికి వెళ్ళితే విరేచనం అవుతుందికాని సాఫీగా కాదు రెండుమూడుసార్లు దొడ్డికి తిరగవలసి వుంటుంది ముక్కిన కొద్దీ విరేచనం కావడం కష్టమవుతుంది మలబద్ధకానికే కాకుండా రక్తవిరేచనాలకు కూడా ఇది మంచి మందు రక్తవిరేచనాలలో నక్స్ మెర్క్‌కార్ ముందుగా ఆలోచించతగ్గ మందులు నక్స్‌రోగిలో మలంలో రక్తంతో గూడిన జిగురు మలం సాఫీగా రాదు మెర్క్‌కార్ రోగిలో విరేచనం అయిన తరవాత కూడ ముడ్డి తీపు ఈ తేడాలు గమనించవలసి వుంటుంది నక్స్ రోగి మలలతో బాధపడతాడు మలలున్నవాళ్లు నక్స్ సల్ఫర్ మందులను ఒకదాని తరవాత ఒకటి వాడుకొంటే వీరికి ఆపరేషన్‌తో పనివుండదు

నక్స్ రోగికి గాఢనిద్ర పట్టదు తెల్లవారుజామున 3 4 గంటలకే మెలకువ వస్తుంది కాని వెంటనే గురక పెట్టి నిద్రపోతాడు అయినా లేచిన తరవాత హాయి వుండదు

స్త్రీలలో బహిష్టులు త్వరత్వరగా వస్తాయి మైల ఎక్కువగా అవుతుంది ఎక్కువ రోజులపాటు అవుతుంది

నక్స్‌కి చలిగిట్టదు మానసిక శ్రమని తట్టుకోలేరు కోపం వచ్చినప్పుడు బాధలెక్కువవుతాయి అన్నం తిన్న తరవాత జీర్ణమయ్యేదాకా బాధపడుతుంటారు టెన్షన్ కోపంవున్న వ్యక్తుల బాధలకి ఇది తప్పక ఆలోచించాలి

# ౯ పల్సటిల్లా

జిగురుపొరల నుంచి చిక్కటి పసుపుపచ్చ, ఆకుపచ్చ స్రావాలు

జలుబు ముదిరివుంటుంది వాసన తెలియదు రుచి తెలియదు

అజీర్తి, కొవ్వు పదార్థాలు అరగవు ఐస్‌క్రీమ్ లాంటివి తింటే జీర్ణంకావు

మలబద్ధకం విరేచనాలు మలం ఒకసారి వున్నట్లు ఒకసారి వుండదు

బహిష్టులు ఆలస్యంగా వస్తాయి మైల తక్కువ రుతుశూల రజస్వల కావటం ఆలస్యం

బహిష్టులకు ముందు బహిష్టు సమయంలో బాధలు తెల్లకుసుమ
స్త్రీలలో కామవాంఛ విపరీతం
పురుషుల్లో బీర్జాలలో నొప్పి. గనేరియా స్రావం ప్రాస్టేట్ గ్రంధి వాపు
అదుపుతప్పిన కామవాంఛ

**పాలీ**క్రెస్ట్ ఔషధాలలో ఇది ఒకటి ప్రతి ఇంట్లో ఉంచుకోవలసిందే పల్సాటిల్లా స్త్రీలకు సల్ఫర్ పురుషులకు అని ప్రసిద్ధి కాని పల్సాటిల్లా తత్వం గల పురుషులు సల్ఫర్ తత్వంగల స్త్రీలు ఉండకపోరు మనసు శరీరాన్ని ప్రభావితం చేస్తుందనడానికి ఈ మందే గొప్ప రుజువు మానసిక లక్షణాలను ఆధారంగా చేసుకొని ఈ మందును ఎంపిక చేసి వాడితే స్త్రీల శారీరక బాధలన్నీ తగ్గుతాయి అందుకే ఇది స్త్రీల మందుగా పేరుపడిపోయింది

పల్సాటిల్లా పిరికి మనిషి మృదుస్వభావం చిన్న విషయానికి కూడా కంట తడిపెడతారు వీరిని ఓదార్చడం అవసరం వీరు కంట తడిపెట్టడం కూడా తనను గూర్చి ఇతరులు పట్టించుకోవాలనే గావచ్చు పల్సాటిల్లాది స్వార్థపూరిత స్వభావం పుచ్చుకోవడమేగాని ఇవ్వడం జరగదు ఫాస్ఫరస్ తత్వం దీనికి భిన్నం ఇతరులు అభిమానించాలని కోరుకుంటారు తాము ఇతరులను ఆదరిస్తారు కూడా పల్సాటిల్లాకు మూరాశ మెండు సంఘంలో కలవలేరు ఎదుటివారి మాటల్లో ఎప్పుడూ విపరీతార్థాలే స్ఫురిస్తాయి భయం జాస్తి త్వరగా ఒక నిర్ణయానికి రాలేరు బీరువా తెరచి ఏ చీర ధరించాలన్న విషయం కూడా ఒక సమస్యే డాక్టరు దగ్గర బాధలు వివరించేటప్పుడు మాటలకన్న ఏడుపే ముందు వస్తుంది పల్సాటిల్లాకు అసూయ అనుమానాలు కూడా ఎక్కువ అసూయ అనుమానాలతోబాటు భయం అందుకే వీరిని అబలలని పిలుస్తారు అబల అని మనం అనుకొన్నా వీరికి కోపం కూడా ఎక్కువే

దుఃఖ భారంతో కుంగిపోయే వారి శారీరక బాధలకిది మంచి మందు భర్తతో తగాదా వచ్చి భార్యకు విరేచనాలు పట్టుకొంటే ఈ మందు ఆలోచించవచ్చు. ఇగ్నేషియా కూడా ఈ రకమైన బాధలకు ఉపయోగపడే మందె

లక్షణాలు మారుతుండడం పల్సాటిల్లాలో ప్రధానాంశం కీళ్లలో నొప్పి ఈ రోజు ఒక కీలులో వుంటే రేపు మరొక కీలులో వుంటుంది విరేచనాలవుతుంటే మలం ఒకసారి వున్నట్టు మరొకసారి వుండదు ఈ క్షణంలో ఏడుపు మరోక్షణంలోనే నవ్వు

పల్సాటిల్లాకి చల్లటి వాతావరణం కావాలి చన్నీళ్ల స్నానమంటే ఇష్టం జిగురు పొరల నుండి చిక్కటి పచ్చటి స్రావాలు అధికం రక్తం తక్కువ అజీర్తి

బహిష్టులు ఆలస్యంగా వస్తాయి మైల చాలా తక్కువ అసలు కనబడకపోవచ్చు కూడా రజస్వల కావడం కూడా ఆలస్యమే రుతుస్రావం నల్లగా కండలు కండలుగా అవుతుంటుంది లేదా నీరులాగా పలచగా కనబడవచ్చు. బహిష్టు సమయంలో కడుపులో నొప్పి బహిష్టు సమయంలో కడుపు నొప్పికి కేమోమిల్లా కూడా ఆలోచించదగిందే చిర చిరలాడే కేమోమిల్లాని మృదువైన పల్సాటిల్లాని గుర్తించడం కష్టం కాదు బహిష్టు నొప్పులతో బాధపడుతుండెవారు మెగ్నీషియా 2X ను గోరువెచ్చని నీటిలో కలిపి ప్రతి పావు గంటకు ఒకసారి పుచ్చుకోవడం కూడ మంచిదే నొప్పులు వెంటనే తగ్గిపోతాయి పల్సాటిల్లా తెల్ల కుసుమ వ్యాధికి ప్రధానమైన మందు తెల్ల కుసుమ చిక్కగా మీగడలాగా అవుతుంటుంది, బహిష్టు అయిన తరవాత వారం రోజులపాటు చిక్కగా తెల్లగా తొడలు ఒరుసుకుపోయేటట్లు తెలుపు అవుతున్నట్లయితే క్రియోజోటం మంచి మందు కాన్పు సమయంలో నొప్పులు సక్రమంగా లేక కాన్పు ఆలస్యమైతే పల్సాటిల్లా ఇస్తే సుఖప్రసవం అవుతుంది కాన్పుకు ముందు ఒక డోసు పల్సాటిల్లా ఇచ్చినట్లయితే మాయ తేలికగా పడిపోతుంది గర్భవతిగా ఉన్నప్పుడు గర్భసంచిలో శిశువు అడ్డంగా తిరిగివున్నట్టు గమనిస్తే పల్సాటిల్లా ఇచ్చి శిశువును మామూలు స్థానంలో ఉంచేటట్లు చేసిన కేసులెన్నో నమోదయ్యాయి ప్రసవానంతరం కనబడే మైల స్రావం లోకియా) అణచివేతకు గురయితే వెంటనే పల్సాటిల్లా ఇవ్వవలసి వుంటుంది గర్భసంచి జారిన వారికి పల్సాటిల్లా సెపియాలు తప్పక ఆలోచించదగిన మందులు

పల్సాటిల్లా అజీర్ణానికి మంచి మందు బిర్యానీ నూనె పదార్థాలు ఐస్‌క్రీములులాంటివి తిన్న తరవాత

జీర్ణంగాక బాధపడుతుంటేవారు ఈ మందు వాడుకోవచ్చు నోరు ఉప్పగా వుంటుంది విరేచనాలు రాత్రిపూట ఎక్కువ ఆకుపచ్చగా జిగురుతోకూడిన మలం ఒకసారి ఉన్నట్టు మరొకసారి మలం ఉండకపోవడం వల్సాటిల్లాలో విచిత్రమైన లక్షణం

జలుబుకిది ముఖ్యమైన మందు ముక్కు నుంచి వెలువడే స్రావాలు చిక్కబడి పసుపు పచ్చగా మారిన వెంటనే వల్సాటిల్లా వాడితే జలుబు వెంటనే తగ్గుతుంది ఈ రోగికి రుచి వాసన కూడా తెలియవు రాత్రిళ్ళు పొడి దగ్గు పడుకొంటె కూర్చుంటే హాయిగా వుంటుంది ఇది టిబి వ్యాధికి కూడా మంచి మందు

దీనిని పొంగు వ్యాధికి ప్రత్యేకమైన మందుగా పరిగణించవచ్చు ఆరంభ దశలో ఏకోనైట్ వాడి తరవాత వల్సాటిల్లా వాడితె ఈ వ్యాధికి ఏ ఇతర మందులతో పనిలేదు వల్సాటిల్లాను పొంగు వ్యాధి నిరోధక మందుగా వాడుకోవచ్చు కంటికురుపులు తగ్గించడానికి ఈ మందు బాగా ఉపయోగపడుతుంది చెవిపోటు చెవిలో చీముకారడం నివారించడానికి పల్సాటిల్లా వాడుకోవచ్చు

గనేరియా అణచి వేయబడిన గనేరియా రోగులకు వల్సాటిల్లా ఆలోచించాలి జననేంద్రియాల నుంచి చిక్కగా వచ్చే స్రావం మూత్ర విసర్జన తరవాత మంట బీర్జాలలో నొప్పి వాపు ఈ రోగుల్లో కనబడే లక్షణాలు వీరికి వల్సాటిల్లా ఎంతో మేలు చేస్తుంది

## 10 యాలో

విరేచనాలు ఉదయం లేవగానే విరేచనాలు పొట్ట బాగా ఉబ్బరించి వుంటుంది
పొట్టలో గడబిడలు మోతలతో గూడి అపానవాయువులు
అపానవాయువుతో కలిసి విరేచనం బట్టల్లోనే అయిపోతుంది
తిన్నా తాగినా వెంటనే దొడ్డికి పోవాలి
రక్తవిరేచనాలు మలంలో జిగురు రక్తం
ముడ్డితీపు ముడ్డిపేగు జారి వుంటుంది
మలలు బయటకు గుత్తులు లాగా పొడుచుకు వస్తాయి
నిలబడినా నడుస్తున్నా బాధలు ఎక్కువ వేసవిలో బాధలు ఉద్రేకిస్తాయి

ప్రతి ఇంట్లో ఈ మందు తప్పక వుండి తీరాలి వృద్ధులకు శారీరక శ్రమలేనివారికి ముట్లుడిగే స్త్రీలకి ఇది ప్రత్యేకంగా వువయోగపడగల మందు అనాదిగా ఈ మందును విరేచనకారిగా రుతుస్రావం అధికంగా అవుతుంటే వాడుకొనేవారు పేగుల మీద జననేంద్రియాల మీద దీని ప్రభావమెక్కువని చెప్పడానికి ఇది నిదర్శనం హెూమియో వైద్యంలో కాలేయం పేగుల బాధలకు యాలో పోడోపైలం నేట్రంసల్ఫ్ ప్రత్యేకంగా ఆలోచించదగిన మందులు

విరేచనాలకిది ముఖ్యమైన మందు యాలోకి కొన్ని విశిష్టలక్షణాలున్నాయి ఉదయంపూట విరేచనాల ధికం ఈ సందర్భంలో నల్సార్ కూడా గుర్తుంచుకోవాలి నిద్రలేవకముందే నల్సార్‌రోగిలో విరేచనాలు మొదలవుతాయి నిద్రలేచిన తరవాత మొదలవుతాయి యాలోరోగి విరేచనాలు యాలోని వెజిటబుల్ నల్సార్ అని కూడా వ్యవహరిస్తారు విరేచనం ఆపుకోలేడు త్వరగా దొడ్డికి పరుగెత్తాలి కాని వెళ్ళేలోపలే బట్టల్లో అయిపోతుంది పొట్టపగిలిపోతుందా అన్నంత బిర్రుగా వుంటుంది అపానవాయువు పోయేటప్పుడు మూత్రవి సర్జన సమయంలో విరేచనం పలచగా బయటకు వచ్చేయవచ్చు ఏదైనా తిన్న తరవాతగాని తాగిన తరవాతగాని విరేచనం వెంటనే అవుతుంది బొడ్డుచుట్టూ నొప్పి విరేచనం అయిన తరవాత నొప్పి తగుతుంది ఈలక్షణం నక్స్‌లో కూడ ప్రముఖమే కడుపులో నొప్పి విరేచనం అయిన తరవాత గూడ తగ్గకపోతే మెర్క్‌కార్ వాడుకోవాలి విరేచనం అయిన తరవాత నొప్పి తగ్గినా నీరసం చెమటలు అపానవాయువు దుర్వాసనతో కూడి వుంటుంది విరేచనం అయ్యేటప్పుడు ముడ్డిమంట మలంలో జిగురు రక్తం ఎక్కువగా వున్నప్పుడు గ్యాస్ అధికం విరేచనం పిచికారీ కొట్టినట్టు అవుతుంది విరేచనం నీళ్ళు నీళ్ళుగా మలం వుండలతో గ్యాస్‌తో కూడివుంటుంది

యాలో విరేచనాలకే కాకుండా మలబద్ధకానికి కూడా మంచి మందె పిల్లల్లో మలబద్ధకముండి అప్పుడప్పుడు వాళ్ళకు తెలియకుండానే అటు ఇటూ తిరిగేటప్పుడు గట్టిగా వుండలు వుండలుగా విరేచనం అవుతుంటే యాలో ప్రత్యేకంగా ఉపయోగించుకోవచ్చు.

ఎమీబిక్ డిసెంట్రీకిది మంచి మందు గవరగవరగా విరేచనాలు సుద్దలుసుద్దలుగా ఎంక మలం ఉండలు ఉండలుగా బంకతో కలిసి వుంటుంది ముందుగా బంకపడిపోయి తరవాత మలం రావచ్చు పొట్టలో గుడగుడ శబ్దాలు విరేచనాలయ్యేటప్పుడు ఆకలి ఎక్కువ విరేచనాలు ఉదయం పూట అధికం నీరసం

విరేచనం అయ్యేటప్పుడు మలలు గుత్తిమాదిరిగా బయటికి వస్తాయి రక్తం పడుతుంది ముడ్డి దురద చన్నీళ్లతో కడుక్కొంటే హాయిగా వుంటుంది బాధలు తగ్గడానికి ఆయింట్‌మెంట్ వాడకూడదు వాడితే బాధలెక్కువవుతాయి సల్ఫర్ రోగిలో కూడా చర్మవ్యాధికి పూతమందులు బాధలను అధికం చేస్తాయన్నది గమనార్హం

విరేచనాలతోపాటు మూత్రం పచ్చగా వస్తుంటే జాండిస్ వచ్చిందేమోనని అనుమానించాలి తలనొప్పి, పొట్టలో కుడివైపున నొప్పి, ముడుచుకొని కూర్చోవలసిరావడం వస్తువులు పచ్చగా కన్పించడం యాలో రోగి లక్షణాలు

యాలో రోగి దిగులుగా వుంటాడు. చిరాకు ఎక్కువ సోమరి వేసవిలో విరేచనాలు చలికాలం తలనొప్పితో బాధపడుతుంటాడు చల్లటిగాలి చల్లటివాతావరణం కావాలి

యాలోరోగికి రుతుస్రావం అధికం నల్లగా కండలు కండలుగా అవుతుంటుంది నడుంకింది భాగంలో నొప్పి గర్భసంచి జారి వుండవచ్చు. కటిలోపల నిండుగా బంతిపెట్టినట్లుంటుంది ఈ లక్షణాలు గమనించి యాలో వాడుకొంటే ఆపరేషనుతో పనివుండదు

బీరు నత్తగుల్లల్లాంటివి తీసుకున్న తరవాత వచ్చే విరేచనాలకు యాలో ప్రత్యేకమైన మందు ఈ సందర్భంలో నత్తగుల్లల్లాంటివి తినడంవల్ల వచ్చే విరేచనాలకు లైకోపోడియం కూడా గుర్తుంచుకోవాలి అదే విధంగా బీరు తాగిన తరవాత వచ్చే విరేచనాలకు కాలీబైక్రోమికం వాడుకోవచ్చు.

# 11 ఆర్జెంటం నైట్రికం

**పొట్టలో ఎసిడిటీ అల్సర్ మంట పొట్ట ఉబ్బరం**
**చల్లటిపాలు తాగితే హాయిగా వుంటుంది**
**తీపి అంటే బాగా ఇష్టం తింటే గిట్టదు**
**చల్లటి పదార్థాలు కావాలి చల్లటిగాలి కావాలి**
**కళ్ళజబ్బు, ఇన్ఫెక్షన్ ఎరుపు ఇసుకఉన్నట్టుగా గుచ్చుకొంటుంది**
**నైరాశ్యం ఏపనీ చేయలేనని సంకోచం**
**ఏదైనాపని పెట్టుకుంటే ఆందోళన పడిపోతారు**
**పరీక్షలకు ఇంటర్వ్యూలకు వెళ్ళవలసివచ్చినప్పుడు విరేచనాలు పట్టుకొంటాయి**
**దుర్వాసనతో అపానవాయువులు విరేచనాలు**

ఇది వెండి నుంచి తయారౌతుంది పొటెన్సీ ప్రక్రియ ద్వారా వెండి బంగారం ఇనుములాంటి లోహాలను సైతం సారాయిలో కరిగించి అమృతతుల్యమైన ఔషధాలుగా మలచిన ఖ్యాతి హానిమన్‌దే

వెండి బంగారాలకోసం మనను తాపత్రయపడుతుంది ఆ లోహాలే పొటెన్సీ రూపంలో మనోవికారాలకు గొప్ప ఔషధాలు ఈ అనుభవంకూడా హోమియోపతిని బలపరిచేదే

ఆర్జెంటం నైట్రికం మానవులపై ప్రయోగించి లక్షణాలను రాబట్టి హోమియో వైద్యంలో మొదటగా హానిమన్ ప్రవేశపెట్టాడు మనస్సు, మెదడు జననేంద్రియాలపై ఈ మందు ప్రభావమెక్కువ

మగ లైంగిక హార్మోనోత్పత్తికి మూలం జననేంద్రియాలు జీవోత్పత్తికి ఆధారం ఆర్జెంటం నైట్రికం మనస్సుని జననేంద్రియాలను ప్రభావితం చేయడం ఈ రెంటింటి మధ్యగల సన్నిహిత సంబంధాన్ని నిరూపిస్తుంది మనస్సు లైంగికతలకు గల సంబంధాన్ని విశ్లేషించి వివరించినవాడు మనోవిశ్లేషణశాస్త్ర పితామహుడు సిగ్మండ్ ఫ్రాయిడ్ ఆర్జెంటం నైట్రికంతో మానవులపై జరిపిన ప్రయోగాలు ఫ్రాయిడ్ ప్రతిపాదనలకు ప్రయోగాత్మకమైన రుజువులు సృష్టివరంగా మనస్సు జననేంద్రియాల పాత్రను వివరిస్తూ యాంత్రపోసోఫి ప్రవక్త రుడాల్ఫ్ స్టయినర్ ఒక ప్రతిపాదన చేశాడు సంతానోత్పత్తిలో ప్రధానపాత్ర వహిస్తున్న స్త్రీ వైజ్ఞానిక కళాసృష్టిలో పురుషునికన్న వెనకబడిపోయిందని దానికి కారణం జీవశక్తిని పునరుత్పత్తికి ధారపోయడమేనని స్టయినర్ అభిప్రాయపడ్డాడు

మానసికంగా శారీరకంగా సమస్థితి లోపించి వుంటాడు ఆర్జెంటం నైట్రికం రోగి ఆందోళన పడిపోతాడు ఎక్కడికన్నా పోవాలన్నా ఎవ్వరినైనా కలవాలన్నా ఎవ్వరైనా వస్తున్నారన్నా ఏదైనా పని తలపెట్టినా గందరగోళం పడిపోతాడు రేపు పనివుంటే ఈ రాత్రి నిద్రపట్టదు ప్రయాణమంటే రైలు రావడానికి గంటముందే వెళ్ళి కూర్చొంటాడు మనోగతమైన తొందరపాటులో శరీరంకూడ పాలువంచుకొంటుంది ప్రయాణానికి బయలుదేరటానికి ముందు పేగుల్లో కదలికవల్ల దొడ్డికి పరుగెత్తాల్సి వస్తుంది మనస్సుకి శరీరంపైగల ప్రభావాన్ని ఈ లక్షణం గుర్తుచేస్తుంది పరీక్షలకు ముందు కొందరు విద్యార్థులు ఆందోళన కారణంగా చదువుపై మనస్సు లగ్నం చేయలేరు దీనిని ఎగ్జామినేషన్ ఫంక్ అంటారు ఎగ్జామినేషన్ ఫంక్‌కి ఇది మంచి మందు ఈ మందుని ఫంక్‌పిల్స్ అని అంటారు పరీక్షలు తప్పుతామని భయాందోళనతో సతమతమయ్యే విద్యార్థులకి ఇది బాగా మేలుచేస్తుంది ఎధూజా ని కూడా ఈ సందర్భంగా గుర్తుంచుకోవచ్చు విపరీతంగా చదవడంవల్ల మనస్సు పని చేయనివారికి ఎధూజా వాడుకోవాలి

ఆర్జెంటం రోగి కిటికీలు తలుపులు మూసిపెట్టిన గదిలో కూర్చోలేడు లిఫ్టులో పోవాలంటే విపరీతమైన భయం రోడ్డుమీద నడిచేటప్పుడు రోడ్డుపక్క ఇళ్ళు ముందుకు పొడుచుకొస్తున్నాయన్న భయం వంతెనమీద ఒక పక్కగా నడవలేడు సరిగా మధ్యన నడుస్తాడు మేడమీద పిట్టగోడ దగ్గరకు రాలేడు కిందికి చూస్తే కళ్ళు తిరిగి పడిపోతానని భయం తికమకలో కిందికి దూకి ఆత్మహత్య చేసుకొంటాడు

అస్థిమితం మనస్సుకే పరిమితంగాదు శరీరాన్నికూడా ఆవహిస్తుంది నడుస్తుంటే కాళ్ళు తడబడతాయి చీకట్లో నడవాలంటే తొట్రుబడిపోతాడు రాయలేడు చేతులు వణుకుతుంటాయి ముందు మనస్సు తరవాత శరీరం వ్యాధిగ్రస్తమవుతాయన్నది గమనార్హం ఇది ఒక రకమైన పక్షవాతానికి మంచి మందు

ఇది జిగురు పొరల వ్యాధులకి కూడా మంచి మందు అన్నకోశంలో అల్సర్లను ఈ మందుతో నివారించవచ్చు. తాగుబోతుల్లో వచ్చే కడుపునొప్పికి బాగా పనిచేస్తుంది ఈ రోగికి తీపి పంచదార అంటే ప్రాణం కాని సరిపడదు విరేచనాలు గాస్ ఎక్కువ మోతతో కూడిన త్రేపులు అపానవాయువులు

స్త్రీ పురుషులకు కూడా రతి బాధాకరంగా వుంటుంది పురుషుల్లో రతి సల్పబోయేటప్పటికి అంగం మెత్తబడిపోతుంది స్త్రీలలో రతి అనంతరం రక్తం కనబడుతుంది గర్భకోశం ముఖద్వారంలో అల్సర్ బహిష్టులకు మధ్య రుతుస్రావం కనబడుతుంది రుతుస్రావాలు క్రమబద్ధంగా వుండవు

కలలో పాములు కన్పిస్తాయి రతి సల్పుతున్నట్లు కలలొస్తుంటాయి

---

# 12. ఎనాకార్డియం

పొట్టలో అల్సర్ బాధలు తిన్న తరవాత ఉపశమిస్తాయి

ఆత్మవిశ్వాసముండదు తిట్లు శాపనార్థాలు పెడుతుంటారు

విపరీతమైన మతిమరుపు ఇది హఠాత్తుగా వచ్చి వుండవచ్చు.

మానసిక శ్రమ తట్టుకోలేరు ఆహారం పుచ్చుకుంటే హాయిగా వుంటుంది

జ్ఞానేంద్రియాలు మొద్దుబారతాయి

విరేచనం ఇరికిరికి అవుతుంది (నక్స్‌వామికా)
చర్మంపై గుల్లలు

ఇది నల్ల జీడినుంచి తయారయ్యే మందు యాంటిసోరిక్ ఔషధాలుగా ప్రసిద్ధిచెందిన వాటిలో ఇది ఒకటి మెదడు నరాలు జీర్ణమండలం చర్మవ్యాధులకిది ప్రత్యేకంగా ఉపయోగపడే మందు మానసికస్థాయిని అవగాహన చేసుకోడానికి ఎనాకార్డియం ఎంతో ఉపయోగపడుతుంది మనసు మూడుస్థాయిల్లో పనిచేస్తుంది ఉద్వేగం వివేకం ధారణ అని మూడు భాగాలుగా మనస్సుని విశ్లేషించవచ్చు ఎనాకార్డియం ఉద్వేగస్థితిని ప్రభావితం చేస్తుంది ఆర్జెంటం నైట్రికం వివేకస్థాయి లక్షణాలకు ఉపయోగపడుతుంది ధారణకు సంబంధించిన వైకల్యానికి ఎన్నో మందులున్నాయి ఔషధాలను మానవులపై ప్రయోగించి ఔషధ ధర్మాలను రాబట్టే విధానాన్ని కనుగొని హానిమన్ మానవవైద్యానికి శ్రీకారం చుట్టాడు

వృద్ధాప్యంలో షాక్ మితిమీరిన ఆందోళనవల్ల కుంగిపోవడం విపరీతంగా చదవడం మితిమీరిన కామకలాపాలు ఈ కారణాలవల్ల అకస్మాత్తుగా సంభవించే చిత్తచాంచల్యం మతిమరుపులాంటి మనోవైకల్యానికి ఇది మంచి మందు అల్లోపతి డాక్టర్లు యాంక్సయిటీన్యూరోసిస్ అని పిలిచే మానసిక బాధలకు ఇది ప్రత్యేకమైన ఔషధం ఈ రోగుల్లో చాలామందికి ఆత్మవిశ్వాసం లోపిస్తుంది విద్యార్థులు పరీక్షల్లో కూర్చోడానికి భయపడతారు లాయర్లు కోర్టులో వాదించాలంటే భయం అలాంటి వారికిది బాగా ఉపయోగపడుతుంది వృద్ధాప్యంలో మతిమరుపునకు కోపంతో ఒళ్ళు తెలియకుండా బండబూతులు తిట్టేవారికి ఈ మందును తప్పనిసరిగా ఆలోచించాలి ఎనాకార్డియం రోగులు తేలికగా ఉద్రేకపడతారు ఎప్పుడూ నోటివెంట బూతులు రాని వాళ్ళుకూడా బూతులు మాట్లాడుతుంటారు పక్షవాతం వచ్చి మానసికంగా కుంగిపోయిన రోగులకిది దివ్యమైన ఔషధం ద్వైదీభావం ఎనాకార్డియం రోగి విశిష్టలక్షణంగా భావించవచ్చు ఒక పని చేయాలంటే ఊగిసలాట ఎటూ తేల్చుకోలేరు హామ్లెట్ పాత్రలాగా చేయాలావద్దా అన్న డోలాయమానస్థితి- వాస్తవికతను గుర్తించకపోవడం పెద్ద విషయాలను వదిలేసి చిన్న చిన్న వాటిని పట్టించుకోవడం ఈ రోగికి అలవాటు భ్రమ భ్రాంతి భయం ఈ రోగిని పట్టి పీడిస్తుంటాయి

వేదనల విషయంలో ఈ రోగికి కొన్ని విచిత్రలక్షణాలున్నాయి బిరడాపెట్టినట్టు గొంతుకలో ఆసనంలో బిగుసుకుపోయినట్టు పగిలిపోతున్నట్టు బాధలుంటాయి

అజీర్తి అనగానే ముందుగా నక్స్‌వామికా గుర్తుకువస్తుంది ఎనాకార్డియం గూడా అజీర్తికి నక్స్‌లాగా ముఖ్యమైన మందే పొట్టలో ఆహారం ఉన్నంతసేపు నొప్పిరాదు అన్నకోశం ఖాళీ అవుతుండగానే కడుపునొప్పి మొదలైతే ఈ మందు తప్పకవాడుకోవాలి ఈ విషయంలో నక్స్ రోగిది విరుద్ధతత్వం అన్నకోశంలో ఆహారం ఉన్నంతసేపు నక్స్ రోగికి కడుపునొప్పి ఈ తేడాలను గమనించి నక్స్ ఎనాకార్డియం మందులను వాడుకుంటే ఎసిడిటీ గాస్ అల్సర్ అని వ్యవహరించబడే బాధలను శాశ్వతంగా నివారించుకోవచ్చు ఆహారం తింటే పొట్టలో బాధలతోబాటు మానసికమైన బాధలుకూడా తగ్గుతాయి ఇది ఎనాకార్డియం లక్షణం ఈ సంఘటనలు మనస్సు, శరీరం ఒకదానిని ఒకటి ప్రభావితం చేసుకొంటాయన్న విషయానికి నిదర్శనాలు నక్స్‌రోగి తిని బాధలు కొనితెచ్చుకుంటాడు అజీర్తి కేసుల్లో ఎనాకార్డియం 200 పొటెన్సీలో వాడడం మంచిదంటాడు డాక్టర్ వాష్. అజీర్తి రోగుల్లో మలబద్ధకానికి కూడా ఈ రెండూ బాగా ఉపయోగపడే ఔషధాలే నక్స్‌లో ఉదయం ఒకేసారి విరేచనం సాఫీగాకానందువల్ల రెండు మూడుసార్లు దొడ్డికి వెళ్ళాల్సి ఉంటుంది దొడ్డికి వెళ్ళాలని అనిపించి తీరా వెళ్ళాక విరేచనం కాదు ఔషధాలను ఎంపిక చేసేటప్పుడు ఈ విశ్లేషణ అవసరం

చర్మవ్యాధులలో ఎనాకార్డియం రస్టాక్స్‌తో పోటీ పడుతుంది పొక్కులుగా చీముగుల్లలుగల చర్మవ్యాధికి ఇది మంచిమందు పుళ్ళుపడ్డ కుష్ఠురోగులకు ప్రధానమైన మందుల్లో ఇది ఒకటి ఎనాకార్డియం రోగికి చర్మవ్యాధి జిలపెట్టినకొద్దీ కోపం పెరుగుతుంటుంది ఎంత గోకినా జిలతగ్గదు విరేచనానికి ముక్కేటప్పుడు మూత్రంలో ప్రోస్టాటిక్ స్రావం పోతుంటుంది

ఎనాకార్డియం రోగి నిద్రలో కేకలు పెడతాడు కలల్లో మంటలు శవాలు లోయలు లాంటివి కన్పిస్తాయి నిద్రలేచిన తరవాత ఆ కలలు కళ్ళల్లో మెదులుతుంటాయి

# 13 ఏపిస్

ముఖం కనురెప్పలు వాచివుంటాయి
కాళ్ళు చేతులు నీరు చూపివుంటాయి నొక్కితే గుంటలువడతాయి
చర్మం మీద గరుకుగా వుండే దద్దురు
కళ్ల కలక వాపు కొయ్యకండలు
అకస్మాత్తుగా వచ్చే కంఠవాతం (డిఫ్తీరియా) గొంతులో వాపు
కిడ్నీలవాపు ఉబ్బుకామెర్లకు ఇది ప్రత్యేకమైన మందు
ఆర్టికేరియా చురుకులు మంటలు
చల్లటి వాతావరణం చన్నీటి స్నానం హాయిగా వుంటాయి

ఈ మందు తేనెటీగల నుంచి తయారౌతుంది హఠాత్తుగా సంక్రమించే వ్యాధులకు వాడుకోదగిన మూడు ముఖ్యమైన ఔషధాలలో ఇది ఒకటి మిగతా రెండు ఔషధాలు ఎకోనైట్ బెల్లడోనాలు మినీకిట్‌లో ఈ మూడు ఔషధాలను తప్పక ఉంచుకోవలసిందే

హోమియోమందులు నిదానంగా పనిచేస్తాయని సాధారణంగా అనుకుంటుంటారు దీనికికారణం లేకపోలేదు దీర్ఘవ్యాధిగ్రస్తులే ఎక్కువ మంది హోమియోవైద్యుల వద్దకు పోతుంటారన్న విషయం గమనార్హం దీర్ఘవ్యాధులు నిదానంగా మాత్రమే తగ్గుతాయి వ్యాధి ధర్మాన్ని వైద్యవిధానానికి ఆపాదించడంవల్ల అది హోమియో మందులు ఆలస్యంగా పనిచేస్తాయన్న అపప్రథకు కారణమైంది

ఏపిస్ తరుణవ్యాధులకు దీర్ఘవ్యాధులకు కూడా ఉపయోగపడే మందు తరుణవ్యాధులను సత్వరంగా ను దీర్ఘవ్యాధులను నిదానంగాను నయంచేస్తుంది హోమియోవైద్యంలో తరుణ వ్యాధులు శీఘ్రంగా నయమవుతాయనడానికి ఈ మందే చక్కని ఉదాహరణ

ఏపిస్‌ను ఈ వైద్యవిధానంలో ప్రవేశపెట్టడానికి పూర్వమే తేనెటీగలను రోగనివారణకు వాడుతుండేవారు అప్పుడె కాన్పయినపిల్లలు మూత్రం పోయకపోతే తేనెటీగలను వేడినీటిలో వేసి తీసివేసి ఆ నీటిని పిల్లలకు పట్టడం అనాదిగా వస్తున్నదే తేనెటీగలు కుట్టినతరవాత ఆర్థ్రయిటిస్ తగ్గిన కేసులు వైద్య చరిత్రలో నమోదై ఉన్నాయి ఈ అనుభవాలు కూడా హోమియోవైద్య సూత్రాన్ని రుజువుచేస్తాయి

ఏపిస్ శరీరాన్ని కప్పివున్న పొర చర్మం అదేవిధంగా మెదడు ఊపిరితిత్తులు పేగులను కప్పివున్న పొరలపై ఎక్కువ ప్రభావం కల్గివుంది ఈ పొరల వ్యాధులుగల వారికిది ఎంతో ఉపయోగపడుతుంది

ఇన్ఫెక్షనుతోపాటు చర్మం జిగురుపొరలు అవయవాలను కప్పివుంచిన పొరలమధ్య నీరు చేరితే ఏపిస్ లక్షణంగా భావించాలి ఏపిస్ వాపులో కన్పించే నీరు రక్తంలోని కణాలను వడకట్టబడ్డ తరవాత వచ్చే సీరం అనే ద్రవమే వాపుతోబాటు చురుకులు మంటలుండడం ఏపిస్‌లో మరొక ప్రధాన లక్షణం ఈ లక్షణాలన్నీ తేనెటీగ కుట్టిన తరవాత కన్పించే వాపు చురుకులు మంటలను పోలివుంటాయి ఆర్సెనికం రోగిలో కూడా మంటలతోగూడిన బాధలుంటాయి ఏపిస్ మంటలు చన్నీళ్ళు తగిలితే హాయిగా ఉంటాయి ఆర్స్ రోగి మంటలు వేడి నీళ్ళు తగిలితేగాని ఉపశమించవు రోగుల తత్వాలను విడదీసి చూడాలనడానికి ఈ తేడాలు ప్రధానం

వాపులు చురుకులు మంటలేగాకుండా ఒళ్ళు నొప్పులు శరీరమంతా వచ్చివుండులాగా సున్నితంగా వుండడం ప్రముఖ లక్షణమంటాడు డాక్టర్ ఫారింగటన్— రోగి శరీరాన్ని తాకినా శరీరంమీద ఏమాదిరి ఒత్తిడి తగిలినా భరించలేడు దుస్తులు గూడా బిగుతుగా ధరించలేడు

ఏపిస్ రోగిలో ఇన్ఫెక్షన్ జ్వరమున్నా దప్పిక తక్కువ— ఇది ఈ రోగి విచిత్ర లక్షణం

ఈ రోగి మానసిక లక్షణాలు పల్సాటిల్లా రోగి మానసిక లక్షణాలకు దగ్గరగా వుంటాయి పిరికితనం

తేలికగా కంటతడిపెట్టడం అసూయ— ఇవన్నీ పల్సటిల్లా లక్షణాలు లాంటివే అసూయ విషయంలో లాకిసిస్‌తో పోటీపడుతుంది ఏపిస్

ఏపిస్ మెనింజైటిస్‌కి మంచిమందు రోగిలో అపస్మారం క్రమంగా పెరుగుతుంది మధ్య మధ్య కెవ్వున కేక పెడుతుంటాడు పళ్ళు నూరడం తలవూపు ఈ లక్షణాలను గమనించి ఏపిస్ వాడితే వ్యాధివెనక్కి తగ్గుతుంది బెల్లడోనా బ్రయోనియాలను కూడా ఈ సందర్భంలో గుర్తుంచుకొని అవసరాన్నిబట్టి వాడుకోవాలి

డిఫ్తీరియా వ్యాధికి ప్రత్యేకమైన మందుగా దీనికి పేరుంది గొంతుక వాచివుంటుంది కొండ నాలుక ఉబ్బి జారివుంటుంది మింగుడుపడడం కష్టం ఏపిస్ మిగతా లక్షణాలను కూడా సమన్వయించుకొని వాడుకోవాలి

కిడ్నీ వాపునకు ఇది మంచిమందు మూత్ర విసర్జన తగ్గిపోతుంది మూత్రంలో ఆల్బుమిన్ రక్తంకూడా ఉండవచ్చు. ఒంటిమీద దద్దు గజ్జి వచ్చి తగ్గి ఉండవచ్చు. ఈ కేసుల్లో ఏపిస్ ఆలోచించాలి ముఖం కూడా ఉబ్బి వుంటుంది కింద రెప్పలకింద వాపు ఎక్కువగా కనబడుతుంది ముఖం పాలిపోయినట్లు వుంటుంది ఎండవేడి తట్టుకోలేరు వీరికి ఏపిస్ వాడితే మూత్రం అధికంగా జారీ అవుతుంది వ్యాధి నివారణ అవుతుంది

స్త్రీలకిది ప్రత్యేకంగా ఉపయోగపడేమందు ప్రతిసారి 3 4 నెలలలోపుగా ఎబార్షన్ అయిపోయేవారికి ఈ మందు వాడుకుంటే అలా జరగదు అండకోశాలు ముఖ్యంగా కుడివైపు అండకోశంలో వాపు కణితి ఏర్పడినట్లయితే ఈ మందు ఆలోచించవలసి వుంటుంది

ఒంటిమీద దద్దు ఎలర్జీ కన్పించేవారికి ఇది దివ్యౌషధం ఈ రోగులు చల్లగాలి చన్నీళ్ళతో తడుపుకోవటం ఎంతో ఇష్టపడుతుంటారు ఏపిస్ వాడినా ఎలర్జీ మళ్లీ మళ్లీ తిరగబెడుతుంటే కేలింమూర్ వాడుకొని శాశ్వతంగా నివారించవచ్చు చర్మంమీద ఎలర్జీకి రస్టాక్సు కూడా మంచి మందే కాని రస్టాక్స రోగులకు వేడికాపు హాయి ఇస్తుంది ఈతేడా గమనార్హం వెనవికాలంలో ఒళ్ళుపేలి బాధపడేవారు ఏపిస్ వాడుకోవచ్చు

గొరుచుట్టు ఆరంభదశలోనే వాడుకొంటే వ్యాధి ముదరకుండానే తగ్గిపోతుంది ఈ వ్యాధికిది ప్రత్యేకమైన మందుగా పరిగణించవచ్చు.

# 14 బాప్టీజియా

టైఫాయిడ్ జ్వరం ఆరంభదశకు జెల్సిమియం
ఆ తరవాత ఇవ్వాల్సిన మందు బాప్టీజియా
నిస్త్రాణ ఒళ్ళంతా నొప్పులు ఒళ్ళు పచ్చిపుండులాగా వుంటుంది
మగత అపస్మారం
కాళ్ళుచేతులు మొండెం నుంచి విడిపోయినట్లనిపిస్తుంది
ఏకాగ్రత వుండదు
అడిగిన దానికి సమాధానం చెప్పడంపూర్తి చేయకుండానే నిద్రలో పడిపోతారు
విరేచనాలు మలం భరించరాని దుర్వాసన
నోరు పొడారి వుంటుంది

**హా**నిమన్ మరణానంతరం 857లో హోమియో వైద్యంలో ప్రవేశపెట్టిన మరొక ముఖ్యమైన మందు నీటిద్వారా సంక్రమించే టైఫాయిడ్‌లాంటి వ్యాధులు ప్రబలంగా ఉన్న భారతదేశంలో ఈ ఔషధం మరింత ప్రాధాన్యతను సంతరించుకొంటుంది ఈ కారణంగా ఇది ప్రతి ఇంట్లో మినీకిట్‌లో ఉంచుకోదగ్గ మందు

జ్వరాలకు బాప్టీజియాతోపాటు జెల్సిమియం ఆర్సెనికం ఆల్బ్ బ్రయోనియా తప్పక గుర్తుంచుకోవలసిన ఔషధాలు

బాప్టీజియా రక్తంలో చోటుచేసుకొనే టైఫాయిడ్ క్రిములను శక్తిహీనంగా చేయగలదని బ్రిటిష్ వైద్యవేత్త డాక్టర్ వీలర్ ప్రయోగపూర్వకంగా నిరూపించాడు

టైఫాయిడ్ బాధలు అతి శీఘ్రంగా పెరుగుతూ వచ్చినట్లయితే బాప్టీజియా సరైన ఔషధమని కెంట్ అభిప్రాయం బాధలు క్రమ క్రమంగా పెరుగుతూ వచ్చిన కేసుల్లో వాడతగిన మందు జెల్సిమియం వ్యాధి ముదిరిన స్థాయిలో జెల్సిమియం తరువాత తప్పక ఆలోచించాల్సిన మందు బాప్టీజియా వ్యాధి పరిణామాన్నిబట్టి స్థాయినిబట్టి ఔషధాలను ఎంపికచేయవలసి ఉంటుందన్నది గమనార్హం రోగి తత్వాన్నిబట్టి వ్యాధి నడక ఉంటుంది తత్వానుసారంగా ఔషధాల ఎంపికజరుగుతుందనడాకి ఇది నిదర్శనం

టైఫాయిడ్‌లో బాప్టీజియా వాడిన తరవాత ఇంకా నివారణకాని బాధలకు లక్షణ సారూప్యతనుబట్టి బ్రయోనియాగాని ఆర్సెనికం ఆల్బ్‌గాని వాడవలసి ఉంటుంది టైఫాయిడ్ జ్వరంలో ఈ నాలుగుమందులు దృష్టిలో ఉంచుకొని లక్షణ సముదాయాన్నిబట్టి వాడుకోవాలి

టైఫాయిడ్ ఫ్లూ డిఫ్తీరియా బాలెంత జ్వరంలాంటి కేసుల్లో బాధలు అతిశీఘ్రంగా తారస్థాయికి చేరుకొంటాయి ఈ కేసుల్లో రోగులు మగతగా ఉంటారు ముఖం ఎర్రబారి ఉంటుంది విపరీతమైన తలనొప్పి, కళ్ళుమూసుకుపోతుంటాయి రోగులు అస్తిమితంగా ఉంటారు అటు ఇటూ కదలకుండా ఉండలేరు ఒళ్ళంతా పచ్చిపుండులా ఉంటుంది అధికంగా నొప్పులు పరుపుమీద పడుకొన్నా పడకరాయిలాగా అనిపిస్తుంది చెమట ఎక్కువ మల మూత్రాలు చెమట దుర్వాసన కఫంగూడ దుర్వాసనే గొంతు ఎర్రగా ఉంటుంది దాహం ఎక్కువ తాగాలంటే వికారం రోగి మానసికంగా ఏమీ ఆలోచించలేడు తాగినట్లుగా పడివుంటాడు అడిగినదానికి జవాబు చెప్పరు జవాబు చెప్పడం మొదలుపెట్టినా మధ్యలోనే నిద్రపోతాడు దేనిమీదా ఏకాగ్రత కుదరదు బాప్టీజియా రోగి వ్యక్తిత్వం కకావికలైపోతుంది శరీరంలోని భాగాలు మొండెం కాళ్ళు చేతులు విడిపోయినట్టుగా అనుభూతి ఇది బాప్టీజియా విచిత్ర లక్షణం ఈ లక్షణంతో పాటు మనకచూపు వృసికట్టిన [illegible] ఎర్రబారిన ముఖం కన్పించినట్లయితే వ్యాధిపేరు ఏదిపెట్టినా బాప్టీజియా ఇటు అద్భుత ఫలితాలు పొందవచ్చు బాలెంత జ్వరాలకు బాప్టీజియాతోబాటు పైరోజెన్ సల్ఫర్ కూడా వాడుకోదగ్గ మందులే

ఫ్లూజ్వరానికి ప్రత్యేకమైన మందు జెల్సిమియం జలుబు నొప్పులు తీవ్రంగా ఉండి దానికితోడు విరేచనాలున్నట్లయితే బాప్టీజియా ముఖ్యమైన మందు జెల్సిమియం బాప్టీజియా రోగుల్లో నీరసం జాస్తి ఏటువక్కకు తిరిగి పడుకొంటే ఆ వక్క బాధలెక్కువ కావటం ఒళ్ళంతా విరగ్గొట్టినట్టు అనిపించడం బాప్టీజియా రోగి విలక్షణత

బాప్టీజియా జిగురుపొరలను ప్రభావితం చేస్తుంది గొంతు టాన్సిల్ ఎర్రగా ఉంటాయి కాని నొప్పి ఉండదు ఇది బాప్టీజియా రోగిలో విచిత్ర లక్షణం చిన్నపేగులు జిగురు పొరలలో మార్పువల్ల విరేచనాలు పట్టుకొంటాయి మలం దుర్వాసన కొడుతుంటుంది

# 15 బెరైటాకార్బ్

టాన్సిల్స్ వాచి వుంటాయి గొంతునొప్పి మింగటం కష్టం
పిల్లలు పెరగరు తరచుగా జలుబు దగ్గు సిగ్గు భయం కొత్తవాళ్ల దగ్గరకుపోలేరు
మెడలో గ్రంధులు వాచివుంటాయి
వృద్ధులలో శిశుప్రవృత్తి శారీరక మానసిక బలహీనత
అకస్మాత్తుగా వచ్చే టాన్సిల్స్ వాపునకు బెల్లడోనా
నిదానంగా చోటుచేసుకునే వాపునకు బెరైటాకార్బ్

ఇది విషతుల్యమైన క్షారం రసాయనికంగా బేరియం కార్బనేట్ విషపదార్థాలు పొటెన్సీ రూపంలో శక్తిమంతమైన ఔషధాలు హానిమన్ ప్రవేశపెట్టిన ప్రధానమైన యాంటిసోరిక్ ఔషధాలలో ఇది ఒకటి ఇది పిల్లలకు వృద్ధులకు బాగా ఉపయోగపడే మందు మీ మినీకిట్‌లో దీనికి చోటు కల్పించాలి

పిల్లల్లో పెరుగుదల లోపిస్తే ఇది ప్రత్యేకమైన ఔషధం ఈ పిల్లలు వయస్సుకు తగ్గ ఎత్తు పెరగరు వయస్సుకు తగ్గ బరువుంటే వుండవచ్చు మరుగుజ్జుగా కనిపిస్తారు శరీరంలాగా మానసికవికాసం కూడా

తక్కువే వీరికి సిగ్గు భయం ఎక్కువ కొత్తవాళ్లకు దూరంగా వుంటారు కొత్తచోటుకు వెళితే భయపడతారు ఎవరైనా చొరవతీసుకొని దగ్గరకు తీస్తే చిరాకుపడి ఏడుపు మొదలుపెడతారు ఒంటరిగా వుండలేరు తెలిసినవాళ్ళు దగ్గరగా వుండాలి తోటిపిల్లలతో కలవరు

ఈ పిల్లలకి మెడనిలబెట్టడం దగ్గరనుంచీ కూర్చోవడం నడవడం పళ్లురావడం మాటలు రావడం అన్నీ ఆలస్యమే ఈ దశల్లో కొన్ని సమయానికి వచ్చినా కొన్ని ఆలస్యమవుతాయి వికాసంలో క్రమత్వం లేకపోవడం బెరైటాకార్బ్ విచిత్రలక్షణం ఈ పిల్లలు ఒళ్ళు చేయరు వీరికి మతిమరుపు ఎక్కువ మనసుదేనిమీదా లగ్నం చేయరు బెరైటాకార్బ్ బిడ్డ ఏదో ఒక బొమ్మ తీసుకొని మళ్లీ వెంటనే దాన్ని వదిలేసి ఇంకోదానివైపు వెడతాడు డాక్టర్ దగ్గరకు తీసుకెళ్లితే ఒక క్షణం డాక్టర్ వైపుచూచి తల్లిని వాటేసుకొంటాడు స్కూలుకు పంపితే చదువురాదు ఇంటిదగ్గర కష్టపడినేర్పినా బయటకు పోయివచ్చేసరికి మరచిపోతాడు ఎప్పుడూ చొంగకారు స్తుంటాడు

వీరికి మనసు స్వాధీనంలో లేనట్లే శరీరం కూడా స్వాధీనంలో వుండదు త్వరగా అలసిపోతారు కష్టపడలేరు నీరసం ఈ పిల్లలు పెరిగిన తరవాత ఒళ్ళు అలిస్తే తలనొప్పి వస్తుంది కదలిక తట్టుకోలేక రైలు కారు ప్రయాణాలలో వాంతులవుతాయి ఈ పిల్లలకు చలిగిట్టదు తేలికగా జలుబు పట్టుకొంటుంది దానితో చెవిపోటు విరేచనాలు కూడా తోడుగావచ్చు. ఈ పిల్లల జలుబుకు ప్రత్యేకత ఉంది ముందుగా గొంతు జలుబు టాన్సిల్స్‌వస్తాయి చీముపట్టవచ్చు. డాక్టర్లు చూసి టాన్సిల్స్ వాచివున్నాయి గనుక ఈ పిల్లవాడిలో త్వరగా జలుబు పట్టుకుంటుందంటారు ఆపరేషను చేయాలంటారు టాన్సిల్స్ జలుబు ఫలితమేగాని జలుబుకు కారణంగాదు టాన్సిల్స్ తీసినంతమాత్రాన అతని తత్వం మారదు జలుబు చేస్తూనే వుంటుంది బెరైటాకార్బ్ వాడితే బిడ్డతత్వాన్ని మార్చి జలుబు రాకుండా చేయడం వాచిన టాన్సిల్స్‌ను తగ్గించడం వారి [illegible] మానసిక వికాసాలకు [illegible] చీము పట్టిన టాన్సిల్స్‌కు బెరైటాకార్బ్ హెపార్‌సల్ఫ్, సొరైనం ప్రధాన ఔషధత్రయం మానసిక శారీరక రుగ్మత వెనుక దాగివున్న తత్వం అవగాహన అవసరాన్ని గుర్తుచేసేమందు ఇది ఈ బిడ్డకి టాన్సిల్స్‌లాగానే మెడలో గ్రంధులు వాచి వుండవచ్చు. ఇదేమాదిరిగా పొట్టలో గ్రంధులు కూడా వాచివుంటాయి పొట్ట ముందుకు పొడుచుకు వస్తుంది నడ్డి విరుచుకొని నడిచినట్లు కన్పిస్తాడు తిన్న తరవాత బెరైటాకార్బ్ పిల్లలు అవస్థపడతారు ఇది విచిత్ర లక్షణం

గొంతు నొప్పి, జ్వరం జలుబుతో ఉన్న పిల్లవానికి బెరైటాకార్బ్ వాడవలసివస్తే ముందుగా బెరైటామూర్ వాడి అప్పటి బాధలను తగ్గించాలని డాక్టర్ బోర్లాండ్ సూచన ఇది ఆచరణయోగ్యమైనది తరవాత బెరైటా కార్బ్ వాడాలి ఇది తత్వగతమైన చికిత్సా పద్ధతి

పిల్లలు కోలుకోకుండా చిక్కిపోతుంటే బెరైటాకార్బ్, నేట్రంమూర్ అయోడం ఆలోచించదగ్గ మందులు వీరి తత్వాలను అర్థంచేసుకొని ఈ మందులు వాడాలి బెరైటా బిడ్డను తేలికగా గుర్తించవచ్చు. ఆడుకోటానికి పోయి తన్నులు తిని మెదలకుండా ఇంటికి వచ్చే బిడ్డ బెరైటాకార్బ్. ఈ బిడ్డకు చర్మవ్యాధి వుండవచ్చు. లేదా తలమీద మాత్రమే కురుపులుండవచ్చు. మలబద్ధకం జాస్తి మలం పెంటికలు కడుతుంది

యుక్తవయసులో బెరైటాకార్బ్ యువకులు సాధారణంగా హస్తప్రయోగానికి బానిసలైపోతారు ఈ అలవాటు నుంచి బయటపడలేరు ఏకాగ్రత లోపిస్తుంది మతిమరుపు ఎక్కువ ఈ దశలో వీరికి ఈ మందు మంచిమేలు చేస్తుంది

బెరైటాకార్బ్ తత్వం గలవాళ్లకి వార్ధక్య లక్షణాలు త్వరగా వస్తాయి చిన్నపిల్లల్లాగా ప్రవర్తిస్తారు ఇప్పుడు పెట్టిన వస్తువు ఇప్పుడే మరచిపోతారు రక్తనాళాలకు కూడా వార్ధక్యందాపురిస్తుంది క్షీణతాలక్షణాలు చోటుచేసు కొంటాయి ధమనులు పెళుసుబారిపోతాయి రక్తపోటు కూడా పెరగవచ్చు. మెదడులో రక్తనాళాలు దెబ్బతిని పక్షవాతం రావచ్చు. పక్షవాతం వచ్చి చాలారోజుల వరకు కూడా కోలుకోనివారికి ఈ మందు మేలు చేస్తుంది.

ఊపిరితిత్తులపై కూడా ఈ మందు ప్రభావమెక్కువ తరచుగా దగ్గు కఫం పట్టుకుంటాయి పడుకొంటే ఆయాసం ఈ బాధలు కూర్చోబెడతాయి యాంటిం‌టార్ట్ ఈ రోగులకు ఉపశాంతి ఇస్తుంది వీరికి బెరైటాకార్బ్ వాడితే ఈ బాధ శాశ్వతంగా నివారణవుతుంది

వార్ధక్యంలో వచ్చేభయంకరమైన ప్రొస్టేట్ గ్రంధివాపునకిదివరప్రసాదమనిడాక్టర్‌ఎన్.ఎం.చౌధురి శ్లాఘించాడు

లైంగికశక్తి నన్నగిల్లి నంపుసకత్వం పట్టుకొంటుంది
సార్థకమైన వార్ధక్య జీవితానికిది ఎనలేని ఔషధం

# 16 కాల్కేరియా కార్బ్

పోషణ లోపం సత్తువ వుండదు
మానసికంగా శారీరకంగా మందకొడితనం నిరాశ
తల పొట్ట పెద్దవిగా వుంటాయి దంతాలు రావడం ఆలస్యం
దొడ్డికాళ్లు నడక ఆలస్యంగా వస్తుంది
తల మీద చెమటలు ఎక్కువ ఒళ్ళు చల్లగా వుంటుంది
పుల్లటి తేపులు వాంతులు పాలు నెయ్యి ఇష్టముండదు
తేలికగా జలుబు చేస్తుంది విడిచి పెట్టకుండా దగ్గు
ముక్కులో కండలు రక్తం తక్కువ

ఇది రసాయనికంగా కాల్షియం కార్బనేట్ హోమియో వైద్యంలో అనేకరకాల కాల్షియం సమ్మేళనాలున్నై వీటిలో ముఖ్యమైనవి కాల్కేరియాకార్బ్, కాల్కేరియాఫాస్ హోమియో వైద్యంలో సల్ఫర్‌ది మొదటిస్థానం తరవాతి స్థానం కాల్కేరియా కార్బ్‌ది ఇవి చాలా గాఢమైన ఔషధాలు వీటి ప్రభావం దీర్ఘకాలికం శక్తికోల్పోయిన రోగులకు ఇవి ఎంతోమేలు చేస్తాయి ఈ రెండింటితోపాటు లైకోపోడియాన్ని చేర్చి హోమియోవైద్యంలో ఔషధరాజత్రయంగా చెబుతారు మొత్తం జనాభాలో అత్యధిక సంఖ్యాకులకు ఈ ఔషధాల ధర్మాలు వర్తిస్తాయి అందువల్ల కాల్కేరియాకార్బ్‌ను మీ మినీకిట్‌లో తప్పకుండా ఉంచుకోవాలి

హానిమన్ తనమీద తన ఎనిమిదిమంది శిష్యులమీద ప్రయోగాలుచేసి ఈ మందు ధర్మాలను రాబట్టాడు ఈ మందు గవ్వపొరలలోని మజ్జనుంచి తయారౌతుంది అంతమాత్రాన ఇది వట్టి కాల్షియంకార్బొనేట్ కాదంటాడు డాక్టర్ ఫారింగ్‌టన్ ఆయిష్టర్ కవచంగావుండే ఈ గవ్వలో దాని జీవధర్మాలు అంతర్గతంగా వున్నాయి గనుక దీనిని కాల్కేరియా ఆస్ట్రియేరం అన్నాడు హెరింగ్

శరీరపోషణ పెరుగుదలలో కాల్షియం పాత్ర అమోఘం ఎముకల్లో దంతాల్లో ఎక్కువభాగం కాల్షియమే జీవకణ కార్యాలలో కాల్షియం పొటాషియం సోడియం మెగ్నీషియంవంటి లవణాల పాత్ర ఎంతో వుంది ఎముకల నిర్మాణానికి కండరాల కదలికలకీ గాయం తగిలినప్పుడు రక్తం ఊరక కారిపోకుండా చేయడానికీ కాల్షియం అవసరం అవుతుంది కాల్షియంలేని నీటిలో కప్పలను పెంచితే వాటి అండకణాలు అభివృద్ధి చెందలేవు దీనినిబట్టి జననేంద్రియాలపై కాల్షియం ప్రభావం ఎంతటిదో తెలుస్తుంది

కాల్కేరియా కార్బ్‌ది ఊబ ఒళ్ళు, ఔషధతత్వాలవరంగా రోగులను వర్గీకరించి ఆ ఔషధం పేరుతో రోగిని పిలవడం హోమియో వైద్యంలోని విశిష్టత ఆరోగి ఆ ఔషధతత్వానికి నమూనా దీనినే కాన్‌స్టిట్యూషనల్ ఔషధమని పిలుస్తారు జీవితంలో ఏదో ఒక దశలో లావుగాలేని వాళ్ళకు కాల్కేరియాకార్బ్ ఉపయోగపడదు లావుగా కనబడ్డా ఈ రోగికి శక్తి శూన్యం Fatness without fitness వీరి ఎముకలలో సత్తావుండదు చల్లని వాతావరణంలో కూడా చెమటలు కారుతుంటాయి నీరసం నిస్త్రాణ

కాల్కేరియా తత్వాన్ని క్లుప్తంగా చెప్పాలంటే మందకొడితనం బద్ధకం వెనకబడిపోవటం స్థూలత నిస్సత్తువ భయం

మందకొడితనంవల్ల శరీరపోషణ దెబ్బతింటుంది పెరుగుదలలో లోపం సాధారణంగా బిడ్డ 4వ నెలలో మెడ నిలబెడుతుంది ఒళ్ళు 6వ నెలలో రావటం మొదలవుతుంది 6వ నెల నుండి 9వ నెలలోపల కూర్చుంటుంది 12వ నెల నుండి 14వ నెలల్లోపుగా నడక నేర్చుకుంటుంది కాని కాల్కేరియాలో ఈ దశలన్నీ ఆలస్యమే వెనుకబడడమంటే ఇదే తల పెద్దది మాడుపూడదు మెడచుట్టూ గ్రంధులు వాచివుండొచ్చు పొట్ట ముందుకు పొడుచుకువచ్చి మూకుడు బోర్లించినట్టుగా వుంటుంది చర్మం ముడుతబట్టినట్టు కనిపిస్తుంది

ఇవన్నీ పెరుగుదల లోపాన్నీ పోషణ లోపాన్నీ సూచించే లక్షణాలే

ఆకలి విపరీతంగా ఉండవచ్చు లేదా బలవంతంగా తినిపించాల్సి రావచ్చు. మట్టి ఇసుక సున్నంలాంటివి తింటుంటారు వీరికి తలమీద చెమటలు ఎక్కువ తలకింద పెట్టిన గుడ్డలు చెమటతో నానతాయి వీరు రాత్రిళ్ళు సుఖంగా నిద్రపోరు అర్ధరాత్రి లేచి దడుచుకొన్నట్టుగా ఏడుస్తారు మాటిమాటికి జలుబు దగ్గు

మందకొడితనం ఈ బిడ్డ జీర్ణమండలంలో కూడా వ్యక్తమవుతుంది అజీర్తి తరచుగా విరేచనాలు మలం పులిసినట్టు వాసన వాంతులు కూడా పులిసిన వాసన బిడ్డశరీరం కూడా పులిసిన కంపు పులియటం కాల్కేరియా కార్బ్ ముఖ్యలక్షణంగా ఎంచుకోవచ్చు. తిన్న ఆహారం విరేచనంలో జీర్ణం కాకుండాపోతుంది విరేచనం మీద కంట్రోలు వుండదు తెలియకుండానే బట్టల్లో అయిపోతుంటుంది పాలుగిట్టవు పాలిస్తే పెరుగులాగా కుదపలు కుదపలుగా కక్కేస్తారు ఇదే లక్షణం ఎథూజా యాంటింక్రూడ్‌లో కూడా వుంది దంతాలు వచ్చేటప్పుడు వేసవి కాలంలో వచ్చే విరేచనాలకు కాల్కేరియాకార్బ్ ప్రత్యేకమైన ఔషధం

కాల్కేరియా కార్బ్ శిశువుల్లో పొట్టలో పురుగులు కూడా చేటుచేసుకొంటాయి వీరికి పురుగుల మందువాడితే ప్రయోజనముండదు కాల్కేరియాకార్బ్ పొటెన్సీ రూపంలో వాడితే తత్వం మారిపోయి పురుగుల బాధకూడా తప్పిపోతుంది మురుగు గుంటల్లో దోమలు చేరుతున్నాయంటే దోమలను చంపుతూ కూర్చుంటే దోమలు పోవు అసలు కారణమైన మురుగునే తీసివేయాలి

కాల్కేరియా కార్బ్ తత్వం బద్ధకం కనక మలబద్ధకం కూడా ఈ శిశువు లక్షణం మలబద్ధకంగా ఉన్నప్పుడే ఈ బిడ్డకు సుఖంగా వుంటుంది

ఎముకల్లో బలం తక్కువగా వున్నందున ఈ బిడ్డలకు దొడ్డికాళ్ళొస్తాయి (రికెట్స్ కాల్షియం బిళ్ళలు వాడితే దొడ్డికాళ్ళుపోవు ఈ బిడ్డలకు కాల్షియం వంటబట్టకపోవడమే వ్యాధికి కారణమన్న విషయం గమనార్హం విటమిన్ డి సూర్యరశ్మి కొంతవరకు మేలుచేస్తాయి

కాల్కేరియాకార్బ్ తత్వం నిదానం ఇది మానసిక శారీరక స్థాయిల్లో వ్యక్తమవుతుంటుంది బడికి పోయేపిల్లలు చదువులో చురుకుగా వుండరు ఒక సబ్జెక్టులో అయినా వెనుకబడి వుంటారు చదువులో వెనుకబడ్డ పిల్లలకు బెరైటాకార్బ్ కూడా మంచిమందే అయినా తత్వాన్ని గమనించి వాడుకోవాలి బెరైటాకార్బ్ పిల్లలు మొద్దులు జ్ఞాపకశక్తి వుండదు గ్రహణశక్తికూడా తక్కువే కాల్కేరియాలో జ్ఞాపకశక్తికీ గ్రహణశక్తికీ లోపంవుండదు కాని బద్ధకస్తుడు ఈ బద్ధకం మానసిక శారీరకస్థాయిల్లోవుంటుంది తల్లిదండ్రులకు టీచర్లకు పిల్లల మనస్తత్వాల అవగాహన చాలా అవసరం

బద్ధకంవలన కాల్కేరియాకు మందకొడితనం ఈ రెండింటివలన భయం చోటుచేసుకొంటుంది తన అసమర్థతను గమనిస్తారని భయపడిపోతాడు చేయాలనుకొన్నది చేయలేకపోవడం ఈ భయానికి మూలం క్లాసులో అర్థంకాకపోయినా లేచినిలబడి టీచర్ని అడగడు క్లాసులో పిల్లలు ఎగతాళి చేస్తారని భయం ఈ భయంవల్ల మొదటికే బద్ధకస్తుడు క్లాసులో వెనుకబడిపోతాడు టీచర్లు కాల్కేరియా మనస్తత్వాన్ని కనిపెట్టలేక మీ పిల్లవాడికి చదువు అబ్బదని ప్రొగ్రెస్ రిపోర్టులు పంపిస్తుంటారు

ఈ పిల్లలు ఆటల్లోపాల్గొనరు బద్ధకమే దీనికి కారణం శరీర శ్రమకు తట్టుకోలేరు ఆడటం చేతకాలేదని తోటి పిల్లలు నవ్వితారని భయం అందుకని ఆటలాడకుండా చేతులు కట్టుకు కూర్చుంటారు ఈ పిల్లలకు గ్రంధులు వాచి ఉంటాయి టాన్సిల్స్ కూడా వాచివుంటాయి కాల్కేరియా కార్బ్ వాడి ఈ పిల్లలను ఆపరేషన్ పాతబడకుండా రక్షించవచ్చు.

యవ్వనంలో అడుగు పెట్టేసరికి కాల్కేరియాకార్బ్ పిల్లలు బాగా సాగుతారు ఈ దశలో బాల్యచరిత్రను దృష్టిలో పెట్టుకొని వీరి తత్వాన్ని మదింపు వేసుకోవాలి ఈ వయసులో యువకులు హస్తప్రయోగం అలవాటుకు బానిసలై నీరసించి పోతారు ఈ రకమైన నీరసానికి కాల్కేరియాకార్బ్, సల్ఫర్ నక్స్‌వామికా ప్రత్యేకమైన మందులుగా డాక్టర్ జార్ సూచించాడు టి బి రావచ్చు. ఈ అనుమానం వుంటే ● మందు తప్పనిసరిగా వాడాలి లక్షణ సముదాయాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ ఔషధాన్ని ఎంపిక చేసి వాడుకోవాలి భగ్నప్రేమికులకు ఇది గొప్ప ఔషధం

యువతులు సకాలంలో రజస్వలకారు తత్వరీత్యా వున్న బద్ధకం మందకొడితనం జీవకార్యాలన్నీ లేటుకావడానికి కారణం

కాల్కేరియాకార్బ్‌కు రుతుస్రావాలపై అత్యంత ప్రభావముంది రుతుస్రావాలు అధికంగా అవుతున్న స్త్రీలకు ఇది ప్రత్యేకమైన మందు రుతుస్రావాలు త్వరత్వరగా వస్తాయి మైల ఎక్కువ ఎక్కువరోజులు అవుతుంది గర్భస్రావంవల్లగాని, కాన్పులోగాని కాన్పు తరవాతగాని రక్తం పోతుంటే ఈ మందు తప్పక ఆలోచించాలి ఉద్రేకానికి గురైనప్పుడు శ్రమమూలకంగా రక్తం కనబడడం కాల్కేరియాకార్బ్ రోగిలో విచిత్రలక్షణం విచిత్రలక్షణాలు ఔషధం ఎంపికకు చాలా అవసరం ఈ లక్షణాన్ని గుర్తించి కాల్కేరియాకార్బ్ వాడుకొంటే రక్తస్రావాన్ని అరికట్టవచ్చు. శరీర ధర్మస్థాయిలో రక్తస్రావాన్ని అరికట్టడానికి కాల్షియం అవసరాన్ని ఇది గుర్తుచేస్తుంది తత్వానుసారంగా బహిష్టుకు బహిష్టుకు మధ్య కన్పించే తెల్లమైలకు ఇది ప్రయోజనకారి తెల్లకుసుమ పాలలాగా వుండి దురదలు మంటలతో బాధపెడుతుంటుంది

పని ఒత్తిడివల్లగాని మెంటల్ షాక్‌వల్లగాని దెబ్బతిని మానసిక దౌర్బల్యం చోటుచేసుకొంటే ఇది మంచిమందు మతిమరుపు త్వరగా ఆలోచించలేకపోవడం సందర్భానుసారంగా మాటలు తట్టకపోవడం జంకు భయం బాగా సాగుతున్న వ్యాపారాన్ని వృత్తిని మధ్యలోనే వదిలెయ్యడం తమ మానసిక బలహీనత ఇతరులు గుర్తించి పిచ్చి అనుకుంటారేమోనని భయం- ఇవన్నీ మానసిక దౌర్బల్యాన్ని సూచించే లక్షణాలు

కాల్కేరియాకార్బ్ అన్నకోశంలో హైపర్ ఎసిడిటీకీ శ్వాసావయవాల్లో బ్రాంకైటిస్‌కి ఉబ్బసానికి కిడ్నీలలో రాళ్లకు కీళ్ళలో ఆర్థరైటిస్‌కి ఉపయోగపడే మందు ఈ వ్యాధులన్ని పై చూపులకు భిన్నంగా కన్పించినా ఈ బాధలన్నింటికి మూలకారణం తత్వగతంగా వుండాలి ఇది వైద్యపరిభాషలో డయాథీసిస్ హానిమన్ ఈ మూలతత్వాన్ని సోరా సైకోసిస్ ట్యూబర్క్యులార్ సిఫిలిస్‌గా విశ్లేషించాడు ఈ నాలుగు కూడా మూలతత్వ పరిణామదశలను తెలియచేసేవే కాల్కేరియాకార్బ్ ఈ అన్ని దశలకు పనికివచ్చే మందే ఇలాంటి మందులని లోతుకుపోయి పనిచేసే మందులు (డీప్‌యాక్టింగ్) అని అంటారు పాలీక్రెస్ట్ ఔషధాలన్నీ ఇలాంటివే

# 17 కాల్కేరియా ఫాస్

అజీర్తి తిన్నది అరగక కక్కుకుంటారు ముఖ్యంగా పాలు పిల్లలు శుష్కించిపోతారు
దంతాలు వచ్చేటప్పుడు ఆకుపచ్చటి విరేచనాలు
దుర్వాసనతో గూడిన అపానవాయువు
రికెట్స్ గ్రంధులవాపు చెమట లెక్కువ
బడికి వెళ్ళే ఆడపిల్లల్లో బడినుంచి వచ్చిన తరవాత తలనొప్పి
వృద్ధుల్లో ఎముకలు విరిగిన తరవాత అతుక్కోవు
చిన్నపిల్లలు జబ్బు చేసి తగ్గిన తరవాత కోలుకోరు

డాక్టర్ ష్యూస్లర్ గుర్తించిన ద్వాదశ లవణాలలో ఇది ఒకటి రసాయనికంగా ఇది కాల్షియం ఫాస్ఫేట్ ఈ లవణంపై హెరింగ్ ప్రభృతులు కూడా ప్రయోగాలు చేసి దాని ధర్మాలు రాబట్టారు

ఈ లవణం ఎముకలు పళ్ళు రక్తకణాలలో అధికంగా వుంటుంది ఎముకల దృఢత్వానికి ఇది మూలం దంతాలు రూపొందటానికి ఈ లవణం అవసరం జఠర రసంలో ఈ లవణముంటుంది జఠర రసంలో ఈ లవణం సమపాళ్ళలో లేనట్లయితే అజీర్తికి హేతువు అవుతుంది ఈ లవణ లోపం రుమాటిజం లాంటి బాధలకు దారితీస్తుంది ఎసిడిటీ బాధలు ఈ లవణ లోపంవల్లనే అని గుర్తించడం జరిగింది అన్నకోశంలో అల్సర్ శ్వాసావయవ బాధలు కీళ్ళ నొప్పులు మూత్రావయవాల్లో రాళ్ళు ఎసిడిటీ వల్లనే అన్నది గమనార్హం కాల్కేరియాఫాస్ మెగ్నీషియాఫాస్‌లు చాల సన్నిహిత సంబంధం కలిగిన లవణాలు మెగ్నీషియాఫాస్ ఇవ్వతగిన కేసుల్లో అది వాడినా బాధలు నివారణ కానట్లయితే కాల్కేరియాఫాస్ తప్పక ఆలోచించవలసి ఉంటుంది

శరీర పోషణకు ఈ లవణం అత్యంత ప్రయోజనకారి ఇది టానిక్‌గా వాడుకోదగ్గ లవణం తరుణ

వ్యాధుల కారణంగా గాని దీర్ఘవ్యాధుల కారణంగాగాని చిక్కిపోయినట్లయితే వారికి ఈ లవణం ఇవ్వాల్సి ఉంటుంది ఈ రోగులు శుష్కించిపోవడమేగాక రక్తం తగ్గిపోయి పాలిపోయి ఉంటారు ఎనీమియా రోగులకు కూడా ఈ లవణం ఉపయోగపడుతుంది వయస్సుకు తగినంత ఎదుగుదల లేని పిల్లలకు యవ్వనదశలో ఈ లవణం ప్రయోజనం ఎంతైనా ఉంది ఎముకల్లో ఈ లవణం 57 శాతముంటుంది ఈ లవణం లోపిస్తే ఎముకల నిర్మాణం సాధ్యంకాదు ఎముకలు విరిగి ఆ విరిగిన భాగాలు అతుక్కోవడం ఆలస్యమైతే ఈ లవణం ఉపయోగించుకోవచ్చు. ఎముకల వ్యాధుల్లో కూడా ఈ లవణం ఉపయోగపడుతుంది రికెట్స్ వ్యాధికిది మంచిమందు ఎముకల బలహీనతవల్ల వీరికి దొడ్డికాళ్ళు వస్తాయి ఈ వ్యాధికి కాల్కేరియా ఫాస్‌తోపాటు సైలీషియా కూడా ఆలోచించాలి సైలీషియా అవసరమయ్యే పిల్లలకు తలలో చెమటలు అరికాళ్ళు, అరిచేతుల్లో చెమటలు మలబద్ధకంలాంటి లక్షణాలు కూడా ఉంటాయి రోగి లక్షణాలు ఈ లవణాల ఎంపికకు సహాయపడతాయి పళ్ళు ఆలస్యంగా రావడం వచ్చినా పుచ్చిపోతుంటాయి ఈ లక్షణాలు కాల్కేరియాఫాస్ లవణ లోపాన్ని సూచిస్తాయి ఆ పిల్లలకు కాల్కేరియాఫాస్ వాడవలసివుంటుంది ఈ పిల్లలకు జీర్ణశక్తి తక్కువ వయస్సుకి తగినంత ఒళ్ళు చేయరు శుష్కించి వుంటారు పొట్ట పీక్కుపోయి ముడతలు పడివుంటుంది గ్రంధులు వాచివుండవచ్చు.

వసిపిల్లలకు కూడా ఇది చాలా ఉపయోగకరమైన లవణం తల పెద్దదిగా కన్పిస్తుంది మాడు సకాలంలో పూడదు మెడ నిలబెట్టలేరు వెన్నెముక వంగిపోతుంటుంది పాలు తాగినప్పుడల్లా కడుపులో నొప్పి పాలు వాంతి చేసుకొంటారు ఆకుపచ్చటి విరేచనాలు అధికంగా అవుతుంటాయి ఎప్పుడూ తింటుంటారు జీర్ణం చేసుకోలేరు గ్యాస్ అధికం పొట్టలో వుండే లింఫ్ గ్రంధులు వాచివుంటాయి చిక్కిపోతుంటారు కూర్చోవడం నడవడం పళ్ళు రావడం అన్నీ ఆలస్యమే ఈ లక్షణాలున్న పిల్లలకు ఈ లవణం వాడడం మంచిది తింటున్నా కోలుకోని పిల్లలకు నేట్రంమూర్ కూడా ఆలోచించదగిందే నేట్రంమూర్ ఇవ్వదగిన పిల్లలు చల్లదనం ఇష్టపడతారు మలబద్ధకం వుంటుంది కాల్కేరియాఫాస్ పిల్లలకు వెచ్చదనం కావాలి పళ్ళు వచ్చేటప్పుడు విరేచనాలు వేసవిలో విరేచనాలు పొట్టలో పురుగులు ఈ లక్షణాలున్న వారికి కాల్కేరియాఫాస్ ఆలోచించాలి పళ్ళు ఆలస్యంగా రావడం వచ్చినా త్వరగా పుచ్చిపోతుంటాయి ఈ కేసులకి కాల్కేరియాఫ్లోర్ కూడా గుర్తించుకోదగిందే పళ్ళు వచ్చే సమయంలో ఫిట్స్ వస్తుంటే మెగ్నీషియాఫాస్ ప్రధానమైన మందు ఈ మందు వాడినా ఫిట్స్ తగ్గకపోయినట్లయితే కాల్కేరియాఫాస్ వాడవలసివుంటుంది పళ్ళు వచ్చే సమయంలో బాధలకు ప్రధానమైన లవణం కాల్కేరియాఫాస్ వసిపిల్లల్లో వృద్ధుల్లో మలబద్ధకానికి ఇది ఉపయోగపడే లవణం బయటకు పొడుచుకువచ్చి దురదపెట్టే మలలకు కాల్కేరియాఫాస్ కాల్కేరియా ఫ్లోర్ ఆలోచించవలసివుంటుంది

పిల్లలు చదువుమీద మనసు లగ్నం చేయలేరు స్కూలు వదిలిపెట్టే సమయానికి వీరికి తలనొప్పి స్కూలు లేని రోజుల్లో వీరికి తలనొప్పి వుండదు ఈ పిల్లలకు ఎప్పుడూ విరేచనాలు విరేచనాలతోపాటు గ్యాస్ మలం దుర్వాసన కొడుతుంటుంది పిల్లలు కోలుకోరు ఈ లక్షణాలున్న పిల్లలకు కాల్కేరియాఫాస్ ముందుగా ఆలోచించవలసివుంటుంది మెగ్నీషియాఫాస్ నేట్రంమూర్‌లను కూడా లక్షణాలను అనుసరించి ఇవ్వవలసిరావచ్చు. టాన్సిల్స్ దీర్ఘకాలంగా వాచివున్నవారికి కాల్కేరియాఫాస్ ప్రత్యేకమైన మందు బలహీనంగా ఉండి శ్రమకు తట్టుకోలేనివారికి ఈ లవణం ఇవ్వొచ్చు. వీరు మానసిక శ్రమ శారీరక శ్రమ కూడా తట్టుకోలేరు ఎప్పుడూ విశ్రాంతి కోరుకుంటారు జ్ఞాపకశక్తి తక్కువ హస్తప్రయోగానికి బానిసైపోయి మానసిక దౌర్బల్యానికి గురైనవారికిది దివ్యౌషధం వీరికి భవిష్యత్తును గూర్చిన ఆందోళన అధికం దిగులు జాస్తి ఒంటరితనం కోరుకుంటారు దు ఖభారంతో కుంగిపోయేవారికి కూడా ఇది చాలా మంచిమందు చల్లటిగాలికి బాధలుద్రేకిస్తాయి తడిసినా వీరికి బాధలెక్కువ ఋతువు మారినప్పుడల్లా వీరి బాధలు ఉద్రేకిస్తాయి

యుక్తవయస్సులో రక్తం తక్కువ బలహీనంగా ఉండే వారికి ఈ మందు చాలా ఉపయోగం తరచుగా జలుబు ముఖంమీద మొటాలు ఆడపిల్లల ముఖంమీద మొటాలకు ఇది మంచిమందు ఈ లక్షణాలున్నవారికి కాల్కేరియాఫాస్‌తోపాటు నేట్రంమూర్ కూడా తప్పక గుర్తుంచుకోదగిందే

అతిమూత్రం మూత్రంలో అల్బుమిన్ మూత్ర విసర్జన సమయంలో పోట్లు కిడ్నీవాపు మూత్రం ఎర్రగా జారీగావడం ఈ వ్యాధికి కాల్కేరియాఫాస్‌తోపాటు కాలీఫాస్ కూడా వాడుకోదగిన లవణమే మూత్రంలో

ఫాస్ఫేట్స్ పోతుంటే ఏదో ఒక దశలో ఈ లవణం వాడుకోక తప్పదు మూత్రంలో రాళ్ళు ఏర్పడకుండా ఉండడానికి ఈ లవణం కూడా ఆలోచించాలి మధుమేహ రోగులకు ఇతర లవణాలతోపాటు ఈ లవణం కూడా ఉపయోగపెట్టుకోవలసి ఉంటుంది ఈ రోగులకు నేత్రంఫాస్ కాలీఫాస్‌లు కూడా మంచి మందులే ఏ వయస్సులోనైనా తెలియకుండా మూత్రం పడిపోయేవారికి ఇది ప్రయోజనకరమైన లవణం

కాల్కేరియాఫాస్ స్త్రీలకెంతో ఉపయోగపడుతుంది బలహీనతవల్ల గర్భకోశం జారి ఉంటుంది ఈ కేసులకి కాల్కేరియాఫ్లోర్ కూడా మంచిమందే గర్భకోశంలో నొప్పి, బహిష్టుకు ముందు విపరీతమైన కామవాంఛ ఒరునుకుపోయే తెల్లకుసుమ తెల్లకుసుమతో నీరసించిన వారికి టానిక్‌లా ఈ లవణం ఉపయోగపడుతుంది బహిష్టు సమయంలో పురిటినొప్పులులాగా తీవ్రమైన నొప్పి ఈ బాధ వున్నవారికి మెగ్నీషియాఫాస్ కూడా గుర్తుంచుకోవాలి ఈ రకమైన బాధ నివారణకు ఫెర్రంఫాస్‌ను సూచించడం జరిగింది బాలెంతలలో పాలు చాలినంతగా లేని తల్లులకు ఇది వాడవచ్చు. పాలు ఉప్పగా వుంటాయి పిల్లలు తాగరు తాగినా కుదువలు కుదవలుగా పులిసిన పాలు కక్కుతుంటారు. ఈ తల్లులకి కాల్కేరియాఫాస్ నేత్రంమూర్‌లు మంచి మందులు

టి బి కేసుల్లో ఆరంభదశలో ఇది మంచి లవణం ఈ రోగికి తరచుగా విరేచనాలు రాత్రిళ్ళు చెమటలు దగ్గు గొంతు పొడారిపోతుంది రక్తం తక్కువ

# 18 కాస్టికం

దీర్ఘవ్యాధులకిది ప్రత్యేకమైన మందు శారీరక, మానసిక దౌర్బల్యం
సాధారణంగా కుడివైపు వచ్చే పక్షవాతం
ఏ అవయవానికి పక్షవాతం వచ్చినా ఇది ఆలోచించాలి
గొంతు బొంగురు చన్నీళ్ళు తాగితే హాయిగా వుంటుంది
మనసు కుంగిపోయి వుంటుంది
పులిపిర్లు తూజా తరవాత ఇది గొప్పమందు
ఒళ్ళు కాలి తగ్గిపోయిన తరవాత వచ్చే బాధలకు
రాత్రిళ్ళు పక్క తడపటం
కీళ్ళల్లో బాధలు

కాస్టికాన్ని పొటాసియం లవణంగా పరిగణిస్తారు దాని రసాయనిక స్వభావం ఖచ్చితంగా తెలియలేదు హానిమన్ రసాయనిక శాస్త్ర ప్రతిభకి ఈ ఔషధం నిదర్శనం హానిమన్ కేవలం శాస్త్రజ్ఞుడు మాత్రమే కాదు గొప్ప మానవతావాది కూడా పిచ్చివాళ్ళను హింసించకుండా సున్నితంగా వైద్యం చేయాలని మొదటగా ప్రతిపాదించినవాడు హానిమన్

హానిమన్ తన మీద తన మంది శిష్యవర్గం మీద ప్రయోగాలు చేసి కాస్టికం ధర్మాలను నిరూపించాడు ఏ ఔషధాన్ని కనుగొనకపోయినా ఈ ఒక్క కాస్టికం కనుగొన్నందుకే మానవజాతి హానిమన్‌కు రుణపడి ఉండేదని డాక్టర్ నాష్ ఈ ఔషధ ప్రాముఖ్యాన్ని శ్లాఘించాడు ఈ ఔషధం మీ మెడికిట్‌లో తప్పక ఉండదగినది

దీర్ఘ వ్యాధులకిది ప్రత్యేకమైన మందు తరుణ వ్యాధులకి ఉపయోగపడే మందులు ముందుగా వాడుకొన్న తరువాత వ్యాధి తగ్గకపోతే అప్పుడు ఈ మందు వాడవలసి వుంటుంది కాస్టికం ప్రధానతత్వం నిస్సత్తువ దీర్ఘకాలికంగా దిగులు చింతల కారణంగా కలిగే బాధలకు ఇది మందు దడుపు భయాలవల్ల చేటుచేసుకొనే పరిణామాలకు ఈ మందు ఉపయోగిస్తుంది చర్మవ్యాధులకు పూత మందులు వాడి అణిచివేసిన కేసుల్లో ఈ మందు ఆలోచించవలసి ఉంటుంది

మానసికంగా ధైర్యం నడలి ఉంటారు వీరికి తమ బాధలను గూర్చిన భయం నిరాశ నిస్పృహ వట్టి పీడిస్తుంటాయి తమ భవిష్యత్తు కుటుంబ భవిష్యత్తును గూర్చి దిగులు పెట్టుకుంటారు దానితో మానసిక

నమస్థితి కోల్పోతారు తేలికగా ఉద్వేగానికి గురవుతారు ఉద్వేగపరమైన బాధలు కూడా వచ్చిపడతాయి ఎవ్వరైనా ఎదురు చెబితే తట్టుకోలేరు ఏడ్చేస్తారు

తన బాధలకు తానెంతగా కుంగిపోతాడో పరుల బాధలకి కూడా అదేవిధంగా చలించిపోతాడు కాస్టికం కరుణామూర్తి చిన్న పిల్లల్లో ఇది స్పష్టంగా కన్పిస్తుంది పక్క పిల్లవాడిని కొడుతుంటే కాస్టికం తత్వం ఉన్న పిల్లవాడు జాలిపడి ఏడ్చేస్తాడు

కాస్టికంలో జ్ఞాపక శక్తి తగ్గిపోతుంది మాటలు గుర్తుకు రావు వృద్ధాప్యంలో చేటుచేసుకునే మనోదౌర్బల్యాని కిది మంచిమందు మెదడుకు కలిగే బడలికే దీనికి కారణమంటాడు డాక్టర్ కెంట్ శరీరం కూడా ఇదేవిధమైన దౌర్బల్యానికి గురవుతుందని గమనించాలి

కాస్టికం పిల్లవాడిది చాలా సున్నితమైన మనస్సు. తోటి పిల్లల బాధలకి చలించిపోతాడు వీరికి కండరాల కీళ్ళ బాధలు ఎక్కువ దీన్ని రుమాటిజం అంటారు పొడిగా ఉన్న చల్లటిగాలి వీరికి సరిపడదు తేమగా ఉన్న వాతావరణం హాయిగా ఉంటుంది

వీరిది ఉద్వేగపూరిత స్వభావం భయం దడుపు ఎక్కువ ఈ కారణంగా చీకట్లో పడుకోలేరు దడుపు వల్ల కొరియా అసంకల్పితంగా చేతులూగుతుంటాయి చేతుల్లో ఉన్న వస్తువులు జారిపడిపోతుంటాయి నిద్రలో కూడా చేతులు కదులుతుంటే కాస్టికం ప్రత్యేకమైన మందు కొంతమంది పిల్లలకు ఫిట్స్. ఇవి నిద్రలో ఎక్కువ ఫిట్స్‌లో మూత్రం కూడా పడిపోతుంది ఇది కాస్టికం ప్రత్యేకత ఫిట్స్ పూర్ణిమనాడు ఎక్కువౌతాయి ఔషధాల ఎంపిక చేయడానికి కాల ప్రభావం గమనార్హం కాస్టికం పిల్లలు వయసు పెరిగిన తరవాత కూడా పక్క తడుపుతుంటారు నిద్రపోగానే పక్క తడిపేవాళ్లకిది మంచిమందు పల్సాటిల్లా కూడా ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి వారు తెల్లవారు జామున పక్క తడుపుతుంటారు

కాస్టికం పులిపిర్లకు మంచిమందు ఈ విషయంలో తూజాతో పోటీ పడుతుంది

యుక్తవయస్సులో రుతుస్రావాలు క్రమం తప్పి వస్తూ ఫిట్స్ కూడా తోడైన యువతులకు కాస్టికం బాగా ఉపయోగపడుతుంది ఈ ఫిట్స్ అమావాస్యకు ఎక్కువగా కన్పడతాయి ఈ రోగుల్లో చిన్నతనంలో చర్మవ్యాధికి పూతమందులు వాడి అణిచివేసి ఉన్నట్లు గమనిస్తే కాస్టికం తప్పక వాడుకోవచ్చు.

చచ్చు వ్యాధికి గొప్ప మందు శరీరంలో ఏదో ఒక భాగం చచ్చుబడిపోతే ఇది ప్రత్యేకమైన మందు పై రెప్పలు మూసుకుపోవడం ముఖానికి పక్షవాతం (ఫేషియల్ పెరాలిసిస్) ఆహారం మింగుడుపడకపోవడం వీటిని కాస్టికం నివారించగలదు ఆరంభదశలో పక్షవాతానికి ఈ మందు వాడగూడదు ఎకొనైట్ లాంటి మందులు ముందుగా వాడి కాస్టికం ఉపయోగించుకోవచ్చు. కండర బలహీనతవల్ల విరేచనం సాఫీగా అవదు మలబద్ధకం రోగి నిలబడితే తేలికగా విరేచనం అవుతుంది కాన్పు అయిన తరవాత మూత్రకోశ కండరాల బడలికవల్ల బాలింతకు ఒంటేలు రావు వారికి కాస్టికం బాగా ఉపయోగపడుతుంది పుట్టిన శిశువుకి ఒంటేలు రాకపోతే ఎకొనైట్ వాడుకోవాలని కెంట్ సూచించాడు

దీర్ఘకాలంగా కండరాల రుమాటిజంతో బాధపడుతూ అవయవాలు చచ్చుబడిపోతే కాస్టికం వాడుకోవచ్చు. ఈ రోగులకు కాస్టికం రస్టాక్స్ నక్సవర్ మంచి ఔషధాలే

కాస్టికం శ్వాసావయవాలను కూడా ప్రభావితం చేస్తుంది దగ్గు తెరలుతెరలుగా వస్తుంది గొంతులో మంట స్వరం బొంగురుపోతుంది చన్నీళ్ళు పుచ్చుకొంటే దగ్గు ఉపశమిస్తుంది ఉదయం పూట స్వరం బొంగురుపోతే కాస్టికం మంచిమందు ఇదే లక్షణం సాయంకాలముంటే ఫాస్ఫరస్ ఆలోచించాలి

బహిష్టు సమయంలో పొట్టనొప్పికి ఈ మందు ఆలోచించాలి బహిష్టులు త్వరగా వస్తాయి మైల జాస్తి రాత్రిపూట అసలు మైలకాకపోవటం కాస్టికాన్ని సూచించే విచిత్ర లక్షణం

# 19 కార్బోవెజ్

అజీర్తి గాస్ యాసిడ్ పొట్ట ఉబ్బరం పొట్టలో అల్సర్

ఆహారం ఎంత తేలికగా తీసుకున్నా జీర్ణం గాదు

బిరియానీలాంటివి తిన్నప్పుడు అజీర్తి వల్సాటిల్లాతో తగ్గనట్లయితే ఈ మందు వాడాలి

వళ్ళుతోముకునేటప్పుడు చిగుళ్ళ నుంచి రక్తం

బాగా గాలి విసిరించుకోవడం నిమోనియా అవసాన దశలో ఇది సంజీవని

కాలిసిరలు ఉబ్బి వుంటాయి సిరలు ఉబ్బిన తావున పుళ్ళు

అధిక రుతుస్రావం రుతుస్రావం నల్లగా వుంటుంది

ఇది బొగ్గునుంచి తయారౌతుంది రసాయనికంగా కర్బనం జీవరసాయన శాస్త్రజ్ఞులు మానవదేహంలో దాదావు 30 మూలకాలు ఉన్నట్లు గుర్తించారు హైడ్రోజెన్ కార్బన్ నైట్రోజెన్ ఆక్సిజెన్ ఈ మూలకాల జాబితాలో అగ్రస్థానంలో ఉంటాయి సాధారణంగా కర్బనం శరీరంలో పిండి వదార్థాల రూపంలో ఉంటుంది పిండివదార్థాలు పేగుల్లో జీర్ణమైన తరవాత గ్లూకోజ్ రూపంలో రక్తంలోకి చేరుకొంటుంది రక్తంలో వేయిపాళ్ళలో ఒకపాలు గ్లూకోజు కండరాల కదలికకు గ్లూకోజు ఇంధనంగా ఉవయోగవడుతుంది శరీరంలో ఈ ఇంధనం ఖర్చయిపోయిన ప్రాణాపాయ వరిస్థితుల్లో కార్బోవెజ్ వాడుకొనదగిన మందు కార్బోవెజ్ burned out వరిస్థితికి గొప్ప ఔషధమని డాక్టర్ రాబర్ట్స్ సూచన శరీరం చల్లబడిపోయి నాడి బలహీనంగా ఉండి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు చల్లబడి కండరాలు వనిచేయలేని అవసానదశలో ఉన్న రోగికి ఈ మందు తప్పక వాడుకోవాలి హోమియోలో ఈ మందు సంజీవని అని చెప్పుకోవచ్చు. ఇంత ముఖ్యమైన ఔషధాన్ని మీ మినీకిట్‌లో తప్పకుండా ఉంచుకోవాలి

ముడి కర్బనాన్ని హానిమన్ కాలం నాటికే పుళ్ళు వాసన గొట్టకుండా పొట్టలో గాస్ తగ్గటానికి వాడుతుండేవారు ఆనాటి వైద్యం కర్బనానికున్న భౌతిక ధర్మాల ప్రయోజనానికి వరిమితమై ఉండేది పొటెన్సీ ప్రక్రియలో కర్బనం చైతన్య ధర్మాలను వెలికి తీయడం హోమియో వైద్యం ప్రత్యేకత కార్బోవెజ్ రక్తాన్ని జిగురు పొరలను ప్రభావితం చేస్తుంది నాడులను ఉత్తేజవరిచి నీరసానికి నిస్సార వరిస్థితికి సహాయవడుతుంది ఈ నిస్సారం మానసిక శారీరక స్థాయిలకు చెందింది జీవితపు ఒత్తిళ్ళకు లొంగిపోయినవారికి కర్బనం లవణాల రూపంలో మంచి మందు కాల్కేరియాకార్బ్ కాలికార్బ్ నేట్రంకార్బ్ బెరైటాకార్బ్ గ్రఫయిటిస్ సెపియా జంతు సంబంధమైన కర్బనం ఈ లవణ రూవ ఔషధాలలో కొన్ని

కార్బోవెజ్ అజీర్తి రోగులకు మంచిమందు తిన్న ఆహారం పులిసి గాస్‌గా మారిపోతుంది మాంసం కొవ్వు వదార్థాలంటే ఇష్టవడరు ఉదయం లేవగానే వికారం వీరికి తేపులు పెద్దగా వస్తాయి పొట్టలో మంట అన్నకోశంలో అల్సర్ కాన్సర్ కూడా వాంతిలో రక్తం వడుతుంది కడుపునొప్పి, నొప్పి బాధకు వంగిపోతాడు పొట్టమీద దుస్తులు వదులు చేసుకుంటాడు అపానవాయువులు ఎక్కువ భరించరాని దుర్వాసన ముసలివాళ్ళలో విరేచనాలు ఆసనం మంట మలలు విరేచనం అయిన తరవాత ఆసనంలో బాధ కలరాలో నీరసించిపోయి ప్రాణం పోతుందా అన్న సమయంలో కార్బోవెజ్ వెరాట్రం ఆల్బ్ లాగా ఉవయోగవడుతుంది రోగి చల్లబడిపోతాడు నిస్త్రాణ చల్లని చెమటలు

కార్బోవెజ్ రోగి తిండిపోతు అధికంగా తిని తాగి అజీర్తి బాధలు తెచ్చుకొంటాడు గాస్‌తో బాధవడే రోగులకు కార్బోవెజ్ లైకోపోడియం చైనా ప్రధాన ఔషధాలుగా శ్లాఘిస్తాడు డాక్టర్ నాష్. తత్వానుసారంగా ఈ మందులను ఎంపికచేసి వాడుకోవాలి తేపులవల్ల కార్బోవెజ్ రోగికి కొంత సుఖం ఉంటుంది చైనా లైకో రోగుల్లో తేపులవల్ల బాధ తగ్గదు కార్బోవెజ్ రోగికి పొట్ట పైభాగాన ఉబ్బరం లైకోరోగిలో ఉబ్బరం బొడ్డుకింది భాగంలో ఉంటుంది చైనాలో పొట్టంతా ఉబ్బరంగా ఉంటుంది ఈ తేడాలు గమనార్హం

కార్బోవెజ్ రోగిలో దుర్బలత్వం ప్రధాన లక్షణం ఈ దుర్బలత్వం గర్భకోశ కండరాలలో కన్పిస్తుంది ఈ రోగికి

బహిష్టులు త్వర త్వరగా వస్తాయి మైల వెచ్చగా ధారాపాతంగా అవుతుంది మానంలో వేడి మంట తెల్లకుసుమ ధారాపాతంగా బహిష్టులకు ముందు అధికం చిక్కగా ఆకువచ్చగా వెచ్చగా ఉంటుంది స్తనాల్లో గడ్డలు పాలిచ్చిన తరవాత నీరసం గర్భస్రావం తరవాత ఆగకుండా గర్భసంచి నుంచి స్రావం గవర గవరగా పోతుంది ఈ స్రావం దుర్గంధంతో కూడి ఉంటుంది చిన్నచిన్న కండలుగా రక్తం రోగికి నిస్త్రాణ నీరసం లోజ్వరం ముసలితనంలో ముక్కు అదిరి రక్తం పడుతుంటుంది వీరికిది మంచి మందు

కార్బోవెజ్ రోగిలో గొంతు పడిశం జాస్తి మాట బొంగురుగా వస్తుంది సాయంకాలం మాట మరీ బొంగురుపోతుంది గొంతు పచ్చిపుండులాగా మంట పెడుతుంది కోరింతదగ్గు ఆరంభదశలో ఈ మందు తప్పక వాడుకోవాలని డాక్టర్ కెంట్ సూచించాడు ఈ రోగి దగ్గు పెద్ద పెద్ద తెరలుగా రాత్రిపూట ఎక్కువ

ఉబ్బసం రోగులకిది మంచిమందు కఫం జిగురు జిగురుగా పడుతుంది గాలి చాలక సతమతమైపోతుంటాడు గాలికోసం ఆరాటం విసరమంటాడు వెచ్చని తేమతో గూడిన వాతావరణం ఈ రోగికి గిట్టదు ఉబ్బసం బాధతో రాత్రివేళ లేచిపోయి గాలికోసం కిటికీ దగ్గర కూర్చొంటాడు లేదా ఫాన్ పెట్టమంటాడు

ముసలితనంలో గుండె బలహీనతకు ఇది మంచి మందు కాళ్ళు చల్లబడిపోతాయి సిరలు ఉబ్బి ఉంటాయి గుండెదడ నాడి అందదు

కార్బోవెజ్ రోగి కళ్ళలో సిరలు ఉబ్బి, చీలమండలపైన కురుపులవుతుంటాయి త్వరగా మానవు కాళ్ళు చల్లగా ఉంటాయి రోగి నీరసంగా ఉంటాడు మానసిక శారీరక శ్రమకు ఓర్చుకోలేడు కాస్త శ్రమకే స్పృహ తప్పినంతపని అవుతుంది ముసలితనంలో గాంగ్రీన్‌కు ఇది మంచి మందు

# ౨౦ కొలోసింత్

పొట్టలో శూలనొప్పికిది ప్రత్యేకమైన మందు
కాళ్ళు పొట్టలో పెట్టుకుని వత్తుకుంటే ఉపశమనంగా వుంటుంది
మలవిసర్జన తరవాత బాధ తగ్గిపోతుంది
జున్ను సరిపడదు
సయాటికా ముఖ్యంగా కుడికాలు బారుకీ పెద్ద నరంలో పోట్లు
విశ్రాంతి తీసుకున్నా కాపడం పెట్టినా ఒత్తిడివల్లా ఉపశమనం
వేసవిలో విరేచనాలు గ్రహిణి కడుపు నొప్పి
స్త్రీలలో అండాశయంలో నొప్పి, వాంతులు విరేచనాలు తోడవుతాయి
తీవ్రమైన కోపంవల్ల బాధలుద్రేకిస్తాయి

ఇది ఒకరకమైన చేదుదోసనుంచి తయారౌతుంది ఈ మందుని హానిమనే హోమియో వైద్యంలో ప్రవేశపెట్టాడు హోమియో వైద్యంలో ప్రయోగాలద్వారా ఔషధ లక్షణాలను రాబట్టి వస్తుగుణదీపికలో నమోదు చేస్తారు వస్తుగుణదీపికలో నమోదైన లక్షణాలను ఆధారం చేసుకొని రోగులకు ఎంపిక చేసి వాడతారు ఈ విషయంలో కొలోసింత్‌కు ఒక ప్రత్యేకత వుంది ప్రయోగాలద్వారా రాబట్టిన లక్షణాలలో అత్యధిక భాగం రోగులపై వాడి ఈ మందు లక్షణాలను రుజువు చేయడం జరిగింది హోమియో వైద్యంలో వాడే మందులన్నిటిలో అలా బాగా నిరూపించబడ్డ వాటిలో దీనిదే అగ్రస్థానం అని డాక్టర్ జార్జి గోయల్ అభిప్రాయపడ్డాడు పేగుల నరాల వ్యాధికిది ఎంతో ప్రయోజనకారి కనుక ఈ మందుకి మీ మినీకిట్‌లో స్థానం కల్పించవలసిందే

హోమియో వైద్యంలో వ్యక్తీకరణ కీలకసూత్రం కనుక రోగి మానసికస్థితి ముందుగా పరిశీలించాలి మానసికంగా గాయపడి చిన్నబోయిన వ్యక్తులకిది ప్రధానంగా ఉపయోగపడే మందు అహం దెబ్బతిన్న వ్యక్తులలో చెలరేగే కోపాగ్ని ప్రధాన నాడులపై జీర్ణమండలంలో పేగులపై కేంద్రీకృతమవుతుంది తన కోపమే తన శత్రువు అన్న సూక్తికి మంచి నిదర్శనం కొలోసింత్ రోగి క్రోధ ప్రభావానికి గురైన నాడులలో భరించరాని నొప్పి మొదలవుతుంది ముఖానికి సంబంధించిన నాడులు దెబ్బతిని ట్రైజెమినల్ నాడి బాధకు గురౌతారు

ఈ బాధ తెరలుతెరలుగా కరెంట్ షాక్ కొట్టినట్టుగా వుంటుంది ముఖంలో ఎక్కడైనా ఒక నగానికే పరిమితమవుతుంది ఈ బాధ అనుభవించేవాడికి తెలియవలసిందే తీవ్రమైన నొప్పితోబాటు నిస్సత్తువకూడా చోటుచేసుకొంటుంది మాట్లాడడానికి కూడా ఓపికవుండదు ఇది విచిత్ర లక్షణం నీరసంవల్ల ఒక్కొక్కసారి రోగి స్పృహకూడా కోల్పోవచ్చు ఇది నొప్పికి సంబంధించినదిగా గుర్తించాలి నరాల బాధల వల్ల నొప్పి వున్న భాగంలో చిమచిమలాడినట్లు తిమ్మిరిగా చీమలు పారాడుతున్నట్లు అనిపించవచ్చు.

కాలిలో వుండే పెద్ద నరాన్ని సయాటికొ నాడి అని అంటారు సయాటిక్ నాడి బాధను సయాటికా అని వ్యవహరిస్తారు ఈ బాధకు కాలోసింత్ ప్రత్యేకమైన ఔషధం కాలోసింత్ రోగికి పెద్దనాడులలోనే బాధలు కనిపిస్తాయి ఇదే రస్టాక్ లో అయితే కండరాలు స్నాయువులు బాధపెడతాయి కాలోసింత్ బాధలలో ఒక విశేషముంది ఈ బాధలు ఒత్తిడికి ఉపశమిస్తాయి రోగికి కాపడం హాయిగా వుండవచ్చు. ఒక చోట స్తిమితంగా వుండలేడు అటూ ఇటూ తిరుగుతుంటాడు తిరగటంవల్ల కూడా ఉపశాంతి పొందుతాడు నొప్పి ప్రారంభంకా గానే కాలోసింత్ రోగి మనస్తత్వం బయట పడుతుంది నొప్పితో కేకలు ఆందోళన ప్రతిదానికి విసుగు ఎవరితోనూ మాట్లాడడానికి ఇష్టపడడు సొంతవాళ్ళను కూడా దగ్గరకు రానివ్వడు ఒంటరితనం ఇష్టపడతాడు నొప్పి భరించలేక అవస్థలు పడుతుంటాడు కాలోసింత్ రోగికి పొట్టలో నొప్పి వచ్చినట్లయితే వాంతులు విరేచనాలు పట్టుకొంటాయి మితిమీరి భుజించే వారిలో ఇలాంటి బాధ ఎదురౌతుంది వాంతులు విరేచనాలు కూడా కదలిక రూపాంతరమే కాలోసింత్రోగి వాంతులలో ఒక విశేషముంది వికారంగాని వాంతిగాని ముందుగారావు ముందు కడుపునొప్పి ఆరంభమవుతుంది కడుపునొప్పి తీవ్రమైన కొద్ది వాంతి వికారాలు లంకించుకొంటాయి తిన్న ఆహారం వెళ్ళిపోతుంది నొప్పి తగ్గేదాకా రోగి డొక్కుంటూనే వుంటాడు రోగి ఆహార విహారాల వివరాలు ఔషధం ఎంపికలో ప్రాధాన్యత సంతరించుకొంటాయి కాలోసింత్ రోగి మానసికంగా కుంగి విసుగుచెంది వుంటాడు దేంట్లో చెయ్యిపెట్టినా అది కలిసిరాదు వ్యాపారంలో విపరీతమైన నష్టాలు దాంతో విసుగు చిరాకు అదే స్త్రీలకి భర్త జులాయికావడంవల్ల నిద్రాహారాలు మాని ఆయన్ను కనిపెట్టుకు చూస్తుండాలి ఈ రకమైన మానసిక వ్యధతో కుమిలికుమిలి విసుగు కోపానికి గురికావడం ఎవ్వరైనా చిన్న తప్పు చేసినా వారిపై మండిపడడం కాలోసింత్ రోగి మానసికతత్వం ఈ రకంగా శారీరక బాధలకి పునాది పడుతుంది వీరిలో క్రమంగా నాడుల బాధలు జీర్ణకోశబాధలు చోటు చేసుకొంటాయి ఎండాకాలం ఐస్క్రీమ్, చల్లటి పానీయాలు తాగటంవల్ల దుంపకూరలు అతిగా తినడంవల్ల ఆగ్రహం దిగులులాంటి ఉద్వేగాలకు గురికావడంవల్ల వచ్చే కడుపునొప్పికి ప్రధానమైన మందు కాలోసింత్ నొప్పి మెలిపెట్టినట్టు కోస్తున్నట్టు పేగుల్లో మొదలౌతుంది ఈ బాధ పైకెగబాకి అన్నకోశంవైపు రాగానే వికారం వాంతి బయలుదేరతాయి ఏమాత్రం తిన్నా తాగినా బాధలు ఎక్కువవుతాయి గట్టిగా నొక్కిపెడితే బాధ ఉపశమిస్తుంది అందుకే కాలోసింత్ రోగి పొట్టని ఏదైనా కుర్చీకో బల్లకో అదిమిపెట్టి వుంచుతాడు నొప్పితో ముందుకి వంగిపోతుంటాడు ఇది కాలోసింత్ విచిత్ర లక్షణం పడుకొంటే రెండు కాళ్ళు మడిచి పొట్టకానిస్తాడు నొప్పితో అటూఇటూ తిరుగుతాడు గాస్ పోతే కొంచంసేపు స్తిమితపడతాడు అందరిమీద నొప్పితో విసుక్కుంటాడు నొప్పితో వాంతులు విరేచనాలు మొదలవుతాయి ఆహారం పుచ్చుకొంటే నొప్పి ఎక్కువౌతుంది విరేచనాలు మొదలవుతాయి ఈ బాధలు కాలోసింత్తో తగ్గనట్లయితే ఆరోగికి కాలికార్బ్ ఇవ్వవలసి వుంటుందని డాక్టర్ కెంట్ సూచన కడుపులో నొప్పికి కేమోమిల్లా మెగ్నీషియాఫాస్ కూడా వాడుకోదగ్గవే మెగ్నీషియాఫాస్ రోగికి కడుపునొప్పి ఒత్తిడికేకాకుండా వేడి కాపునకుకూడా తప్పకుండా ఉపశమిస్తుంది కాలోసింత్ కడుపునొప్పికేకాక రక్తవిరేచనాలకు కూడా చాలా మంచి మందు నొప్పికి సంబంధించిన ఉద్రేక ఉపశమనాలు రోగి మానసిక లక్షణాలు పరిగణనలోకి తీసుకొని ఈ మందు వాడాలి బహిష్టు నొప్పి (డిస్మెనోరియా)కి కూడా ఇది ఉపయోగిస్తుంది ఈ నొప్పితోబాటు వాంతులు కూడా వుంటాయి

సయాటికా బాధ తెరలుతెరలుగా వస్తుంది రోగి అస్తిమితంగా వుంటాడు ఈ రోగికి కదలిక ఉపశాంతి నిస్తుంది సయాటికా బాధకు పైటోలక్కా, నాఫాలియం కూడా గుర్తుంచుకోదగ్గవే

కాలోసింత్ నివారించగల ట్రైజెమినల్ న్యూరాల్జియాలో కూడా నొప్పి తెరలు తెరలుగా వస్తుంది కాని కదలికవల్ల ఈ బాధ ఉద్రేకిస్తుంది సయాటికా ట్రైజెమినల్ న్యూరాల్జియా నరాలకు సంబంధించిన బాధే అయినప్పటికి ఉద్రేక ఉపశమనాలలో తేడా వుంది ఇదే సృష్టిలో ఏకత్వంలో భిన్నత్వానికి నిదర్శనం

ట్రైజెమినల్ న్యూరాల్జియాకు బెల్లడోనా మెగ్నీషియాఫాస్‌లు కూడా వాడుకోదగ్గ మందులే

# 21) చైనా

స్రావాలు పోవటంవల్ల నీరసం
తెల్లమైల రుతుస్రావం రక్తస్రావం విరేచనాలు అజీర్తి పొట్ట ఉబ్బరం
ఊరగాయపచ్చళ్లు ఇష్టం తిన్నందువల్ల బాధలు
చిన్న పిల్లల్లో రాత్రిళ్లు విరేచనాలు తిన్నది అరిగీ అరగకుండా మలంలోకి వస్తుంది
మలేరియా, రక్తహీనత తల పగలగొట్టుకు పోతుంటుంది చెవుల్లో హోరు
బహిష్టులు త్వరగా వస్తాయి రుతుశూల రుతుస్రావం అధికం
తేలికగా రక్తస్రావం ముక్కు, గొంతు ఊపిరితిత్తులు
రక్తహీనతవలన ఒళ్లు నీరు పడుతుంది

ఈ మందు సింకోనా బెరడునుంచి తయారవుతుంది దీనికి హోమియో వైద్య చరిత్రలోనే ప్రత్యేకమైన స్థానంవుంది హోమియోవైద్యం ఈ ఔషధంతోనే ఆరంభమైంది చాలాకాలం నుంచి సింకోనా బెరడు చలిజ్వరానికి ప్రత్యేకమైన మందుగా వాడుతున్నారు ఒకనాడు ఐరోపా ఖండంఅయిదులక్షల పౌనుల సింకోనా బెరడు దిగుమతి చేసుకునేదని సుప్రసిద్ధ ఫ్రెంచి వైద్యుడు డాక్టర్ లెస్లీ రాతలవల్ల తెలుస్తుంది వైద్య చరిత్రలో నల్లమందు తరువాత విరివిగా వాడేమందు క్వైనా (సింకోనా)యే

సంప్రదాయ వైద్యంలో ఎం డి పట్టా తీసుకున్న హానిమన్ సమకాలీన క్రూరమైన చికిత్స పద్ధతులతో విసిగిపోయి వైద్యవృత్తి విడనాడాడు జీవికకోసం వైద్య గ్రంథాల భాషాంతరీకరణ చేపట్టాడు ఆంగ్లవైద్యుడు కల్లెన్ వస్తుగుణ దీపికను అనువదించేటప్పుడు సింకోనా విషయం వచ్చేటప్పటికి కల్లెన్ చెప్పిన వ్యాఖ్యానంతో ఏకీభవించలేకపోయాడు సింకోనా టానిక్‌లాగా పనిచేస్తున్నందువల్లనే మలేరియా నయమవుతుందని కల్లెన్ వాదన టానిక్‌లాగా పనిచేసే అనేక ఔషధాలు మలేరియాను ఎందుకు నివారించలేకపోతున్నాయని హానిమన్ సంశయం ఈ సంశయ నివృత్తికోసం తనపై సింకోనాను ప్రయోగించుకుని ప్రకృతి సూత్రాన్ని రాబట్టాడు తాను సింకోనా కషాయాన్ని సేవించినప్పుడు మలేరియా జ్వరాన్ని పోలిన లక్షణాలు రావటం గమనించాడు ఔషధం సేవిచటం ఆపినప్పుడు ఆ జ్వరలక్షణాలు కూడా తగ్గిపోయాయి ఈ ప్రయోగం 790లో జరిగింది ఈ ఘట్టం వైద్య చరిత్రలోనే మహత్తరమైంది ఒక ఔషధం ఆరోగ్యవంతులమీద ఎలాంటి లక్షణాలను కలిగించగలదో ఆ లక్షణాలను పోలిన లక్షణాలున్నరోగి బాధలను ఆ ఔషధం నివారించగలదన్న సూత్రాన్ని ఈ ప్రయోగంద్వారా హానిమన్ ఆవిష్కరించాడు చెట్టునుండి కిందపడ్డ యాపిల్‌పండు న్యూటన్ మహాశయునికి గురుత్వాకర్షణ సూత్రాన్ని వెలువరించడానికి చర్చిలో ఊగుతున్న వేలాడగట్టిన దీపం గెలీలియో లోలక సూత్రాలను కనిపెట్టడానికి దారితీసినట్లే చైనా ప్రయోగం చికిత్సా రంగంలో శాశ్వతనియమాన్ని ప్రతిపాదించడానికి ఆధారమైంది ఈ నియమానుసారంగా సాగే చికిత్సకు హోమియోపతి అని నియమరహితంగా కొనసాగే చికిత్సకు అల్లోపతి అని హానిమనే పేరు పెట్టాడు ఇంత చరిత్ర సృష్టించిన చైనామందు మీ మినీకిట్‌లో ఉండి తీరాల్సిందే

నిస్త్రాణకు ప్రత్యేకమైన ఔషధం చైనా జీవరసాలు నష్టపోయినందువల్ల కలిగే నిస్త్రాణకు చైనా ఉపయోగపడుతుంది మాటి మాటికి రక్తస్రావాలకు గురికావడం విరేచనాలు ఎక్కువగా కావడం లేదా ఎక్కువకాలంపాటు అవుతుండడం అధికంగా వీర్యనష్టం కావడం దీర్ఘకాలంగా చీము కారుతుండడం ఎక్కువ కాలంపాటు తల్లులు పిల్లలకు పాలివ్వటంలాంటి కేసులన్నింటిలో కలిగే నీరసానికి బాగా పనిచేస్తుంది

మామూలుగా రక్తం తక్కువై వచ్చే నీరసానికి ఫెర్రంమెట్ నరాలబలహీనత విచారం దిగులు వల్ల వచ్చే నీరసానికి యాసిడ్‌ఫాస్ కండరాలు అలసిపోవడం వల్ల వచ్చే నీరసంవల్ల ఆర్నికా మెదడు జబ్బులవల్ల వచ్చే

నీరసానికి జింకంమెట్ వాడుకోదగ్గ మందులు

తరుణ వ్యాధుల తరువాత కోలుకోలేని రోగులకు చైనా టానిక్‌లాగా పనిచేస్తుంది ఈ సందర్భంలో కారణాన్నిబట్టి కూడా ఔషధాలను ఎంపిక చేసుకోవాల్సి ఉంటుంది ఫ్లూజ్వరం తగ్గినా ఒళ్లంతా బద్ధకంగా బరువుగా వణుకుతున్నట్లుగా ఉన్న రోగికి ఇన్‌ఫ్లూయెంజైనం మంచి మందు తనకు కావలసిన సేవలో అందోళనకు గురై నిద్రకోల్పోయి నీరసించినవారికి కాక్యులస్ చాలా మంచి మందు వివరీతమైన మానసిక శారీరక ఒత్తిళ్ళవల్ల కలిగె నీరసానికి ఆర్నికా ఆలోచించాలి ప్రత్యేకంగా నీరసానికి మాత్రమే అయితే చైనా ఆలోచించదగిన మందు

చైనా రోగిది అతి సున్నితమైన తత్వం అతని నిస్త్రాణే సున్నితత్వానికి దారితీయవచ్చు. ప్రతిదానికి అతిగా స్పందించడం ఈ రోగి ప్రధాన లక్షణం ఈ సున్నితత్వం మానసికస్థాయిలో మెదడు నాడీమండల స్థాయిలో శారీరక స్థాయిలో వ్యక్తమవుతుంది

కోపం తనవంక ఎవ్వరూ చూడడం ఇష్టపడదు ఒంటరితనాన్ని కోరుకుంటాడు చిత్తభ్రమ ఆలోచించలేకపోవడం కొన్ని స్థిరమైన అభిప్రాయాలు కలిగి ఉండడం చైనారోగి మానసికస్థాయిలో సున్నితత్వాన్ని సూచించే లక్షణాలు

జ్ఞానేంద్రియాలలో కూడా సున్నితత్వం చోటు చేసుకుంటుంది కంటిచూపు పోవచ్చు. చెవుదు హోరు మని ధ్వనులు ఏదితిన్నా చేదు నీళ్లు తప్ప అన్నీ చేదు ఎకొనైట్ రోగికి శరీరాన్ని తాకితే భరించలేనంత నొప్పి గాలి తగిలినా బాధే అయితే ఒత్తిడి సుఖంగా ఉంటుంది ఇది విచిత్ర లక్షణంగా గమనించాలంటాడు డాక్టర్ గేర్న్‌స్

తేలికగా స్పృహ కోల్పోతాడు రక్తస్రావానికి గురైనప్పుడు ఈ రోగికి ఫిట్స్ కూడా రావచ్చు. మెదడు సున్నితమనడానికి ఇది నిదర్శనం

చైనా రోగికి జీర్ణశక్తి లోపిస్తుంది గాస్ ఎక్కువ పొట్ట ఉబ్బరం టీ వంట్లు నరివడవు పెద్దమోతలతో కూడిన తేవులు తేవులు వచ్చినప్పుడు పొట్ట ఉబ్బరం తగ్గదు తేవులు వచ్చినప్పుడు ఉబ్బరం కొంచెం తగ్గితే అది కార్బోవెజ్ లక్షణం అదే లైకోపోడియం అయితే ఒకసారి తగ్గుతుంది ఒకసారి తగ్గదు పొట్ట ఉబ్బరానికి ఈ మూడూ మంచి మందులే గుండెల్లో మంట ఎసిడిటీ పాలు తాగినా హాయిగా ఉండదు

చైనా రోగికి మసాలాలు చాలా ఇష్టం పులుపు వస్తువులు కావాలి పిల్లలయితే అన్నం తినరు ఎప్పుడూ చిరుతిండి కావాలి చైనా రోగులకు వెర్రి ఆకలి కాని అన్నం సహించదు పసరుతిత్తుల్లో రాళ్లు పొట్ట ఉబ్బరం కడుపునొప్పితో బాధపడే వారికి చిన్న పొటెన్సీలో చైనా బాగా పనిచేస్తుంది

విరేచనాలకు ఇది చాలా మంచిమందు రోగి నీరసిస్తాడు విరేచనాలు పీల్చి పిప్పి చేస్తాయి పేగులు అరుస్తుంటాయి అపానవాయువులు దుర్వాసన మలంలో జీర్ణంగాని ఆహారపదార్థాలు రాత్రిపూట విరేచనాలు విరేచనాలవుతున్నా కడుపునొప్పి ఉండదు ఇదేరకంగా విరేచనాలవుతూ నీరసం లేనట్లయితే అది యాసిడ్ ఫాస్ లక్షణం

గర్భసంచి నుంచి అయ్యే రక్తస్రావాలకు ఇది మంచిమందు కాన్పుకు ముందు తరువాత రక్తం పోతుంటే ఈ మందు తప్పక వాడుకోవాలి శరీరం చల్లబడుతుంది ఫిట్స్ కూడా కన్పించవచ్చు ఫిట్స్ కనిపిస్తే ఇది ప్రత్యేకమైన మందు బహిష్టులు త్వరత్వరగా వస్తాయి మైల నల్లగా కండలు కండలుగా ఉంటుంది పొట్ట ఉబ్బరం బహిష్టులకు ధారాపాతంగా తెల్లకుసుమ దుర్వాసనతో ఎరుపుగా కావచ్చు.

లివర్ వ్యాధులకిది ప్రత్యేకమైన మందు జాండిస్ లివర్ పెద్దదిగా కావడం లివర్ సిర్రోసిస్ తాగుబోతుల్లో వచ్చే లివర్ జబ్బుకు చైనా ప్రత్యేకమైన మందు తాగుడు మానడానికి చైనా మదర్ టించరు ఉదయం పదిచుక్కలు సాయంకాలం పదిచుక్కలు నీటిలో కలిపి ఇవ్వాలని డాక్టర్ క్లార్క్ సలహా నిస్త్రాణకు సున్నితత్వానికి ఏ విధంగా పనిచేస్తుందో మలేరియా జ్వరానికి అంత బాగా పనిచేస్తుంది చైనా ప్రధాన లక్షణాలు నీరసం సున్నితత్వం పీరియడిసిటీ అంటే ఒక టయింప్రకారం వచ్చే బాధలు రోజువిడిచి రోజు 2 గంటలకో ఒంటిగంటకో 7 రోజులకో 4 రోజులకో జ్వరం వస్తుంటుంది చలివచ్చేముందు దాహం

చెమటలు పట్టేటప్పుడు దాహం చలిగా ఉన్నప్పుడు జ్వరం ఉన్నప్పుడు దాహం ఉండదు ఇవి చైనా జ్వరం లక్షణాలు

# 22 కేమోమిల్లా

అధికంగా చిరాకు దురుసుతనం
పిల్లలను ఎత్తుకు తిప్పాలి
కోపంవల్ల బాధలు తెచ్చుకుంటారు
ఏపాటి బాధనూ సహించలేరు నొప్పితోబాటు తిమ్మిరి వుంటుంది
అస్తిమితం నిద్ర వుండదు
దంతాలు వచ్చే సమయంలో ఆకుపచ్చటి విరేచనాలు
మలంలో జిగురు తెల్లగాగాని పసుపు పచ్చగా గాని వుంటుంది
చెవిపోటు పెద్దగా ఏడుస్తారు

---

దీనిని హెూమియో వైద్యంలో హనిమన్ ప్రవేశపెట్టాడు ఇది వృక్షసంబంధమైన మందు ఇది పాలీక్రెస్టులలో చేరుతుంది శిశువులకు స్త్రీలకు ఇది ప్రత్యేకమైన మందు పిల్లలకుపయోగపడే మూడు ముఖ్యమైన మందుల్లో కేమోమిల్లా ఒకటి మిగిలినవి రెండు ఎకొనైట్ బెల్లడోనాలు వీటిని సంక్షిప్తంగా ఎ బి సి అని పిలుస్తాడు డాక్టర్ క్లార్క్ ఈ మూడు మీ మినీకిట్‌లో ఉండవలసిందే

ఈ మూడు మందుల్లో ఆందోళన ప్రధాన లక్షణం రక్తప్రసారంలో ఒత్తిడికి ఎకొనైట్ మెదడులో మార్పులకు బెల్లడోనా మానసికాందోళన క్షోభకు కేమోమిల్లా ఇది కోపానికి మంచిమందు కోపానికేగాక కోపంవల్ల చేటుచేసుకొనే శారీరక బాధలకు మంచి మందుగా టైలర్ సూచన కేమోమిల్లాను ఎంపిక చేసేటప్పుడు మానసిక లక్షణాలకు ఎక్కువ విలువ ఇవ్వాలి ప్రశాంతంగా పడుకొన్న రోగికి ఏ పరిస్థితుల్లోనూ కేమోమిల్లా ఇవ్వగూడదని హనిమన్ శాసించాడు

కేమోమిల్లా బిడ్డ చిరచిరలాడుతుంటాడు మూలుగుతుంటాడు ఊరికే ఏడుస్తుంటాడు అది కావాలని ఇది కావాలని పేచి పెడుతుంటాడు అడిగిన వస్తువు ఇచ్చినప్పుడు తీసుకొని విసిరి అవతల పారేస్తాడు తనకు ఏంకావాలో శిశువుకు తెలియదు ఆ బిడ్డను ఎత్తుకు తిప్పితే ఊరుకుంటాడు కోపంవల్ల బిడ్డకు విరేచనాలు జ్వరంలాంటివి వస్తాయి ఫిట్స్‌కూడా రావచ్చు.

పళ్ళు వచ్చేసమయంలో ప్రతి శిశువుకు కేమోమిల్లా వాడవలసి వస్తుంది పళ్ళు వచ్చేటప్పుడు వట్టుకొనే విరేచనాలకు ఇది మంచిమందు విరేచనాలు ఆకుపచ్చగా అవుతుంటాయి ముద్ది ఒరుసుకుపోతుంది కుళ్ళిన కోడిగుడ్డులాగా దుర్వాసన చిగుళ్ళు వాచివుంటాయి వేడిపదార్థాలు పట్టలేరు చల్లటివే ఇష్టపడతారు ఈ మందును 30 పొటెన్సీలో 4 గంటలకు ఒక డోసు చొప్పున 2 రోజులు వాడితే బాధలు తగ్గిపోతాయి ఈ మందును వాడేటప్పుడు మానసిక లక్షణాలను ఎప్పుడూ దృష్టిలో పెట్టుకోవాలి

చలిగాలిలో బయటకు వెళ్ళివస్తే చెవిపోటు చెవిపోటుకు కేమోమిల్లా పల్సటిల్లా ఎలియంసెపా ముఖ్యమైన మందులు కేమోమిల్లా శిశువుకు నొప్పితో కోపం వస్తుంది చిరాకుగా ఏడుస్తుంటాడు జ్వరం దప్పిక కూడా తోడుగావచ్చు పల్సటిల్లా రోగి ఏడుపువింటే జాలివేస్తుంది రోగి మానసిక లక్షణాలను బట్టి మందులు ఎంపిక చేయవలసి వుంటుంది

కేమోమిల్లా పిల్లలు క్రమశిక్షణకు లొంగకుండా పెరుగుతారు కోపం ఎక్కువ గుక్కపెట్టి ఏడుస్తారు కోపంలో తలను గోడకేసి బాదుకుంటారు ఆ సమయంలో వీరికి ఫిట్స్ కూడా రావచ్చు ఈ పిల్లలతో చాలనేర్పుగా వ్యవహరించాలి

పెద్దయిన తరవాత కేమోమిల్లా తత్వంగల రోగులు బాధలున్నప్పుడు చాల దురుసుగా ప్రవర్తిస్తారు ప్రాణస్నేహితులను సైతం తూలనాడతారు తరవాత పశ్చాత్తాపపడతారు నక్స్‌రోగిది కూడ ఇలాంటి

స్వభావమే నక్‌రోగికి అసూయద్వేషాలతో కూడినటువంటి కోపం అందువల్ల వాళ్ళు పశ్చాత్తాపపడరు కేమోమిల్లా రోగి మామూలుగా అందరూ ఓర్చుకొనే బాధకు కూడా తట్టుకోలేరు చిన్న బాధకు కూడా తట్టుకోలేక రాత్రిపూట లేచి అటూఇటూ తిరుగుతారు వ్యాధి చిన్నదైనా విపరీతంగా నీరసించిపోతారు నరాల బలహీనతవల్ల ఈ విధంగా జరుగుతుంది నొప్పులతో బాటు తిమ్మిర్లు ఒకటి విడిచి ఒకటి రావచ్చు. కేమోమిల్లా రోగి బాధలు రాత్రిపూట ఎక్కువ రోగి అస్తిమితంగా వుంటాడు నిద్ర పట్టదు అస్తిమితంగా వుండే మూడుమందులతోపాటు దీనిని కూడ చేర్చుకోవాలి ఎకోనైట్ ఆర్సెనికం ఆల్బ్ రస్టాక్స్ అస్థిమితం ప్రధాన లక్షణంగా కలిగివుండే మందులు కేమోమిల్లా నొప్పులు తగ్గడానికి నిద్రవట్టడానికి మంచి మందు కాఫీకి అలవాటుపడ్డ రోగులకు ఈ మందు ఆలోచించాల్సివుంటుంది

కేమోమిల్లా శ్వాసకోశ వ్యాధులకు ఆలోచించదగినదే బ్రాంకైటిస్ రాత్రిపూట పొడిదగ్గు ముఖ్యంగా నిద్రలోనే దగ్గు ఎక్కువ గొంతువాపు టాన్సిల్స్ వాపు చలిగాలి సరిపడదు

పంటినొప్పికిది ప్రత్యేకమైన మందు వేడివేడి పదార్థాలు పుచ్చుకొంటే పంటి బాధ ఎక్కువ బహిష్టు సమయంలో గర్భిణీ స్త్రీలకు వచ్చే పంటిబాధలకు ఇది వాడుకోవచ్చు. అర్ధరాత్రి బాధ ఎక్కువౌతుంది బాధతో వీరు ఉద్రేకపడతారు

కేమోమిల్లా రోగి కోపంగావున్న సమయంలో పిల్లలకు పాలిచ్చినా ఆ పిల్లలకు ఫిట్స్ వస్తాయి మనస్సుకి శరీరంపైగల ప్రభావానికిది నిదర్శనం

కేమోమిల్లా- స్త్రీల బాధలకు ఉపయోగపడే మందు ఉద్రేకపడే స్వభావం ఓర్చుకోలేనంత నొప్పితో బాధపడే స్త్రీలకిది మంచిమందు యువతుల్లో వచ్చే బహిష్టు నొప్పులకు ఇది ఉపయోగించవచ్చు. మైల ధంపాతంగా నల్లగా కండలు కండలు అవుతుంటే తత్వాన్ని గమనించి ఈ మందు వాడుకోవచ్చు. కాన్పు నొప్పులు భరించలేనంతగా వుండి రోగి డాక్టర్ మీద నర్సు మీద మండిపడుతుంటే ఆ రోగి సుఖంగా ప్రసవించటానికి కేమోమిల్లా ప్రత్యేకమైన మందు ఉద్రేకానికి గురై గర్భస్రావమయ్యే ప్రమాదముంటే ఈ మందు వాడుకోదగిందే కోపంవల్ల కలిగే దుష్పరిణామానికి కేమోమిల్లా గుర్తుంచుకోవాలి ముద్దముద్దలుగా తెల్లకుసుమ ఒరుసుకుపోయేలా అవుతుంటుంది

## 23 క్యూప్రంమెట్

మూర్ఛలకిది ప్రత్యేకమైన మందు
కంపనాలు ముందుగా వేళ్ళల్లో మొదలవుతాయి
బొటనవేలు ముందుగా అరిచేతిలోకి ముడుచుకుపోయి గుప్పిడి బిగుసుకుపోతుంది
కలరా రోగి పిక్కలు కండెలు పట్టుకుపోయే దశలో ఇది వాడాలి
ఉబ్బసం కోరింతదగ్గు

ఇది రాగి నుంచి తయారయ్యే ఔషధం దీనిని హెూమియో వైద్యంలో మొదటగా ప్రవేశపెట్టినది హానిమన్ ఎంత చిన్న మోతాదులో పుచ్చుకొన్నా హాని కలిగించే విషతుల్యమైన పదార్థాలెన్నింటినో పొటెన్సీ ప్రక్రియద్వారా అమృతతుల్యమైన ఔషధాలుగా మలచిన ఖ్యాతి హానిమన్‌కే దక్కుతుంది సారూప్య ఔషధ నియమానికి సార్థకత సమకూర్చి పెట్టినది పొటెన్సీ ప్రక్రియ పొటెన్సీలను సారూప్య నియమాన్ని అనుసరించి వాడితేనే ఉపయోగపడతాయి సారూప్య ఔషధ నియమం పొటెన్సీ ప్రక్రియ ఉభయతారకాలు. కలరాకి పుట్టినిల్లయిన భారతదేశంలాంటి దేశంలో ఈ ఔషధ ప్రయోజనం ఎంతైనా ఉంది ఇది మీ మినీకిట్‌లో తప్పక ఉంచుకోదగ్గ మందు మొలతాడు రాగితాయెత్తు కట్టడం మన సంప్రదాయం హంగరీలో కూడా ఇలాంటి సంప్రదాయమే ఉండేది కలరా వ్యాధిరాకుండా ఈ రాగితాయెత్తు ఉపయోగపడుతుందని ఒక నమ్మకం జీర్ణమండల నాడీమండల వ్యాధుల నివారణ ఈ మందు ప్రత్యేకత చిన్నపిల్లల్లో కనిపించే మూర్ఛలకిది మంచి మందు

కలరా వ్యాధి నివారకంగా నిరోధకంగా హెూమియో ఔషధాల్ని ఎంతో ప్రయోజనకారులుగా గుర్తించారు హానిమన్ తానుగా కలరా చూసి ఉండలేదు కలరా వ్యాధి లక్షణాలను కలరా వ్యాధి వివిధ దశలను

అధ్యయనంచేసి ఈ వ్యాధికి మూడు ముఖ్యమైన మందులుగా హానిమన్ ప్రకటించాడు 830వ సంవత్సరంలో రష్యాలో రెండు ప్రదేశాలలో ఈ వ్యాధి సోకగా రెండు తావుల్లో హెూమియోచికిత్స చేయించుకున్న 70 మందిలో అందరూ బతికి బైటపడ్డారు మరొక 270 మంది వ్యాధిగ్రస్తుల్లో 08 మంది మాత్రమె చనిపోయారు అదే సమయంలో సంప్రదాయ వైద్యంలో నూటికి 70 మంది చనిపోయారన్న విషయం గమనార్హం ఇంగ్లండు ఫ్రాన్స్ దేశాల్లో కలరా ఎపిడమిక్స్‌లో కూడా హెూమియో చికిత్సలో నూటికి 9 0 మంది మాత్రమే చనిపోతుంటే సంప్రదాయ వైద్యంలో నూటికి 90 మంది చనిపోవడం వైద్యచరిత్రలో నమోదయివున్న విషయమే హెూమియోవైద్యం నిలదొక్కుకోవడానికి ఈ చేదు నిజాలన్నీ దోహదం చేస్తూనే వచ్చాయి

కలరా వ్యాధి తొలిదశలో వాడదగిన మందు కాంఫర్ కాంఫర్ మదర్ టించర్‌ను ఒక చెంచా నీళ్లలో ఒక చుక్కవేసి ప్రతి అయిదు నిమిషాలకు ఆ చెంచా నీళ్ళు ఇవ్వవలసి ఉంటుంది ఈ మందు ఎంత త్వరగా మొదలుపెడితే అంత త్వరగా రోగి ఒంట్లో వేడి వస్తుంది రోగికి స్పృహవస్తుంది విశ్రాంతి లభిస్తుంది 5 నిమిషాలలో కాంఫర్ పనిచేస్తున్నదన్న దాఖలా లేకపోతే వ్యాధి రెండవదశకువయోగవడే క్యూప్రంమెట్ వెంటనే మొదలు పెట్టవలసి ఉంటుంది ఈ మందును 30 పొటెన్సీలో ప్రతి అరగంటకు లేదా గంటకు ఒకసారి ఇవ్వవలసి ఉంటుంది వాంతులు విరేచనాలు కట్టుకుని రోగికి విశ్రాంతి లభించేవరకు ఈ విధంగా వాడవలసి ఉంటుంది ఈ మందు తరవాత దశలో వాడవలసిన మందు వెరాట్రం ఆల్బ్

కలరా వ్యాధి తొలిదశలో రోగి ఒళ్ళు చల్లబడిపోతుంది కళ్ళు పీక్కొనిపోయి ఉంటాయి పొట్టలో మంటలు స్పృహకోల్పోయి గొణుగుతుంటాడు ఈ దశలో కాంఫర్ మదర్ టించర్ పైన చెప్పిన విధంగా రోగి ఒంట్లో వేడిపుట్టి రోగికి హాయిగా ఉండేటంత వరకు వాడుకోవలసి ఉంటుంది

మలిదశలో వాంతులు విరేచనాలు ఎక్కువౌతాయి పిక్కకండరాలు కూడా కండెలు కట్టుకుపోతాయి ఈడ్పులు క్యూప్రంమెట్ ప్రత్యేక లక్షణం ఈడ్పులలో ఒక ప్రత్యేక అంశమే కలరా వ్యాధిలో కండెలు కట్టుకుపోవడం ఈ దశలో అరగంట కొకసారి 30 పొటెన్సీలో ఈ మందు రోగికి హాయిగా ఉండేవరకు వాడాలి ఈ దశలో వాంతులు విరేచనాలు ఉధృతమవుతూ ఒళ్ళంతా విపరీతంగా చల్లటి చెమటలు పడతాయి ఒళ్లంతా చెమటలు నుదుటి మీద చెమటలు పట్టేదశకు ఈ వ్యాధి చేరుకున్నప్పుడు వాడదగిన మందు వెరాట్రం ఆల్బ్. క్యూప్రంమెట్ లాగానే ఈ మందును కూడా 30 పొటెన్సీలో అరగంటకొకసారి వాడాలి మొదటిదశలో ఒళ్ళు మంచులా చల్లబడిపోవడం రోగి కుప్పకూలిపోవడం రెండోదశలో కండరాలు కండెలు కట్టిపోవడం మూడవదశలో మరీ ఎక్కువగా వాంతులు విరేచనాలు చల్లటి చెమటలు గమనించి ఈ మందులు వాడుకోవలసి ఉంటుందంటాడు డాక్టర్ డన్హాం వారానికి ఒక డోసు క్యూప్రంమెట్ 30 పొటెన్సీలో వ్యాధినిరోధకంగా కూడా వాడుకోవచ్చు.

క్యూప్రంమెట్ ప్రధాన లక్షణం ఈడ్పులు (Spasms) ఈడ్పులు కనిపించే ఏ వ్యాధినివారణకైనా ఈ మందు వాడుకోదగిందే కోరింత దగ్గు మూర్ఛలు కొరియా పొంగు వ్యాధిలో పొంగు బైటికి రాకుండా వాంతులు మగత ఈడ్పులు కనిపించడం- ఈ వ్యాధులన్నింటిలోను ఈ మందు ఉపయోగపడుతుంది క్యూప్రంమెట్‌లో కనిపించే ఈడ్పులలో ఒక ప్రత్యేకత ఉంది వణుకు ముందుగా బొటనవేలిలో మొదలవుతుంది బొటనవేళ్ళు అరచేతుల్లోకి ముడుచుకుపోతాయి వెంటనే మిగిలిన వేళ్ళు బొటనవేళ్ళమీదకు గట్టిగా ముడుచుకుపోయి గుప్పిలి బిగునుకుపోతుంది ఈడ్పులు తగ్గిన తరవాత రోగి శవంలా నిశ్చేష్టుడయి కొంతసేపటి వరకు ఉండిపోతాడు క్యూప్రంమెట్ బిడ్డ కోరింతదగ్గు తల్లిమాటల్లో చెప్పవలసివస్తే దగ్గు తెరలో ఆగకుండా దగ్గి ముఖం నల్లబడిపోయి వేళ్ళు నల్లగా మారి ఊపిరి బిగపట్టుకుపోయి స్పృహతప్పి పడిపోతాడు ప్రాణం పోయిందేమో అనిపిస్తుంది తరవాత దీర్ఘనిశ్వాసతో లేస్తాడు దగ్గుతెర మొదలుపెట్టగానే కొద్దిగా చన్నీళ్ళు ఇచ్చినట్లయితే వచ్చే దగ్గు నిల్చిపోతుంది ఇది ప్రత్యేకమైన లక్షణంగా గమనించవచ్చు. క్యూప్రంమెట్ లక్షణాలలో గమనించతగ్గ విశేషం తీవ్రత దగ్గు తెరకావచ్చు. విరేచనాలు కావచ్చు. ఫిట్స్‌కావచ్చు అన్నీ తీవ్రంగా ఉంటాయి మూర్ఛల్లో కూడా ముందుగా వేళ్ళు బాగా వణికిపోతాయి కెవ్వున అరిచి రోగి పడిపోతాడు ఫిట్స్‌లో మలమూత్రాల విసర్జన జరుగుతుంది వేళ్ళల్లో మొదలయి శరీరమంతా కంపించిపోయే ఫిట్స్‌కు ఈ మందు బాగా ఉపయోగపడుతుంది ఫిట్స్ వచ్చి తగ్గిపోయిన తరువాత తలనొప్పి పట్టుకొంటుంది ఫిట్స్‌లో కాళ్ళు చేతులు కొట్టుకోవడం కూడా ఉంటుంది ముందు గట్టిగా ముడుచుకోవడం తరవాత విసురుగా చాచుకోవడం

క్యూప్రంమెట్ ప్రత్యేకత

రాత్రిళ్ళు కాళ్ళపిక్కలలో కండరాలు కండెకట్టుకొని పోతుంటే కాల్కేరియా క్యూప్రంమెట్‌లను తప్పక ఆలోచించాలి కాళ్ళు చాచుకొంటే కండెలు కట్టుతున్నట్లయితే కాల్కేరియా మంచి మందు తీవ్రంగా ఉంటే క్యూప్రంమెట్ వాడుకోవలసి ఉంటుంది

# ౨౪ కోనయం

దీర్ఘకాలంగా లైంగిక జీవితానికి నోచుకోని వృద్ధ స్త్రీ పురుషుల బాధలకు
వృద్ధుల్లో కాన్సర్ నాలుక గ్రంధులు స్తనాలు-
లైంగికవాంఛ అణుచుకొన్న వారికి తిరుగుబోతుల బాధలకి
దెబ్బ తగిలిన తరవాత వచ్చే కదుములు కణుతులు ముఖ్యంగా స్తనాల్లో
రాళ్ళలాగా కణనబారిన గ్రంధులు
అటూ ఇటూ పక్కలకి తిరిగినప్పుడు తలతిప్పు
అన్నవాహిక చచ్చుబడి మింగటం కష్టం
మూత్రకోశం బాధలు మూత్రం ఆగిఆగి అవుతుంది
కళ్ళు మూనుకోగానే చెమటలు.

కోనయం వృక్ష సంబంధమైన మందు ఈ మందు పేరు వినగానే గ్రీసు తత్వవేత్త సోక్రటీసు గుర్తుకు వస్తాడు ఒకనాడు ఏథెన్సు చెరసాలలో ఖైదయిన సోక్రటీస్‌కు హెమ్లాక్ వసరు తాగి చనిపోయె మరణదండన విధించారు. శిష్యులు శ్రేయోభిలాషులు విలపిస్తుండగా నిర్భయంగా నిశ్చలంగా ఆ విషాన్ని తాగి మృత్యువును కౌగలించుకున్నాడు సోక్రటీస్ హెమ్లాక్‌లో కోనయం ఉంటుంది ఆ హెమ్లాక్ పుచ్చుకొన్న తరువాత అటూ ఇటూ నడవమన్నారు ఆయనను నడిచాడు ముందుగా కాళ్లు బరువెక్కాయి చల్లబడిపోయాయి తరువాత స్వాధీనం తప్పిపోయాయి మెల్లగా చల్లదనం మొండెం తలకు ఎగబాకి ప్రాణం పోయింది చనిపోయేవరకు స్పృహ బాగానే ఉంది కోనయం అనగానే సోక్రటీస్ వృత్తాంతం గుర్తుకు వస్తుంది చచ్చు వ్యాధి పెరాలిసిస్ కాళ్లనుంచి శిరస్సువైపునకు వ్యాపించే కేసుల్లో ఈ మందు వాడుకోవలసి ఉంటుంది

ముడిపదార్థంగా విషతుల్యమైన కోనయ్యాన్ని పొటెన్సీగా మలిచి దివ్యౌషధంగా అందించినవాడు హానిమన్ మెదడు నాడులు గ్రంధులు జననేంద్రియాలపై ఈ మందు ప్రభావం అనల్పం వృద్ధులకు అవివాహితులకు ఇది ప్రత్యేకించి మంచిమందు

కోనయం రోగులు మానసికంగా కుంగి ఉంటారు కోపం ఎక్కువ చిన్న చిన్న విషయాలకికూడా ఎంతో చికాకు పడిపోతారు ఎదురుచెబితే చికాకుపడిపోయి మరింత కుంగిపోతారు. ఒంటరిగా ఉండలేరు అలాగని మనుషులతో కలవలేరు ఇదేరకమైన మనస్తత్వం లైకోపోడియం రోగుల్లో కూడా ఉంది వీరికి మతిమరుపు ఎక్కువ ఒక విషయంమీద మనస్సు లగ్నం చేయలెరు ఎత్తుమీద నుంచి పడి వెన్నుపాముకు దెబ్బతగిలి వచ్చే బాధలకు ఈ మందు తప్పక ఆలోచించవలసి ఉంటుంది వెన్నుపాము,నాడులు దెబ్బతినిచ్చే వ్యాధుల్లో కూడా ఇది వాడదగిన మందు ఈ రోగులు కళ్లు మూనుకుని నిలబడలేరు చీకట్లో నడక తడబడుతుంది

తలతిప్పుతో బాధపడుతుండేవారికిది ప్రత్యేకమైన మందు తల అటూ ఇటూ తిప్పలెరు మంచంమీద పడుకొన్నప్పుడు ఒకవైపునుంచి మరొవైపునకు తిరగలేరు తల తిప్పు వస్తుంది కదిలే వస్తువులను చూసినప్పుడు ఈ రోగికి తలనొప్పి వాంతులు పట్టుకొంటాయి తలతిప్పు ఉన్న రోగులకు కోనయంతోపాటు ఫాస్పరస్‌కూడా తప్పక ఆలోచించదగిన మందు

కాన్సర్ కణుతులకు కోనయం ప్రసిద్ధిచెందిన మందు దెబ్బలు తగిలిన తరవాత స్తనాల్లో వృషణాల్లో వచ్చే కణుతులకు ఇది ప్రత్యేకంగా ఆలోచించదగిన మందు గర్భసంచి కాన్సర్‌కి ప్రొస్టేట్ కాన్సర్‌కు కూడా ఇది బాగా ఉపయోగపడుతుంది స్తనాల్లో నొప్పులు అనగానే ఈ మందు ముందుగా ఆలోచించాలి బహిష్టు రావడానికి

వదిరోజులు ముందుగానే స్తనాలలో నొప్పులు కన్పించేవారు ఈ మందు వాడుకుంటే ఆ బాధలు తగ్గిపోతాయి

స్త్రీ పురుష జననేంద్రియాలకు సంబంధించిన వ్యాధుల్లో ఈ మందుకు ప్రధానమైన స్థానం ఉంది. సెక్సులో అధికంగా పాల్గొన్నవారికి సెక్సు కోరికలు అణచిపెట్టుకున్నవారికి కూడా ఇది ఉపయోగపడుతుంది వృద్ధులకు అవివాహితులకు ఇది ప్రత్యేకమైన మందు ఏనాడో భర్త చనిపోయిన వృద్ధ స్త్రీల విషయంలో ఈ మందు ఆలోచించదగినది హస్తప్రయోగానికి అధికంగా అలవాటుపడిపోయి లైంగిక బలహీనతకు గురిఅయి నవారికి ఈ మందు వాడి తాను మేలు చేకూర్చిన కేసులు ఎన్నో ఉన్నాయని ప్రసిద్ధ కలకత్తా వైద్యులు డాక్టర్ ఎస్.ఎం.చౌధురి చెప్పుకున్నారు స్త్రీని చూడగానే ఉద్రేకపడిపోయి ఇంద్రియనష్టం చేసుకునేవారికి తప్పక ముందుగా వాడతగిన మందు ఈరకమైన రోగుల్లో లైకోపోడియం సల్ఫర్ నక్స్‌వామికాలు కూడా ఆలోచించద గిన మందులే

కామోద్రేకాన్ని అణచిపెట్టి జీవితాన్ని సాగించే స్త్రీల గర్భకోశ అండాశయ కణుతులకు కోనియం ఉపయోగపడుతుంది వీరు గర్భకోశ ముఖద్వారంవద్ద వూత అధికంగా తెల్లస్రావంతో బాధపడుతూ ఉండవచ్చు.

కోనియం రోగికి మెలకువగా ఉన్నంతసేపు మామూలుగానే ఉండి నిద్రపట్టగానే దిగపోతగా చెమటలు పడతాయి ఇది ఈ రోగిని పట్టిచ్చే విచిత్ర లక్షణం ఈరకంగా చెమటలు గమనించి రోగికి పక్షవాతం కాన్సర్ తలతిప్పులాంటి వ్యాధులతో బాధపడుతున్నట్లయితే ఈ మందు వాడి వారికి తప్పక స్వస్థత చేకూర్చవచ్చు. ఈ రకమైన విచిత్ర లక్షణాలను అవయవధర్మపరంగాగాక చైతన్యపరంగా మాత్రమే విశ్లేషించగలం చైతన్యం కుంటుపడిన కారణంగా వ్యాధిగ్రస్తులవుతారన్నది హోమియోవైద్య అవగాహన

## ౩౫ డల్కామారా

చల్లని తేమ వాతావరణంలో వచ్చే బాధలు (నేత్రంసల్ఫ్)
ముక్కులు బిగుసుకుపోతాయి గొంతునొప్పి
ఒళ్లు బిగుసుకుపోతుంది ఏదో ఒక అవయవానికి సంబంధించిన పక్షవాతం
ఉబ్బసపు దగ్గు తెమడ
వేసవికాలంపోయి తొలకరిలో వచ్చే విరేచనాలు
బహిష్టులకు ముందు వచ్చే చర్మంమీద దద్దు
పులిపిర్లు
ఎకొనైట్‌లో పొడిగాఉండే చలిగాలులకు బాధలు వస్తాయి

---

ఇది మొక్క ఆకులనుండి తయారయ్యే మందు గాయాలు మంటపెడుతుంటే బాధ నివారణకు పూతమందుగా అనాదిగా వాడుతూ వచ్చారు పొటెన్సీ రూపంలో మొదటగా దీనిని వాడుకోవడం నేర్పింది హానిమన్

వ్యాధి ఏ అవయవంలో చోటుచేసుకొన్నా ఆ వ్యాధిని ఏపేరుతో పిలిచినా చల్లటి వాతావరణం— ముఖ్యంగా తేమతోకూడిన చల్లటి వాతావరణంవల్ల వచ్చే వ్యాధులకిది దివ్యౌషధం తేమతోకూడిన చల్లటిగాలి కారణంగా వచ్చే వ్యాధులన్నింటిలో ఈ మందు ముందుగా ఆలోచించవలసి ఉంటుంది జలుబు విరేచనాలు మూత్ర సంబంధ వ్యాధులు చర్మవ్యాధులు తేమతోకూడిన చల్లగాలి సోకిన తరవాత ఆరంభమైనట్లు గమనిస్తే ఈ మందు ఉపయోగించవలసివస్తుంది

ఈ రోగికి చలిగిట్టదు వెచ్చదనం హాయిగా ఉంటుంది జలుబుచేస్తే ముక్కుకు జేబురుమాలు అడ్డంపెట్టు కుని వెచ్చగా ఉంచుకుంటాడు కాని చర్మంపై దద్దుపస్తేమాత్రం గదిలో ఉండేకంటే చల్లగాలికి బయటకు రావలసివస్తుంది చర్మవ్యాధికి చల్లదనం కావాలి రోగికి చల్లగాలిగిట్టదు ఈరకమైన లక్షణాలు ఆర్సెనికంలో

ఫాస్పరస్‌లో కనిపిస్తాయి ఆర్సెనికంరోగి చల్లటి వాతావరణం నహించలేడు వెచ్చగా వుంటాలి ఈ రోగికి తలనొప్పిగావుంటే తలకు చల్లగాలి తగిలేటట్లు తల కిటికీ బయటకు పెట్టుకోవాలనిపిస్తుంది ఫాస్పరస్ రోగి చల్లగాలి భరించలేడు పొట్టలో మంటగావుంటే కూల్‌డ్రింక్స్ తాగుతాడు డల్కమారా రోగికి వెచ్చదనం హాయిగా ఉంటే ఆ రోగి చర్మానికి చల్లదనంకావాలి ఆర్సెనికం రోగి వేడికోరుతుంటే ఆ రోగి తలకు చల్లగాలి అవసరం ఫాస్పరస్ రోగికి వేడి ఆ రోగిపొట్టకు ఐస్ ఉపయోగపడుతున్నాయి ఉద్రేక ఉపశమనాలలో గమనించే వైవిధ్యం వ్యక్తి అవయవాలభిన్నత్వానికి ప్రత్యక్ష నిదర్శనం హోమియో వైద్యం మానవవైద్యం గనుక లక్షణాలను అవయవాలవరంగా వ్యక్తివరంగా కూడా విశ్లేషించగలుతుంది మానవుడు చైతన్యం మనస్సు శరీరాల సంగమం అనడానికి ఈ లక్షణాలే ప్రత్యక్షమైన రుజువు

డల్కమారా జిగురుపొరలు చర్మం కండరాలు గ్రంధులపై అధికమైన ప్రభావం కలిగివుంటుంది ముక్కు పడిశం గొంతునొప్పి, ఊపిరితిత్తుల సంబంధమైన బ్రాంకైటిస్ వ్యాధులకు బాగా ఉపయోగపడుతుంది విరేచనాల కేసులకిది ఆలోచించదగిన మందే చర్మంమీద దద్దు తామర నురుగుడు కాయలకేసులకు ఇది ఎంతో ప్రయోజనకారి

డల్కమారా రోగి మానసికంగా కుంగివుంటాడు మాటిమాటికి జలుబు పట్టుకుంటుంది ఈ లక్షణాలు కాల్కేరియా కార్బ్ రోగికి దగ్గరగా వుంటాయి చల్లగాలి సోకిన తరవాత పట్టుకునే కండరాల నొప్పులకు ముఖ్యంగా నడుము నొప్పిలాంటి బాధలకు డల్కమారా ఉపయోగపడుతుంది ఈ బాధలనే రుమాటిజమ్ అని వ్యవహరిస్తారు ఈ బాధలకు రస్టాక్స్, బ్రయోనియాలు కూడా ఆలోచించదగిన మందులే లక్షణాల సమగ్ర స్వరూపాన్ని ఆధారంచేసుకుని మందులను ఎంపికచేయవలసి ఉంటుంది డల్కమారా రోగిలో రుమాటిజం విరేచనాలు ఒకటి విడిస్తే మరొకటి పట్టుకొంటాయి ఈ రోగిలో ఇది ప్రత్యేక లక్షణంగా పరిగణించవచ్చు.

తేమ చలి వాతావరణంలో పనిచేసేవారికి పట్టుకునే విరేచనాలకి ఇది ప్రత్యేకమైన మందుగా వాడుకోవచ్చు విరేచనాలతోబాటు వాంతులు కూడా ఉంటూవుంటాయి మలం పసుపువచ్చగా ఆకుపచ్చగా తెల్లగా రంగుమారుతూ వుంటుంది రోగి నీరసించిపోయి వుంటాడు ముడ్డిపేగు కూడా జారివుండవచ్చు. విరేచనాలతో నీరసించిపోయిన రోగులకు చైనా కూడా ప్రధానమైన మందు అన్న విషయం గమనార్హం

తేమగాఉన్న రోజుల్లో చిన్నపిల్లల్లో వృద్ధుల్లో కనిపించే దగ్గు కఫం తగ్గడానికి ఈ మందు వాడుకోవచ్చు. కఫం తెగివడక చాలా బాధవడుతుంటారు ఈ వ్యాధినే బ్రాంకైటిస్ అంటారు ఈ రకమైన బాధలకి యాంటింటార్ట్ కూడా ఆలోచించతగినదే

మూత్రాశయానికి సంబంధించిన ఇన్ఫెక్షన్ కారణంగా మూత్రం చిక్కగా తెల్లగా పోతుంటే ఈ మందువాడడం మంచిదంటాడు డాక్టర్ క్లార్క్

చర్మవ్యాధులు చర్మంమీద దద్దు తామరలకు ఇది మంచి మందు బహిమ్ము ముందు చర్మంమీద దద్దు కనిపించటం విచిత్ర లక్షణం నురుగుడు కాయలకు డల్కమారా కాష్టికం తూజా ప్రధాన ఔషధాలుగా పరిగణించవచ్చు నురుగుడు కాయలు పెద్దవిగా మెత్తగా ఉంటే ఇది ప్రత్యేకమైన మందు

తేమగాలి సోకి కండరాలు చచ్చుబడినట్లయితే ముఖ్యంగా ఏదోఒక అవయవం మాత్రమే చచ్చుబడినట్లయితే ఈ మందు ఉపయోగపడుతుంది

జననేంద్రియాలలో పొక్కులు దురద అధికంగా కామోద్రేకం ఉన్నట్లయితే ఇది వాడుకోవచ్చు పిచ్చివాళ్ళ కామోద్రేకం తగ్గించడానికి ఈ మందు ఉపయోగిస్తుంది

## 26 జెల్సిమియం

జ్వరం కేసుల్లో ఆరంభదశలో (ఎకొనైట్ బెల్లడోనా)
నిస్సత్తువ మత్తుగా ఉంటాడు ఏకాంతంగా ఉండాలనిపిస్తుంది
తల భారం తల వెనుకభాగంలో నొప్పి

కళ్లు ముక్కు మండుతుంటాయి
తుమ్ములు గొంతుబాధ ఫ్లూజ్వరం ఒళ్లునొప్పులు పైకి ఎగబాకే చలి
పోలియో కేసుల్లో మొదటి దశ
వేళ్లు కండెలుబారతాయి కలం కదలదు
రెటీనా విడిపోయి అకస్మాత్తుగా చూపు దెబ్బ తింటుంది

---

ఇది వచ్చుమల్లె అని పిలిచె మొక్క వేళ్ళనుండి తయారయ్యే ఔషధం ఈ మొక్కల వేళ్ళు నక్స్‌వామికా ఇగ్నాషియాలవలె విషతుల్యమైనవి ఈ మందును మొదటిసారిగా హోమియో వైద్యంలో ప్రవేశపెట్టినవాడు సుప్రసిద్ధ అమెరికా వైద్యుడు ఇ.ఎం. హేల్ ఈయన ఈ మందుపై ప్రయోగాలు జరిపి తాను రచించిన హేల్స్ న్యూరెమిడీస్ అనే గ్రంధంద్వారా 862 లో వెల్లడించారు తరుణ వ్యాధుల్లో ఈ ఔషధం ఎకోనైట్, బెల్లడోనా మాదిరిగా అగ్రశ్రేణికి చెందినదే

సుస్పష్టమైన లక్షణాలు కలిగివుండడం ఈ మందు ప్రత్యేకతగా పరిగణించవచ్చు కండరాల చచ్చు కన్పించిన వ్యాధులకిది ప్రత్యేకమైన మందు పోలియోవ్యాధి చికిత్సకు దీన్ని ఔషధరాజంగా పరిగణిస్తారు నరాల బలహీనతవల్ల కండరాలు చచ్చుబడిపోతాయి. కండరాలలో శక్తిలెక అవయవాలలో కూడా వణుకు కన్పిస్తుంది నిలబడినప్పుడు కాళ్ళు వణుకుతుంటాయి నాలుక కండరాలు స్వాధీనంలో వుండకపోవడం వల్ల మాటల్లో స్పష్టత లోపిస్తుంది మాట ముద్దగా వస్తుంది ఆహారం సరిగ్గా మింగుడుబడదు ఆహారనాళ కండరాలు చచ్చుబడిపోవడంవల్లనే ఇది సంభవిస్తుంది కళ్ళు మూతలుబడిపోతుంటాయి రెప్ప కండరాల బలహీనత దీనికి కారణం కంటిరెప్పలు లేవలేరు కండరాల బలహీనతకుతోడు నన్నటి నొప్పులు కూడా చోటుచేసుకుంటాయి బలహీనత వణుకులతో కూడిన వ్యాధుల ఆరంభదశలో ఇది తప్పక ఆలోచించదగిన మందు

జెల్సిమియం రోగిలో దుర్బలత్వం నరాలు కండరాలకు మాత్రమే పరిమితంగాక మనస్సుగూడా దుర్బలంగా ఉంటుంది చెడువార్తలు భరించలేరు దు ఖాన్ని తట్టుకోలేరు విద్యార్థులు పరీక్షలంటే బెదిరిపోతారు ఏదైనా పనిగాని ప్రయాణంగాని పెట్టుకొంటే తత్తరపడిపోతారు తత్తరపాటుతో విరేచనాలు కావడం ఈరోగి విశిష్ట లక్షణంగా గమనార్హం

తలనొప్పికి మైగ్రెయిన్‌గా వ్యవహరించే తలనొప్పికి ఇది మంచి ఔషధం ఎండకీ వేసవికాలంలో వచ్చే తలనొప్పులకూ ఇది తప్పక ఆలోచించదగిన మందు ఆరోగ్యం సరిగాలేనప్పుడు రతిలో పాల్గొన్న తరువాత వచ్చే తలనొప్పికి ఇది ప్రత్యేకమైన మందు హస్తప్రయోగం చేసుకొన్న తరువాత తలనొప్పి పట్టుకున్న వారు ఈ మందు వాడుకోవచ్చు. తలనొప్పి మొదలవ్వబోయే ముందు చూపు మసకగా ఉంటుంది తలకింద రెండు దిండ్లు ఎత్తుగా పెట్టుకొని పడుకొంటే హాయిగా ఉంటుంది తలనొప్పి మెడ వెనుకభాగంలో ముందుగా ఆరంభమై, తలపైకి వ్యాపించి కళ్ళమీదకు చేరుకుంటుంది ఉదయంపూట ఎక్కువగా తలనొప్పితో బాధపడుతుంటారు మూత్ర విసర్జన అనంతరం తలనొప్పి తగిపోతుంది ఇది విచిత్ర లక్షణం

ఫ్లూజ్వరానికి దీన్ని ప్రత్యేకమైన మందుగా పరిగణిస్తారు జ్వరం రాబోయేముందు జ్వరం వచ్చినతరువాత, జ్వరం వచ్చి తగ్గిపోయిన తరవాత కూడా ఫ్లూకి ఇది మంచిమందుగా వాడుకోదగిందే ఫ్లూజ్వరం నిరోధించడానికి ఈ మందు వాడుకోవచ్చునని డాక్టర్ టైలర్ సూచన

జ్వరాల కేసుల్లో ఎకోనైట్ బెల్లడోనా జెల్సిమియం ఔషధాలు ముందుగా ఆలోచించదగినవే ఎకోనైట్ రోగిలో అశాంత ప్రధాన లక్షణం బెల్లడోనా జ్వరం తీవ్రంగా ఉంటుంది ఒంటిమీద చేయిపెట్టి తీసిన తరవాత కొంతసేపటి వరకు చేతులు మాడిపోతున్నట్లుంటాయి జెల్సిమియం రోగిలో బాధలు క్రమక్రమంగా చోటుచేసుకుంటాయి రోగి ఏమీ పట్టనట్టుగా మగతగా ఉంటాడు తలభారం కళ్ళు విప్పిచూడడం కూడా కష్టంగా ఉంటుంది మానసికంగా శారీరకంగా దుర్బలత్వం కాళ్ళు చేతులు చల్లగా ఉంటాయి ముఖం కంది ఉబ్బరంగా కన్పిస్తుంది ముక్కులు బిగేసి గాలి పీల్చటం కష్టంగా ఉంటుంది జ్వరం ఎంత ఎక్కువగా ఉన్నా దాహం ఉండదు ఇది ఈ రోగి విచిత్ర లక్షణం మాట సరిగ్గా రాదు తాగినవాడిలా మాట్లాడతాడు జ్వరాన్ని

ఏపేరుతో పిలిచినా ఈ లక్షణంపై ఆధారపడి మందు ఎంపికచేసి వాడి ఫ్లూ మలేరియా టైఫాయిడ్ పొంగు కనపడే జ్వరాలన్నిటిని నివారించవచ్చు పొంగు జ్వరాలలో దద్దు కనిపించే సమయంలో ఫిట్స్‌కూడా చోటుచేసుకున్నట్లయితే జెల్సిమియం ప్రత్యేకమైన మందు జెల్సిమియం బాప్టీజియా రోగులు మగతగా కన్పిస్తారు జెల్సిమియం రోగిని చూసి స్నేహితులు బంధువులు ఎక్కువగా ఆదుర్దా చెందుతుంటారు.గాని నిజానికి బాప్టీజియా రోగిదె ప్రమాదకరమైన పరిస్థితి టైఫాయిడ్ జ్వరం ఆరంభదశలో జెల్సిమియం మంచి మందు తరవాత దశలో బాప్టీజియా ఆర్సెనిక్‌ ఆల్బ్‌, బ్రయోనియా మందులను ఆలోచించవలసి వుంటుంది

# 27 ఇగ్నేషియా

స్త్రీలలో దుఃఖం భగ్నప్రేమ విచారం లాంటివాటికి దీర్ఘకాలంగా గురైనందువల్లవచ్చే బాధలు

సున్నితమైన మనస్సు. తేలికగానొచ్చుకొంటారు

దుఃఖంతో కుమిలిపోతుంటారు

కాఫీ ధూమపానం మద్యపానం మానసిక శ్రమవల్ల తలనొప్పి

హిస్టీరియా ఫిట్స్‌కు ప్రత్యేకమైన మందు

దడుచుకున్నందువల్ల కొట్టినందువల్ల పొట్టలో పురుగులవల్ల పిల్లలో ఫిట్స్ కొరియా

దిగులువల్ల లైంగిక అనాసక్తత

ఇగ్నేషియా వాడిన తరవాత బాధలు తగ్గి తిరగబెడుతుంటే నేట్రం మూర్ ఇవ్వాలి

ఇగ్నేషియా అమారా అనే చెట్టుగింజల నుండి ఈ మందు తయారుచేస్తారు ఈ గింజల్లో ప్రధానంగా స్ట్రిక్నైన్ అనే రసాయన పదార్థముంటుంది నక్స్‌వామికా గింజల్లో వుండే పదార్థం కూడా ఇదే ఇగ్నేషియా నక్స్‌ల మధ్య కొంతవైవిధ్యం వున్నా చాలా పోలికలున్నాయి ఈ రెండూ కూడా ప్రధానంగా నాడీమండలాన్ని ప్రభావితం చేసే మందులే

ఇగ్నేషియా నక్స్ కేమోమిల్లాలు తరుణవ్యాధుల్లో ముఖ్యమైన ఔషధాలు వీటిని పాలీక్రెస్టలుగా పరిగణిస్తారు ఇవి మీ మినీకిట్‌లో తప్పక వుంచుకోదగ్గ మందులు

ఇగ్నేషియా స్త్రీలకు నక్స్ పురుషులకు కేమోమిల్లా పిల్లలకు ఉపయోగించే మందులుగా ప్రసిద్ధి చెందాయి ఈ మూడు మందుల్లో ఉద్రేక స్వభావం ప్రధాన లక్షణం ఇగ్నేషియా రోగులు ఉద్వేగపరంగా తీవ్రంగా కలతచెందే స్వభావం కలవారుగా వుంటారు కాని బయటపడరు లోలోన కుమిలిపోతారు ఇది స్త్రీల స్వభావం నక్స్‌రోగులకు తీవ్రమైన కోపం తమాయించుకోలేరు మీదపడిపోతారు ఇది పురుషుల స్వభావం ఈ రెండు మందుల్లో వుండే ప్రధాన రసాయన పదార్థం స్ట్రిక్నైన్ అయినా దానితోబాటు వుండే ఇతర పదార్థాలపై ఆధారపడి మందుల ధర్మాలుంటాయనడానికి ఈ మందులే నిదర్శనం పదార్థాలలోని ప్రధాన రసాయనాన్ని విశ్లేషించి విడదీసి దానినే ఉపయోగించుకోవాలని అనుకోవడం ప్రకృతి విరుద్ధం

ఈ మందుపై ప్రయోగాలు జరిపి హోమియో వైద్యంలో దీనిని మొదటగా ప్రవేశపెట్టిన వాడు హానిమన్ ఇగ్నేషియా రోగి మానసిక శారీరక లక్షణాలలో కొట్టొచ్చినట్లు కనిపించేది వైరుధ్యం విరుద్ధతత్వమే ఇగ్నేషియా రోగిని పట్టిచ్చే విలక్షణత డాక్టర్ హెచ్ సి యాలెన్ ఈ విలక్షణతను చక్కగా క్రోడీకరించి చెప్పాడు చెవిలో హోరుమనే ధ్వనులుంటాయి సంగీతం వింటుంటే హాయిగా వుంటుంది వంటిబాధ సములుతుంటే తగ్గిపోతుంది మలలుంటాయి నడుస్తుంటే హాయిగా వుంటుంది గొంతు నొప్పిగావుంటే ఘనపదార్థాలు మింగుతూంటే ఉపశమనంగా వుంటుంది సునదగ్గు వుంటుంది దగ్గితే నుసకగ్గడానికిబదులు అధికమవు తుంది దు ఖం పొర్లుకొస్తుంటుంది ఏడ్వడానికి బదులు విరగబడి నవ్వుతుంటారు చలితో వణికిపోతుంటారు అలా వున్నప్పుడే దాహం వేస్తుంటుంది జ్వరం వున్నప్పుడు నీళ్ళుతాగరు నుదురు పగలగొట్టుకుపోతుంటుంది ముందుకు వంగితే బాధ తక్కువ అని అంటారు ఈ జాబితా ఎంతైనా పొడిగించవచ్చు. ఔనంటే కాదనిలే

ఆడవారి మాటలకు అర్థాలే వేరులే అన్న మాటలు గుర్తుకొస్తాయి ఈ రోగిని చూసినప్పుడు

క్షణంలో లక్షణాల తీరు స్వభావం మారుతుంటుంది లక్షణాల తావు కూడా మారుతుంటుంది నవ్వుతూ నవ్వుతూనే ఏడుపు ప్రారంభిస్తారు ఎంతో కోపంతో మండిపడుతూ అంతలోనే పశ్చాత్తాపంతో కుంగిపోతారు క్రోధం నిలబడదు దు ఖం ముంచుకువచ్చినప్పుడు ఒంటరిగా వుండాలని కోరుకుంటారు ఇది పూర్తిగా స్త్రీల స్వభావం ఇగ్నాషియా రోగులు తమకున్న బలహీనతల వట్ల తామే విసుగుచెంది కుంగిపోతుంటారు ఎదురు చెప్పితే భరించలేరు ఎదుటివారిమాటలన్నీ సూటిపోటి మాటలుగా కనిపిస్తాయి ఆలోచన కన్న ఆవేశం ఎక్కువగా వుంటుంది అయితే తెలివితేటలు తక్కువేమీకాదు చాలా చురుకైన నిదానమైన వ్యక్తులు పల్సటిల్లాలాగానే ఇగ్నాషియాది మృదువైన స్వభావం అయితే పల్సటిల్లా రోగులు పూర్తిగా స్వార్ధపరులు ఇగ్నాషియాకి స్వార్ధమున్నా ఇతరుల బాధలవట్ల స్పందించే స్వభావం కూడా వుంది వీరు ఎంత చురుకైన వాళ్లో అంత సున్నితమైనవారు అంతగా ఉద్రేకానికి గురౌతారు మనస్సేకాక శరీరం కూడా సున్నితమైనదే ఏ చిన్ననొప్పికీ ఓర్చుకోలేరు ఈ రోగి నొప్పుల్లో ఒక విశేషముంది మూత్రవిసర్జన తరువాత నొప్పి తగ్గిపోతుంది ఉదాహరణకి తలనొప్పి విపరీతంగా వస్తుంది ధారాళంగా మూత్రవిసర్జన అయిన తరువాత నొప్పి తగ్గిపోతుంది ఇవి విచిత్ర లక్షణాలు ధాతుశైధిల్య శాస్త్రజ్ఞులకు అంతుబట్టని సమస్యలుగా ఇవి మిగిలిపో తాయి

దిగులు దు ఖంతో కుంగిపోయేవారికి ఇగ్నాషియా ప్రధానమైన మందు ఒక తల్లి తన ఏకైక సంతానాన్ని కోల్పోయి దు ఖ సముద్రంలో మునిగి వుంటుంది ఆమెను ఓదార్చడం అసాధ్యం ఒంటరిగా కుంగిపోతూ వుంటుంది గుండె బరువై దడ వస్తుంది నిద్రపట్టదు ఒక యువతి తన ప్రేమికుడు తనని మోసం చేశాడని తెలుసుకుంటుంది దిగులుపడి కాసేపు ఏడుస్తుంది కాసేపు నవ్వుకుంటుంది గదిలోకిపోయి తలుపులు వేసుకుని ఒంటరిగా కూర్చుంటుంది ఆమెకు ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుంది ఒక చిన్నపిల్లను స్కూల్లో టీచరు కొడితే ఇంటికివచ్చి ఏడ్చి ఏడ్చి నిద్రపోతుంది రాత్రి నిద్రలో కూడా నిట్టూర్పులు విడుస్తూ వుంటుంది ఫిట్స్ కూడా రావచ్చు. దిగులు పడి కుమిలిపోయే తల్లి నిద్ర గుండెదడ గుండెల్లో భారానికి భగ్నహృదయ అయిన యువతికి సున్నితమైన పసిబిడ్డ ఫిట్స్‌కి ఇగ్నాషియా దివ్యౌషధం ఇటువంటి సంఘటనవల్ల వెనువెంటనే కలిగే ఉద్వేగభారంతో నిండి పోయిన వారి దు ఖ నివారణకి ఇగ్నాషియా మంచి మందు

హిస్టీరియాకు ఇది గొప్పమందు హిస్టీరియాకు వేరే మందులు లేవనిగాని హిస్టీరియా కాక వేరే బాధలను ఇది నివారించలేదనిగాని భావించనవసరంలేదు నీరసం నిస్త్రాణ స్పృహతప్పిపడిపోవడం ఇగ్నాషియా రోగికి సహజం అందుకే ఇది హిస్టీరియా మందుగా పేరు పడిపోయింది మానసికమైన ఒత్తిడి రాత్రిళ్ళు నిద్రకాయవలసి వస్తే ఈ మందు వాడుకోవచ్చు. కాన్పు సమయంలో నొప్పికి భయంవల్ల ఫిట్స్‌కి ఇది వాడుకోవచ్చు. బహిష్టుల్లో వచ్చే ఫిట్స్‌కి ఈ మందు ఆలోచించదగిందే గొంతులో ముద్దవున్నట్లుందనీ శరీరంలో ఎక్కడో ఒకచోట తిమ్మిర్లు చురుకులు వున్నాయని బాధపడేవారికి ఇతర కారణాలు గమనించి ఇగ్నాషియా వాడుకోవచ్చు.

ఇగ్నాషియా రోగుల ఆకలి ఒక తీరుగా వుండదు వీరికి కాఫీ మాంసం అంటే ఇష్టం ఉండదు పుల్లటి వస్తువులంటే ఇష్టపడతారు ఇది విచిత్రమే వేడి పదార్థాలంటే ఇష్టపడరు ఈ రోగుల మానసిక లక్షణాలను కూడా పరిశీలించి ఈ మందును ఎంపిక చెయ్యాలి

ఇగ్నాషియా వాడినప్పుడు బాధలు తగ్గి ఆ లక్షణాలు తిరగబెడుతున్నట్లు గమనించితే నేట్రంమూర్ సెపియాలను ఆలోచించవలసి వుంటుంది తీవ్రమైన మన క్లేశం కుంగదీసే రోగులకు యాసిడ్‌ఫాస్ ఇవ్వవలసి రావచ్చు.

## 28. గ్రఫయిటిస్

కాళ్లమీద గుల్లలు స్రావం కారుతుంటాయి

చర్మం పగిలి ఉంటుంది ఆసనంచుట్టూ పగిలి ఉంటుంది మంట బాధ

మలబద్ధకం మలం పెంటికలు చుట్టూ జిగురు
విరేచనం అయిన తరవాత నొప్పి.
దుర్వాసనతో గూడిన అపానవాయువులు
నోటి మూలల్లో చనుమొనల్లో వగుళ్లు చనుమొన పీక్కుపోయి ఉంటుంది
కాలిగోళ్లు చేతిగోళ్లు మందబారిపోయి ఆకారమే ఉండదు
బొద్దుగా ఉంటారు
మానసికంగా కుంగి ఉంటారు

ఈ మందును పెన్సిల్‌కి వుపయోగించే నల్లసీసం నుండి తయారు చేస్తారు ఇది ఒక కర్బనమే ఈ మందు హోమియో వైద్యంలో ప్రవేశపెట్టిన వాడు హానిమన్ దీర్ఘవ్యాధులకిది ప్రత్యేకమైన మందు దీనిని గొప్ప పాలీక్రెస్ట్ ఔషధం అని శ్లాఘిస్తాడు డాక్టర్ డన్‌హామ్ గ్రఫయిటిస్ వజ్రం రూపాంతరం వజ్రతుల్యమైన ఈ మందు పిల్లలకు పెద్దలకు ముఖ్యంగా స్త్రీలకు ఎంతో ప్రయోజనకరమైనది ఇది మీ మెడికిట్‌లో వుంచుకోవలసిన మందు అద్దాల కర్మాగారాల్లో పనిచేసేవారు ముఖంమీద గుల్లలు తగిపోవడానికి పాత మందును వాడడం హానిమన్ దృష్టిని ఆకర్షించింది చర్మవ్యాధులకే ఈ మందు ప్రయోజనం పరిమితం కాదు పొటెన్సీ రూపంలో జీర్ణమండల వ్యాధుల జననేంద్రియ వ్యాధుల నివారణకిది ఎంతో ఉపయోగకారి

ఏ రోగికైనా రెండు ప్రత్యేక లక్షణాలపై ఆధారపడి ఈ మందును ఎంపిక చెయ్యవచ్చునంటాడు డాక్టర్ ఇ బి నాష్ గ్రఫయిటిస్‌రోగి బొద్దుగా వుంటాడు ఇది మొదటి లక్షణం ఒంటిమీద జిగురుసాన ఊరుతూండే గుల్లలు ఉండడం రెండవ లక్షణం మలబద్ధకాన్ని మూడవలక్షణంగా చెప్పుకోవచ్చు. మలం పెంటికలు పెంటికలుగా జిగురు పులిమినట్లుంటుంది ఈ రోగులకు జలుబు తేలికగా పట్టుకుంటుంది గోళ్ళు మొద్దుగా ఆకారం లేకుండా వుంటాయి స్త్రీలైతే రుతుస్రావాలు క్రమం తప్పి ఆలస్యంగా వస్తుంటాయి పైన తక్కువ ఈ లక్షణాలను గుర్తు పెట్టుకుంటే ఆ లక్షణాలున్న రోగి ఏ రోగంతో బాధపడుతున్నా ఈ మందు అతనికి స్వస్థత చేకూర్చవచ్చు. రోగి తత్వానికి మందులు వాడితే రోగకారణంగా ధాతువులలో చోటుచేసుకుని వున్న దుష్ఫలితాల ను నివారించవచ్చు. జలుబులాంటి సాధారణవ్యాధి మొదలుకొని కేన్సర్‌లాంటి ప్రమాదకరమైన వ్యాధులకు కూడా ఈ మందు పనిచేస్తుంది

గ్రఫయిటిస్ పిల్లలు బొద్దుగా కన్పిస్తారు పొట్టపెద్దగా వుంటుంది వారికి చలిగిట్టదు మలబద్ధకం చాలా పిరికి మనస్తత్వం కొత్త స్కూలుకు పోవాలంటే భయపడిపోతారు బద్ధకస్తులు వీరు సోమరిపోతులని స్కూలు రిపోర్టులు వస్తుంటాయి వీరికి సిగ్గు వుండదు కోప్పడినా నవ్వుకుంటారు చర్మం గరుకుగా పొడారి వుంటుంది ముక్కులు ఆరిపోకుండా ఎప్పుడూ కారుతూవుంటాయి స్రావం చిక్కగా వుంటుంది చెవిలో చీము పొద్దున లేచేసరికి కళ్ళు పుసులు కట్టి అంటుకుపోయి వుంటాయి ఆటల్లో తేలిగ్గా అలిసిపోతారు ఓపిక తక్కువ అయితే ఈ పిల్లలు తిండిపోతులు ఏదో ఒకటి తినకుండా కాసేపు కూడా వూరుకోలేరు తీపి అంటే ఇష్టపడరు చిన్నపిల్లల్లో తీపి అంటే ఏవగించుకోవడం విచిత్ర లక్షణం చేపలన్నా కూడా ఏవగించుకుంటారు చర్మం ఆరోగ్యంగా కన్పించదు ప్రత్యేకంగా కళ్ళమడతలో తలలో చెవివెనక భాగాన తేనెలాగ జిగురుసాన ఊరుతుండే గుల్లలు కన్పిస్తాయి ఈ వ్యాధిని ఎగ్జిమా అని వ్యవహరిస్తారు చర్మవ్యాధి తగ్గిపోయి ఆస్త్మారావచ్చు. ఈ రకమైన ఆస్త్మాకు గ్రఫయిటిస్ ప్రత్యేకంగా వాడుకోదగిన మందు తూజా నల్ఫర్‌లు కూడా ఈ సందర్భంలో గుర్తుంచుకోదగ్గ మందులే ఈ పిల్లలకు మలబద్ధకంతోబాటు జిగురుతోకూడిన మలం ముడ్డిభాగమంతా ఎగ్జిమాలాంటి వ్యాధి ఇవన్నీ బాల్యంలో ఎదురయ్యే గ్రఫయిటిస్ లక్షణాలు

పెద్దవయస్సు వాళ్ళలో గ్రఫయిటిస్‌కు కొన్ని ప్రత్యేక లక్షణాలు కన్పిస్తాయి వీరు త్వరగా ఒక నిర్ణయానికి రాలేరు డోలాయమాన మనస్తత్వం మానసికంగా అస్తిమితం ఈ సందర్భంలో పల్సటిల్లా గుర్తు వస్తుంది బహిష్టుల ఆరంభ దశలో పల్సటిల్లా బహిష్టులాగిపోయే వయస్సు వచ్చినవారికి గ్రఫయిటిస్ వాడుకవడిన మందులు పనికిబద్ధకించి దాటవేస్తుంటారు దిగులు జాస్తి ఇటీవల సంఘటనలు గుర్తుకురావు గాని ఏనాడో జరిగిపోయిన విషయాలు గుర్తుంటాయి కొద్దిపాటి శ్రమకి కూడా చెమటలు పడతాయి చెమట

దుర్వాసన కొడుతుంటుంది ఆ చెమటలో నానితే గుడ్డలు పసుపు రంగుగా మారిపోతాయి చర్మం ఆరోగ్యంగా వుండదు మడతల్లో జననేంద్రియాల్లో ఎగ్జిమాలాంటి చర్మ వ్యాధి జిల ఎక్కువ సొన ఊరుతూండే పొక్కులు

జీర్ణమండల వ్యాధులకు గ్రఫయిటిస్ మంచి మందు చర్మాన్ని ల గానే జిగురు పొరలను ఇది ప్రభావితం చేస్తుంది పొట్టలో నొప్పి, పొట్ట ఉబ్బరం తిన్నది జీరంకాదు తిన్న తరువాత తలనొప్పి వాంతి వచ్చినట్లుంటుంది నోట్లో ఎక్కువగా నీళ్ళూరుతుంటాయి అయితే తృప్తిగా భోజనం చేసినా తిన్నతరవాత ఒక గంటలోనే ఆకలిమంటలాంటి బాధ కలుగుతుంది ఈ రోగికి వెర్రి ఆకలి అప్పుడు ఏదైనా తింటే హాయిగానే వుంటారు గ్రఫయిటిస్ రోగులకి గాస్ట్రిక్ అల్సర్ డుయోడినల్ అల్సర్ బాధలెక్కువ ఏదైనా తిన్నప్పుడు వేడివేడి పాలు తాగినప్పుడు హాయిగా వుంటుంది ఇది ఈ మందు విచిత్ర లక్షణం గ్రఫయిటిస్ రోగులకు తీపి వస్తువులు మాంసాహారం ఇష్టముండదు ఇది వారి తత్వపరమైన లక్షణం మలబద్ధకం మూలశంకలతో బాధపడుతుంటారు విరేచనంలో జిగురు పదార్థం పడుతుంటుంది స్థూలంగా వుండి నలభై సంవత్సరాల వయస్సు వచ్చి, మలబద్ధకం కల స్త్రీలకు గ్రఫయిటిస్ మంచి మందు వీరికి రుతుస్రావం క్రమం తప్పి వస్తుంటుంది మైలతక్కువ నల్లగాగాని పాలిపోయినట్లుగాని వుండవచ్చు తెల్లకుసుమ ధారాపాతంగా అవుతుంటుంది జననేంద్రియాలు ఒరుసుకుపోతాయి బహిష్టు సమయంలో కడుపు నొప్పి, గర్భకోశానికి కాన్సర్ కణితి వుండవచ్చు. కాన్సర్ కణితివల్ల మైల నల్లగా కండలు కండలుగా పడుతుండవచ్చు ఈ తత్వం రోగులకు గ్రఫయిటిస్ తప్పక ఆలోచించాలి పురుషుల్లో నపుంసకత్వం రతినల్పినా వీరికి వీర్యస్థలనం వుండదు రతిసౌఖ్యం అనుభవించలేరు గాయాలు గడ్డలు మానిన తరవాత ఆ మచ్చలు దళసరిగా కాయలు కాసినట్లు తయారైతే వాటిని కీలాయిడ్స్ అంటారు కీలాయిడ్స్ కరిగిపోవడానికీ కీలాయిడ్స్‌లో ఏర్పడిన కేన్సరుకీ గ్రఫయిటిస్ మంచి మందు ఈ సందర్భంలో సైలీషియా థ్రోసెరాలు కూడా ఆలోచించదగిన మందులే

# 29 అయొడం

శుష్కించి వుంటారు - శిశువులు ముసలివాళ్ళలాగా కన్పిస్తారు
వెర్రి ఆకలి బాగా తింటారు తింటేగాని వారికి బాధలు తగ్గవు
టాన్సిల్స్ ఏడినాయిడ్స్ వాచి శుష్కించిపోయినపిల్లలకు ఇది మంచి మందు
లివర్ స్ప్లీన్ పెరిగి వుండవచ్చు.
మెడలో గ్రంధులవాపు టి బి
థైరాయిడ్‌గ్రంధి వాపు
గర్భకోశం అండాశయాలు పెద్దవైవుంటాయి స్తనాలు మాత్రం కృశిస్తాయి
కీళ్ళవాపు నొప్పి

దీనిని అయొడిన్ అని పిలుస్తారు ఇది సముద్రంలోనూ సముద్రంలో నివసించే జీవరాశుల్లో అధికంగా లభించే రసాయనిక పదార్థం దీనిని మొదటిసారిగా హోమియో వైద్యంలో ప్రవేశపెట్టినవాడు హానిమన్ ఆయన దీనిని ఉత్తమశ్రేణికి చెందిన ఔషధంగా పరిగణించాడు ఇది మీ మినీకిట్‌లో ఉండదగినమందే

సంప్రదాయవైద్యంలో శస్త్రచికిత్స చేయబోయే తావున క్రిమిసంహారక ఔషధంగా చర్మంమీద లోషన్ రూపంలో వాడుతుండేవారు కీళ్ళవాపు నొప్పిఉంటే ఆ బాధలు తగ్గించడానికి అయొడిన్ ద్రావణం పూతమందుగా వాడడం అనవాయితీ సిఫిలిస్ కారణంగా గుండె రక్తనాళాల వ్యాధులకు పొటాసియం అయొడైడ్ వాడేవారు ఉబ్బసం రోగులకు ఛాతీలో కఫం తెగిపడి పోవడానికి కూడా పొటాసియం అయొడైడ్ ఇస్తుంటారు ఇవి ముడిరూపంలో అయొడిన్ ప్రయోజనాలను సూచిస్తాయి

పొటెన్సీల రూపంలో టి బి కాన్సర్ ఎండు రోగం (మెరాస్మస్) లాంటి వ్యాధులతో బాధపడే రోగులకు సైతం అయొడిన్ ఉపయోగపడుతుంది వ్యాధి పేరునుగాక లక్షణ సమష్టిపై ఆధారపడి ఔషధాన్ని ఎంపికచేసి వాడడం హోమియో వైద్య విధానం

అయొడిన్ రోగులు శుష్కించి పోతూవుంటారు కండలన్నీ కరిగిపోయి అస్తిపంజరంలాగా కన్పిస్తారు అయితే గ్రంధులు మాత్రం వాచివుంటాయి గ్రంధుల వాపు గమనార్హమైన విషయం మెడచుట్టూ వున్న గ్రంధులు మెడముందున్న థైరాయిడ్ గ్రంధి చంకలో పొట్టలో గజ్జల్లో ఉండే గ్రంధులుకూడా వాచి పెద్దవిగా కన్పిస్తాయి నుసతోగూడిన పొడిదగ్గు అరుదుగా రక్తంతో కలిసిన కఫం కూడా కన్పించవచ్చు వ్యాధి ముదిరినకొద్దీ దగ్గు తెరలు తెరలుగా వస్తుంది రోగి దగ్గు బాధకు తట్టుకోలేక గొంతు పట్టుకొని కూర్చొంటాడు మాట బొంగురుపోతుంది ఈ రోగులకు అయొడిన్ చాలా ఉపయోగకరమైన మందు ఈ దశలో రోగులకు ఈ మందు వాడితే టి బి రాకుండా నిరోధిస్తుంది

అయొడిన్ రోగికి ఆకలి ఎక్కువ అతిగా తింటూవుంటాడు తింటేగాని హాయిగా వుండదు తినకపోతే శోషవచ్చి పడిపోతాడు కూడా ఎంతతిండి తింటున్నా శుష్కించి పోవడం అయొడం ప్రత్యేక లక్షణం ఈ రోగి అమిత నీరసంగా వుంటాడు ఏ పనీ చేయలేడు మెట్లు ఎక్కితే మరీ ఎక్కువగా ఆయాసపడిపోతాడు స్త్రీలు బహిష్టుసమయంలో అధికంగా నీరసపడిపోతారు

మానసిక శారీరక స్థాయిల్లో అయొడం రోగికి ఆందోళన అస్తిమితం శారీరకమైన అస్తిమితం కారణంగా ఎప్పుడు అటూ ఇటూ తిరుగుతుంటాడు మానసికమైన ఆందోళన తగ్గించుకోవడానికి ప్రయత్నించినకొద్దీ అది మరింత అధికమవుతుంది ఇది గమనించదగ్గ విషయం ఈ సందర్భంలో ఆత్మహత్య చేసుకోవడమో ఇతరులను హత్యచేయడానికి పాల్పడడమో జరుగుతుంది ఈరకమైన దుడుకు మనస్తత్వానికి ఆర్సెనికం ఆల్బ్ హెపార్‌సల్ఫ్ లు కూడా గుర్తుంచుకోదగ్గ మందులే అయొడం రోగిది వేడితత్వం చల్లటి ప్రదేశం చల్లటి గాలి కావాలి చన్నీళ్ళ స్నానం అంటే ఇష్టం అయొడం ప్రకృతిలో సముద్రం నీటిలో లభిస్తుందని గుర్తుంచుకొంటే ఈ రోగులకు చల్లటి గాలి చన్నీళ్ళ స్నానం ఇష్టంకావడం సహజమేనని అర్ధంచేసుకోవచ్చు. ఆర్స్‌ఆల్బ్ రోగులకు చల్లదనం గిట్టదు హెపార్‌సల్ఫ్‌కు అంతే ఇది ముఖ్యమైన తేడా ఒక లక్షణాన్నే ఆధారంచేసుకుని హోమియో వైద్యం ఔషధాలను ఎంపికచేయడం జరుగదు రోగి ముఖ్యాంశాలన్నీ విశ్లేషించి మందులను ఎంపికచేస్తారు

అజీర్తి రోగులకు అయొడం మంచి మందు అప్పుడప్పుడు వాంతులవుతాయి తేన్పు లెక్కువ తిన్న ఆహారమంతా గాస్‌గా మారుతుందన్నట్లనిపిస్తుంది ఉదయంపూట విరేచనాలవుతుంటాయి లివరు దెబ్బతిన డమే దీనికి కారణం వచ్చుకామెర్లు కూడా వుండవచ్చు. తిన్నది జీర్ణంకాకపోయినా ఆకలి హెచ్చు. తిన్నది ఒంటికి పట్టక చిక్కిపోతుంటాడు క్రమంగా లివరు దెబ్బతిని జలోదర లక్షణాలు కూడా కన్పిస్తాయి

కొంతమందిలో జిగురుతోకూడిన పెద్ద పెద్ద విరేచనాలు కూడా కావచ్చు ఇటువంటివారి విషయంలో జీర్ణమండలానికి సంబంధించిన పాంక్రియాస్ గ్రంధి దెబ్బతిందని అనుమానించవలసివస్తుంది

పొట్టలో గ్రంధులువాచి పొట్ట ఉబ్బరంగా వుండి నోటిపూత నోరు దుర్వాసన అమితమైన ఆకలి తింటున్నా చిక్కిపోవడం లాంటివి కొంతమందిలో కన్పిస్తాయి దీనిని పొట్టలో టి బి గా నిర్ధారించవచ్చు. ఈ కేసులకి అయొడం మంచి మందు

స్త్రీ పురుష జననేంద్రియ వ్యాధులలో అయొడం ఉపయోగం అనల్పమైనది ఋతుస్రావం అధికంగా అవడం బహిష్టులు క్రమంతప్పిరావడం తెల్లకుసుమతో బాధపడే స్త్రీలకు ఈ మందు ఆలోచించవచ్చు కుసుమవల్ల యోని అంచులు ఒరుసుకుపోతుంటాయి బహిష్టులకుముందు కుసుమ మరీఎక్కువ జిగురుగా గవరరంగులో అవుతుండవచ్చు. బట్టలకయితే అవి కూడా చిల్లులు పడిపోతాయి గర్భకోశ ముఖద్వారం పూసి ఉండవచ్చు. సాధారణంగా ఇటువంటి స్త్రీలు ఎక్కువ కాన్పులు కూడా కనివుంటారు ఈ కేసులు కాన్సరు కూడా కావచ్చు. వీరికి అయొడిన్ మంచి ఔషధం గ్రంధులన్నీ వాచినా అయొడం రోగుల్లో స్తనాలు మాత్రం కృశించివుంటాయి ఇది విచిత్ర లక్షణం

అయొడం రోగి చిత్రం క్లుప్తంగా ఈ విధంగా వుంటుంది రోగి చిక్కిపోయివుంటాడు శ్రమకు ఓర్వలేడు పొడిదగ్గు మాట బొంగురుపోయి వుండవచ్చు. కాన్సర్ టిబి మలేరియా లాంటి వ్యాధులుండవచ్చు. ఆందోళన అస్తిమితం అతి ఆకలి గ్రంధులు వాచి ఉంటాయి

# ౩౦. ఫెర్రంఫాస్

ఇది ఇనుము భాస్వరాల సమ్మేళనం ఇనుము రక్తానికి టానిక్‌లాంటిది ఇనుము రక్తానికెంత ప్రధానమైనదో భాస్వరం నాడులకంత ముఖ్యమైనది ఈ మందును హోమియో వైద్యంలో ప్రవేశపెట్టిన ఖ్యాతి ద్వాదశలవణ చికిత్సా విధానానికి పితామహుడనదగిన డాక్టర్ విలియం హెచ్‌స్క్యూస్లర్‌కి దక్కుతుంది ఈయన తన జీవితాన్ని హోమియో వైద్యుడి గానే ప్రారంభించాడు శరీరంలోవున్న కణాలను రసాయనికంగా విశ్లేషించి పన్నెండు లవణాలను కనుగొన్నాడు ఈ ద్వాదశలవణాలు జీవరసాయన లవణాలుగా ప్రసిద్ధి చెందాయి శరీరంలో ఈ లవణాల సమస్థితి లోపించడమే వ్యాధికి కారణంగా భావనచేసి ఆ లవణాలను రోగులకువాడి ఆరోగ్యాన్ని పునరుద్ధరించే లక్ష్యంగల చికిత్సా విధానమే ద్వాదశ లవణచికిత్స. లవణాల సమస్థితిని నిర్ధారించడానికి హోమియో వైద్యవిధానంలో మాదిరిగా రోగిలక్షణాలను అధ్యయనం చేయవలసివుంటుంది ఇది ఒకరకంగా సారూప్యసిద్ధాంతాన్ని అమలువరచడమే అవుతుంది ద్వాదశ లవణచికిత్స సారూప్యసిద్ధాంత నిర్ధారణకు ఒకరుజువని చెప్పవచ్చు కణాల జీవకార్యనిర్వహణకు జీవరసాయన లవణాలు ఉపయోగపడ తాయి ఈ లవణాల సమస్థితిలోపిస్తే ఆరోగ్యం దెబ్బతినడం సహజం సమస్థితిలోపం సమస్థితిని సరిదిద్దడం చైతన్యస్థాయికి చెందిన అంశాలుగా పరిగణిస్తారు ఆ కారణంగా ద్వాదశలవణాలను కూడా దశాంశపద్ధతి అనుసరించిన పొటెన్సీలుగా వాడడం జరుగుతుంది ఫెర్రంఫాస్ కాల్కేరియాఫాస్ కాల్కేరియాఫ్లోర్ కాల్కేరియాసల్ఫ్, కాలీమూర్ కాలీఫాస్ కాలీసల్ఫ్, నేట్రంఫాస్ నేట్రంసల్ఫ్, నేట్రంమూర్ మెగ్నీషియాఫాస్ సైలీషియాలు ద్వాదశలవణాలు వీటన్నింటిలో తరచుగా వాడుకొనేమందు ఫెర్రంఫాస్ ఇది మీ మెడికిట్‌లో వుండవలసిన మందు

దేహంలో ప్రాణవాయువు సరఫరాకు అవసరమైన ఎర్రకణాల అభివృద్ధికి ఇనుము అవసరం ఫెర్రంఫాస్ ఎర్రకణాల అభివృద్ధికి తోడ్పడుతుంది పాలిపోయిన రోగులు ఈ మందును వాడుకోవచ్చును రక్తవృద్ధికేకాకుండా రక్తనాడుల గోడల దృఢత్వానికి కూడా ఈ మందు సహాయపడుతుంది రక్తనాడులు చిట్లి రక్తస్రావాలకు గురయ్యే రోగులకు ఈ మందు బాగా పనిచేస్తుంది ముక్కునుండి మాటిమాటికి రక్తస్రావమవుతుంటే ఈ మందును వాడుకోవచ్చు ఈతత్వం గల పిల్లలకు ఈ మందు మంచిటానిక్

దెబ్బలు తగిలిన కేసుల్లో ముందుగా ఫెర్రంఫాస్ వాడవలసివుంటుంది కముకుదెబ్బలు తగిలినా గాయాలయినా కోసుకుపోయినా ఈ మందు రోజుకు నాలుగుసార్లు చొప్పున వాడుకోవచ్చు. నొప్పి తగ్గిన తరవాత వాపు తగ్గడానికి కాలీమూర్ ఉపయోగించవలసి వుంటుంది గాయాలు తగిలి చీముపట్టినట్లయితే సైలీషియా ఇవ్వవలసివుంటుంది గడ్డలులాంటివి ప్రారంభమైన వెంటనే ముందుగా ఈ మందు వాడుకోవచ్చును

జ్వరాల కేసులన్నింటిలో ఆరంభంలో ఈ మందు వాడుకోవచ్చును సామాన్య జ్వరాలు టైఫాయిడ్ ఫ్లూ గొంతునొప్పి, ఆటలమ్మ దద్దు గవదబిళ్ళలులాంటి అంటువ్యాధుల ఆరంభదశలో వచ్చే జ్వరాలకు ఈ మందు వాడుకోవచ్చును ద్వాదశలవణచికిత్సలో ఏ ఇన్ఫెక్షనుకయినా ముందుగా వాడేమందు ఇదే

గొంతునొప్పి, జ్వరంతోబాటు ఛాతీలో నొప్పికూడా వుంటే ఫెర్రంఫాస్ కాలీమూర్ ఒకటిమార్చి ఒకటి వాడుకోవలసివుంటుంది మొదటి డోసు ఫెర్రంఫాస్ రెండవ డోసు కాలీమూర్ మళ్లీ మూడవ డోసు ఫెర్రంఫాస్- ఈవిధంగా నాలుగు గంటలకు ఒక డోసు చొప్పున వాడుకోవాలి

టైఫాయిడ్ ఆటలమ్మ గవదబిళ్ళల కేసుల్లో కూడా ఫెర్రంఫాస్ కాలీమూర్‌లు ఉపయోగపడతాయి ఫ్లూ నిమోనియా జ్వరాలలో ఫెర్రంఫాస్ నేట్రంసల్ఫ్ ఒకదాని తరవాత ఒకటిమార్చి ఇవ్వవలసి వుంటుందని డాక్టర్ కారీ సూచన ఫ్లూ జ్వరాలలో నేట్రంసల్ఫ్ మంచిమందని డాక్టర్ స్క్యూస్లర్ అభిప్రాయం

మూత్రావయవాల ఇన్ఫెక్షన్ ఆరంభదశలో ఫెర్రంఫాస్‌ను వాడుకొని అదే ఇన్ఫెక్షన్ మరల తిరగబెట్టినట్ల యితే కాలీమూర్ వాడుకోవలసివుంటుంది

సిఫిలిస్ గనేరియాలాంటి సుఖవ్యాధులలో ఆరంభదశలో ఫెర్రంఫాస్ గ్రంధులువాయడం వృషణాలలో నొప్పిలాంటి లక్షణాలు కన్పించినట్లయితే కాలీమూర్ వాడుకోవచ్చును

ద్వాదశలవణాలను వాడుకొనే విధానాన్ని వివరిస్తూ డాక్టర్ న్యూష్లర్ ఫెర్రంఫాస్ సైలీషియా కాల్కేరియాఫ్లోర్ మందులను 2x పొటెన్సీలోను మిగిలిన మందులను 6x పొటెన్సీలోను వాడుకోవడం మంచిదని సూచించాడు తరుణవ్యాధులలో ఈ మందులను గంట రెండు గంటలకొకడోసు చొప్పున వాడుకోవలసి వుంటుంది దీర్ఘవ్యాధులలో రోజుకు మూడు నాలుగు డోసులు వాడుకోవలసి ఉంటుంది

రక్తం తక్కువై పాలిపోయినట్లున్న వారు మొదటిగా కాల్కేరియాఫాస్ తరవాత ఫెర్రంఫాస్ వాడుకోవలసి వుంటుంది ఎర్రకణాల సంఖ్య అభివృద్ధికి కాల్కేరియా ఫాస్ తోడ్పడుతుంది ఊపిరితిత్తుల వద్ద ప్రాణవాయువును సేకరించి శరీరంలోని ధాతువులు కణాలు అన్నింటికీ ప్రాణవాయువును సరఫరా చేయడంలో ఫెర్రంఫాస్ పాత్ర అమూల్యమైనది

చిన్నపిల్లల తలనొప్పికిది ప్రత్యేకమైన మందు. రక్తపోటువల్ల చెవులలో హోరుమని శబ్దాలతో బాధపడుతున్నట్లయితే ఈ మందు వాడుకోవచ్చును

---

# 3 హెపార్‌సల్ఫ్

చీము పట్టిన పుళ్లు గడ్డలు తాకినా ఓర్చుకోలేరు పోట్లు
చల్లదనం ఒత్తిడి నొప్పి భరించలేరు
చెమటలు పడుతుంటాయి
గొంతులో నొప్పి టాన్సిల్స్‌వాపు చీము
గొంతులో గుచ్చుకుంటున్నట్లు నొప్పి
స్వరపేటిక వాపువల్ల విపరీతంగా దగ్గు (ఎకొనైట్ స్పాంజియా)
చెవిలో చీము చెవిలో గడ్డ గూబ చిట్లటం
గ్రంధులవాపు పోటు

హెపార్‌సల్ఫ్, నక్స్‌లాంటి మందులు ప్రతి ఇంట్లో వుంచుకోతగ్గ 5 6 మందుల మినీకిట్‌లో కూడా వుండతగ్గవి శస్త్రచికిత్సకునిలాగ ఉపయోగపడే మందు హెపార్‌సల్ఫ్ ఆపరేషన్ అవసరమయ్యే కేసులెన్నో ఈ మందుతో నివారించుకోవచ్చును గడ్డలు గాయాలు గాంగ్రీన్ రాచకురుపులాంటి వ్యాధులకు ఆపరేషన్‌తో పనిలేకుండా హెపార్‌లాంటి మందులు మీకు సహాయపడతాయి అవయవ ఛేదం చేయవలసివచ్చే కేసులలో కూడా అటువంటి అవసరం రాకుండా చేసే ఇలాంటి మందులు మినీకిట్‌లో వుండవలసిందే తరచుగా వచ్చే జలుబు దగ్గు స్వరపేటిక వాచి ఉక్కిరిబిక్కిరి చేసే కింకవాయువు (క్రూప్) లాంటి బాధలకు హెపార్‌సల్ఫ్ మీకు చాలా ఉపయోగపడుతుంది హోమియోవైద్యంలో ఈ ఔషధాన్ని ముందుగా ప్రవేశపెట్టినవాడు హానిమన్ హానిమన్ ఆయన ప్రియశిష్యుడు డాక్టర్ స్టాఫ్ ప్రభృతులు దీనిపై ప్రయోగాలు జరిపి ధర్మాలను రాబట్టారు

ఈ మందు సల్ఫర్ కాల్కేరియా ఔషధరాజాల సమ్మేళనం హెపార్‌సల్ఫ్ ధర్మాలలో అనేకం ఈ రెండు ఔషధాలను పోలివుంటాయి చర్మం జీర్ణమండలంలో జిగురుపొరలపై సల్ఫర్‌లాగాను ఊపిరితిత్తులపై కాల్కేరియా కార్బ్‌వలె కాలేయం మూత్రపిండాలపై మెర్క్యురీలాగాను హెపార్‌సల్ఫ్ ధర్మాలుంటాయని డాక్టర్ యాలెన్ స్థూలంగా క్రోడీకరించి వివరించారు

ఔషధాలలో ఎన్ని పోలికలున్నప్పటికీ ఆ ఔషధాన్ని పట్టిచ్చే విశిష్ట లక్షణాలు విచిత్ర లక్షణాలు ప్రత్యేకించి కొన్ని ఉంటాయన్న విషయం గమనించాలి సున్నితత్వం హెపార్‌రోగి ప్రత్యేకలక్షణం మానసిక శారీరక స్థాయిలలో ఈ లక్షణం కనిపిస్తుంది మానసిక శారీరక స్థాయిల్లో ఒకేరకమయిన ధర్మాలు వ్యక్తంకావడం మానవుని చైతన్యస్థాయిలో అర్థం చేసుకోవాలన్న విషయాన్ని గుర్తుచేస్తుంటాయి

హెపార్ రోగికి ఉద్వేగం హెచ్చు దిగపోతగా చెమటలు పడుతుంటాయి మాటల్లో దూకుడు అధికం చేష్టలలో కూడా అంతే ఎంత పెద్దపెద్ద వాక్యాలను కూడా గుక్కతిప్పుకోకుండా పూర్తి చేస్తాడు ఆవేశపరుడు

హత్యకు ఆత్మహత్యకు తేలికగా పాల్పడవచ్చు

సున్నితతత్వం గనుక శారీరకంగా చలికి తట్టుకోలేదు చల్లటిపొడిగాలి సోకినట్లయితే దగ్గు పట్టుకుంటుంది మాట కూడా బొంగురుపోతుంది తేమగాలి సోకినట్లయితే కీళ్లు బిగుసుకుపోవడం నొప్పులు వంటి బాధలు వస్తాయి వీటినే రుమాటిక్ నొప్పులని వ్యవహరిస్తారు

నొప్పిగా వున్నచోట ఏమాత్రం తాకినా ఈ రోగి భరించలేడు ఎవ్వరైనా చెయ్యి పెడతారేమోనని జాగ్రత్తపడతాడు డాక్టరు పరీక్ష చెయబోతే స్పృహతప్పిపోతాడు కూడా తాకితే నొప్పి చల్లటిగాలి కొంచెం కూడా తట్టుకోలేని సున్నితరోగి హెపార్‌సల్ఫ్ అని అంటాడు డాక్టర్ నాష్ వారు పడుకున్న గదిలోనేగాక పక్కగదిలో కిటికీతలుపులు తెరిచివుండి చల్లటిగాలి ఇంట్లో ప్రవేశిస్తున్నా ఈ రోగి తట్టుకోలేడు వెచ్చదనం చాలా హాయిగా వుంటుంది పగలు రాత్రి కూడా ఈ రోగి ఒంటిపై నిండుగా కప్పుకుంటాడు

ఎండుకుపోయినట్లుండే పిల్లలకు ఈ మందు తప్పక ఆలోచించాలి వీరికి ఏ తిండీ సహించదు జీర్ణశక్తి తక్కువ చర్మం కూడా ఆరోగ్యంగా వుండదు వళ్లంతా వాసనకొడుతూ వుంటుంది చల్లటిగాలి తగిలితే చాలు ఎప్పుడూ ముక్కు కారుతుంటుంది ఎక్కడా సంతోషం కనబడనే కనబడదు ఏదీ కావాలని వుండదు

చీమువట్టే సందర్భాలలో ఈ మందు ముందుగా ఆలోచించాలి సైలీషియా మెర్క్యూరీలను కలుపుకొని ఈ త్రయాన్ని చీము విషయంలో పరిశీలించవలసి ఉంటుంది గడ్డతేలకుండా ఎర్రగా వుండి చీము ఇంకా పట్టక బాధగా వుండే ఆరంభదశలో బెల్లడోనా మంచి మందు రెండవదశలో హెపార్‌సల్ఫ్ పెద్ద పొటెన్సీలో వాడుకోవడం మంచిది చీమ కారుతున్నట్లయితే అది పలచగా గవరగా వున్నట్లయితే సైలీషియా చిక్కగా వచ్చగా చీముకారుతుండే గడ్డలకు హెపార్‌సల్ఫ్ పనిచేస్తాయి హెపార్ దశ తరవాత సైలీషియా వాడదగిన మందు అని డాక్టర్ ఫారింగ్‌టన్ సూచించాడు గడ్డలుండి రాత్రిళ్లు అధికంగా గాదవడే రోగులకు మెర్క్యురీ తప్పక ఆలోచించవలసి వుంటుంది గడ్డలు మానినా మళ్లీ మళ్లీ తిరగబెడుతున్నట్లయితే సల్ఫర్ మంచి మందు

హెపార్‌రోగి చర్మం ఆరోగ్యంగా వుండదు ప్రతి చిన్నగాయం కూడా చీమువడుతుంది త్వరగా మానువట్టదు మోచేతి మోకాలి మడతల్లో సూకలలాగ చీము పొక్కులుండే చర్మవ్యాధుల నివారణకు హెపార్ మంచిమందు అంటాడు డాక్టర్ గరన్సే చర్మవ్యాధులపట్ల కూడా సున్నితతత్వం గుర్తుంచుకోతగ్గ విషయం గుడ్డ తగిలినా బాదపడతాడు సల్ఫర్ విషయంలో ఇది వర్తించదు హెపార్‌సల్ఫ్ రోగి చలిగాలి భరించలేడు సల్ఫర్‌రోగికి చల్లటిగాలి హాయిగా వుంటుంది హెపార్‌రోగికి కప్పుకుంటే హాయిగా వుంటుంది ఈ రోగికి చెమటలు ఎక్కువ సల్ఫర్‌రోగికి చెమటలంతగా పట్టవు హెపార్‌రోగి చురుకులు పోట్లతో బాధపడుతుంటాడు సల్ఫర్‌రోగి మంటలతో బాధపడుతుంటాడు చర్మవ్యాధుల రోగుల్లో హెపార్‌సల్ఫ్, సల్ఫర్ రోగులకుండే తేడాలను గమనించి వాడుకోవలసివుంటుంది

చలిగాలిసోకి స్వరపేటిక వాపుతో కూడిన క్రూప్ అని పిలిచే దగ్గుకు డాక్టర్ బోనింగ్‌హాసన్ ఎంచుకున్న మూడు మందుల్లో ఇది ఒకటి మిగిలిన రెండు మందులు ఎకొనైట్ స్పాంజియా

# 32 ఇపికాక్

**వివరీతమైన డోకులు వాంతులైన తరవాత కూడా వికారం తగ్గదు**

**పిల్లల్లో శ్వాసకోశబాధలు దగ్గు పిల్లికూతలు వికారం**

**ఛాతీలో గురగురలు వివరీతంగా వుంటే యాంటింటార్ట్**

**కోరింతదగ్గు వికారం వాంతులు ఫిట్సు తోడైతే ఇది మంచి మందు**

**రక్తస్రావం ఎక్కడనుంచైనా రక్తస్రావముండి వికారంతోడైతే ఈ మందు ఇవ్వాలి**

**వేవిళ్ళకు ఇది ముఖ్యమైనమందు**

**కొవ్వు పదార్థాలు తిన్న తరవాత అజీర్తి బాధలు (పల్సటిల్లా)**

ఇపికాక్‌లో నాలుక శుభ్రంగా వుంటుంది
వల్సటిల్లాలో నాలుకమీద మందముంటుంది
ఎమీబిక్ డిసెంటరీ వికారం

ఇది వృక్షసంబంధమైన మందు హోమియో వైద్యంలో ప్రత్యేక చరిత్ర కలిగిన సింకోనా వృక్షజాతికి దగ్గరగా వున్న చెట్టునుండి ఈ మందు తయారవుతుంది పిల్లలకు పెద్దలకు ఉపయోగకరమైనది

ఔషధాల మోతాదుల విషయంలో అల్లోపతి హోమియో వైద్యవిధానాలకు గమనార్హమైన తేడా వుంది ఔషధం మోతాదు ఏమేరకు పెంచితె రోగి మరణించదు అన్న విషయం అల్లోపతిలో ప్రాధాన్యత సంతరించు కొంటుంది ఏమేరకు ఔషధాన్ని బలపరిచి ఇస్తే రోగం నివారణ అవుతుందన్నది హోమియోలో ముఖ్యమైన విషయం పలచబరచిన మోతాదులనే పొటెన్సీలని పిలుస్తారు ఈ ఇపికాక్ విషయంలో అల్లోపతి వైద్యులు కూడా హోమియో వైద్యపద్ధతి అవలంబిస్తారు ఇది ఆసక్తికరమైన విషయం

ఇపికాక్ పెద్ద మోతాదులో వాడితే వాంతులవుతాయి ఒకటి రెండు చుక్కలు నీటిలో కలిపి ఇస్తే వాంతులవుతున్న రోగికి వాంతులు తగ్గిపోతాయి ఈ సత్యాన్ని గ్రహించి అల్లోపతి వైద్యులు కూడా సూక్ష్మమోతాదులో గర్భిణీ స్త్రీల వాంతుల నివారణకు వాడుతుండేవారు ఇదే సూత్రాన్ని మిగిలిన మందులకు కూడా అల్లోపతి వైద్యులు వర్తింపచేయకపోవడం దురదృష్టకరం అల్లోపతి వైద్యులు కూడా హోమియో పద్ధతిలో వాడే ఇపికాక్ మీ మినీకిట్‌లో వుండవలసిందే

దోకులు వాంతులు చోటుచేసుకున్న ఏ వ్యాధికైనా ఈ మందు ముందుగా ఆలోచించాలి దోకులు ఇపికాక్ రోగి ప్రధానమైన లక్షణం గర్భిణీస్త్రీల వాంతులకు ఇది ప్రత్యేకమైన ఔషధం వసరువాంతులవుతూ నీరసపడిపోయేవారికిది ఇవ్వాల్సి వుంటుంది తిన్న ఆహారం జీర్ణంగాక వాంతులవుతుంటాయి ఐస్‌క్రీం లాంటివి తిని బాధపడుతుంటే ఈ మందు ఆలోచించవచ్చు పూర్తిగా వాంతయినా దోకులు తగ్గవు ఇలాంటి రోగులకు ఆరంభదశలో పల్సటిల్లా మంచి మందు పల్సటిల్లా రోగులకు నాలుకమీద మందం కనిపిస్తుంది ఇది గమనించదగిన తేడా

పసిపిల్లలకు అజీర్తి కడుపునొప్పి విరేచనాలు మొదలైన బాధలున్నట్లయితే ఇపికాక్ వాడుకోవచ్చు. దంతాలు వచ్చే సమయంలో వచ్చే విరేచనాలకు వేసవిలో పట్టుకొనే విరేచనాలకు ఇపికాక్‌ను ఆలోచించాలి సకాలంలో ఈ మందు వాడితే వారికి ప్రమాదకరమైన డీహైడ్రేషన్‌రాదు వసరుతిత్తిలో రాళ్లు ఏర్పడి అజీర్తి కడుపునొప్పి వాంతులతో బాధపడేవారికి ఇపికాక్‌వాడి స్వస్థత చేకూర్చిన కేసులు నమోదైవున్నాయి కూడా

రక్తవిరేచనాలకు ఇపికాక్ దివ్యౌషధం రోగి దొడ్డికిపోయి బాగా ముక్కవలసి వస్తుంది ప్రతిసారి కొద్దిగా జిగురుమాత్రం పడుతుంటుంది వాంతి వచ్చినట్లుగా దోకులుంటాయి ఈ రోగికి దప్పివుండదు ఇది ఇపికాక్ విచిత్రలక్షణం

శ్వాసావయవాల బాధలకు కూడా ఇది మంచిమందు ఊపిరితిత్తిలో శ్లేష్మం కూడుకొని రోగి బాధపడుతుంటాడు ఊపిరాడక దగ్గు గాలిపీల్చుతుంటే గురగురలు దమ్ము చిన్నపిల్లలు కళ్లు తేలేసి బిగుసుకుపోవచ్చు ముఖం నల్లబడిపోతుంది ఈ లక్షణాలు కనిపించే కోరింతదగ్గు రోగికి ఇపికాక్ వాడవలసివుంటుంది

చిన్నపిల్లల్లో బ్రాంకైటిస్ కి ఇది మంచిమందు దగ్గు గురగురలు వాంతులు జ్వరం వున్నకేసుల్లో ఈ మందు ఆలోచించాలి వ్యాధి ఆరంభదశలో ఇపికాక్ వ్యాధిముదిరిన తరువాత యాంటిటార్ట్ ఆలోచించవలసి వుంటుంది

రక్తస్రావాన్ని అదుపుచేయడంలో ఇపికాక్ పాత్ర అనల్పం ఈ మందు లేకుండా నేను వైద్యవృత్తిచేయలేను అని అంటాడు డాక్టర్ కెంట్ ఎక్కడ రక్తస్రావమున్నా దోకులు కూడా తోడవుతాయి ఇది ఇపికాక్ రోగి విచిత్ర లక్షణం రక్తం ఎర్రగా వుంటుంది నిస్త్రాణ స్పృహ కోల్పోవచ్చు.

డాక్టర్ గరన్సే-ఇపికాక్ స్త్రీలకు ప్రసిద్ధమైన ఔషధంగా శ్లాఘిస్తాడు బహిష్టులు త్వరత్వరగా వస్తాయి రుతుస్రావం అధికం మైల కండలు కండలుగా అవుతుంటుంది పొత్తికడుపులో నొప్పి గర్భస్రావం అనుమానం వచ్చిన రోగులకు ఇపికాక్ తప్పక ఆలోచించాలి కాన్పయిన తరవాత రక్తం అధికంగా పోతుంటే ఈ మందు ఆలోచించాలి ఈ సందర్భంలో ఫాస్పరస్ ఎకోనైట్‌లను కూడా గుర్తుంచుకోవాలి ఎకోనైట్‌లో ప్రాణం పోతుందన్న భయం ఎక్కువ ఫాస్పరస్ ఐస్ నీళ్లకొరకు తపనబడతాడు కాన్పయిన తరవాత చాలారోజులకు

నల్లగా మైలపోతూ రోగి చిక్కిపోతుంటే సెకెలికర్ ఆలోచించాలి అధికరక్తస్రావంవల్ల పాలిపోయిన రోగుల రక్తవృద్ధికి చైనా మంచిమందు

జ్వరం కేసులన్నింటిలో ముందుగా ఇపికాక్ ఇవ్వాలని అంటాడు డాక్టర్ జార్ మలేరియాకు ఈ మందు వాడితే సింకోనాతో పనిలేదని ఆయన అభిప్రాయపడ్డాడు

# 33 కాలీకార్బ్

బొద్దుగా వుంటారు ముఖ్యంగా వృద్ధులు
ఒంటికి నీరు పట్టుతుంది
కంటిపై రెప్పలు సంచులులాగా ఉబికివుంటాయి నిస్సత్తువ
నడుములు పగలుగొట్టుకపోతుంటాయి
చెమటలు కొంచెం నడిచినా ఈ బాధలు ఎక్కువౌతాయి
రతి అనంతరం బాధలుద్రేకిస్తాయి
బహిష్టుల్లో మైల ధారాపాతంగా అవుతుంది
చీములాగా తెల్లకుసుమ ఎక్కువగా అవుతుంటుంది
బహిష్టులకు ముందు నీరసంగా కుంగిపోయి వుంటారు
తేలికగా జలుబు చేస్తుంది ఉబ్బసం
తెల్లవారుజాము 2-4 గంటల మధ్య బాధలెక్కువ
పడుకోలేరు ముందుకు వంగబడి కూర్చొంటారు

**కా**లీకార్బ్ పొటాసియం కర్బనాల సమ్మేళనం రసాయనికంగా పొటాసియం కార్బొనేట్ పొటాసియం శరీర కణాలన్నింటిలో వుండే ముఖ్యమైన పదార్థం నాడీకణాల్లో భాస్వరం తరవాత ఈ పదార్థమే ఎక్కువగా ఉంటుంది జీవకార్య నిర్వహణలో పొటాసియం పాత్ర అనల్పం

హానిమన్ తనపై మరొక ఆరుగురిపై దీనితో ప్రయోగాలు జరిపి హోమియో వైద్యంలో ప్రవేశపెట్టాడు ఇది దీర్ఘ వ్యాధులకు ప్రత్యేకమైన మందు తరుణ వ్యాధుల్లో కూడా ఉపయోగపడినా ఆ రోగుల బాధలకు మూలకారణం ఏ దీర్ఘవ్యాధో అయివుంటుంది

ఇది సాధారణంగా మధ్యవయసు దాటినవారికి ఆలోచించదగిన మందు కాల్కేరియా కార్బ్ రోగులలాగానే వీరు స్థూలకాయులు అయితే రక్తం తక్కువ పాలిపోయి ఉంటారు చల్లటి వాతావరణం గిట్టదు తేలికగా జలుబు చేస్తుంది వీరికి వ్యాధి నిరోధకశక్తి కూడా తక్కువే జీవితాన్ని అతిభారంగా గడుపుతుంటారు దీర్ఘకాలికంగా వ్యాధితో బాధపడుతూ ఉండవచ్చు మానసికంగా ఒక నిర్ణయానికి రాగలశక్తి వీరిలో లోపిస్తుంది జీవనసమరంలో క్షతగాత్రులు కావడమే దీనికి కారణం కావచ్చు ఒత్తిళ్లకు తట్టుకోలేక మానసికంగా శారీరకంగా సతమతమవుతూ వుంటారు వీరిది చాలా సున్నితమైన తత్వం మానసికంగా శారీరకంగా కూడా తేలికగా ఉద్వేగానికి గురవుతారు ముక్కోపి అది ద్వేషంతో కూడిన కోపం కాదు సహాయం పొందేవారివల్ల కూడా చిరచిరలాడిపోతుంటారు ఈ మానసిక సున్నితత్వం Hypersens t ve బలహీనతను సూచించే లక్షణం

శరీరంలో కూడా సున్నితత్వం బలహీనత స్పష్టంగా కనిపిస్తాయి తాకినా శబ్దం విన్నా ఉలిక్కిపడతాడు కొంచెం నొప్పివున్నా భరించలేడు ఇవి శారీరక సున్నితత్వాన్ని సూచించే లక్షణాలు బలహీనత కారణంగా తనపని కూడా ఇతరులమీదికి నెట్టడానికి ప్రయత్నిస్తాడు ఆ పనికాకపోయినా పట్టించుకోడు సందర్భానుసారంగా తాను నెరవేర్చవలసిన బాధ్యతలను స్వీకరించడు దీక్ష తక్కువ ఈ దుర్బలత్వానికి కారణాలు ముఖ్యంగా ఏదైనా దీర్ఘవ్యాధి కావచ్చు. అతిగా వ్యభిచరించడం కావచ్చు. కాలీకార్బ్ రోగి దుర్బలత్వానికి తోడుగా నిరాశ కూడా ఆవరిస్తుంది చిన్న బాధలు కూడా ఎంతో పెద్ద బాధలుగా కనిపిస్తాయి గోరంతలను కొండంతలుచేసి మనస్సు వికలం చేసుకునే తత్వం ఈ రోగిది ఈ వ్యాకులతతో ఎప్పుడూ చిరచిరలాడిపో

తుంటాడు నిరాశమూలాన ప్రతిదానికి మితిమించిన భయం అనుమానం పిల్లవాడు స్కూలు నుంచి మామూలుగా తిరిగివచ్చే వేళకు రాకపోయినట్లయితే ఏ యాక్సిడెంటో అయిందనో ఏదో ప్రమాదం జరిగిందనో ఆందోళన పడిపోతాడు కాలీకార్బ్ రోగి భయస్తుడు ఒంటరిగా వుండలేడు

దుర్బలత్వం అవయవాలలో కూడా ఏర్పడుతుంది గుండె బలహీనం రక్తప్రసారం సన్నగిల్లుతుంది డాక్టరుకు చూపిస్తే బి పి తక్కువగా ఉందని చెబుతాడు

కండరాలలో కూడా బలహీనత ఏర్పడుతుంది తన ఒళ్లు తాను మోసుకోలేడు కీళ్లనొప్పి, నడుంనొప్పి, రోడ్డుమీద నడిచేటప్పుడు నడుంనొప్పి బాధతో ఓర్చుకోలేక ఎక్కడైనా పడుకోవాలనిపిస్తుంది చెమటలెక్కువ దుర్బలత్వం నడుంనొప్పి, అధికంగా చెమటలు- ఈ మూడు కాలీకార్బ్ విచిత్ర లక్షణత్రయం అంటాడు ప్రసిద్ధ వైద్యుడు ఫారింగ్టన్ తిన్న తరువాత నడుంలో బాధలెక్కువవుతాయి

కాలీకార్బ్ రోగిచురుకులుపోట్లతోబాధపడుతుంటాడు శ్వాసావయవవ్యాధిలో ఛాతీలో ఇవిస్పష్టంగాకనిపిస్తాయి చురుకులు పోట్లకు బయోనియా కూడా మంచి మందు బయోనియా రోగి గాలిపీల్చినప్పుడే ఈబాధలుంటాయి కాలీకార్బ్ రోగికి గాలి పీల్చినప్పుడూ పీల్చనప్పుడూ కన్పిస్తాయి

కాలీకార్బ్ రోగులకళ్ల పై రెప్పలకు కనుబొమ్మలకు మధ్య నీరు కూడుకుని సంచిలాగా ఏర్పడుతుంది ఈ వాపు ఈ రోగుల విచిత్రలక్షణమని డాక్టర్ బోనింగ్‌హాసన్ అభిప్రాయపడ్డాడు ఇదే రకమైన వాపు ఏపిస్ లో కిందిరెప్పల అడుగు భాగంలో కనిపిస్తుంది

నిమోనియా కోరింత దగ్గు టి బి లాంటి ఊపిరితిత్తుల వ్యాధులున్న రోగులకు పై లక్షణా పై ఆధారపడి ఈ మందు వాడుకోవలసి వుంటుంది ఉబ్బసం రోగులకు ఇది దివ్యౌషధం రాత్రిళ్లు 2-4 గంటల మధ్య బాధ అధికంగా వుంటుంది రోగి ముందుకు వంగి కూర్చుంటాడు

వృద్ధులలో అజీర్తి పాండురోగంతో బాధపడేవారికీ మందు గుర్తుంచుకోవాలి గాస్ ఎక్కువ తిన్న తరవాత పొట్ట ఉబ్బరంగా వుంటుంది తిన్న తరువాత నీరసంగా వుండి నిద్ర ఆపుకోలేరు తినే సమయంలోనే నిద్రతూలుతూ వుంటుంది కాలీకార్బ్ అజీర్తి రోగులను గుర్తించడానికి ఈ లక్షణాలు ఉపయోగపడతాయి వీరికి తీపి పులుపు పదార్థాలంటే ప్రీతి మాంసం ఇష్టముండదు మలబద్ధకం హెచ్చు ఆసనం వెంట జిగురుపడుతుంటుంది మలలుంటే మంటపెడుతుంటాయి చన్నీళ్లతో తడిపితే మంట తగ్గుతుంది

స్త్రీలకు ఇది మంచి మందు జర్మనీలో ముడిరూపంలో దీనిని గర్భవిచ్ఛిత్తికి వాడుతుంటారని డాక్టర్ మర్జ్ రాశారు ఎక్కువ కాన్పులయిన స్త్రీలలో గర్భసంచి మడతపడటం జారిపోవడంలాంటి బాధలకు ఈ మందు వాడుకోవచ్చు. అయితే ఈ రోగిలో ముఖ్యాంశాలయిన నడుంనొప్పి, నీరసంలాంటి బాధలున్నవారికి ఈ మందు వాడుకోవలసి వుంటుంది

స్త్రీలలో బహిష్టులు త్వరత్వరగా వస్తుంటాయి ఎక్కువరోజులు అధికంగా రక్తస్రావం అవుతుంటుంది సాధారణంగా తెల్లకుసుమ ఎక్కువగా వుంటుంది చీము జిగురు కలిసివుంటాయి ఈ లక్షణాలు గర్భసంచి కణుతు (ఫైబ్రాయిడ్ లున్న రోగులకు ఈ మందు వాడి ఆపరేషన్ నివారించవచ్చు.

స్త్రీ పురుషులలో రతిసల్పిన తరువాత అన్ని బాధలు ఉద్రేకిస్తాయి ఇది ఈ మందు విచిత్ర లక్షణం కాలీకార్బ్ రోగులకు ఆర్సెనికం ఆల్బ్, సెపియా రోగులకు చాలా లక్షణ సామీప్యముంటుందని గమనించాలి

# 34 లాకిసిస్

రక్తపోటు గుండెజబ్బు, బిగపట్టినట్లు బాధలు
ఎడమవైపు పక్షవాతం
రక్తస్రావం ముఖ్యంగా కాన్సర్‌లో రక్తస్రావం
బహిష్టులు ఆగిపోయే సమయంలో బాధలు
మైల ఎక్కువ కావడం గుండెదడ

ఒళ్లంతా వెచ్చటి ఆవిర్లు మాడుపోటు
కిటికీలు మూసిన గదిలో కూర్చోలేరు బట్టలు వదులు చేసుకోవాలనిపిస్తుంది
బాధలన్ని ఎడమవైపు నిద్రలో బాధలు అతిశయిస్తాయి
అసూయాపరులు వాగుడుకాయలు
టాన్సిల్స్‌వాపు వేరికోజ్ వెయిన్స్ వడదెబ్బ

లాకిసిస్‌ను సుప్రసిద్ధ అమెరికన్ వైద్యశాస్త్రవేత్త డాక్టర్ కాన్‌స్టాంటయిన్ హెరింగ్ హోమియోవైద్యంలో 828లో ప్రవేశపెట్టాడు హానిమన్ అనుయాయులలో ఈయనకు మంచిపేరు ప్రఖ్యాతులున్నాయి సారూప్యతాని యమం సూక్ష్మతానియమం హానిమన్ కనిపెట్టిన గొప్ప ప్రకృతి నియమాలు ఆ తరువాత అంతగొప్ప స్వస్థతా నియమాన్ని కనిపెట్టిన ఘనత ఈయనకే దక్కుతుంది

లాకిసిస్‌పై ప్రయోగాలు జరిపి డాక్టర్ హెరింగ్ చారిత్రక పురుషుడయ్యాడు లాకిసిస్‌ను బ్రెజిల్‌లోని సురుకుకు అని పిలిచే తాచుపాము జాతికి చెందిన విషసర్పం గరళం నుండి తయారుచేస్తారు వృత్తిరీత్యా పాములను పట్టే వాళ్లు కూడా ఈ పామును పట్టుకోవడానికి భయపడిపోతుంటే తానే స్వయంగా పట్టి గరళం సంపాదించి దానిపై ప్రయోగాలుచేసిన త్యాగపురుషుడు హెరింగ్ వైద్యచరిత్రలో ఈయన పేరు సువర్ణాక్షరాలతో లిఖింపతగినది ఈ పాము గరళాన్ని సంపాదించే ప్రయత్నంలో ఆయనకు స్పృహతప్పి, పునర్జన్మ పొందినంత పని అయింది లాకిసిస్ సినసైన పాలీక్రెస్ట్ ఔషధమని డాక్టర్ నాష్ శ్లాఘించాడు శతాంశగుణక పద్ధతిలో 3వ పొటెన్సీ దాటిన తరువాత ఎంతటి విషంకూడా అమృతతుల్యమైన ఔషధమని స్వయంగా ప్రయోగాత్మకంగా రుజువుచేసి చూపెట్టాడు హానిమన్ ఇంత చరిత్ర కలిగిన లాకిసిస్ మీ మినీ కిట్‌లో ఉండదగిన మందు

పసి పిల్లలకు వృద్ధులకు ముఖ్యంగా స్త్రీలకు ఈ మందు ఎంతో ఉపయోగపడుతుంది విషజ్వరాలకు (సెప్టిసిమియా) ఇది బాగా పనిచేస్తుంది ఒళ్లుచల్లబడిపోయి నాడికూడా అందకుండా వున్న రోగులకు గరళం వాడటం మనకు తెలిసిన విషయమే టైఫాయిడ్‌లాంటి జ్వరాలలో బాప్టీజియా బ్రయోనియాల తరువాత వాడదగినమందు లాకిసిస్

హోమియో ఔషధాలను విచిత్రలక్షణ సమష్టి (Symptom totality)పై వాడటం విధాయకమైన విషయం లాకిసిస్ రోగిని పట్టిచ్చే కొన్ని విచిత్రలక్షణాలు వున్నాయి వాటిలో మొదటగా చెప్పుకోతగినది - ఈ రోగికి నిద్రపోయి లేచిన తరువాత బాధలన్నీ ఉద్రేకిస్తాయి నిద్ర వీరి పాలిట శని నిద్రపట్టిన తరువాత బాధలు ఎక్కువై నిద్రలేచే రోగికి ముందుగా లాకిసిస్‌ని ఆలోచించాలి రక్తపోటు రోగి పడుకుని నిద్రపట్టిన తరువాత దడ ఆయాసం వచ్చి లేచి కూర్చోవలసివస్తే ఆ రోగికి ఇవ్వదగిన మందు లకిసిస్ దడ తలతిప్పుడు బాధపడే రోగులకు నిద్రపోయి లేచిన తరువాత బాధలు మరింత ఎక్కువవుతున్నాయని తెలిసినప్పుడు లాకిసిస్ తప్పక ఆలోచించాలి నిద్రపట్టాలంటే మానసిక శారీరకస్థాయిల్లో అనుకూలమైన మార్పులు రావాలి బాగా నిద్రప ట్టిందని రోగిచెబితే అంతర్గతంగా సానుకూల పరిస్థితులు నెలకొన్నవని నిర్ధారించుకోవచ్చు నిద్రపోయే సమయంలో శరీరంనుండి కల్మషాలన్నీ విసర్జనమవుతాయి ఆహారంలేకుండా జీవించగలిగినన్ని రోజులు నిద్రలేకుండా జీవించలేరన్న విషయం గమనార్హం నిద్రలేవగానే గాబరాగాబరాగావుండి టైముకూడా తెలియని వ్యక్తికి లాకిసిస్ మంచి మందు లాకిసిస్‌లో నిద్రమూలకంగా వచ్చే బాధలు శారీరకమైనవి నిద్రలోలేచి దడుచుకుని ఏడ్చేపిల్లలకు మంచి మందు బెల్లడోనా ఇది మానసిక లక్షణం ఇదే లక్షణం మాటిమాటికీ వస్తున్నట్లు పిల్లల్లో గమనించడం జరిగితే కాల్కేరియా కార్బ్ వాడవలసి వుంటుంది జీవకార్య నిర్వహణలో ఆకలి నిద్రలపాత్ర అనల్పం జీవికెంతో ముఖ్యమైన నిద్ర లాకిసిస్ రోగికి శనిగా పరిణమిస్తే ఆశ్చర్యం ఏముంది?

స్రావాలు లాకిసిస్ రోగివట్ల వరాలుగా పరిణమిస్తాయి ఉదాహరణకు బహిష్టు రాబోయేముందు బాధలుండి బహిష్టు కనపడగానే బాధలన్నీ తీసివేసినట్లు పోతుంటే లాకిసిస్ వాడాలి దీనినే డిస్మెనోరియా అని వ్యవహరిస్తారు దీని నివారణకు చిన్న ఆపరేషను కూడా చేయడం జరుగుతుంది పై లక్షణం స్పష్టంగా

కనపడి రోజులు లాకిసిస్ వాడి బాధ నివారించవచ్చు నెలానికి బహిష్టురాక బాధలు వుంటూ బహిష్టురాగానే బాధలు తగ్గిపోయే రోగులకు లాకిసిస్ ఉపయోగపడుతుంది

లాకిసిస్ రోగుల నాడీమండలంలోనూ రక్తప్రసారంలోనూ అస్తిమిత లక్షణాలు అధికంగా కనిపిస్తాయి వీరు స్పర్శ భరించలేరు కట్టుకున్న బట్టలు ఒంటికి తగిలితే కూడా భరించలేరు చీర లూజ్‌గా కట్టుకోవాలని పిస్తుంది కొట్టవారి ధ్వనులను కూడా ఓర్చుకోలేరు

రక్తప్రసారంలో అస్థిమితంవల్ల వీరికి ఒంటిలో ఆవిర్లు చెమటలు కనిపిస్తాయి బహిష్టులు ఆగిపోయిన ప్పుడు ఈ లక్షణం అధికంగా కనపిస్తుంది ఈ బాధల నివారణకు ఈస్ట్రోజన్ హార్మోన్ ఇచ్చి ఈస్ట్రోజన్ రిప్లేస్‌మెంట్ థెరపి అని వ్యవహరిస్తుంటారు ఈ రకమైన చికిత్స కాన్సర్‌కి దారితీయవచ్చు. ఈ రకమైన రోగు లకు లాకిసిస్ దివ్యౌషధమని చెప్పవచ్చు. చికిత్స సున్నితమైనదిగా సాగాలన్నది హోమియో వైద్యసిద్ధాంతం

లాకిసిస్ రోగుల్లో బాధలు ఎడమవైపు ఎక్కువ ఇది విచిత్రమైన ప్రధానలక్షణం లైకోపోడియం రోగుల్లో బాధలు కుడివైపున వుంటాయి ఈ రకమైన లక్షణాలు ఔషధాలకు కూడా వున్నాయి పాము ఎడమనుండి కుడివైపునకు చుట్టుకుని పడుకొంటుంది లాకిసిస్ లక్షణాలు కూడా ఎడమపక్క ప్రారంభించి కుడివైపునకు చేరుకుంటాయి పాము తత్వమే పాము గరళానిది లాకిసిస్ పిల్లల్లో కంఠవాపు వ్యాధి ఎడమవైపు ప్రారంభించి కుడివైపునకు వ్యాపిస్తుంది వ్యాధిలో ఈ లక్షణం గమనించినప్పుడు లాకిసిస్ వాడాలి లాకిసిస్ రోగులు వెచ్చదనాన్ని భరించలేరు వేడిపదార్థాలు తినలేరు వీరిది వేడితత్వం వీరిని హాట్ రోగులుగా పరిగణిస్తారు ఆర్స్ ఆల్బ్, నక్స్ వామికా రోగులకు వెచ్చదనం కావాలి ఈ రోగులది చలితత్వం సాంకేతికంగా వీరిని చిల్లీ రోగులుగా వ్యవహరిస్తారు ఔషధాలను ఎంపికచేసేటప్పుడు రోగులను హాట్ చిల్లీ పేషంట్లుగా విశ్లేషించి మందులు వాడటం హోమియో వైద్యవిధానం ఔషధాలను మానవులపై ప్రయోగించి వాటి ధర్మాలను రాబడతారు గనక హాట్ చిల్లీ ఔషధాలుగా విశ్లేషించి వాడటం జరుగుతుంది వ్యాధి ఒకటే అయినా తత్వానుగుణంగా వేరువేరు మందులు ఇవ్వవలసి వుంటుంది

లాకిసిస్ ఎండవల్ల వచ్చే బాధలకు ప్రత్యేకమైన మందు వడదెబ్బకు గ్లోనయిన్ లాకిసిస్‌లు మంచి ఔషధాలు వడదెబ్బకు ముందుగా గ్లోనయిన్ వాడి తరువాత లాకిసిస్‌ను వాడుకోవచ్చును

లాకిసిస్ మానసిక స్థాయిని కుమిలే అగ్నిపర్వతంతో పోల్చవచ్చు దీర్ఘకాలంగా దు ఖానికి గురైనవారు కావచ్చు ప్రేమ వ్యవహారంలో విఫలమైనవారు కావచ్చు - దు ఖభారంతో కుంగిపోతూ మధ్య మధ్య క్రోధాన్ని వెళ్ళగక్కుతూ వుండె స్వభావం లాకిసిస్ రోగిది మానసికంగా కుంగిపోయి కోపానికి గురయ్యేవారికి ఆలోచించవలసిన మందులు ఆర్స్ లాకిసిస్‌లు దు ఖభారంతో జీవించే వ్యక్తులకు తాగుబోతులకు బహిష్టులాగిపోయిన స్త్రీలకు లాకిసిస్ ప్రత్యేకమైన మందు

లాకిసిస్ రోగులు స్వార్థపరులు గర్వపోతులు అసూయ ద్వేషం అనుమానాలతో వీరు అగ్నిపర్వతంలాగా కుమిలిపోతుంటారు ఎవ్వరేమి మాట్లాడుకొంటున్నా తమను గూర్చి మాట్లాడుకొంటున్నారని అనుకొంటారు తమని చంపడానికి అందరూ పథకాలు వేస్తున్నారని అనుమానిస్తుంటారు మందులో విషం కలిపివుంటారని మందు తీసుకోవడానికి కూడా సందేహిస్తుంటారు పారానోయియా అని వ్యవహరించె మానసిక రోగుల కిది మంచి మందు భర్త శీలాన్ని ఎప్పుడూ శంకిస్తూ వుంటారు భర్త ఆఫీసులో పనిచేసే ఆడవాళ్లంటే అసూయ పడుతుంటారు ద్వేషిస్తారు భార్య లాకిసిస్ రోగి అయితే ఆ భర్త జీవితం యమ యాతనే

లాకిసిస్ రోగులు దిగులు దు ఖంతో కుంగిపోతున్నా మధ్య మధ్య కోపంతో చెలరేగిపోతుంటారు వసపిట్టలాగా వాగుతుంటారు మాటలు దొర్లిపోతుంటాయి మాట్లాడేటప్పుడు ఒక వాక్యం పూర్తికాకుండానే మరొక వాక్యం మొదలుపెడతారు లాకిసిస్ మనస్తత్వంగల మనిషి నలుగురిలో వున్నప్పుడు ఇతరులు ఏ విషయాన్ని గురించీ మాట్లాడే అవకాశం దొరకదు హిస్టీరియా రోగులకు కూడా మానసికస్థితిని గమనించి ఈ మందు వాడవచ్చును

స్పృహతప్పి పడిపోవడం లాకిసిస్ రోగులలో తరచు గమనించె విషయం ఇది నాడీ మండల బలహీనతను సూచించె లక్షణం ఈ రోగికి మానసికంగా శారీరకంగా కూడా నిస్త్రాణ వుంటుంది ఉదయం నిద్రలేవగానె మరీ

నిస్త్రాణగా ఉంటుంది తలతిప్పు దేకు వుండవచ్చు. పక్షవాతానికి కూడా గురి అవుతుంటారు ఎడమపార్శ్వం వడిపోవడం లాకిసిస్ రోగి ప్రత్యేక లక్షణం రాత్రుళ్లు నిద్రలో మూర్ఛలతో బాధపడుతుండే రోగులకు లక్షణ సమష్టిపై ఆధారపడి ఈ మందును వాడవచ్చు

రక్తపోటువున్న రోగులు తాగుబోతులు తరచుగా తలనొప్పితో బాధపడుతుంటే ఈ మందు ఆలోచించవచ్చు. తల పగిలిపోతున్నట్లు బాధపడతారు ఎడమపార్శ్వంలో బాధ అధికంగా వుంటుంది తాకిడికి వత్తిడికి బాధ ఎక్కువ అవుతుంది నిద్రపోతే హాయిగా వుండడానికి బదులు తలనొప్పి మరింత ఎక్కువ అవుతుంది ఈ రకమైన బాధలున్న రోగులకు లాకిసిస్ చాలా ప్రయోజనకరమైన మందు

లాకిసిస్‌కు నాడీమండలంపై లాగానే జీర్ణమండలంపై కూడా అనల్పమైన ప్రభావంవుంది నోట్లో చిగుళ్లువాచి రక్తం పడుతుండవచ్చు. నోరు దుర్వాసనగా వుంటుంది ఉమ్మి జిగురుగా వుంటుంది ఈ రకమైన బాధలున్న రోగులకు మెర్క్‌సాల్‌కూడా ఆలోచించదగిన మందు మెర్క్‌సాల్ వాడాక బాధలు తగ్గనట్లయితే లాకిసిస్ వాడాలి

గొంతులో బాధలకు టాన్సిల్స్‌కు ఈ మందు పనిచేస్తుంది కంఠవాపు (డిఫ్తీరియా కు లాకిసిస్ మెర్క్‌సైనైడ్ మందులు వాడితే ఏ వాక్సిన్‌తోనూ అవసరం వుండదని డాక్టర్ ఎం ఎల్ టైలర్ అభిప్రాయపడ్డారు వెచ్చని పదార్థాలు వెచ్చని వాతావరణం లాకిసిస్ రోగికి గిట్టవన్న విషయం గుర్తించుకోవాలి గొంతుచుట్టూ గుడ్డ కూడా తాకనివ్వరు నిద్రపోయి లేచిన తరువాత గొంతుబాధలు కూడా ఎక్కువ అవుతాయి ఈ రకమైన గొంతుబాధతో కూడిన టైఫాయిడ్ నిమోనియాలాంటి ఏ బాధలనైనా లాకిసిస్ వాడి నివారించవచ్చునని అనుభవపూర్వకంగా చెప్పాడు డాక్టర్ నాష్ లాకిసిస్ రోగుల్లో నాలుక స్వాధీనం తప్పుతుంది వణుకు ఎక్కువగా వుంటుంది నీళ్లు ఇస్తే తాగలేడు గొంతుమింగుడు పడదు ఫిట్స్ కూడా రావచ్చును పిచ్చికుక్క కరిచిన తరువాత వచ్చే రేబిస్ వ్యాధిలో ఇలాంటి లక్షణాలున్న రోగులకు లాకిసిస్ వాడవచ్చు

ఈ రోగులకు గాస్ ఎక్కువ పొట్ట ఉబ్బరంగా వుంటుంది బట్టలు వదులుచేసుకోవాలనిపిస్తుంది లివర్ పెద్దది కావచ్చు. గుండెజబ్బు కూడా వుండి లివరు పెద్దదయి నీరు చూపి శరీరం కూడా నీలంగా మారిపోయిన రోగులకు లాకిసిస్ ఎంతో మేలు చేసినట్లు గమనించారు

విరేచన బద్ధకం మొలలు రక్తం జిగురుతో కూడిన విరేచనాలు వుండే రోగులకు కూడా లాకిసిస్ బాగా పనిచేస్తుంది

స్త్రీ జననేంద్రియ వ్యాధులకిది ప్రత్యేకమైన మందు బహిష్టులు ఆగిపోయిన తరువాత స్త్రీలకు ఉపయోగపడే మందులలో సల్ఫర్ సెపియాలతోబాటు ఇది కూడా వుంది బహిష్టు అలస్యంగా రావచ్చు. మైలకావడం తక్కువ నల్లగా వుంటుంది బహిష్టు రాబోయేముందు తెల్లకుసుమ చిక్కగా అవుతుంటుంది ఒరుసుకుపోయినట్లు బాధగా వుంటుంది బహిష్టు రాబోయేముందు విరేచనాలు కావచ్చు. రాబోయేముందు బాధలు అధికంగావుండి బహిష్టు రాగానే తగ్గిపోయేవారికి తప్పక పనిచేస్తుంది ఋతుస్రావం ఆగిపోగానే మళ్లీ బాధలు ప్రారంభం అవుతాయి ఈ తత్వంగల స్త్రీలకు లాకిసిస్ దివ్యౌషధం

అండకోశం గర్భసంచి వ్యాధులకు కూడా ఇది బాగా పనిచేస్తుంది ఎడమవైపు అండకోశవాపు కాన్సరుకి కూడా ఇది ప్రయోజనకారి గర్భసంచి బాధలు కూడా ఎడమవైపు ప్రారంభించి కుడివైపునకు వ్యాపిస్తుంటాయి గర్భసంచి పెద్దదయి జారివుండవచ్చు. ఋతుస్రావం అధికంగా వుండవచ్చు ఆవిర్లు చెమటలు అధికంగా వుండవచ్చు. తలనొప్పి కూడా వుంటుంది బహిష్టులాగిపోయేవారిలో ఆగిపోయినవారిలో వచ్చే బాధలకు లాకిసిస్ మంచి మందు ఈ దశలో సెక్స్‌వాంఛ కూడా అధికంగా వుండవచ్చు.

తీవ్రమైన గడ్డలు గాంగ్రీన్‌లాంటి వ్యాధుల్లో పుండ్లుపడి రక్తం ఎక్కువగా పోయేవారికి ఆలోచించవలసిన మందు లాకిసిస్ చర్మం నీలిరంగులో వుంటుంది గడ్డలచుట్టూ చర్మం నల్లగా వుంటుంది దుర్వాసనతో కూడి గపరగావుండే స్రావం కూడా వుండవచ్చు.

టైఫాయిడ్ జ్వరంలో రెండోవారం మూడోవారంలో ఉపయోగించే మందు లాకిసిస్ రోగికి డెలీరియం వుంటుంది గొణుగుతుంటాడు విరేచనంలో రక్తం కనిపించవచ్చు. నాలుకలో వణుకు నల్లగా పొడిగా వుండవచ్చు. రోగి చాలా బలహీనంగా వుంటాడు అంత్యదశ అనిపించవచ్చు.

# లైకోపోడియం

అజీర్తి, గాస్ పొట్ట ఉబ్బరం
ఆకలి ఉంటుంది ఎక్కువ తినలేరు
తీపి ఇష్టంగాతింటారు కాని నరిపడదు
తిన్న ఆహారం అంతా గాస్‌గా మారిపోయి అపానవాయువులు ఎక్కువ
దీర్ఘకాలికంగా లివర్ జబ్బు శుష్కించివుంటారు
జ్ఞాపకశక్తి నన్నగిల్లుతుంది ఆత్మవిశ్వాసం కోల్పోతారు
అకాలవార్ధక్యం నపుంసకత్వం
స్త్రీలలో యోని పొడారి రతి బాధాకరంగా ఉంటుంది

లైకోపోడియం రోగి గంభీరంగా వుంటాడు ఎవరినీ లక్ష్యపెట్టడు ప్రతి చిన్న విషయానికీ ఉద్రేకపడిపోతాడు ఎదురు చెప్పడానికి వీల్లేదు ఈ రోగి నన్నగా వుంటాడు ఈ లక్షణాలు నక్స్‌వామికా లో కూడా కనిపిస్తాయి మానసికంగా ఈ ఇద్దరిలో పోలికలు కనిపిస్తాయి అయినా కొన్ని తేడాలు లేకపోలేదు లైకోరోగి తప్పులు వెదికి తగాదా పెట్టుకుంటాడు నక్స్‌రోగి ఒట్టి కోపిష్ఠి మాత్రమే అజీర్తి మలబద్ధకం వీరిద్దరిలో సామాన్య లక్షణం లైకోరోగిలో పుల్లటి తేపులు ఎక్కువ నక్సురోగికి నోరు చేదు

ఈ రోగిలో ద్వేషం పిరికితనం స్పష్టంగా కన్పిస్తుంటాయి దిగులు ఎక్కువ ఎప్పుడూ ఏదో ఆలోచిస్తుంటాడు ముందుగానే ముసలితనం వచ్చేస్తుంది నుదుటిమీద ముడతలు కన్పిస్తాయి ఎవరైనా కృతజ్ఞతలు తెలిపితే లైకోరోగి కంట తడిపెడతాడు నేట్రంమూర్ రోగికి సానుభూతి తెలిపితే కళ్లనీళ్ళు కారిపోతాయి అవయవం కన్నా అవయవి ప్రధానం అనడానికిదే నిదర్శనం

పొట్టలో గాస్‌తో బాధపడే వారికి లైకోపోడియం మంచిమందు శాకాహారుల అజీర్ణానికి బాగా పనిచేస్తుంది అతిగా తినడంవల్ల ముఖ్యంగా బంగాళాదుంపలు తీపి పదార్థాలు తినడం వలన వచ్చే గాస్‌కి ఇది వాడుకోవాలి ఈ రోగి తీపి అంటే చాలా ఇష్టపడతాడు మాంసం గిట్టదు పొత్తికడుపు వుబ్బి వుంటుంది పొట్టలో గుడగుడలు అన్నం తిన్న వెంటనే బాధలు మొదలవుతాయి నక్సురోగుల్లో అన్నం తిన్న ఒక గంట తరవాతగాని బాధలు మొదలుకావు పొట్టలో గాస్‌కి చైనా కార్బోవెజ్ కూడా ముఖ్యమైన మందులే చైనా రోగికి జీర్ణశక్తి తక్కువ తిన్నదంతా గాస్‌గా మారిపోతున్నట్లు బాధలు గాలి పీల్చుకోవడం కూడా కష్టమయిపో తుంది కానీ వేళకాగానే భోజనానికి తయారవుతాడు ఇది చైనారోగి విచిత్ర లక్షణం కార్బోవెజ్ రోగికి పొట్ట పైభాగం ఉబ్బరించి వుంటుంది చైనా రోగికి పొట్టంతా ఉబ్బరమే కార్బోవెజ్‌లో పడుకుంటే బాధలు ఎక్కువ అవుతాయి

లైకోరోగి ఆకలితో భోజనానికి కూర్చుంటాడు కొంచెం తినడంతోనే పొట్టనిండినట్లనిపిస్తుంది మళ్ళీ గంటకే ఆకలేస్తుంది పొట్టలో కుడివైపు పైభాగం నొప్పి ఈ రోగిలో లివరు జబ్బులెక్కువ తాగుబోతుల్లో లివరు దెబ్బతిని ముడుచుకుపోయినట్లయితే ఇది మంచి మందు లివరు దెబ్బతిని పెరిగినట్లయితే చైనా ఆలోచించాలి లివరు ముడుచుకుపోయి పొట్టలో నీరు కూడా చేరితే జలోదరం అని వ్యవహరిస్తాం జలోదరానికి లైకోపోడియం ప్రత్యేకమైన మందు పనరుతిత్తిలో రాళ్ళు కొన్సరు కణుతులు వచ్చుకామెర్లుఉన్న రోగులకు ఈ మందు పనిచేస్తుంది

మలబద్ధకం మలద్వారం ముడుచుకుపోయి విరేచనం ఇరికిరికి అవుతుంది పసిపిల్లల్లో విరేచన బద్ధకానికి ఇది ప్రత్యేకమైన ఔషధం హస్తప్రయోగానికి లోనయినవారికీ ఎక్కువగా స్వప్న స్థలనాలకు లోనయినవారికి వచ్చే మలబద్ధకానికీ బాగా పనిచేస్తుంది నక్సురోగులకు కూడా మలబద్ధకం ఎక్కువ విరేచనం సాఫీగా కానందువల్ల ఎక్కువసార్లు వెళ్ళవలసి వస్తుంది

అతిమూత్రవ్యాధికి మంచి మందు ఈ వ్యాధిగ్రస్తులు నీళ్ళు ఎక్కువగా తాగుతుంటారు మూత్రావయవాల్లో

ఇన్ఫెక్షన్ మూత్రావయవాల్లో రాళ్ళు చేరితె ఈ మందు వాడాలి మూత్రంలో వచ్చే మార్పుల మూలంగా లవణాలు పేరుకుని రాళ్ళుగా మారుతుంటాయి లైకోపోడియం వాడినప్పుడు రోగిక స్వచ్ఛత చేకూరి మూత్రం మార్పుచెందడం వలన మూత్రావయవాల్లోని రాళ్లు కరిగిపోతాయి

నపుంసకత్వానికిది ముఖ్యమైన మందు అతిగా కామకలాపాల్లో పాల్గొనడంవల్ల హస్తప్రయోగానికి గురయిన వారికి ఇది ప్రత్యేకమైన మందుగా గుర్తుంచుకవాలి స్త్రీలలో యోని పొడారివుంటుంది రతిలో మంట రతి తరవాత కూడా బాధపడతారు వారికి మందు ఉపకరిస్తుంది ఈ సందర్భంలో నేట్రంమూర్ కూడా గుర్తుంచుకోవాలి తత్వాన్నిబట్టే ఈ మందులు వాడవలసి వుంటుంది

రుతుస్రావం అధికంగా ఎక్కువరోజులపాటు అవుతుంటుంది తెల్ల మైల ఎక్కువ తొడలు ఒరుసుకుపో తుంటాయి గర్భసంచిలో కణుతులు గర్భిణీస్త్రీలలో అన్నహితవులేనివారికి వేవిళ్లకు ఈ మందు పనిచేస్తుంది ఈ రోగుల్లో శ్వాసావయవాల బాధలు అధికం ముక్కులు పొడారిపోయి నోటితో గాలిపీలుస్తుంటారు గొంతులో టాన్సిల్స్ వాచివుండవచ్చు కంఠవాతానికిది మంచిమందు బాధలు కుడినుంచి ఎడమవైపుకి వ్యాపిస్తాయి వేడి ద్రవపదార్థాలు పుచ్చుకొంటె బాధ ఉపశమిస్తుంది నోరు కూడా పొడారివుంటుంది లాకిసిస్ రోగిలో బాధలు ఎడమవైపు ప్రారంభమవుతాయి దగ్గుకిది మంచి మందు నిమోనియా క్షయగా మారితే ఇది ప్రత్యేకమైన మందని డాక్టర్ డ్యూయీ చెప్పాడు ఎడతెరిపిలెని దగ్గు దుర్వాసనతో కూడిన కళ్ళె నోరంతా ఉప్పన రాత్రులు చెమటలు అరికాళ్ళు అరిచేతుల్లో మంటలు మలబద్ధకం రోగి శుష్కిస్తాడు ఈ లక్షణ సముదాయాన్ని నివారించగల మందు లైకోపోడియం

ఈ మందుని ఒక రకం నాచునుంచి తయారు చేస్తారు హానిమన్ మరో ఏడుగురితో కలిసి దీనిపై ప్రయోగాలు జరిపి ధర్మాలను రాబట్టి హోమియో వైద్యంలో ప్రవేశపెట్టాడు ఈ మొక్కలు బీజాణువుల పొడిలాగ ఉంటాయి ఈ పొడిని గాయాలమీద చల్లడానికి మాత్రలు కట్టుకోడానికి ఉపయోగించేవారు హానిమన్ ఆవిష్కరించిన శక్తిగుణీకరణ ప్రక్రియ ద్వారా ముడిరూపంలో జడపదార్థాలుగా పరిగణించే బొగ్గు ఇనుకలాంటి పదార్థాలను సైతం దివ్యౌషధాలు గా మలచారు ఈ విధంగానే మలచిన లైకోపోడియం ఔషధధర్మాలు 2వ పొటెన్సీ తరవాతనే ఆవిష్కరింపబడ్డాయి

సల్ఫర్ కాల్కేరియాకార్బ్ లైకోపోడియం హోమియో వస్తుగుణదీపికలో ఔషధరాజత్రయం

వ్యాధి ఏ దశకు చెరుకున్నా లైకోపోడియం నివారించగలదు సోరా సైకోసిస్ సిఫిలిస్ అనేవి వ్యాధి దశను వివరించే సాంకేతిక పదాలు లైకోపోడియం యాంటీసోరిక్ యాంటీసైకోటిక్ యాంటీసిఫిలిటిక్ ఔషధం అన్నమాట శరీరంలోని ధాతువులన్నింటిని ఈ మందు ప్రభావితం చేస్తుంది ఈ రకమైన మందులను పాలీక్రెస్ట్ లని వ్యవహరిస్తారు

జిగురుపొరలపై mucous membrane ఈ మందు ప్రభావం ఎక్కువగా ఉంటుంది జిగురు పొరలు అనగానే జీర్ణమండలం శ్వాసావయవాలు మూత్రావయవాలు జననేంద్రియాలు గుర్తొస్తాయి ఊపిరితిత్తుల వ్యాధులకు లివర్ జబ్బులకు లైకోపోడియం చక్కగా పనిచేస్తుంది పసిపిల్లల వృద్ధుల అనారోగ్యానికి ఇది మంచి మందు జీవితం ఆది అంత్యదశల్లో ఉపయోగపడే ఈ మందును సంజీవని అని చెప్పవచ్చును లైకోపోడియం జీవి అంతరాంతరాలను స్పృశించే మందు అంటాడు డాక్టర్ కెంట్

లైకోపోడియం రోగికి బాధలు కుడివైపు ఎక్కువగా ఉంటాయి కుడివైపున ప్రారంభమై ఎడమవైపునకు బాధలు వ్యాపించవచ్చును సాయంకాలం 4 నుంచి 8 గంటల వరకు బాధలుద్రేకిస్తాయి ఈ రోగికి తీపి అంటే మక్కువ వేడి పదార్థాలంటే ఇష్టం దగ్గు గొంతునొప్పి అజీర్తి ఈ బాధలు వేడి పదార్థాలు తీసుకుంటే తగ్గినట్లనిపిస్తాయి అటూ ఇటూ తిరుగుతుంటె బాధలు ఉపశమిస్తాయి కదలికలో ఉపశమనం కలగడం రస్టాక్స్ రోగికి కూడా ఉంటుంది బెల్లడోనా రోగికి వలెనే వీరికి కూడా బాధలు హఠాత్తుగా వస్తాయి తగ్గిపోతాయి

లైకోరోగులు శుష్కించి పోతుంటారు మెడ సన్నబడిపోతూ ఉంటుంది ఛాతీ ఎండుకుపోతుంది వృద్ధులకి లాగ చర్మం ముడతలు పడిపోతుంది అకాల వృద్ధాప్యానికి మానసిక దౌర్బల్యానికిది మంచి మందు

ఈ రోగులు మానసికంగా శారీరకంగా దుర్బలులు ఫ్లూ టైఫాయిడ్ లాంటి జ్వరాలతో బాధపడి కోలుకొని రోగులకు ఈ మందు ఉపయోగిస్తుంది

లైకోపోడియం రోగులకు తత్తరపాటు భయం ఎక్కువ తత్తరపడే లక్షణం ఆర్జెంటంనైట్రికం జెల్సిమియం లకు కూడా ఉంది పతీపనినీ సందేహిస్తూనే ఆరంభిస్తారు వీలయినంత వరకు దాటవెయ్యటానికి ప్రయత్నిస్తారు పిరికితనం ఎక్కువ ఒంటరిగా ఉండలేరు నలుగురిలోకి రాలేరు చీకటిగదిలో ఒంటరిగా ఉండలేరు కాని తోడు ఇంటే వారిని తమ గదిలో ఉండనివ్వరు పక్క గదిలో ఉండాలి తమ పిరికితనాన్ని కప్పిపుచ్చుకోవడానికి కోపం ప్రదర్శిస్తుంటారు తమ భద్రతపట్ల తమకు జాగ్రత్త ఎక్కువ డబ్బు ఖర్చు చెయ్యటానికి ఇష్టపడరు డబ్బుమీద ప్రేమ కన్నా ఉన్న డబ్బు ఖర్చు పెట్టేస్తే భవిష్యత్తు ఎలా ఉంటుందోనన్న భయం ఎక్కువ

పిల్లలలో వయసుకి తగ పెరుగుదల ఉండదు వయస్సుకి మించిన తెలివితేటలుంటాయి బాగా నీరసంగా ఉంటారు బలహీనతవల్ల ఆటలకు కూడా వెళ్లరు ఎప్పుడూ ఏదో ఒక సుస్తీ ఆజీర్తి టిబి సోకే అవకాశం ఉంటుంది స్కూలుకి టైము మించిపోతుందని ఆత్రుతతో ఏమీ తినకుండానే స్కూలుకి పరుగెడుతుంటారు

పెద్దవయస్సు వచ్చిన తరువాత మానసిక దౌర్బల్యంతో జ్ఞాపకశక్తి తగ్గిపోతుంది ఎవ్వరినీ నమ్మలేరు వీన గుణం కోపం ఎక్కువగా ఉంటాయి ఎప్పుడూ ఎదుటివారిలో తప్పులు వెదుకుతుంటారు లైకోపోడియం మనస్తత్వంగల యజమాని దగ్గర పనిచెయ్యడం చాలా కష్టం లైకోపోడియం తీసుకునేటప్పుడు కాఫీ తాగడం తగ్గించుకోవాలి కాఫీ ఈ ఔషధ ప్రభావాన్ని కొంత తగ్గిస్తుంది తూజా వాడినప్పుడు రోగి ఉల్లిపాయలు తినకూడదు రస్టాక్స్ వాడినప్పుడు రోగి చన్నీళ్ళ స్నానం చెయ్యకూడదు

# 32. మెర్క్‌సాల్

చర్మం మీద గుల్లలు కురుపులు గ్రంధులవాపు చీము
నాలుక మెత్తగా వుండి పళ్ల అరాబులు నాలుక అంచులమీద పడతాయి
నోట్లో పుళ్ళు పంటిచిగుళ్లనుంచి చీము
టాన్సిల్స్ వాపుచీము స్రావాలన్ని దుర్వాసన
సెగ్గడ్డలలో ముందుగా మెర్క్‌సాల్ తరవాత హెపార్‌సల్ఫ్ వాడాలి
జిగటవిరేచనాలు ముడ్డిదీపు
పొట్టలో శూలనొప్పి చెవిలో చీము దుర్వాసన నీరసం చేతుల్లో వణుకు
మెర్క్‌సాల్ సైలీషియాలు విరుద్ధ ఔషధాలు
ఒకదాని తరవాత ఒకటి వాడాల్సివస్తే మధ్య హెపార్‌సల్ఫ్ ఇవ్వాలి

ఈ మందు పాదరసం నుంచి తయారవుతుంది హానిమన్ తనమీద మరో ఎనిమిదిమంది అనుచరుల మీద ప్రయోగాలు జరిపి దీని లక్షణాలు నిరూపించాడు సోరా తత్వానికి సల్ఫర్ సైకోసిస్ తత్వానికి తూజా సిఫిలిస్ తత్వానికి మెర్క్యురీ హోమియోలో ప్రత్యేకమైన మందులు ఒక డజను మందులు పెట్టుకోదలచిన వాళ్లు కూడా వాటిలో మెర్క్‌సాల్ ఉంచవలసిందే ఆయుర్వేద వైద్యంలో పాదరసానికి ప్రత్యేక స్థానం వుంది ప్రాచీనకాలం నుంచీ పాదరసం నల్లమందు విపరీతంగా వాడుతున్నారు

సిఫిలిస్ నయం చెయడానికి పాదరసాన్ని పెద్ద మోతాదుల్లో సంప్రదాయ వైద్యులు వాడేవారు దీనివల్ల రోగులు ఎన్నో దుష్ఫలితాలకు గురై బాధలనుభవించేవారు ఈ విషయం వైద్యచరిత్రలో నమోదైవుంది ఈ మందుని పొటెన్సీ రూపంలో వాడి రోగి వ్యాధినిరోధక శక్తిని పెంచి వివిధరూపాల్లో దర్శనమిచ్చే సిఫిలిస్‌ని నిరపాయంగా నివారించడం హోమియో వైద్యం ప్రత్యేకత

మెర్క్‌సాల్ లేకుండా వైద్యం చెయ్యడం అసాధ్యమని అభిప్రాయపడింది డాక్టర్ టైలర్ చిన్నా పెద్దా వ్యాధులకి ఈ మందు పనిచేస్తుంది జలుబు దగ్గు పంటినొప్పి చిగుళ్లవాపు గొంతునొప్పి చెవినొప్పి మొదలైన సామాన్య వ్యాధులకి ఉపయోగపడుతుంది ఊపిరితిత్తులు లివరు బ్రెయిన్ కిడ్నీలకు సంబంధించిన

అతిప్రమాదకరమైన వ్యాధులకు కూడా మెర్క్‌సాల్ పనికొస్తుంది జననేంద్రియ వ్యాధుల నివారణకు ఇది ప్రత్యేకమైన మందు

మెర్క్‌సాల్ రోగి నోరు దుర్వాసన కొడుతుంటుంది నోట్లో ఎక్కువగా నీరూరుతుంటుంది చెమటలెక్కువ చెమట వాసన కొడుతుంటుంది మూత్రం మైల తెల్లకునుమ కూడా స్రావాలే అయినప్పటికీ ఇవి వాసనరావు ఈ రోగి బాధలు పొద్దుగూకిన దగ్గరనుంచీ తెల్లవారేవరకూ ఎక్కువగా వుంటాయి ఈ రోగి జిగురుపొరలనుంచి స్రావం వస్తుంటుంది ఇవన్నీ మెర్క్‌రోగి విచిత్ర లక్షణాలు హోమియోలో రోగలక్షణాలకే ప్రాధాన్యత రోగికి స్వస్థత చేకూర్చడమే వైద్యుని ధ్యేయం

కొంతమంది రోగులు వేడిని తట్టుకోలేరు వీరు హాట్ రోగులు కొంతమంది చలిని తట్టుకోలేరు వీరు చిల్లీ రోగులు మెర్క్‌సాల్ రోగులు దేన్నీ తట్టుకోలేరు వాతావరణంలో మార్పులకి వీరు తేలికగా స్పందిస్తారు అందుకే వీరిని మానవరూపంలో వున్న బరామీటర్ అని పిలుస్తారు

నోటిలోని జబ్బులకి ఈ మందు ముందుగా ఆలోచించాలి చిగుళ్ళు వాచివుంటాయి రక్తం కారుతూ వుండవచ్చు. నాలుక పెద్దదిగా కనిపిస్తుంది నాలుక అంచుమీద పలువరున గుర్తులు కనిపిస్తుంటాయి జిగురులాంటి ఉమ్మి ఊరుతుంటుంది నోరు తడిగా వున్నా దాహం అవుతుంటుంది ఈ లక్షణాలన్నీ రోగి గొంతు టాన్సిల్స్‌తో బాధపడుతున్నా డిఫ్తీరియాతో బాధపడుతున్నా నోరు దుర్వాసనగా వుంటే మెర్క్‌సాల్ వాడాలి నోరంతాపూచి ఉమ్మి ఎక్కువగా వస్తుంది నోరు అరుచి

శరీరంలో ఏ భాగంలో బాధలున్నా మెర్క్‌సాల్ రోగికి చెమటలు ఎక్కువ చెమటలు పట్టినా బాధలు మాత్రం తగ్గవు పైగా ఎక్కువవుతుంటాయి

గ్రంధులవాపు చీముపట్టడం ఈ రోగి ప్రత్యేక లక్షణం టాన్సిల్స్‌వాచి చీము పట్టినట్లయితే మెర్క్‌సాల్ ఉపయోగిస్తుంది మెర్క్‌బిన్ అయోడ్ ఈ బాధలకు ప్రత్యేకమైన మందు చీము కనిపించే వ్యాధులన్నింటిలో మెర్క్‌సాల్ హెపార్ సల్ఫ్, సైలీషియా ముఖ్యంగా వాడుకోవచ్చు మెర్క్‌సాల్ రోగిలో చలి పులకరం వుంటుంది చీముపట్టే మొదట దశలో ఈ బాధ కనిపిస్తుంది చీము పొకుతున్నట్లనిపిస్తుంది శరీరం కంపించేటంత చలికాదు ఈ దశలో పెద్ద పొటెన్సీలో మెర్క్‌సాల్ వాడితే చీము పట్టకుండానే తగ్గిపోతుందని ప్రముఖ వైద్యుడు డాక్టర్ నాష్ అంటాడు పడిశం పట్టేటప్పుడు మొదట చలిపులక వుంటుంది ముక్కుపుండు పడుతుంది ఈ లక్షణాలతో వుండే ముక్కు పడిశానికి మెర్క్‌సాల్ వాడుకోవాలి రోగి వ్యాధినిరోధకశక్తి తగ్గి ఈ దశ బ్రాంకైటిస్ నిమోనియా వ్యాధులకి దారితీయవచ్చు. చలిపులక సాయంకాలానికి ఎక్కువై రాత్రిళ్లు ఎక్కువగా బాధపడతారు ఈ రకమైన చలిపులక ఒంటిమీద గడ్డలు లేచినా కనిపించవచ్చు వీటితోపాటు చెమటలు ఉన్నట్లయితే మెర్క్‌సాల్ తప్పక వాడుకోవాలి పళ్లు పుచ్చి బాధపెడుతుంటాయి ఈ బాధలకు ఇది మంచిమందు దీని తరువాత క్రియాసోటం ఆలోచించదగింది

ఈ రోగులకి జలుబు చేసినప్పుడు పగలుకన్నా రాత్రులు ఎక్కువ బాధపడతారు వేడి చలి రెండూ భరించలేరు చెవిపోటు కూడా రావచ్చు. పొంగు మీజిల్స్ వచ్చినవారికి మెర్క్‌సాల్ పల్సటిల్లాతోబాటు ఆలోచించదగింది ఈ రోగికి చెవినుంచి రాత్రిళ్లు ఎక్కువగా చీము కారుతుంటే మెర్క్‌సాల్ ప్రత్యేకమైన మందు డిఫ్తీరియా రోగులకు మెర్క్‌సైనైడ్ దివ్యౌషధంగా ప్రసిద్ధిగాంచింది జాండిస్ కేసుల్లో కూడా మెర్క్‌సాల్ వాడుకోదగిందే రోగి కుడివైపు పడుకోలేడు కుడివైపు పడుకుంటే బాధలతిశయించే కేసులన్నింటిలో వ్యాధి ఏదైనా మెర్క్‌సాల్ ఆలోచించాల్సిన మందు

రక్తవిరేచనాలకిది ప్రత్యేకమైన మందు మలంలో జిగురువుంటుంది రక్తం జీరలు కూడా వుండవచ్చు. కడుపునొప్పి విరేచనాలు రాత్రిపూట ఎక్కువగా అవుతుంటాయి ముడ్డి ఒరుసుకుపోయి వుంటుంది విరేచనం అయినా కడుపునొప్పి తగ్గదు విరేచనం అయిన తరువాత కడుపునొప్పి తగ్గిపోతే ఇవ్వదగిన మందు నక్స్‌వామికా రక్తవిరేచనాల రోగులకు మెర్క్‌కర్ ప్రత్యేకమైన మందు

మూత్రపిండాలవాపుతో ఉబ్బు కామెర్లతో బాధపడే రోగికి మెర్క్‌కర్ ఆలోచించదగినది జననేంద్రియాలలో సిఫిలిస్ పుండుకు మెర్క్‌సాల్ తప్పక ఇవ్వాల్సివుంటుంది ఈ రోగులకు ముందు ఆర్సెనికం ఆల్బ్ ఇచ్చి తరవాత మెర్క్‌సాల్ వాడడం సముచితమని డాక్టర్ వీలర్ అభిప్రాయం

మెర్క్‌సాల్ రోగికి రుతుస్రావం అధికం తొడలు ఒరుసుకుపోయే తెల్లకునుమ ఈ రోగికి శ్వాసావయవాల

బాధలు కూడా ఎక్కువే దగ్గు ఆయాసం నోరువానన విపరీతంగా చెమటలు జిగటగా వుండే ఉమ్మి దప్పిక ఎక్కువ దిగులు జాస్తి ప్రతి విషయానికి తొందర చంపాలనీ ఆత్మహత్య చేసుకోవాలనీ అనిపించే మనస్తత్వం దద స్పృహతప్పి పడిపోవడంలాంటి లక్షణాలు ఈ రోగిలో ఎక్కువ

మెర్కసాల్ రోగి చర్మం ఎప్పుడూ తడిగా వుంటుంది కురుపులు కురుపుల చుట్టూ మొటాలలాగ పొక్కులు గడ్డలు ఎగ్జిమా

# 39 నేట్రంమూర్

దీర్ఘకాలికంగా తలనొప్పి తలనొప్పి వచ్చేముందు చూపు బూజరగా వుంటుంది
తలనొప్పి సూర్యోదయం మొదలుకొని సూర్యాస్తమయం వరకు వుంటుంది
ఆకలి బాగానే వుంటుంది కాని చిక్కిపోతుంటారు
ఉప్పు ఎక్కువగా వాడతారు చేపలంటే ఇష్టం
మలబద్ధకం మలం పెంటికలుగా విరిగిపడుతుంది
పక్కన ఎవరైనా వుంటే మూత్రవిసర్జన చేయలేరు
నడుంనొప్పి నడుం కింద దిండు పెట్టుకొని పడుకుంటే హాయిగా వుంటుంది
కుంగిపోయి వుంటారు ఓదార్చితే కోపమెక్కువ మితభాషి
ఇగ్నేషియా బ్రయోనియా మందులు వాడాక బాధలు తగ్గినట్లే తగ్గి తిరగబెడితే ఈ మందు ఇవ్వాల్సి వుంటుంది
జలుబు విడవకుండా ముక్కు కారుతుంటుంది

ఇది రసాయనికంగా సోడియం క్లోరైడ్ మామూలుగా మనం వాడుకునే ఉప్పు హానిమన్ మరొక అయిదుగురితో కలిసి దీనిమీద ప్రయోగాలు చేసి హోమియోలోకి తీసుకువచ్చాడు తరువాత ఆస్ట్రియా శాస్త్రజ్ఞులు హోమియో ఔషధాల పరిశోధనలో కూడా ఈ సోడియం క్లోరైడ్‌ని 30 పొటెన్సీవరకూ నిరూపించారు ఉప్పుని రోజూవంటకాల్లో వాడుతున్నాం కాస్తోకూస్తో విడిగా తింటుంటాం అయినప్పుడిది వేరుగా ఔషధంగా ఎలా పనిచేస్తుందని ప్రశ్నించే విద్యార్థులు మనకెదురవుతుంటారు

ప్రకృతిలో శక్తి వ్యక్తంగా కాకుండా గుప్తంగా పదార్థాలలో నిక్షిప్తమై వుంటుందని చెప్పడానికి నేట్రంమూర్ పొటెన్సీలే మంచి ఉదాహరణ పదార్థాలలో గుప్తంగా వున్న ఈ శక్తిని హానిమన్ కనిపెట్టిన శక్తి గుణీకరణ ప్రక్రియద్వారా విడుదల చెయ్యవచ్చు పొటెన్సీలనే ఈనూతన ప్రక్రియనునమ్మటమామానటమా అనే సందేహం అనవసరం వాడి స్వయంగా ఫలితాన్ని పరిశీలించుకోవచ్చని డాక్టర్ బర్నెట్ సవాలు విసిరాడు

సోడియం శరీరంలోని ప్రతికణంలో వుంటుంది నీటిని కణాలలోకి ఆకర్షించి కణవిభజనకు తోడ్పడేది సోడియమే కణాలలో సోడియం తగ్గిపోతే కణాలలో చేరవలసిన నీరు వాటి వెలుపలే వుండిపోయి శరీరం నీరుపట్టినట్లు కనిపిస్తుంది ముఖం ఉబ్బరించడం నిద్రమత్తు కాళ్లు చల్లబడిపోవడం జరుగుతుంది మనిషి శుష్కించిపోతుంటాడు రక్తంతగ్గి పాలిపోతాడు నీరసం రక్తవృద్ధికి సోడియం అవసరం అన్న విషయం గుర్తుంచుకోవాలి శరీరధాతు నిర్మాణానికి పళ్లఎనామిల్‌కి సైతం సోడియం కావాలి సోడియం లోపిస్తే రక్తపోటు తగ్గుతుంది దీనికి కారణం ఎడ్రినాల్ గ్రంధినుంచి వెలువడే స్రావం తగ్గిపోవడమే థైరాయిడ్ గ్రంధి లోపానికి ముందుగా ఆలోచించదగ్గ మందుల్లో ఇదొకటి నేట్రంమూర్ రోగులు ఎండ వెలుతురు చల్లదనం వేడి భరించలేరు జిగురు పొరలనుంచి నీరు కారిపోతుంటుంది జలుబుచేసి ముక్కు నుంచి నీరులాగా కారుతుంటే ఈ మందు వాడుకోవాలి కణాలలో చోటుచేసుకోలేని నీరు కారిపోతుందా అనిపిస్తుంది వీరికి కళ్లవెంట నీళ్లు తేలిగ్గా వస్తాయి నవ్వినా కళ్లవెంట నీళ్లు కారిపోతాయి ఇంట్లోనుంచి ఆరుబయట గాలిలోకి వచ్చినా కళ్లల్లో నీళ్లు వస్తాయి రసాయనికంగానే కాక జీవకార్య నిర్వహణలో సమన్వయంలో ఇంతముఖ్యమైన పాత్ర కలిగిన నేట్రంమూర్ మీ కిట్‌లో తప్పక వుండవలసిందే

నేట్రంమూర్ రోగి బక్కగా వుంటాడు స్రావాల నష్టంవల్ల శుష్కించి పాలిపోయి కనపడతాడు విపరీతమైన కోపం చిన్నవిషయాల పట్ల కూడా ఉద్రేకపడిపోతాడు నిష్కారణంగా ఏడుస్తాడు దిగులుగా కనిపిస్తాడు ఓదార్పు ఇష్టపడడు వల్సాటిల్లా రోగికి ఓదార్పు ఉపశమనాన్నిస్తుంది ఏడుపు చూడగానే ఎల టిల్లా నేట్రంమూర్ స్ఫురించాలి జాలిచూపిస్తే కోపం తెచ్చుకునేవాళ్ళు నేట్రంమూర్ రోగులు వీళ్లకి గుండెదడ కూడా వుంటుంది నాడి పరిశీలిస్తే మధ్య మధ్య నాడి దొరకదు ఈ రోగల్లో ఏదోప్రమాదం ఒరగబోతుందన్న బాధన ఎక్కువ ఎవరితో కలవలేరు మాట్లాడబుద్ధికాదు మౌనస్వభావం కక్షసాధింపు చీటికి మాటికి తగాదా పెట్టుకునేతత్వం ఈ రోగులది వీరు ఎవరితో స్నేహం చెయ్యలేరు ఈ రోగులతో కాపురం చెయ్యడం నరకమే కాసేపు సరదాగా మాట్లాడటానికి మాత్రం మంచివాళ్ళే వీరు శరీరశ్రమకి మానసిక శ్రమకీ కూడా తట్టుకోలేరు పిల్లలు తలనొప్పితో బడినుంచి ఇంటికి వస్తుంటే నేట్రంమూర్ కాల్కేరియాఫాస్ ఆలోచించాలి వీరికి ఏకాగ్రత కుదరదు మతిమరపు అప్పుడే చేసిన పనికూడా మరిచిపోతారు ఇంటికి తాళంవేసి తాళం వేశామా లేదా అని పదిసార్లు తాళం గుంజి చూసుకుంటారు బలవంతంగాపనిచెయ్యాల్సి వస్తే అన్నీ పొరపాట్లే చేసుంటారు జ్ఞాపకశక్తి తగ్గటం తికమకపడటం ఈ రోగుల్లో స్పష్టంగా కనిపిస్తుంది వెనకటి అవమానాలు తలుచుకుని కుమిలిపోతుంటారు అలా అని ఈ బాధాకరమైన సంఘటనలని మరిచిపోవడానికి ప్రయత్నం చెయ్యరు మరపురాని బాధకన్నా మధురమే లేదు గతము తలచీ వగచేకన్నా సౌఖ్యమే లేదు అని రాసిన మహాకవి నేట్రంమూర్ చిత్రాన్నే అందించాడు వీరి చేష్టల్లో మొరటుదనం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది చేతిలో వస్తువు జారవిడుస్తారు పిల్లలు చేతిలో వస్తువులు జారవిడుస్తుంటే ముందు ఎపిస్ తరవాత నేట్రంమూర్ ఆలోచించాలి వీరిలో ధారణే కాకుండా గ్రహణశక్తి కూడా లోపిస్తుంది వీరికి వచ్చే కలలు కూడా విచిత్రంగా వుంటాయి రైలుస్టేషన్‌కి వెళ్ళి ఎక్కబోయే రైలు మిస్సయినట్లూ పరీక్షల్లో పేపర్ పూర్తిగా ఆన్సర్ వెయ్యనట్లూ ఇంట్లో దొంగలు పడ్డట్లు కలలు వస్తుంటాయి అప్పుడు లేచి ఇల్లంతా చూసిగాని పడుకోరు ఇవన్నీ నేట్రంమూర్ జీవతత్వాన్ని ప్రభావితం చేసే వైనం తెలియజేసేవే

పాలీక్రెస్ట్ ఔషధాల్లో తలమానికమైనది నేట్రంమూర్ పిల్లలకు పెద్దలకు ముఖ్యంగా స్త్రీలకు ప్రత్యేకమైన ఔషధంగా దీన్ని చెప్పుకోవచ్చు రుచికోసం వంటకాల్లో వాడుకునే ఉప్పులో నిక్షిప్తమై వున్న శక్తిని వెలికితీసి లోకశ్రేయస్సుకి ఉపయోగించడం నేర్పిన హానిమన్ మహాశయునికి మానవజాతి ఎంతో ఋణపడి వుంటుంది అభివృద్ధి కుంటుపడిన పిల్లలకు ఈ మందు తప్పక ఆలోచించాలి ఈ పిల్లలకు బెరైటాకార్బ్ కూడా మంచిమందు నేట్రంకార్బ్ పిల్లల్లో పెరుగుదల తక్కువ మెడ సన్నగా వుంటుంది గ్రంధులు వాచి వుండవచ్చు. ఇవి టి బి గ్రంధులని అనుకొంటర వీరు చొంగకారుస్తుంటారు నాలుక మ్యాప్ వటంలాగ కనిపిస్తుంది వయస్సు పెరిగినా మాటలు రావు ఏళ్లు వచ్చినా మాటలు రాని వాళ్ళకి ఇది ప్రత్యేకమైనమందు నడక రాకపోతే కాల్కేరియా కార్బ్‌ని గుర్తుంచుకోవాలి ఈ పిల్లల్ని ఎవరైనా పట్టించుకుంటే ఏడుస్తారు ఏడుస్తున్నారు కదా అని ఓదార్చబోతే ఏడుపు ఎక్కువ చేస్తారు పట్టించుకోకపోతే త్వరలో సర్దుకుంటారు హెూమియోలో స్వభావాలని గమనించి మందులు ఎంపిక చెయ్యటం అవసరం ఈ పిల్లల్లో మోటుతనం ఎక్కువ తొందర వస్తువులపట్ల జాగ్రత్త తక్కువ స్కూలుకుపోయే పిల్లలు తలనొప్పి అంటుంటారు ఏకాగ్రతతో పనిచెయ్యలేరు కష్టపడ్డా చదివినా ఆలోచించినా వీరికి తలనొప్పి చలి భరించలేరు వాతావరణం చల్లబడితే జలుబు తుమ్ములు వస్తాయి పిల్లలెక్కువగా తీపి అంటే ఇష్టపడతారు నేట్రంమూర్ పిల్లలకి ఉప్పు ఇష్టం ఉప్పు పంచదారలాగ తింటారు

పెద్దవాళ్లకి కూడా ఈ మందు మంచి ప్రయోజనకారి మానసిక రుగ్మతలు చర్మవ్యాధులు జీర్ణకోశ లోపాలు రక్తసంబంధమైన రోగాలు జననేంద్రియాల బాధలు మొదలైన వాటి చికిత్సలో దీన్ని వాడుకోవచ్చు ఈ రోగులెంత తింటున్నా కోలుకోరు మొరటు స్వభావం వేడితత్వం తరచు జలుబు చేస్తుంది దిగులు విచారంవల్ల కలిగేబాధలకు కోపానికి గురైనందువల్ల వచ్చే అనారోగ్యానికి స్రావాలు నష్టపోయినందువల్ల వచ్చే దుష్ఫలితాలకు ఇది ప్రత్యేకమైన మందు

తలనొప్పికిది ప్రత్యేకమైన మందు తలపై సుత్తిదెబ్బలు పడుతున్నట్లనిపిస్తుంది తలనొప్పి వచ్చేముందు చూపు మసకబారుతుంది ఈ రకమైన తలనొప్పికి కాలీబైకొ జెల్సిమియం కూడా మంచి మందులే నేట్రంమూర్ తలనొప్పి- పొద్దు పొడిచింది మొదలు పొద్దు కుంకేవరకూ ఎక్కువగా ఉంటుంది పది పదకొండు

గంటలకు మరీ తీవ్రం అవుతుంది ఎండగిట్టదు తలనొప్పిగా వున్నప్పుడు ఈ మందు వాడకూడదు అప్పటికి బ్రయోనియా వాడి తరవాత నేట్రంమూర్ వాడుకోవాలి ఈ రోగికి తీవ్రంగా జలుబు చేస్తుంది ముక్కువెంట ధారగా నీరులా కారుతుంది ముక్కులు బిగునుకుపోతాయి తుమ్ములెక్కువ గాలిపీల్చుకోలేదు వాసన తెలియదు పదార్థాల రుచి కూడా తెలియదు నాలుక పూచి మాప్ మాదిరిగా కనిపిస్తుంది

దీర్ఘకాలిక మలేరియా రోగులకి నేట్రంమూర్ ఆలోచించాల్సి వుంటుంది మలేరియా జ్వరంతో శుష్కించి పాలిపోయి నీరసంగా వున్న రోగులకి ఇది వాడితే త్వరగా కోలుకుంటారు వీళ్లలో జ్వరం పది పదకొండు గంటలకి మొదలవుతుంది పెదాలమీద నీటి బొబ్బల్లాగ పొక్కులు వస్తాయి బద్దలైపోతున్నట్లు తలనొప్పి, చలి జ్వరం ఈ వేళల్లో తలనొప్పి కూడా వుంటుంది ఇది నేట్రంమూర్ రోగిలో మాత్రమే కనిపించె ప్రత్యేక లక్షణం నేట్రంమూర్ తరవాత చలిజ్వరాలకు ఉపయోగించే మందు ఆర్స్ ఆల్బ్ నేట్రంమూర్ రోగిలో మలేరియా చలితో మొదలై వాంతులవుతాయి ఆ తరవాత జ్వరం వస్తుంది చిత్తడినేలల్లో ఈ రకమైన జ్వరాలెక్కువ

ఆడపిల్లల్లో రజస్వల కావడం ఆలస్యం అయితే ఈ మందు వాడాల్సి వుంటుంది బహిష్టులు త్వరత్వరగా వస్తాయి మైల నల్లగా ఎక్కువగా ఎక్కువరోజులపాటు అవుతుంది సంతానం కలగదు యోని పొడారి వుంటుంది రతి బాధాకరంగా వుంటుంది అందుకని రతిపట్ల వైముఖ్యం కుసుమ మైల మాదిరిగా చిక్కగా ధారాపాతంగా అవుతుంటుంది బాలింతల్లో జుట్టు ఎక్కువగా రాలిపోతుంటే ఈ మందు వాడుకోవాలి గర్భసంచి జారి నడుముల్లో నొప్పులుండవచ్చు స్తనాలెండుకుపోతున్నా నేట్రంమూర్ ఆలోచించాలి

గర్భసంచి జారిన రోగుల్లో దగ్గినా తుమ్మినా మూత్రం పడుతుంది కొన్ని సందర్భాల్లో తెలియకుండానే మూత్రం బట్టల్లో పడిపోవచ్చు. కొన్ని కేసుల్లో ఒంటేలు వచ్చినట్లున్నా ఎంతో ప్రయత్నంమీదగాని రావు ఇతరులు చూస్తుంటే వీరికి ఒంటేలు రాదు

మగవారిలో నపుంసకత్వానికి ఇది మేలైన మందు శీఘ్రస్ఖలనం వీర్యనష్టంవల్ల నడుంనొప్పి, కాళ్లలో బలహీనత మలబద్ధకం చెడ కనకవుంటే ఇది ప్రత్యేకమైన మందు ఈ రోగులకి కాఫీ ఇష్టం వుండదు మాంసం గిట్టదు చేదు ఇష్టపడతారు చేపలంటే ఇష్టం

# 38 నేట్రంసల్ఫ్

వర్షాకాలం తేమ వాతావరణంలో వచ్చే బాధలు దగ్గు కఫం ఆయాసం

తెల్లవారుజామున 4 5 గంటలకి ఆయాసంతో లేచి కూర్చుంటారు

కఫం చిక్కగా ఆకుపచ్చగా పడుతుంటుంది

కఫం పడిన తరవాత హాయిగా వుంటుంది

తలకి బలమైన దెబ్బ తగిలిన తరవాత వచ్చే తలనొప్పి, మానసికమైన బాధలు

దీర్ఘకాలిక విరేచనాలు

ఉదయంపూట నిద్రలేచిన తరవాత విరేచనాలు ఆరంభమౌతాయి

ఇది రసాయనికంగా సోడియం సల్ఫేట్ దీనిని 658లో గ్లాబర్ అనే శాస్త్రజ్ఞుడు కనిపెట్టాడు అందువలన దీనిని గ్లాబర్‌సాల్ట్ అనికూడా అంటారు సంప్రదాయ వైద్యంలో ఈ లవణాన్ని బేదిమందుగా వాడుతుండేవారు 832లో హార్ట్‌లాబ్ ట్రింక్స్ దీనిపై ప్రయోగాలు జరిపి దీనిని హెూమియో వైద్యంలో ప్రవేశపెట్టారు డాక్టర్ ష్యూస్లర్ జీవరసాయన శాస్త్రపరంగా దీని ధర్మాలను విశ్లేషించి ద్వాదశ లవణ చికిత్సలో చోటుకల్పించాడు

డాక్టర్ గ్రావోగిల్ దృష్టిలో హైడ్రాజెనాయిడ్ తత్వంగల రోగులకిది గొప్పమందు దీనిని సైకోటిక్‌వ్యాధులకు అద్భుతమైన ఔషధంగా పరిగణించాడు హాఫ్‌మన్ ఫ్లూ ఎపిడమిక్ వ్యాధిగా ప్రబలినప్పుడు తప్పక వాడుకోవలసిన మందుగా ష్యూస్లర్ నిర్దేశించాడు ఏ దృష్టితో చూసినా నేట్రంసల్ఫ్ చాలాగొప్ప ఔషదం

రోగితత్వాన్నిబట్టి ఎంపికచేయదగిన మందని కెంట్ అభిప్రాయపడ్డాడు హెూమియోవైద్యం ఔషధ ధర్మాలను అర్థంచేసుకొనే తీరులోనే ఒక ప్రత్యేకత ఉంది ఈ పద్ధతిలో మానసిక శారీరక చైతన్యస్థాయిల్లో రోగి

లక్షణాలను క్రమబద్ధంగా విశ్లేషించాలి ఇంకా లోతుకుపోయి అచేతన అవచేతన subconsc ous) వ్యవస్థలనుకూడా వైద్యుడు పరిశీలించాలి అందుకే కలల వివరాలుకూడా ఈ విధానంలో ప్రాధాన్యతవహిస్తాయి ఈ నేపథ్యంలోనే ఏ ఔషధాన్నయినా అధ్యయనం చేయవలసివుంటుంది

తేమగాలి సముద్రప్రాంతం నీళ్ళలో ఎక్కువసేపు నిలబడి పనిచేయడం వర్షంలో తడవటం నీటికూరగాయలు ఇవన్నీ సరిపడని తత్వాన్ని గ్రావేగిల్ హైడ్రాజెనాయిడ్ తత్వంగా వర్ణించాడు ఈ తత్వంగలవారు గనేరియా లాంటి సుఖవ్యాధులకు తేలికగా గురవుతారు గనేరియా జీర్ణించుకుపోయినందువల్ల సంభవించే వ్యాధులనే సైకోటిక్‌వ్యాధులని హానిమన్ వర్గీకరించాడు వీరికి పొడిగావున్న వాతావరణం హాయిగా వుంటుంది ఈ తత్వంగల వారి బాధలు తెల్లవారుజామున ఉద్రేకిస్తాయి విరేచనాలు దగు ఆయాసం మొదలైన బాధలున్న రోగుల్లో ఇది స్పష్టంగా గమనించిన విశేషం నేట్రంసల్ఫ్ వాడినా వ్యాధి మళ్ళీమళ్ళీ తిరగబెడుతుంటే తూజా వాడితే శాశ్వతంగా నివారణవుతుంది సైకోటిక్ వ్యాధులకు తూజా ఔషధరాజం సల్ఫర్ సోరా తత్వానికి మెర్క్యురీ సిఫిలిస్ తత్వానికి ప్రత్యేకఔషధాలు

ఉబ్బసం సైకోసిస్‌కు సంబంధించిన వ్యాధి ఈ రోగుల్లో కన్పించే శ్వాసావయవాల లక్షణాలు చర్మసంబంధమైన లక్షణాలు నేట్రంసల్ఫ్‌లో ఎక్కువగా కన్పిస్తాయి తేమ చిత్తడిప్రాంతాలలో నివసించే వారి ఉబ్బసం బాధలకు ఇవి ఆలోచించాలి కళ్ళెతోగూడిన దగ్గు ఆయాసం చిన్నపిల్లల్లో కన్పిస్తే ఇది ప్రత్యేకమైన మందుగా వాడుకోవచ్చు. ఈ పిల్లలకు జలుబుచేసినప్పుడల్లా దగ్గు ఆయాసం పట్టుకుంటాయన్న విషయం గుర్తుంచుకోవాలి తెల్లవారుజామున దమ్ము ఎక్కువ ఇది సైకోసిస్ లక్షణం పొద్దుగుంకినప్పటినుంచి తెల్లవారేదాకా వచ్చే బాధలు సిఫిలిస్ లక్షణం అధికశ్రమవల్ల వచ్చే ఉబ్బసానికి కూడా ఇది మంచిమందే దగ్గు ఆయాసం తెరలతోబాటు దొడ్డికి వెళ్ళాల్సివస్తుంటే నేట్రంసల్ఫ్ ప్రత్యేకమైన మందు చక్కని ఆకుపచ్చని కళ్ళె. నేట్రంసల్ఫ్‌లో స్రావాలన్నీ ఇదేరంగులో వుంటాయి ఈ రోగి నిద్రలేచిన వెంటనే దొడ్డికి పరిగెత్తాల్సివస్తుంది ఈ రోగినాలుకమీద మందం పచ్చగా పేరుకొనివుంటుంది ఇది శ్వాసకోశవ్యాధులకు కూడా బాగా ఉపయోగిస్తుంది నిమోనియా జ్వరానికి నేట్రంసల్ఫ్, బ్రయోనియా ఫాస్ఫరస్ ఔషధత్రయంగా పేర్కొనవచ్చు. నేట్రంసల్ఫ్ రోగి ఎడమవైపు ఛాతీ కిందభాగాన దగ్గినప్పుడు నొప్పితో బాధపడుతుంటాడు ఇది విచిత్ర లక్షణం

ఇది మనస్సు, తలకు సంబంధించిన బాధలకు ప్రయోజనకరమైన మందు తలకు బలమైన దెబ్బతగిలి మానసికంగా బాధపడేవారికిది తప్పక ఆలోచించాలి ఆందోళన ఆత్మహత్య చేసుకోవాలనే కోరిక చిన్నచిన్న శబ్దాలకు కూడా చలించిపోవడం కమ్మని సంగీతంకూడా బాధాకరంగా వుంటుంది ఈ రకమైన బాధలకు ఇది మంచి మందు తలకు దెబ్బతగిలిన తరవాత తలనొప్పి పట్టుకుంటే నేట్రంమూర్ ఆర్నికా ఆలోచించదగిన మందులు తలకు దెబ్బతగిలిన తరవాత ఫిట్స్‌వస్తుంటే ఇది ప్రత్యేకమైన ఔషధం తలనొప్పిగా వున్నప్పుడు నోట్లో లాలాజలం ఎక్కువగా ఊరుతుంటే నేట్రంసల్ఫ్ వాడి శాశ్వతంగా నివారించవచ్చు. నేట్రంసల్ఫ్ రోగి మానసిక ఆందోళనకు తగినట్లుగానే కొట్లాటలకు సంబంధించిన కలలు వస్తుంటాయి

ఈ రోగికి పిండివదార్థాలు దుంపకూరలు గిట్టవు జీర్ణంగావు పాలు సరిపడవు ఎక్కువగా విరేచనాలతో బాధపడుతుంటారు ఉదయంపూట విరేచనాలెక్కువ విరేచనంతోపాటు విపరీతమైన అపానవాయువులు ఇది విచిత్రలక్షణం లేవగానే దొడ్డికి పరుగెత్తుకు వెళ్ళాలి పేగుల్లో క్షయ అని నిర్ధారించిన రోగుల విరేచనాలకు ఇది ప్రత్యేకంగా పరిగణించాలని డాక్టర్ క్లార్క్ అభిప్రాయం అపానవాయువులతో గూడిన విరేచనాలకు యాలో కాల్కేరియాఫాస్‌లు గుర్తుంచుకోదగిన మందులు

ఇది మొండికెత్తిన గనేరియాకు మంచి మందు స్త్రీలలో గనేరియా తరవాత పసుపుపచ్చని కుసుమ మూత్రవిసర్జన ఎక్కువగా వుండే డయాబెటిస్ రోగులకు ఇది ఆలోచించదగిందే

# 39. ఫాస్పరస్

వచ్చకామెర్లకు ఇది ప్రత్యేకమైన మందు
చిన్నదెబ్బ తగిలినా రక్తం ఎక్కువగా పోతుంటే తప్పక ఈ మందు ఇవ్వాలి
మంటతో బాధపడుతుంటారు
చల్లటి ఆహార పదార్ధాలు కోరుతుంటారు
మదపిచ్చి, బట్టలు తీసేస్తుంటారు
రాత్రిళ్ళు పొట్టలో బాధ లేచి ఏదైనా తినందే వుండలేరు
ఆహారం పుచ్చుకొన్న తరవాత ఒక అరగంటకు వాంతి అయిపోతుంది
ఛాతి సన్నగా పొడవుగా వుంటుంది టి.బి
విరేచనాలు చిమ్మించినట్లవుతాయి
మత్తు ఇచ్చి ఆపరేషను చేసిన వారికి వాంతులవుతుంటే ఇది వాడుకోవచ్చు.

ఇది భాస్వరం ఈ మూలకాన్ని తొలిసారిగా 668లో మూత్రంలోనుంచి తయారుచేశారు హానిమన్ తన శిష్యులపై ప్రయోగాలు జరిపి హోమియో వైద్యంలో ప్రవేశపెట్టాడు హోమియోలో వాడే భాస్వరాన్ని ఎముకల బూడిద నుంచి తీస్తారు ఇది వచ్చభాస్వరం భాస్వరం జీవకోటికి ప్రాణాధారమైన మూలకం జీవకణానికి కర్బనం తరువాత ఇది చాలా ముఖ్యమైనది ఫాస్పరస్‌కు ఒక ప్రత్యేకత వుంది భౌతిక రసాయనిక శాస్త్ర ప్రయోగం ద్వారా కనిపెట్టలేని సూక్ష్మస్థాయిలో వాతావరణంలో ఉంటుంది టెలిగ్రాఫ్ తీగలమీద పెరిగే స్పానిష్‌మాస్ అనే మొక్కలో ఫాస్పరస్ ఉంటుంది అయితే ఈ మొక్క జీవించే పరిసర వాతావరణంలో ఫాస్పరస్ వున్న దాఖలాలు లేవు పొటెన్సీల స్థాయిలో ఔషధాలు వాటి వాటి ధర్మాలను కోల్పోవని చెప్పడానికి ఇది ప్రబలమైన ఉదాహరణ ఫాస్పరస్ మన శరీరంలో ప్రతి కణంలోనూ ఉంటుంది రక్తకణాలు ఎముకల కణాలు మొదలైన వాటన్నిటిలో ఫాస్పరస్ ఉంటుంది మార్గరెట్ టైలర్ దీనిని పాలీక్రెస్ట్ ఔషధంగా కొనియాడింది ఇది తరుణ దీర్ఘవ్యాధుల్లో కూడా అత్యంత ప్రయోజనకారి అన్ని వయస్సుల వాళ్ళకూ ఇది చాలా ఉపయోగకరమైన ఔషధం

బలహీనతత్వానికిది ప్రత్యేకమైన మందు వీరు పుట్టుకనుంచీ రోగిష్టులుగా బలహీనంగా పీలగా ఉంటారు త్వరగా పొడవు సాగుతారు శరీరం శుష్కించి వుంటుంది క్షయరోగుల్లాగా కన్పిస్తారు మానసికంగా చురుకుగా వుంటారు శరీరం మాత్రం ఎండుకుపోతుంది వీరు పొడవుగా వంగిపోయి వుంటారు కాల్కేరియా రోగి బొద్దుగా ఉంటాడు ఆకారం రూపురేఖలు ఔషధాల ఎంపికకు సాయపడుతుంటాయి

ఫాస్పరస్‌తత్వం పిల్లలు కోమలంగా వుంటారు చాలా చురుకైనవారు చలి భరించలేరు అతి భయస్తులు చీకట్లో ఒంటరిగా వుండలేరు వాతావరణంలో మార్పులకు తట్టుకోలేరు విద్యుత్ సంబంధమైన మార్పులకు తేలికగా స్పందిస్తారు అందుకే ఉరుములు మెరుపులంటే తత్తర విరేచనాలుకూడా పట్టుకొంటాయి ఆందోళనపడిపోతుంటారు సున్నితత్వం ఒంటరితనం ఇష్టముండదు నలుగురితో కలిసివుండాలని వుంటుంది వీరికి ఆవేశం వస్తే ముఖం కందిపోతుంది గుడ్లంటే ఇష్టపడరు మాంసం అంటే మక్కువ ఉప్పు కలిసిన పదార్ధాలంటే ఇష్టం ఎక్కువ నిద్రలో వులికిపడుతుంటారు తేలికగా జలుబు చేస్తుంది ఈ జలుబు బ్రాంకైటిస్ జబ్బులోకి దించుతుంది వాతావరణంలో వచ్చే మార్పులకి ఈ రకమైన బాధలు త్వరగా పట్టుకుంటాయి

ఈ పిల్లల దృష్టి చాలా నిశితం భవిష్యత్ సంఘటనలను ఊహిస్తుంటారు ఎక్కడకు వెళ్ళినా ఆ పరిసరాలను మనుషులను తీక్షణంగా గమనిస్తుంటారు ఆసుపత్రికి తీసుకువెళ్లితే డాక్టర్ల నర్సుల కదలికలను కన్నార్పకుండా పరిశీలిస్తుంటారు వీరిది జాలి మనసు ఎదుటివారి బాధలకు తేలికగా స్పందిస్తారు ఇంట్లో ఎవరినైనా బాధపెడుతుంటే వీరు ముందు ఏడుపు మొదలుపెడతారు వీరికేబాధ వచ్చినా ఎదుటివారి నుంచి

సంపూర్ణమైన సానుభూతి ఆశిస్తారు ఫాస్ఫరస్‌తత్వంగల పిల్లలు అన్నన్నతగా ఎన్నష్పంకు ఒళ్ళు నిమురు తుంటే మెదలకుండా ఊరుకుంట రు సానుభూతితత్వంలో ఫాస్ఫరస్‌కి పం బీలాకు పప గుర్తుంచుకోదగ తేడావుంది పలాటిల్లా పిల్లలు స్వార్ధపరులు ఎదుటివారి సానుభూతిని కోడుకుంటారు కా వారి బాధలేమీ వారికి పట్టవు ప్రతి ఇంట్లో మనకు ఫాస్ఫరస్ వల్సాటిల్లా కాల్కేరియాకార్బ్ కాల్కేరియాఫాస్ పిల్లలు తటస్థపడుతుంటారు పిల్లల పెంపకంలో వారి తత్వాలను గుర్తించడం చాలా అవసరం ఔషధాల ఎంపికలో మానసిక శారీరక లక్షణాలు రెండూ గమనించాలి పిల్లల్లో సాధారణంగా వచ్చే రికెట్స్ వ్యాధికి కాల్కేరియా కాల్కేరియాఫాస్ ఫాస్ఫరస్ ప్రదాన ఔషధత్రయంగా పరిగణించవచ్చు తత్వపరిశీలన చేసి వాడుకోవలసి వుంటుంది

ఫాస్ఫరస్ యవ్వనదశలో ప్రత్యేకమైన మందు ప్రతిదానికి తేలికగా ఆకర్షితులవుతారు ఉద్రేకస్వభావం సావనప్రభావానికి తేలికగా లోనవుతుంటారు సామాజికశ్రేయస్సు ఉన్నత జీవితాదర్శాలకో ఉత్తేజితులవుతారు స్నేహితుల ఎడబాటు సహించలేరు వియోగాన్ని భరించలేరు తేలికగా పొంగిపోవటం ఊరకనే కుంగిపోవడం ఫాస్ఫరస్ ప్రధాన లక్షణం ఆందోళన అస్థిమితం ఎకువ ఆందోళన భయానికి గురైన సమయంలో శరీరం వేడెక్కిపోతుంది చెమటలు పడతాయి వేడిసీళ్ళు ఒంటిమీద పోసినట్లనిపిస్తుంది తల అరిచేతుల్లో వేడి అవిర్లతో చమటలు దడ— ఒకచోట నిలకడగా వుండలేరు చేతులు పూరికే కదిలిస్తుంటారు మానసిక శారీరక నిస్త్రాణకు తేలికగా గురవుతారు అధిక శ్రమ మితిమీరిన వ్యభిచారం దీర్ఘకాలిక విరేచనాలు స్రావాలు కోల్పోయినవారికి ఫాస్ఫరస్ దివ్యౌషధం

ఫాస్ఫరస్ బాగా నిరూపితమైన ఔషధం హోమియోపతి గ్రంధదీపికలో మూడువేల లొమి దీనంచల పై చిలుకు లక్షణాలను నమోదు చేశారు ఇది బహుళ ప్రయోజనకారి

శరీరంలో ధాతువులన్నింటిని ఇది ప్రభావితం చేస్తుంది నాడులు చర్మం జిగురుపొరలు రక్తం కండరాలు ఎముకలు గుండె కాలేయం మూత్రపిండాలు శ్వాసావయవాలు అన్నింటిమీద పనిచేస్తుంది

ఫాస్ఫరస్ తత్వంగల వ్యక్తులు సన్నగా పొడవుగా నాజూకుగా వుంటారు ఛాతీ పలచగా వుంటుంది వంగిపోయివుంటారు చురుకైన స్వబావం చలి గిట్టదు శరీరానికి చలిగిట్టకపోయినా తలకి పొట్టకి వచ్చే బాధలకు చల్లదనం హాయినిస్తుంది అవయవ సర్వస్వాన్ని అధిగమించి వ్యక్తి ప్రవర్తిస్తాడు చెప్పడానికి ఫాస్ఫరస్ మంచి ఉదాహరణ ఫాస్ఫరస్ రోగికి వెచ్చదనం హాయినిస్తే ఆతని తలకి పొట్టకి చల్లదనం హాయినిస్తుంది వ్యక్తిత్వం అవయవధర్మాలను మించి ప్రకటితమవుతుంది

ఫాస్ఫరస్ రోగిలో మంటలతోకూడిన బాధలు ప్రముఖంగా కన్పిస్తాయి ఈ విషయంలో ఆర్సెనికం ఆల్బ్ సల్ఫర్ రోగులను కూడా గుర్తుంచుకోవాలి తరుణ రోగుల్లో మంటలతో కూడిన బాధలకు ఆర్సెనికం ఆల్బ్ దీర్ఘరోగుల్లో ఇదె రకమైన బాధలక సల్ఫర్ ప్రధానమైన ఔషధాలు ఫాస్ఫరస్ రోగుల్లో అరిచేతుల్లో మంటలు సల్ఫర్ రోగిలో అరికాళ్లు మండుతాయి

నాడీమండల వ్యాధులకు ఫాస్ఫరస్‌ని మించిన ఔషధంలేదు ఇది మెదడు వెన్నుపాము దెబ్బతిని బలహీనత వణుకు తిమ్మిర్లు పక్షవాతం మొదలైన బాధలన్నింటికి దివ్యౌషధం మెదడులో రక్తనాళాలు చిట్లిగాని రక్తం గడ్డకట్టిగాని పక్షవాతం వచ్చినవారికి ఫాస్ఫరస్ లాకిసిస్ ముఖ్యమైన ఔషధాలు

గాయాలువడి రక్తం గడ్డ కట్టకుండా ధారగా కారిపోయే శరీరతత్వంగలవారికి ఈ మందు తప్పక వాడాలి ముక్కు ఊపిరితిత్తులు అన్నకోశం గర్భకోశం మూత్రకోశాలనుంచి రక్తస్రావాలను అరికట్టడానికి ఫాస్ఫరస్ తప్పక ఇవ్వవలసి వుంటుంది

తరచు విరేచనాలతో బాధపడే రోగులకు ఫాస్ఫరస్ ప్రయోజనకారని హానిమన్ అభిప్రాయపడ్డాడు కుదవలతో కూడిన నీళ్ల విరేచనాలు ఫాస్ఫరస్ రోగి విచిత్ర లక్షణం పురీషనాళానికి చెరిన పదార్థం వెంటనే జారిపడిపోవాలిసిందే విరేచనం అయిన తరవాత పొట్ట అంతా ఖాళీగా అనిపిస్తుంది

ఫాస్ఫరస్ రోగిలో ఆదికమైన ఆందోళన అస్థిమితం కొట్టవచ్చినట్లు కన్పిస్తాయి ఈ సందర్భంలో ఎకొనైట్ ఆర్సెనికం ఆల్బ్ రోగులను తప్పక గుర్తుంచుకోవాలి ఈ దశనుండి ఫాస్ఫరస్‌రోగి నిరాసక్తతకు నిర్లిప్తతకు గురవుతాడు ఏ విషయాన్నీ పట్టించుకోలేడు తన అభిమానానికి పాత్రులైనవారి విషయంలో కూడా నిర్లిప్తంగా

వుంటాను ఎవ అడిగినా మాట్లాడబుద్ధిగాదు ఈ రకమైన మనస్తత్వానికి నేట్రంమూర్ సెపియాలు కూడా ఆలోచించదగ్గ మందులె కాని వాట వారి తత్వానుగుణంగా మందు ఇవ్వవలసి వుంటుంది తలతిప్పునకు ఇది మంచి మందు తలతిప్పు రోగులకి ఫాస్పరస్ తరవాతనే ఇతర మందులు ఆలోచించాలి

జీర్ణమండల వ్యాధుల్లో ఫాస్పరస్ అత్యంత ప్రయోజనకారి పెదాలు పొడారిపోయి వగిలి వుంటాయి చిగుళ్లు వాచి చీము కారుతుంటుంది పయోరియా వ్యాధికిది మంచి మందు ఆకలి అధికం ఆలస్యమైతే ఆకలికి వుండలేదు పొట్టలో మంట పొట్టలో పుండు కాన్సర్‌లాంటి బాధలుండవచ్చు చల్లటి పానీయాలు ఇష్టపడతాడు తాగిన చల్లని పానీయాలు కొంతసేపయిన తరువాత వాంతి చేసుకుంటాడు తరచుగా ఏదో ఒకటి తింటూ వుండవలసిందే అర్ధరాత్రి కూడా లేచి ఏదైనా తినకుండా వుండలేడు వేవిళ్ళకు ఈ మందు బాగా పనిచేస్తుంది

లివర్ జబ్బులకు ఇది ప్రత్యేకమైన మందు లివరువాచి వచ్చుకామెర్లు అయిన వారి కేసుల్లో ఇది ముందుగా ఆలోచించవలసి వుంటుంది తాగుబోతుల్లో లివర్ దెబ్బతిని సిర్రోసిస్ అనే వ్యాధి వస్తే మొదటి దశలో ఫాస్పరస్ తప్పక ఆలోచించాలి

శ్వాసావయవాల తరుణ దీర్ఘవ్యాధులకు కూడా ఫాస్పరస్ ఉపయోగపడుతుంది ఛాతీ బిగుసుకుపోతున్నట్లు బాధ గుండెలమీద బరువు పెట్టినట్లనిపిస్తుంది గదిలోనుంచి ఆరుబయటికి వెళ్ళితే దగ్గు మాట్లాడుతున్నా తింటున్నా తాగినా దగ్గు పట్టుకుంటుంది ఎడమవైపు పడుకోలేడు దగ్గు ఎక్కువవుతుంది నిమోనియా టి బి కేసుల్లో ఇది బాగా ఉపయోగపడే మందు టి బి వ్యాధిగ్రస్తులకు ఫాస్పరస్ సైలీషియాలాంటి మందు చిన్న పొటెన్సీలలో వాడుకోవాలి క్షయవ్యాధికి ఫాస్పరస్ అయోడం మంచి మందులు

స్త్రీలలో ఋతుస్రావం ముందుగా వస్తుంది మైల చాలా రోజులపాటు అవుతుంది ధారాపాతంగా తొడలు ఒరుసుకుపోయే తెల్లకుసుమ లైంగికవాంఛ అధికం సంతానం లేనివారికి మంచి మందు గర్భకోశం స్తనాల కాన్సర్ వ్యాధులకిది బాగా పనిచేస్తుంది

# 40 సెపియా

సంసార భారంతో కుంగిపోయిన గృహిణి
నిస్సత్తువ
గర్భసంచి జారి ఉంటుంది
నడుంనొప్పి మలబద్ధకం
పొట్ట ఖాళీ అయినట్లుంటుంది
క్రమం తప్పి బహిష్టులు బాధలు
సెర్విక్సు వూచి ఉండటం పుండు పడటం పసుపువచ్చని కుసుమ
ముట్లుడిగిన తరవాత ఒళ్లంతా వెచ్చటి ఆవిర్లు (సల్ఫర్ లాకిసిస్)
రతి బాధాకరంగా ఉంటుంది
దిగులు నిర్లిప్తత

హానిమన్ ఐదుగురితో కలిసి ప్రయోగాలు జరిపి దీనిని హోమియో వైద్యంలో ప్రవేశపెట్టాడు ఇది స్త్రీలకు ప్రత్యేకమైన మందుగా ప్రసిద్ధి చెందింది నూటికి 80 కేసులు స్త్రీలవైనా పురుషులకు కూడా ఇది ఎంతో ప్రయోజనకరమైంది హోమియో వైద్యంలో ఒక పది పాలీక్రెస్ట్ ఔషధాలు ఎంపిక చేయవలసివస్తే సెపియా ఆ జాబితాలో వుండితీరుతుంది హోమియో ఔషధాలలో ఏదైనా ఒక్క ఔషధాన్ని కోరుకోమంటే సెపియాను కోరుకుంటానని డాక్టర్ గిబ్సన్‌మిల్లర్ అన్నాడు సెపియా సైలీషియా లైకోపోడియం లాకిసిస్ లాంటి ఔషధాలు సంప్రదాయ వైద్యానికి బొత్తిగా తెలియవు ఈ ఔషధాల లక్షణాలు 12వ పొటెన్సీ తరవాతగాని వ్యక్తంకావు ముడిరూపంలో ఎందుకూ పనికిరావనుకొనే ఈ పదార్థాలు పొటెన్సీ రూపంలో దివ్యౌషధాలుగా రూపొందుతాయి

హానిమన్‌కు పూర్వం హిప్పోక్రటీస్‌కు మాత్రమె సెపియా విషయం తెలుసు హానిమన్‌తోపాటు దీనిపై ప్రయోగాలు జరిపిన ఐదుగురూ మగవారే 874లో డాక్టర్ డన్‌హాం ఆధ్వర్యాన 26 మంది మీద ప్రయోగాలు జరిపారు వీరిలో 9మంది స్త్రీలు ఈ ప్రయోగాల ద్వారా హానిమన్ నిరూపించిన ప్రయోగఫలితాలను నిరూపించడమేగాకుండా కొత్తలక్షణాలను కూడా రాబట్టారు ఈ మందు శరీరధాతువులన్నింటిని ప్రభావితంచే సినా జననేంద్రియాలు నాడీమండలం జీర్ణమంగలం చర్మంపై ప్రత్యేకమైన ప్రభావం చూపిస్తుంది

సెపియా మధ్యధరా సముద్రంలో విస్తారంగా తిరిగే కటిల్ అనే చేపపొట్టలోని ఎరాలాంటి పదార్థం నుంచి తయారవుతుంది ఈ సిరాను చిత్రలేఖనంలో వాడుతుంటారు చిత్రకారుడైన తన స్నేహితునికి ఎన్నిమందులి చ్చినా అతని బాధలు తగ్గకపోవటంతో హానిమన్ ఈ సిరావల్ల అతనికీ బాధలు వచ్చివుండవచ్చని ఊహించి ఆ సిరావాడకం ఆపించాడు ఆ చిత్రకారుడు కోలుకొన్నాడు ఈ అనుభవాన్ని పురస్కరించుకొని హానిమన్ సెపియామీద ప్రయోగాలు జరిపి ఈ ఔషధాన్ని మానవజాతి కందించాడు సారూప్య సూత్ర ప్రకారం ఒక పదార్థం ఎంత గొప్ప విషమైతే అంత గొప్పఔషధంగా రూపొందుతుంది హానిమన్ తరవాత డన్‌హామ్ హెరింగ్ లిప్పీ, నాష్ మొదలైన హేమాహెమీలంతా దీనిని ప్రశంసించారు

సెపియా రోగి ప్రధానలక్షణం ఉదాసీనత ఏదీ పట్టించుకోవాలని ఉత్సాహముండదు మానసిక శారీరక స్థాయిల్లో ఈ లక్షణం వ్యక్తమవుతుంది మానసికంగా కుంగిపోయి వుంటారు బాధ్యతలు కూడా పట్టవు కటిల్‌ఫిష్ సొంత సంతానాన్ని గురించి పట్టించుకోదు సెపియా లక్షణాన్ని గూడా జీవతత్వస్థాయిలోనే అర్థం చేసుకోవాలి సెపియా స్త్రీలకు తమ భర్త సంతానంమీద కూడా మమకారం తగ్గిపోవడం విశేషలక్షణం సెపియా గర్భకోశవ్యాధులకు ప్రత్యేకమైన మందు కటిల్‌ఫిష్ గర్భకోశ ఆకారాన్ని పోలివుందన్న విషయం గమనార్హం ఇవన్నీ సెపియా జీవతత్వాన్ని తెలియజేసే లక్షణాలే

సెపియా రోగులు ఉద్వేగపరంగా కుంగిపోయిన వ్యక్తులు నలుగురిలో కలవలేరు కాని ఒంటరితనం అంటే పిరికి ఉదాసీనంగా ఏదీ పట్టించుకోనట్లు కన్పించినా తమ మాటకు ఎవ్వరూ ఎదురుచెప్పడానికి వీలులేదు ఎక్కడలేని ఓపిక తెచ్చుకొని తగాదాకు దిగుతారు మాట్లాడేటప్పుడు అభినయం అవయవ విక్షేపాలు ఎక్కువ ఉద్వేగంతోపాటు కన్నీళ్ళు కార్చేస్తారు తెలియకుండానే కన్నీళ్ళు బొటాబొటా రాలిపోతాయి తన బాధలు చెప్పుకోవాలని మొదలుపెట్టి కన్నీళ్ళు కార్చుతూ వివరంగా చెప్పడం కూడా కష్టమైపోతుంది డాక్టర్ దగ్గరకు వెళ్ళినప్పుడు మీ బాధఏమిటని అడిగితే బాధలు చెపుతూ చెపుతూ ఏడ్చేస్తారు ఈ విషయంలో సెపియా పల్సటిల్లాకు చాలాదగ్గర సెపియా రోగి నిరాశ పట్టలేక తెగించేసి ఏడ్చేస్తారు బాధ్యతల బరువు తట్టుకోలేక అన్నీ వదిలేసి కూర్చోవాలి అనిపిస్తుంది బడలిక దీనికి ముఖ్యకారణం గంపెడు సంసారాన్ని సంబాళించుకోలేక బాధపడుతుంటారు చాకిరితో దిగపోత చెమటలు ముఖ్యంగా చంకల్లో సెగకు తట్టుకోలేక బయటగాలిలోకి వెళ్ళాలనిపిస్తుంది కాని చల్లగాలికి తట్టుకోలేరు ఈ బాధలతో సతమతమవుతుంటే ఇంట్లో చిన్నపిల్లలు కొట్టుకొని ఏడవటం ఆ ఏడుపు వినలేక ఓర్పునశిస్తుంది ఈ దశలో ఏ పాటి చిన్న శబ్దాలు భరించలేరు దీనితో బడలిక విశ్రాంతి తీసుకోవాలనిపిస్తుంది భర్త ఇంటికివస్తే నవ్వాలని ప్రయత్నించినా నవ్వురాదు నిద్రవచ్చినట్లుంటుంది కాని నిద్రపట్టదు నిద్రపట్టితే బాధలు తొలగిపోతాయి ఈ విషయంలో ఫాస్ఫరస్ రోగికి దగ్గరగా వుంటుంది లాకిసిస్ రోగికి నిద్ర ఒక శాపం నిద్రపట్టే సమయానికి అన్ని బాధలు ఉద్రేకిస్తాయి సెపియా రోగి పెళ్ళయ్యేనాటికి బొద్దుగా బలంగావున్నా పెళ్ళయిన తరవాత ఎండుకుపోయినట్లు బక్కగా తయారవుతుంది గనేరియా జీర్ణించుకుపోయిన భర్తల పాలబడ్డ స్త్రీలకు ఈ సమస్య ఎదురవుతుంది సెపియా రోగి జారిపోయినట్లు కన్పిస్తుంది ముఖంలో ఏదోభయం తొంగిచూస్తుంది తేలికగా భయపడిపోతారు తనకేదో నయంకాని వ్యాధి వున్నదన్న భయం పిచ్చి ఎక్కుతుందని ఆందోళనపడతారు మానసిక వ్యాధితో బాధపడేవారికి ఇది ఆలోచించదగిన మందు సొంత పిల్లల విషయం పట్టించుకోని మానసిక రోగికి ఇది దివ్యౌషధం

శక్తివంచనలేకుండా జీవనసమరంలో పోరాడి అలిసిపోయిన వ్యక్తులు వీరు ఈ పోరాటంలో విసిగివేసారి శ్రమించలేక బడలికకు గురైన వ్యక్తులు సెపియా రోగులు బద్ధకంతో పాలుమాలినవారు కాదు శరీరధర్మ శాస్త్రరీత్యా వారి ముఖ్యమైన వినాళగ్రంధులు వాటి సమతూకం కోల్పోతాయి పిట్యూటరీ ఎడ్రినల్

సెక్స్‌గ్రంధుల సమన్వయత దెబ్బతినిపోతుంది ఈ కారణంగా వీరిలో థైరాయిడ్ గ్రంధి కూడా చురుకుగా పనిచేయదు నేట్రంమూర్ రోగుల్లో కూడా థైరాయిడ్ గ్రంధి చురుకుగా పనిచేయదు సెపియా నేట్రంమూర్ రెండు కూడా మానసికంగా కుంగిపోయినవారికి మంచి మందులని గుర్తుంచుకోవాలి సెపియా రోగులు మూడీగా వుంటారు ఒక క్షణంలో మెత్తగా వుంటారు ఇంకొక్షణంలో మరీ చిరాకుగా వుంటారు మూడీగా వుండే విషయంలో వీరు పల్సాటిల్లాకు దగ్గరగా వుంటారు పల్సాటిల్లా సెపియా ఒకదాని తరవాత ఒకటి ఇవ్వతగ్గ మందులే చిరాకు కోపం విషయంలో సెపియా రోగి నక్స్ రోగికి దగ్గర

హెూమియో ఔషధాలలో ఎంతో ప్రాముఖ్యంగల ఔషధం సెపియా ఇది పిల్లలు పెద్దల్లో స్త్రీ పురుషులపై పనిచేస్తుంది కాని స్త్రీల ఔషధంగా ప్రసిద్ధి చెందింది యవ్వనంనుంచి పాతికేళ్ల వయస్సుదాకా బహిష్టులు ఆగిపోయే వయస్సులో స్త్రీలకు ప్రత్యేకంగా ఉపయోగకరమైన మందు

చల్లటి గాలికి శారీరక శ్రమవలన వీరి బాధలుద్రేకిస్తాయి తేలికగా జలుబు చేస్తుంది చెమటలు అధికం ఉద్రేకంవలన కూడా ముఖం ఎర్రబారిపోతుంది దిగపోతగా చెమటలు నాడులమీదేగాక రక్తప్రసారం మీద కూడా సెపియా ప్రభావాన్ని చూపుతుంది బహిష్టు ముందురోజుల్లో గర్భవతులుగా ఉన్నప్పుడు వీరి బాధలు ఉద్రేకిస్తాయి

సెపియారోగులు పొడవుగా సన్నగా వుంటారు పిరుదులు తక్కువ చూడటానికి మగవాళ్లలాగా కనిపిస్తారు పురుష హార్మోను యాండ్రోజెన్ ప్రభావంవల్ల గడ్డాలు మీసాలు కూడా పెరిగివుంటాయి సెపియా రోగిని పట్టిచ్చే ప్రధాన లక్షణం మానసికమైనదే నిరాసక్తత సెపియా పల్సాటిల్లా నేట్రంమూర్ కాస్టికం రోగులు మానసికంగా కుంగిపోయిన వ్యక్తులు మాట్లాడేటప్పుడు తేలికగా ఆవేశపడతారు సెపియారోగులు బహిష్టులు ఆగిపోయిన స్త్రీలలో ఒళ్లు సెగలు పొగలుగా వేడెక్కుతుంది అధిక రక్తప్రసరణవల్ల చెమటలు కూడా అధికం చెమటలెక్కువ అనగానే కాల్కేరియా రోగులు కూడా గుర్తుకు రావాలి కాల్కేరియారోగి బద్ధకస్తుడు సెపియారోగిలో బడలిక

సెపియా రోగిలోమానసికంగానే గాక శారీరకంగా కూడా దిగజారుడులక్షణాలుఎక్కువగాకనిపిస్తాయి ముఖం కళాకాంతులు లేకుండా వుంటుంది తెలివితేటలు ఎక్కడా కనిపించవు మూతకళ్లు ముక్కు, చెక్కిళ్లమీద మంగు జీర్ణకోశం అంతా ఖాళీ అయినట్లుగా అనిపిస్తుంటుంది పొట్ట జారిపోయివుంటుంది మూకుడు బోర్లించినట్లుగా పొట్ట ముందుకు పొడుచుకు వచ్చినట్లయితే పిల్లల్లో కాల్కేరియా పెద్దవాళ్లలో అయితే తప్పనిసరిగా సెపియా గుర్తుంచుకోవాలి రక్తం అధికంగా కూడుకోవటంవల్ల గర్భసంచి బరువెక్కి వుంటుంది కటిప్రదేశంలో ఉండబెట్టినట్లనిపిస్తుంది గర్భసంచి జారుతున్నట్లు బాధపడుతుంటారు ఈ ఫీలింగ్ నిలబడ్డా నడిచినా ఎక్కువ తొడలు అదిమిపెట్టి కూర్చోవాలి అనిపిస్తుంది సాధారణంగా కాలు మీద కాలు వేసుకొని కూర్చుంటారు పేగుల్లో పటుత్వంలేక మలబద్ధకం మానసికంగా శారీరకంగా ఈ రకంగా దిగజారిపోవడం చైతన్యపరమైన కారణంగానే భావించాలి చైతన్యస్థాయిలో నిగూఢంగా వున్న కారణం మానసిక శారీరకస్థాయిల్లో స్పష్టంగా ఒకరూపాన్ని దాలుస్తుంది మనిషి అంటే మనస్సు శరీరం చైతన్యం అన్న విషయం సెపియా మనకు గుర్తుచేస్తుంది చైతన్యాన్ని సరిదిద్దకుండా అవయవాలను శస్త్రచికిత్సకు గురిచేసినంత మాత్రాన రోగికి స్వస్థత చేకూరదు

సెపియా రోగికి తలనొప్పి వుండొచ్చు. పార్శ్వనొప్పిగా కూడా కనిపిస్తుంది వెలుతురు శబ్దాలు సహించలేదు కదిలితే తలనొప్పి అధికమవుతుంది ఆకలి వుండదు వండుతున్న ఆహారం వాసన తగిలినా ఒళ్ళు తిప్పుతుంది బహిష్టురోజుల్లో తలనొప్పి కామవాంఛ కలిగితే తలనొప్పి ఇది విచిత్ర లక్షణం

సెపియా రోగికి పులుపు తీపి ఇష్టం మాంసం పాలు నచ్చవు పాలు గిట్టకపోవచ్చు కూడా బీర్ వ్యసనానికి లొంగిపోయినవారికి సెపియావాడి ఆ అలవాటు మాన్పించవచ్చు. గర్భవతిగా వున్నప్పుడు సెపియా రోగికి వాంతులెక్కువ వాంతులతో సతమతమయ్యే గర్భిణీ స్త్రీలకు ఇది మంచిమందు

సెపియా పిల్లలు బద్ధకస్తులు ఇతరుల బొమ్మల కోసం కూడా మారాం చేస్తుంటారు ఆశపోతులు ఒంటరిగా వుండాల్సివస్తే భయం మలబద్ధకం 7 సంవత్సరాల వయస్సు దాటినా పక్కతడుపుతుంటారు పడుకొన్న తరువాత రెండు గంటలలోపుగా లేపి ఒకసారి ఒంటేలు పోయిస్తే పక్కతడపరు నిద్రపట్టగానే ఒంటేలు

పోసేవారికిది మంచిమందు చలిగాలి పడదు రుతువు మారినప్పుడల్లా వీరికి జలుబు చేస్తుంది పాలు గిట్టవు పాలుతాగితే మలబద్ధకం జీర్ణకోశం దెబ్బతింటుంది చర్మవ్యాధులకు గురవుతారు వరం మడతల్లో గుల్లలెక్కువ

స్త్రీల వ్యాధుల్లో ఇది ప్రత్యేకమైన మందు బహిష్టు ఆలస్యంగా రావచ్చు మైల చాలా తక్కువ ఒక్కోసారి బహిష్టులు ముందుగా వచ్చి మైల ఎక్కువకావచ్చు బహిష్టు రోజుల్లో చాలా బరువుగా గర్భసంచి జారుతున్నట్లు బాధపడుతుంటారు గర్భవతుల్లో ముఖ్యంగా 7వ నెల తరవాత ఎర్రమైల కనిపించి బహిష్టులాగిపోయే సమయంలో బహిష్టు బహిష్టుకు మధ్య మైల కనిపిస్తే సెపియా వాడుకోదగిన మందు యవ్వనంలో రుతువులు ఆగిపోయినా బిడ్డకు పాలివ్వటం మానేసినా తల్లుల్లో బహిష్టులారంభంకాకపోయినా ఈ మందు తప్పక ఆలోచించాలి గర్భకోశంలో నొప్పి గర్భకోశ ముఖద్వారం పూసినట్లుంటుంది బహిష్టు తరువాత యోని పొడారినట్లుండి నడుస్తుంటే బాధాకరంగా వుంటుంది రతిపట్ల వైముఖ్యం రతి అనంతరం బాధలు రతి తరవాత నీరసం రతి ఆలోచన మనస్సులోకి వస్తేనే వికారం చికాకు ధారాపాతంగా చిన్నపిల్లల్లో తెల్లకుసుమ-వచ్చుగా ముద్దలు ముద్దలుగా వుంటుంది రుతుస్రావం బదులు తెల్లమైలవుతుంది దుర్వాసన బహిష్టు ముందు వచ్చే తెల్లమైలవల్ల తొడలు ఒరుసుకుపోతుంటాయి ప్రసవానంతరం మాయ పడకపోతే ఈ మందు వాడుకోవచ్చు. ప్రసవానంతరం సెపియా వాడితే గర్భసంచి త్వరగా యథాస్థితికి వస్తుంది 5వ నెల తరవాత గర్భస్రావ నివారణకు సెపియా ముందుగా ఇవ్వదగిన మందు 3వ నెల లోపుగానె గర్భస్రావాలకు గురయ్యేవారికి ఏపిస్ మంచిమందు పొట్టలో శిశువు కదులుతుంటే ఓర్చుకోలేని వాళ్ళకు ఈ మందు వాడాలి బహిష్టులు ఆగిపోయే సమయంలో ఆకస్మాత్తుగా వేడిఆవిర్లు నీరసం చెమటలు వస్తుంటే సెపియా తప్పక వాడవలసి వుంటుంది సంతానానికి నోచుకోని స్త్రీలకు కూడా ఇది మంచిమందు

నడుంనొప్పికిది వాడుకోవచ్చు ఈ సందర్భంగా నేట్రంమూర్ కాలికార్బ్ బ్రయోనియాలు కూడా గుర్తుంచుకోవాలి

ని పట్టితే బాధలన్నీ తగ్గిపోయి హాయిగా వుంటుంది ఇది లాకిసిస్ తత్వానికి విరుద్ధం బహిష్టులాగిపోయేటప్పుడు వచ్చే బాధలకు సెపియా లాకిసిస్ మంచిమందులు కాని ఒకదాని తరవాత ఒకటి వాడదగిన మందులు కాదు రోగితత్వాన్ని పరిశీలించి ఔషధాన్ని ఎంపిక చేయాలి హోమియో వైద్యానికి ప్రతిభతోపాటు రోగిని జాగ్రత్తగా పరిశీలించే ఓర్పు, ఓపిక కూడా వుండాలి

## 9. సల్ఫర్

చర్మం ఆరోగ్యంగా ఉండదు గుల్లలు దురదపెడతాయి గోకిన తరవాత మంట
స్నానం చేయరు అపరిశుభ్రత
నవరంధ్రాలు ఎర్రగా ఉంటాయి
స్రావాలు ఒరుసుకుపోతుంటాయి దుర్వాసన మంట
ముగ్గిడిగే సమయంలో ఒళ్లంతా వెచ్చటి ఆవిర్లు చెమటలు
ఆకలి ఎక్కువ ఆకలికి తట్టుకోలేరు
మలబద్ధకం విరేచనాలు ఒకదాని తరవాత ఇంకొకటి వస్తుంటాయి
విరేచనాలు ఉదయంపూట ఎక్కువ నిద్రలేచి పరుగెత్తుకొని పోవాల్సి వస్తుంది
కోడినిద్ర తేలికగా మెలకువ వస్తుంది
కోలుకోకముందే వ్యాధి తిరగబెడుతుంది వారికీ మందు ఇవ్వాలి
సల్ఫర్ వాడిన తరవాత కాల్కేరియాకార్బ్, లైకోపోడియం వరసక్రమంలో
సందర్భాన్నిబట్టి వాడుకోవచ్చు

గంధకాన్ని ఔషధంగా ప్రాచీనకాలం నుంచి వాడుతున్నారు సంప్రదాయ వైద్యంలో దీని ప్రయోజనం

వృతమందు వరకే పరిమితం హోమియోలో ఇది ప్రధాన ఔషధత్రయంలో ఒకటి మిగతా రెండు కాల్కేరియా కార్బ్ లైకోపోడియం

హానిమన్ వ్యాధులకు మూలకారణం సోరా సైకోసిస్ సిఫిలిస్ అని సిద్ధాంతీకరించాడు సైకోసిస్ సిఫిలిస్‌లకు కూడా ఆధారం సోరా సోరాను నిరోధించే ఔషధాలను యాంటిసోరిక్ ఔషధాలని అంటారు యాంటి సోరిక్ ఔషధాలలో సల్ఫర్ ప్రధానమైనది దీనిని ప్రిన్స్ ఆఫ్ యాంటిసోరిక్ రెమిడీస్ అని పిలుస్తారు హానిమన్ కాలంలో గజ్జిని సోరా అనేవారు హానిమన్ సోరా అనే పదాన్ని గజ్జి అనే పరిమితార్థంలో వాడలేదు సోరాతత్వంలో గజ్జికూడా ఒక అంశం సుఖవ్యాధులు మినహాయించి మిగతా దీర్ఘవ్యాధులన్నింటికి సోరా మూలం ఈ విస్తృతార్థంలోనే సోరాను అర్థం చేసుకోవాలి

జీవకణాలలో ప్రోటోప్లాజంలో సల్ఫర్ ఒక మూలకం అంటే శరీరంలో వుండే ప్రతి జీవకణంలో సల్ఫర్ వున్నట్లే జీవకార్య నిర్వహణకు ఉత్తేజపరచడానికి సల్ఫర్ అవసరమని డాక్టర్ టైలర్ అభిప్రాయపడ్డాడు సల్ఫర్ అనేక వ్యాధులను నివారించగలదు డాక్టర్ ఫారింగ్‌టన్ తన వస్తుగుణ దీపికలో 89 వ్యాధుల జాబితాను ఇచ్చాడు హోమియో వైద్యం కొత్తగా చేబట్టినవారు చేయితిరిగినవారు కూడా ఎక్కువగా సల్ఫర్ వాడతారని కెంట్ చమత్కరించాడు హోమియో ఔషధాలలో అత్యంత ప్రయోజనకరమైన ఒకేఒక్క ఔషధాన్ని ఎంపిక చేసుకోవలసి వస్తే అది నూటికి నూరుపాళ్ళు సల్ఫరే తరుణ వ్యాధులుగాని దీర్ఘవ్యాధులుగాని సరైన మందు వాడిన తరవాత కూడ తగ్గకపోతే సల్ఫర్ వాడాల్సి వుంటుంది సల్ఫర్ వ్యాధి నివారణకుగల అంతర్గత ఆటంకాలను తొలగిస్తుంది వ్యాధిని తుడిచిపెట్టగల ఔషధమని దీనికి పేరున్నది

సల్ఫర్‌ను ఎంపిక చేయడానికి అవయవపరమైన లక్షణాలకన్నా రోగి పరమైన లక్షణాలపైన ఆధారపడవలసి వుంటుంది ఔషధాల ఎంపికలో రోగి లక్షణాలను ముఖ్యాంశాలు(genera s) గాను అవయవాలకు సంబంధించిన అంశాలను సామాన్యాంశాలు part cu ars గాను పరిగణిస్తారు

సల్ఫర్ రోగి సన్నగా వంగి నడుస్తుంటాడు అజీర్తిరోగి కళ్ళు పీక్కుపోయి వుంటాయి బొద్దుగా కన్పించేవారు కూడా వుండకపోరు ఈ రోగి ఒళ్ళు వాసన కొడుతుంటుంది పరిశుభ్రతపై శ్రద్ధ వుండదు నబ్బుతో స్నానం చేసినా వాసనపోదు వీరు కొంచెంసేపు కూడా కుదురుగా నిలబడలేరు నిలబడాల్సి వస్తే అస్తిమితంగా వుంటారు కూర్చొనే తావు కొరకు వెతుకుతుంటారు బద్ధకం ఎక్కువ పనిచేయకుండా కబుర్లతో బతుకుతారు అధికశ్రమవల్ల అలిసిపోయి పాలుమాలిన వారికి కూడా సల్ఫర్ ఇవ్వవచ్చు. తిండికైనా మాడతారుగాని ఒళ్ళు వంచరు బద్ధకస్తుడనగానే ముందు గుర్తుంచుకోవలసిన మందు సల్ఫర్ బుద్ధిమాంద్యంగలవారికి కూడా ఇది మంచిమందే కాల్కేరియా కార్బ్ రోగికి పనిచేయాలని వుంటుంది కాని బుద్ధి మందం

సల్ఫర్ రోగికి దారుఢ్యం తక్కువ కోపం చిరాకు ఎక్కువ ఉద్వేగాలకి ఎక్కువగా స్పందించరు నక్స్ పల్సటిల్లా తీవ్రమైన ఉద్వేగపరులు సల్ఫర్ రోగికి సంకల్పబలం తక్కువ జ్ఞాపకశక్తి తక్కువ ముఖ్యంగా మనుషుల పేర్లు అసలు గుర్తుండవు ఈ లక్షణం లైకోపోడియంలో కూడా వుంది

సల్ఫర్ చాలా స్వార్థపరుడు తన సుఖం తప్ప ఇతరుల కష్టాలు గమనించడు ఎప్పుడూ నిష్ప్రయోజకమైన చర్చలు సాగిస్తుంటాడు చెప్పేది తాను చేయడు ఈయన గొప్ప కుహనావేదాంతి పగటికలలు కంటుంటాడు తాను చాలా గొప్పవాడినని సమాజం తనను తగినంతగా గుర్తించడం లేదని బాధపడతాడు తనువాడే వస్తువులన్నీ మ్యూజియంలో భద్రపరచదగ్గంత గొప్పవనుకొంటాడు గర్వం కూడా ఇతరులు ఏమనుకుంటున్నారన్న సంకోచం ఏమాత్రం వుండదు మాసినబట్టలు వేసుకుంటారు తాముండే గది కూడా శుభ్రంగా వుంచుకోరు

సల్ఫర్‌రోగిలో నవరంధ్రాలు ఎర్రగా వుంటాయి పెదాలు ముక్కుపుటాలు కనుకొలకులు ఎర్రగా వుంటాయి ఈ రోగినుంచి వెలువడే స్రావాలు మండుతుంటాయి స్రావాలు తాకినచోట ఒరుసుకుపోతుంది స్రావాలన్నీ వాసనకొడుతుంటాయి మంటలతో కూడిన బాధలు- ఒళ్ళు మంటలు మాడు మంట ఆసనంలో మంట అరికాళ్ళు అరిచేతుల్లో మంటలు రాత్రిపూట శరీరమంతా కప్పుకొన్నా చల్లటిగాలి కోసం కాళ్ళు దుప్పటికి వెలుపల పెడతారు మంటల విషయంలో హోమియోలో మూడు ముఖ్యమైన మందులు ఆర్స్ ఆల్బ్ ఫాస్పరస్ సల్ఫర్- ఆర్స్ ఆల్బ్ మంటలు వేడికాపుతో ఉపశమిస్తాయి నరాలు దెబ్బతిని మంటలున్నట్లు

యితే ఫాస్పరస్ మంచిమందు చర్మవ్యాధులు అణచివేసిన తరవాత నల్ఫర్ ఆలోచించాలి ఈ రోగికి బ్రాందీ విస్కీలు ఎక్కువ ఇష్టం తీపి అంటే మక్కువ కాని గిట్టదు మాంసం పాలు ఇష్టపడరు ఈ రోగికి చల్లటిగాలి కావాలి ఆకలి ఎక్కువ ఉదయం గంటలకు ఏదైనా తినకపోతే నీరసం వస్తుంది ఆకలి ఎక్కువైనా తినే దానికన్న నీళ్ళు తాగటం అధికం నల్ఫర్ పిల్లలు తిన్నా కోలుకోరు జబ్బు తగ్గినట్లే తగ్గి తిరగబెడుతుంటే నల్ఫర్ ఇవ్వాల్సి వుంటుంది స్వార్థపరులకుండే తొందర హడావిడి నల్ఫర్ రోగులకు వుంది వీరికి స్ఖలనం గూడా తొందరగా అవుతుంది శీఘ్రస్ఖలనానికి నల్ఫర్ మంచి మందు

శరీర ధాతువులన్నిటినీ ప్రభావితం చేయగల ఔషధాలలో నల్ఫర్‌ను మించిందిలేదు దీర్ఘరోగులకిది ప్రత్యేకమైన మందు దీర్ఘరోగాల చికిత్సలో ముందు నల్ఫర్ వాడి ఆ తరువాత ఇతర ఔషధాలను ఆలోచించవచ్చు. సోరిక్ ఔషధరాజం అయినందువల్ల ఈ విధానం అవలంబించవలసి వుంటుంది ఔషధాల ఎంపికలో ఒక స్పష్టమైన నిర్ణయానికి రాలేకపోయినా రోగి లక్షణాలు అస్పష్టంగా వున్నా ఆ కేసులు నల్ఫర్‌తో ఆరంభించవచ్చు. ఈ రోగి బలహీనంగా వుంటాడు చర్మంమీద గుల్లలు పొక్కులు అగ్నిపర్వతం నుంచి చిమ్మే లావాలో నల్ఫర్ లభిస్తుందన్న విషయం ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి ఈరోగి స్నానం అంటే ఇష్టపడడు స్నానంచేస్తే బాధలు ఉద్రేకిస్తాయి మాడు మండుతుంటుంది అరిచేతులు అరికాళ్లలో మంటలు వడుకొన్న ప్పుడు చల్లదనం కొనం అరికాళ్లు బయటపెడతారు

నల్ఫర్ తత్వంగల పిల్లలకి ముసలిముఖం వడుతుంది తల పొట్ట పెద్దవిగా వుంటాయి కాళ్లు చేతులు సన్నం ఆకలి విపరీతం ఎంత తిన్నా ఎక్కిరారు మురికిగా వుంటారు ఒళ్లు వానన కొడుతుంటుంది స్నానం అంటే ఇష్టముండదు స్నానానికి పిలిస్తే ఏడుస్తారు ముక్కులో వేళ్లుపెట్టి కెలుకుతుంటారు ముక్కు వక్కులుకూడా తింటుంటారు ప్రతి దానికీ పేచి పెడుతుంటారు తమకు అక్కర్లేని బొమ్మలు కూడా దాచుకొంటారు స్వార్థం ఎక్కువ వక్కపిల్లల సంగతి పట్టించుకోరు ఈ పిల్లలు జిజ్ఞాసువులు పెద్దవాళ్లని కూడా తికమకపెట్టే ప్రశ్నలు వేస్తుంటారు

పెద్దల్లో వారం వారం నెలనెలా తిరగబెట్టే మైగ్రెయిన్ తల నొప్పికిది మంచి మందు వారమంతా శ్రమించి ఆదివారం విశ్రాంతి రోజున తలనొప్పి పట్టుకొని బాధపడే శ్రమజీవులకు ఇది దివ్యౌషధం ఈ రోగికి చల్లగాలి కావాలి తలనొప్పి వున్నప్పుడు తలకి మాత్రమే వెచ్చదనం కోరుకుంటాడు ఇది నల్ఫర్ రోగిని పట్టిచ్చే విచిత్ర లక్షణం ఇది ఆర్సెనికం ఆల్బ్‌రోగి లక్షణానికి పూర్తిగా విరుద్ధమైనది ఆర్స్‌రోగికి వెచ్చదనంకావాలి తలనొప్పి వచ్చినప్పుడు తలకిమాత్రం చల్లదనం కోరుకుంటాడు

చెవిలో చీము కారణంగా చెవుడువచ్చిన వాళ్లకిది మంచి మందు చెవుడుతోపాటు చెవిలో మోతలతో బాధలకిది ప్రత్యేకమైన మందు

ముక్కు ఎప్పుడూ కారుతూ వానన తెలియకుండాపోతే నల్ఫర్ వాడవలసి వుంటుంది బయటివాననలు తెలియకపోయినా వారిముక్కు వారికి వాననకొడుతుంటుంది ఇది విచిత్ర లక్షణం

జీర్ణమండల వ్యాధులపైన నల్ఫర్‌కి ప్రత్యేకమైన ప్రభావముంది పెదాలు దొండపండు రంగులో వుంటాయి పెదాలు పగిలి మండుతుంటాయి ఆకలి ఎక్కువ ఉదయం గంటలయ్యేటప్పటికి ఆకలితో తల్లడిల్లి పోతుంటారు తీపంటే ఇష్టమేగాని గిట్టదు ఆకలి ఎక్కువగా వున్నా అన్నం తినలేరు నీళ్లు ఎక్కువ తాగుతారు మసాలాలు నూనె పదార్థాలు ఇష్టపడతాడు పాలుతాగితే అజీర్ణం ఈ రోగులకి గ్యాస్ ఎక్కువ పేగులు అరుస్తుంటాయి పొత్తికడుపు ఎడమవైపు ఉబ్బరంగా వుంటుంది మలబద్ధకం విరేచనాలు రక్తవిరేచనాలు కూడా తెల్లవారు జామున 5 గంటలకు నిద్రలేపి పరుగెత్తించే విరేచనాలకిది ప్రత్యేకమైన మందు మెర్క్‌కార్ ఇచ్చిన తరవాత రక్తవిరేచనాలు కంట్రోలుగాకపోతే నల్ఫర్ తప్పనిసరిగా వాడాలి నల్ఫర్‌రోగికి విరేచనాలు పగలే కాని రాత్రిళ్లుగావు తరచు విరేచనాలవుతూ చిక్కిపోతుండే పిల్లలకు నల్ఫర్ వాడుకోవాలి గ్యాస్‌తో కూడిన విరేచనాలకు నేట్రంసల్ఫ్ మంచి మందు నేట్రంసల్ఫ్ విరేచనాలలో కడుపునొప్పి వుంటుంది ఈ లక్షణం నల్ఫర్‌లోలేదు నల్ఫర్ రోగికి ముడ్డి దురద ఎర్రగా రాసుకుపోయివుంటుంది ముడ్డిపేగు జారి ఉండవచ్చు. మలలతో బాధపడుతుంటారు మలలకేసులో ఉదయంపూట నల్ఫర్ రాత్రి పడుకోబోయేటప్పుడు నక్స్‌వామికా వాడుకుంటే మలలు తగ్గుతాయి

స్త్రీ పురుషుల జననేంద్రియ స్రావాలకి సల్ఫర్ ప్రత్యేకమైనమందు గనేరియా జీర్ణించుకుపోయివుంటే ఇది తప్పక వాడుకోవాల స్త్రీలలో బహిష్టులాగిపోయిన తరువాత వచ్చే బాధలకు సల్ఫర్ లాకిసిస్ సెపియా లు ప్రధాన ఔషధత్రయం రొమ్ములు గర్భనంచి తగినంతగా వృద్ధి చెందకపోతే సల్ఫర్ వాడుకోవచ్చు. కాన్పయిన తరువాత బాలెంత జ్వరం ఉధృతంగా వచ్చినట్లయితే జ్వరం తగ్గడానికి సల్ఫర్ పైరోజినం వాడుకోవాలి

పురుషుల్లో స్ఖలనం తరువాత మంట నపుంసకత్వం శీఘ్రస్ఖలనానికిది ప్రత్యేకమైన మందు రతి తరువాత నడుంనొప్పి ప్రోస్టేట్ స్రావాన్ని మూత్రంతోపాటు పోకుండా అరికట్టడానికి ఇది వాడుకోవచ్చు. వీరికి స్త్రీని తాకగానే వీర్యం కారిపోతుంది

దీర్ఘవ్యాధుల చికిత్స సల్ఫర్‌తో ఆరంభించినట్లే చాలా సందర్భాలలో తరుణవ్యాధుల చికిత్స సల్ఫర్‌తో ముగించాల్సి వుంటుంది దీర్ఘకాలిక బ్రాంకైటిస్ వ్యాధికిది గొప్పమందు టి బి వస్తుందనే అనుమానమున్నప్పుడు ఆ రోగికి సల్ఫర్ వాడటం అవసరం టి బి రాకుండా రోగి వ్యాధినిరోధకశక్తిని సంఘటితపరిచే లక్షణం సల్ఫర్‌కుంది టి బి ఆరంభదశలో మాత్రమే ఈ మందు వాడవలసి వుంటుంది ఈ రోగులు గాలి ఎక్కువ కోరుతుంటారు వీరికి ఊపిరాడదు ఛాతీలో బరువు పెట్టినట్లుంటుంది మంట తెరలు తెరలుగా దగ్గు దగ్గు తెరల చివర తుమ్ములు ఈ కేసుల్లో ఈ మందును 30 పొటెన్సీలో మాత్రమే వాడుకోవలసి వుంటుంది

చర్మవ్యాధులకిది ఔషధరాజం చర్మం పొడిగా వుంటుంది అక్కడక్కడ చెమటలు దురద మంటలు గోకితే సుఖంగా వుంటుంది అందుకని రక్తం వచ్చిందాకా గోకుతుంటారు గోకిన తరువాత మంటలు ఇది విచిత్ర లక్షణం చర్మంమీద గుల్లలు చర్మం గరుకుగా వుంటుంది పచ్చి పుండులాగా వుంటుంది స్నానంచేస్తే బాధలు ఎక్కువవుతాయి

నిద్రపట్టనివారికిది మంచి మందు చిన్న అలికిడికి కూడా మెలకువ వస్తుంది ఒళ్లంతా మంటలు వేడితో పక్కమీద అస్థిమితంగా దొర్లుతుంటారు తెల్లవారుజామున 3 గంటలకే లేచి కూర్చుంటారు తరువాత నిద్రపట్టదు ఈ సందర్భంలో నక్స్‌కూడా గుర్తుంచుకోవాలి

ఎకోనైట్ వాడినవారికి బాధలు మళ్లీమళ్లీ తిరగబెట్టకుండా సల్ఫర్ వాడుకోవాలి అజీర్తికేసులో వల్సాటిల్లా నక్స్ తరువాత సల్ఫర్ వాడుకోవడం మంచిది టీకాల దుష్ఫలితాల నివారణకు సల్ఫర్ తూజాలు గొప్పమందులు

## 42. రస్టాక్స్

జ్వరం ఒళ్లు విరుపులు కుదురుగా పడుకోలేరు
నాలుక చివరి భాగం త్రిభుజాకారంలో ఎర్రగా ఉంటుంది
నిస్సత్తువ బరువులెత్తినందువల్ల నడుం పట్టుకుపోవటం
ఒళ్ళంతా నొప్పులు
కదిలితే ఆరంభంలో నొప్పి కదులుతుంటే హాయిగా ఉంటుంది
తడిచినా తేమగాలిలో తిరిగినా బాధలు
రుమాటిజమ్ రుమటాయిడ్ కీళ్ల నొప్పులు
స్రావాలు మలమూత్రాలు దుర్వాసన ఒరుసుకుపోతుంటాయి

ఈ ఔషధాన్ని ఒక రకమైన విషపు జాతి మొక్క ఆకు నుంచి తయారుచేస్తారు మొదటిసారిగా దీనిపై హానిమన్ మరో 9 మందితో కలిసి ప్రయోగాలు జరిపి ధర్మాలు రాబట్టాడు తరుణ వ్యాధులలో రస్టాక్సును ప్రధానమైన ఔషధంగా పరిగణించవచ్చు ఎకోనైట్ బెల్లడోనా బ్రయోనియా జెల్సిమియంలు కూడా తరుణ వ్యాధుల్లో పాలీక్రెస్టను పోలిన ఔషధాలు రస్టాక్స్ మొక్క ఆకులు శరీరానికి రాసుకుంటే దద్దుర్లు వస్తాయి ఈ మొక్క ఆకులను గుర్రాలు మేకలు తింటాయి ఆ ఆకులు వాటినేమీ చేయవు ఔషధ ధర్మాలు రాబట్టడానికి కేవలం జంతువులమీద జరిపే ప్రయోగాలు అసమగ్రమని చెప్పడానికి ఇది ఒక ఉదాహరణ మానవులపై

ప్రయోగాలు మాత్రమే స్వచ్ఛమైన వస్తుగుణదీపికని హానిమన్ చెప్పుకున్నాడు

రస్టాక్స్ లక్షణాలు చాల విచిత్రంగా ఉంటాయి రస్టాక్స్ లక్షణాలు విశ్రాంతి వల్ల ఉద్రేకిస్తాయి దీనికి సరిగ్గా వ్యతిరేక లక్షణం బ్రయోనియాది- కదలికవల్ల బ్రయోనియా లక్షణాలు ఉద్రేకిస్తాయి రస్టాక్స్ రోగిలో కండరాలు కీళ్ళు బిగునుకుపోయి ఉంటాయి కదలడం మొదలు పెట్టగానే విపరీతంగా బాధలు ద్రేకిస్తాయి కొంతకదిలిన తర్వాత బిరునుదనం తగ్గిపోయి అవయవాలలో బాధలు తగ్గుతాయి రస్టాక్స్ రోగి బాధల తీవ్రతను తట్టుకోలేక పక్కలో ఊరక అటూ ఇటూ మసలుతుంటాడు మాటిమాటికి ఒళ్ళు విరుచుకొంటూ ఉంటాడు రోగి చాలా అస్థిమితంగా కన్పిస్తాడు రస్టాక్స్ రోగిలో అస్తిమితం శారీరక బాధవల్ల కలిగేది మానసిక కారణాల అస్తిమితానికి ఎకొనైట్ ఆర్సెనికం ఆల్బలను గుర్తుంచుకోవాలి ఎకొనైట్ రోగికి విపరీతమైన తత్తర మనోవేదన ఆర్స్ ఆల్బ్ రోగికి అధికంగా నిస్త్రాణ అస్థిమితం చేటుచేసుకునే ఇతర లక్షణాలను కూడా కలుపుకొని ఔషధాలను అవగాహన చేసుకోవాలి హెూమియోలో ఎకొనైట్ ఆర్స్ఆల్బ్, రస్టాక్స్ ఈ మూడింటిని అస్తిమిత ఔషధత్రయంగా చెప్పుకోవచ్చు. జ్వరాలకు ఈ మూడూ మంచి మందులే టైఫాయిడ్‌లో మాత్రం ఎకొనైట్ అవసరం రాదు

రస్టాక్స్ రోగి కదులుతుంటే హాయిగా ఉందని అటూ ఇటూ కదులుతుంటే కొంత సేపటికి నీరసించిపోతాడు దాంతో ఒక దశలో కదలకుండా ఉండిపోవలసిందే విశ్రాంతిగా ఉన్నాడంటే మళ్ళీ బాధలు వచ్చిపడతాయి అందువలన కదలక తప్పదు రస్టాక్స్‌లోని ఈ విచిత్ర లక్షణాన్ని డాక్టర్ డన్‌హాం ప్రస్తావించాడు ఈ లక్షణం మలేరియా టైఫాయిడ్ ఫ్లూ పొంగు రోగుల్లో స్పష్టంగా కన్పిస్తుంది ఈ జ్వరాలు చలిలో ఆరంభమవుతాయి రోగి చన్నీళ్లలో మునిగినట్లుగా వణికిపోతుంటాడు ఈ రోగికి నాలుకమీద తెల్లగా మందం కన్పిస్తుంది నాలుకకొన త్రిభుజాకారంలో ఎర్రగా ఉంటుంది ఇది విచిత్ర లక్షణం రస్టాక్స్ రోగికి కదలిక ఎంత హాయిగా ఉంటుందో వెచ్చదనం వేడికాపు కూడా అంత హాయిగా ఉంటాయి చల్లదనం ఏమాత్రం గిట్టదు తేమతో కూడిన చల్లదనం ఈ రోగులకు అసలే గిట్టదు వర్షంలో తడిచినా వర్షపుగాలి సోకినా ఈ రోగులకు జ్వరాలు కీళ్ళనొప్పులు వస్తాయి పక్షవాతం కూడా రావచ్చు. పిల్లలను తడిగాఉన్న తావుల్లో కూర్చోపెడితే పోలియోవ్యాధికి గురవుతుంటారు ఈ రకమైన కేసుల్లో ముందుగా ఆలోచించదగిన మందు రస్టాక్స్. చల్లదనం గిట్టకపోయినా తాగడానికి మాత్రం చల్లని పానీయాలుకావాలి దాహం ఎక్కువ ఐస్‌నీళ్ళలాంటివి తాగిన తరవాత బాధలెక్కువవుతాయి రస్టాక్స్ రోగికి రాత్రిళ్ళు బాధ లెక్కువ నిద్రసరిగా పట్టదు అర్ధరాత్రి దాటిన తరవాత అసలే నిద్ర పట్టదు ఊరికే ఆవలిస్తుంటాడు ఆవలింతలు ఒళ్ళు విరుపులు ఈ రోగి ముఖ్య లక్షణం ఎంతో శ్రమ చేస్తున్నట్లుగా కలలు వస్తుంటాయి చెమటలు కూడా ఎక్కువే కాఫీ లాంటి వేడి పానీయాలు తీసుకొన్న తరవాత చెమటలు దిగపోతగా పోస్తాయి

కీళ్ల నొప్పులకు కండర స్నాయువుల బాధలకు ఇది ప్రత్యేకమైన ఔషధం శరీరశ్రమ ఎక్కువ చేసినందువల్ల వచ్చే బాధలకు రస్టాక్స్ మంచి మందు వంగి బరువులెత్తడం వల్ల నడుం పట్టుకుపోవడంలాంటి బాధలకు కముకు దెబ్బలకు బెణుకుల్లో ముందుగా వాడుకోవాల్సిన మందు ఆర్నికా తరువాత రస్టాక్స్. ఈ రెండు ఔషధాలు వాడిన తరువాత నొప్పి సర్దుకోకపోతే కాల్కేరియాకార్బ్ వాడుకోవాలి దెబ్బలు తగిలిన కేసులో ఈ మూడు ఔషధాలు గుర్తుంచుకోవాలి

కీళ్ళవాతానికి కీళ్ళ చుట్టూ ఉన్న ధాతువులలో నొప్పికి ఇది ప్రత్యేకమైన మందు కీళ్లనావరించి ఉండే సైనోవియల్ పొరకు బ్రయోనియా ప్రత్యేకమైన మందు రస్టాక్స్ బ్రయోనియాలను పరిపూరక ఔషధాలుగా పరిగణించాలి రుమాటిక్ రుమటాయిడ్ కీళ్ళవాతాలకు ఉద్రేకఉపశమనాలను దృష్టిలో ఉంచుకొని రస్టాక్స్‌ను వాడుకోవాలి

ఎక్సిమా హెర్పీస్ పైత్యపుదద్దు మొదలైన చర్మ వ్యాధులకు రస్టాక్స్ అత్యంత ప్రయోజనకారి దురదలు మంట చురుకులు- చర్మవ్యాధుల్లో రస్టాక్స్‌ను సూచించే లక్షణాలు మంట ఆగగానే ఎకొనైట్‌ను కూడా గుర్తుంచుకోవాలి మంటలతో కూడిన దీర్ఘ వ్యాధులకు సల్ఫర్ మంచిమందు

# సైలీషియా

దీర్ఘకాలికంగా గడ్డలు చీము ఆసనంవద్ద చీము లూటీ
గ్రంధులు ఎముకలలో ఇస్నోక్లను చీము చర్మంమీద పొక్కులు
అరికాళ్లలో దుర్వాసనతో కూడిన చెమటలు గోళ్లు పుచ్చిపోతాయి
హెపార్‌సల్ఫ్ వాడిన తరవాత ఈ మందు వాడుకోవచ్చు
టాన్సిల్స్‌లో చీము
మైగ్రెయిన్ తలనొప్పి (కుడివక్క) తలకు గుడ్డకట్టుకుంటే హాయిగా ఉంటుంది
మలబద్ధకం బహిష్టులకు ముందు బహిష్టు సమయంలో స్త్రీలలో మలబద్ధకం
టీకాలు వేసిన తరవాత పిల్లలకి వచ్చే బాధలు

ఈమందు చెకుముకి రాయినుండి తయారవుతుంది ఇది చాలా అద్భుతమైన మందు ముడిరూపంలో వుండే పదార్థాలను మాత్రమే వాడే సంప్రదాయ వైద్యులకు ఈ మందు విషయం అసలు తెలియదు ముడిరూపంలో గాకుండా శక్తి స్వరూపాలైన పొటెన్సీల రూపంలో మాత్రమే సైలీషియా నేట్రంమూర్ లైకోపోడియం లాంటి పాలీక్రెస్ట్ ఔషధాల ప్రయోజనాన్ని పొందగలరు ఆరోగ్యం అనారోగ్యం మరణం మానవునిలో ప్రాణానికి వర్తించె విషయాలని గుర్తుంచుకోవాలి ప్రాణశక్తి మానవుని మనస్సుకి శరీరానికి కూడా ఆధారం ప్రాణశక్తి వ్యాధినిరోధక వ్యాధి నివారణశక్తి కూడా కలిగివుంటుంది అధునాతన శరీరధర్మశాస్త్రజ్ఞుడు డాక్టర్ హాన్స్‌సెలీ ప్రాణశక్తినే అంతర్గతంగావున్న బాలెన్సింగ్ మెకానిజమ్ అని ప్రయోగాత్మకంగా రుజువు చేశాడు బాలెన్సింగ్ మెకానిజం సమస్థితిలో వున్నట్లయితే ఆరోగ్యం అంటాం సమస్థితి లోపిస్తే అనారోగ్యం అని వ్యవహరిస్తాం పొటెన్సీరూపంలో వాడే మందులు శక్తి రూపాలు కనుక అదేస్థాయిలో వున్న ప్రాణశక్తి సమచైతన్యాన్ని పునరుద్ధరించి మానసిక శారీరకారోగ్యాలకు దారితీస్తుంది హోమియో వైద్యంలో వాడే సూక్ష్మ మోతాదులు ఏవిధంగా పనిచేస్తాయన్న సందేహాన్ని సెలీ ప్రయోగాలు నివృత్తిచేశాయని చెప్పుకోవచ్చు.

పొటెన్సీలు పనిచేస్తాయనే దానికి నిదర్శనం సైలీషియా అని అంటాడు డాక్టర్ ఫారింగ్‌టన్ శరీరంపై గాఢంగా దీర్ఘకాలం పనిచేసే ఔషధం సైలీషియా ఇది తత్వ ప్రధానంగా వాడుకోతగ్గ మందు మొక్కలు నిలబడే శక్తికి మానవుని స్థైర్య ధైర్యాలకు సైలీషియాయే ఆధారమంటాడు డాక్టర్ కెంట్ నిస్త్రాణ అనగానే సైలీషియా గుర్తుకు రావాలి పోషణ లోపాన్ని సరిదిద్దటానికి సైలీషియా సాయపడుతుంది పోషణ లోపం పిల్లల్లో కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది అందువల్ల పెరిగేవయస్సులో ఇది ప్రధానంగా వాడుకోతగిన మందు బెరైటాకార్బ్, కాల్కేరియా కార్బ్‌లు కూడా ఈ సందర్భంలో గుర్తుంచుకోదగిన మందులు సైలీషియా పిల్లల పెరుగుదలలో ప్రతిదశలో జాగు కన్పిస్తుంది నడక ఆలస్యంగా నేర్చుకుంటారు మాటలు ఆలస్యంగా వస్తాయి పళ్ళు త్వరగా రావు మాడు త్వరగా పూడదు ఈ పిల్లలు సాధారణంగా పోతపాలపై ఆధారపడివుంటారు స్టెరిలైజ్ చేసిన పాలు వాడేవారిలో ఈ లక్షణాలు ఎక్కువగా కన్పిస్తాయి ఈ పిల్లలకు తల్లిపాలు పడవు తాగి కక్కుకుంటారు పిల్లలు వయస్సుకు తగినంత ఒళ్ళు చేయరు చిక్కిపోతుంటారు కూడా ఈ పిల్లలకు రికెట్స్ టి బి అని చికిత్సచేయిస్తుంటారు ఈ రకమైన పిల్లల తల్లిదండ్రులు సిఫిలిస్‌తో బాధపడివుండొచ్చు. పిల్లల్లో కన్పించే రికెట్స్ టి బి సిఫిలిస్ వ్యాధి లక్షణాలకు ప్రధానఅంతర్గతకారణంపోషణలోపం(malnutrition), పోషణ లోపాన్ని సైలీషియా ఇచ్చి సరిదిద్దడమే ఈ పిల్లల వ్యాధుల నివారణకు సరైన మార్గం రికెట్స్ వ్యాధి నివారించగలదు గనుక సైలీషియాను విటమిన్ ఎ తో పోలుస్తుంటారు పోషణలోపంవల్ల నడకలాంటివి త్వరగా రావు పట్టుకొంటే ఏడుస్తుంటారు పిల్లవాడు చిక్కివున్నా పొట్టమాత్రం పెద్దదిగా వుంటుంది పొట్టలో గ్యాస్ ఎక్కువగా వుంటుంది పొట్టలో గ్రంధులు వాచివుంటాయి వీరికి తీవ్రమైన మలబద్ధకం విరేచనం గట్టిపడిపోయి విసర్జనకూడా దుర్లభమైపోతుంది ముక్కినప్పుడు బయటకివచ్చినట్లే వచ్చి మరల లోనికి పోతుంది ఇది సైలీషియా రోగుల ప్రత్యేక లక్షణం పిల్లల్లో మలబద్ధకానికి బ్రయోనియాకూడా మంచిమందే

ఈ పిల్లలకు చెమటలెక్కువ తల పాదాల్లో చెమటలెక్కువగా కన్పిస్తాయి పిల్లవాడు చిక్కిపోయి తల పొట్ట

